## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# సమస్యలు : సంస్కరణలు

రచయిత :

## మల్లాది సుబ్బమ్మ

పబ్లిషర్స్ :

మల్లాది సుబ్బమ్మ ట్రస్టు

9, ఎం.ఐ.జి.హెచ్. కాలనీ, మెహిదీపట్నం,

హైదరాబాద్ - 500 028

# ధన్యవాదాలు

కథకు, నవలకు ఉన్న పరిధి వ్యాసానికి లేదు. వ్యాసం చదవటానికి, అర్థంచేసుకోవడానికి కొంత శ్రమ పడాలి; కొంత పూర్వజ్ఞానం వుండాలి; లైట్ రీడింగు మాత్రం కాదు. అలా, అలా నిద్దరోతూ చదివే సాహిత్యం అంతకన్నా కాదు. ఊహాలోకాల్లో విహరించే విలువలు వ్యాసానికి ఉండవు.

ఒక సమస్యను తీసి దానికి మౌలిక కారణ మేమిటో, దాని స్వరూప స్వభావాలేమిటో, దానిసెలా హతమార్చాలో నిర్దుష్టంగా నిర్వచించేదే వ్యాసం. దాన్ని వివరించగల సత్తా, ధీశక్తి, విచక్షణా జ్ఞానం దూరదృష్టి కొందరికి మాత్రమే వుంటుంది. వ్యాసంలోకూడా మన భావాలు వేడిగా, వాడిగా సూటిగా, చిత్తశుద్ధితో వివరించవచ్చు. సాహిత్య ప్రక్రియలలో వ్యాసానికున్న విలువ తక్కువది కాదు.

ఒక్కొకక్క వ్యాసం ఒక్కొకక్క సమస్య గురించి ఎన్ని పేజీలైనా వ్రాయవచ్చు. ఎన్ని పంక్తులలోనైనా చెప్పవచ్చు. అది వారివారి భావసముదాయాన్నిబట్టి వుంటుంది. ఎంత వ్రాసినా చెప్పాల్సింది అనంతంగా వుంటుంది. దాన్ని కుదించి పునరుక్తి దోషం లేకుండా, వ్యర్థ పద ప్రయోగాలు రాకుండా, భావగర్భితంగా చక్కని భాష, శైలిలో వ్రాయగలగాలి. అది ఉత్తేజంగా, ఉత్సాహంగా, సూటిగా, చిత్తశుద్ధితో చెప్పగలగాలి. ఈ లక్షణాలు అందరి సొమ్మూ కావు. కాని భావాలకు అంకితమయ్యే నిబద్ధత (కమిట్‌మెంటు) మాత్రం తమ సొమ్ముకావాలి. ఒక క్రొత్తభావాన్ని, లేక భావాన్ని క్రొత్త రీతిలో, శైలిలో వినూత్న సిద్ధాంతాలతో ప్రజా సంక్షేమానికై వ్రాసే రచన అది ఏ సాహిత్య ప్రక్రియయైనా దాని విలువ ఏనాటికీ తగ్గదు. దానికి పాఠకులే న్యాయ నిర్ణేతలు. నా ఈ వ్యాస సంపుటిలో కొన్ని లోపాలు వుండవచ్చు; పొరపాట్లు దొర్లవచ్చు. నాకున్న పరిజ్ఞానంతో, స్త్రీ జనాభ్యుదయాన్ని కాంక్షిస్తూ వ్రాయడం జరిగింది కాని పరిపూర్ణమైన విద్వత్తు నాకు లేదని మనవి చేస్తున్నాను. చెప్పింది, చేసింది అతి తక్కువ. చెప్పాల్సింది,

తెలియాల్సింది అనంతంగా వున్నది. దానికై కృషిచేద్దామని కోరిక, చేయగలననే విశ్వాసం నాకు వున్నాయి.

ఈ వ్యాస సంపుటిలోని వ్యాసాలు అన్నీ అనేక దిన, వార, పక్ష, మాస పత్రికలలో ప్రచురింపబడ్డవే. A I.R , T.V లలోవి కొన్ని, సెమినార్లకు వ్రాసినవి కొన్ని, ఉపన్యాస పాఠాలు కొన్నికూడా వున్నాయి. వీటిని పుస్తకంగా ప్రచురించుకొనే అవకాశం కల్పించిన పత్రికలవారికి, తదితరులకు, నా ధన్యవాదాలు తెలుపుకుంటున్నాను. పుస్తక ముద్రణకు తమ సహాయ, సహకారాలను అందించిన మిత్రులు, సోదరులు Ch. రాజా రెడ్డిగారికి నా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను వ్యాసాలకు సూచన లిచ్చుటలోను ఇతరత్రా నా ఉద్యమాలకు కొండంత సహాయాన్ని అందిచ్చుటలోను నాకు సర్వవిధాలా తోడ్పడుతున్న నా జీవిత సహచరులు సహకార్యకర్త, అఖిల భారత రాడికల్ హ్యూమనిష్టు సంఘాధ్యక్షులు, ఇండియన్ రేషనలిష్టు అసోసియేషన్ ప్రెసిడెంటు అయిన ఎం.వి. రామమూర్తిగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెల్పుకుంటున్నాను.

రచయిత్రి

మల్లాది సుబ్బమ్మ

# నా లో నే ను

"ప్రముఖ ఫెమనిష్టుగా, స్త్రీలపై దురభిమానగా, స్త్రీల స్వేచ్ఛా సమానత్వాలకై పోరాట ప్రభావం; పురుషాధిపత్యంపై విమర్శలు మీకు పెళ్ళికి పూర్వమే ఉన్నయా ? వుంటే మీతో పెళ్ళికి మీ ఆయన ఎలా అంగీకరించారు?" అని ఒక పృచ్ఛకుని ప్రశ్న.

నా సాహిత్యానికి కేంద్రం స్త్రీ; నా ఉపన్యాసానికి మకుటం మహిళ; నా కార్యరంగానికి మూలం అబల. నా ధ్యేయం స్త్రీ విమోచన. అది సంఘసంస్కరణ కాని మత సంస్కరణ కాని, విద్యా సంస్కరణ కాని, రాజకీయాలలో మార్పుకాని, కుల నిర్మూలన సమస్యకాని, స్త్రీ విముక్తి వుద్యమంకాని, మరేదయినా కాని నా ఆదర్శం, లక్ష్యం స్త్రీ జనాభ్యుదయం మీదే వుంటుంది. స్త్రీలు మారితేనే సమాజంలో మార్పు వస్తుందని, దేశ సౌభాగ్యం వర్ధిల్లుతుందని నా భావం. దానికి కారణం నా గతజీవితంతో ముడిపడి వున్నది. నాలో సైతం ఈ మార్పు ఎప్పుడొచ్చింది ? ఎందుకొచ్చింది ? ఎలా వచ్చింది ? ఇంత కాలవ్యవధికి కారణమేమిటి ? అని ప్రశ్నిస్తే—

నాకు అప్పటికి పది ఏళ్ళు నిండాయి. అవి బాల్యవివాహపు రోజులు. అయిదు తరగతులు చదివిన నాకు పెద్దలు కుదిర్చిన పెళ్ళి జరిగింది. మంచీ చెడూ తెలియని నేను నలుగురి పిల్లల తల్లి నయ్యేటప్పటికి నాకు 24 సం॥రాలు నిండాయి. నాలో విద్యా విజ్ఞానాలపై జిజ్ఞాస మాత్ర ముండేది. కారణం నే పుట్టింది మెట్టింది విద్యావంతుల కుటుంబాల్లో. అటు భర్తకు సాంఘిక, ఆర్థిక, రాజకీయాల సభలు, సమావేశాలు, సంస్కర ణోద్యమాలతో కాలక్షేపమైతే ఇటు నాకు నిష్ఠాగరిష్ఠులు, కర్మిష్ఠులు, అయిన అత్తమామలతో పూజా పునస్కారాలతో సమయమంతా దుర్వినియోగ మయ్యేది. నాలో విజ్ఞానం కలిగి మూఢవిశ్వాసాలను నేను వ్యతిరేకించడం మొదలయితే కుటుంబంలో అశాంతి రేగుతుందని నన్ను బలిచేశారా? అనే భావం నన్ను దహిస్తూ వుండేది. కాని రెండు దశాబ్దాలయినా నిండని నా భర్తకు మాత్రం తగినంత విషయ పరిజ్ఞానం, ఆలోచనా శక్తి,

ముందుచూపు వుండవని గ్రహించలేని వయస్సు నాది.

క్రమేపి నాలో విద్యాసక్తి పెరిగింది. అత్తమామలను విద్యా ప్రాప్తికై అర్థించా. "పరాయి పురుషునివద్ద విద్య నేర్చుకుంటే కుటుంబం పరువు, ప్రతిష్ఠ ఏమవుతై ?" అన్నారు ఉద్రేకంతో సాహసిస్తే వెలివేసే రోజులవి. పరిస్థితుల ప్రాబల్యానికి తలఒగ్గక తప్పలేదు. కాని తీరని అశాంతితో, సంఘ కట్టుబాట్లతో నా యవ్వనదశ, శక్తిసామర్థ్యాలు అన్నీ వ్యర్థమయినాయి. అజ్ఞానాంధకారాన్ని తొలగించుకొని వ్యక్తిత్వ మున్న మనిషిగా బ్రతకాలనే వాంఛ మిక్కుటమైంది. నా జిజ్ఞాస నా ఆలోచనాశక్తిని మేల్కొలిపింది. నా మౌఢ్యాన్ని ఛేధించింది; నాకు ధైర్యాన్ని తెచ్చింది; నన్ను ముందడుగు వేయించింది. వెంటనే పెద్ద లకు, సంప్రదాయాలకు "గుడ్ బై" చెప్పేశాను. నాలో సంచలనం కలిగింది; మార్పు వచ్చింది. ఈ ఆలస్యానికి కారణం నేను చొరవ తీసు కోకపోవటమేనని ఇప్పటికీ బాధపడుతూ వుంటా. ఈ పరిణామం కాల వ్యవధితో జరిగినా సంతోషమే కదా! అని తృప్తి పడుతూ వుంటా.

ముందు చదివిన చదువుకు పదును లేక తుప్పుపట్టిపోయింది. తిరిగి **A, B, C, D** లతో విద్యారంగంలోకి కాలుపెట్టా. నా 38-వ ఏట మెట్రిక్ పాసయినా. నా పిల్లలిద్దరు ఇంజనీర్లయి, ఇద్దరు మెడిసిన్ చదువు తున్నారు. వారి నోట్సులతో, సలహాలతో పి.యు.సి. పాసయి బి.ఏ. లోకి పరుగుపెట్టా. నాలో ఆర్తి కలిగినదాది నా భర్త నాకు సర్వవిధాలా తోడ్పడ్డారు. జరిగిన జాప్యానికి, అన్యాయానికి బాధపడ్డారు. నాటినుండి నేటివరకు వారి సహాయసహకారాలు నాకు అనుక్షణం లభిస్తూనే వున్నాయి. లేకపోతే నేను అజన్మాంతం కూపస్థమండూకంలా జీవించేదాన్ని. వస్తుతః వారు స్త్రీ స్వేచ్ఛ, సమానత్వాలు వాంఛించి ఆచరించే వ్యక్తి. కాని ఆనాటి పరిస్థితుల ప్రభావం వారిని అలా చేసింది. వారు పక్కా ప్రజాస్వామిక వాది. ఎవరికి వారే ఆలోచించి ఉద్యమాలలో దూకాలిగాని బలవంత పెట్టరాదనే వారి వైఖరి మరో కారణమయింది. నాటినుండి మిత్రులంగా, సహచరులంగా, సహకార్యకర్తలంగా, కామ్రేడ్సుగా కలిసి పనిచేస్తున్నాం.

తర్వాత ఒక సంఘటన నా జీవితానికే పెద్దమలుపు తెచ్చింది. ఒక సంవత్సరం హైదరాబాద్‌లో హాస్టలులో వుండి కుటుంబ సంక్షేమ శిక్షణ నేర్చుకున్నా. ఆ ట్రయినింగులో ఎనాటమి, ఫిజియాలజి, సోషియాలజి, సైకాలజి, హెల్తు, ఫ్యామిలీ ప్లానింగు, న్యూట్రీషన్, ఫస్టుఎయిడ్ లాంటి విజ్ఞాన విషయాలెన్నో తెలుసుకున్నాను. బైటి ప్రపంచం, వ్యక్తులు, పలుభాషలు, పరిసరాలు, అనేక కులాలవారు, మతాలవారు అనేక సంఘటనలు, పరిచయాలువల్ల జిజ్ఞాస కలిగింది. అందరితో కలిసి మెలిసి తిరుగటంవల్ల కులమతాల భేదభావం పోయింది. నాలో పెద్ద మార్పు వచ్చింది. నాటినుండి నా కొక వినూత్న ఆలోచన; విశిష్ట దృక్పథం కలిగాయి. ఈ నూతన ఉద్వేగం, ఆలోచన నాలో సంచలనాన్ని కలిగించాయి. అదే-తోటి స్త్రీలలోకూడా ఈ సంచలనాన్ని కలిగించాలని; వారిలో చైతన్యం; భావవిప్లవం రేకెత్తించాలనేదే నాలో కలిగిన ఆ తపన. నా తోటిస్త్రీలు కూడా నాలుగు గోడలు దాటి బైటిప్రపంచంలోని విజ్ఞానాన్ని పొందుతూ, తమ సమస్యలను సవరించుకుంటూ సమాజ రుగ్మతలను రూపుమాపగల శక్తిసామర్థ్యాలు కలిగినవారై వుండాలని నా కోరిక. అందుకే మహిళా విముక్తి ఉద్యమాన్ని చేపట్టి నా అనుభవాన్నుండి వారికి గుణపాఠం నేర్పాలనిపించింది. అదిమొదలు నాలాగ అణగారిపోయిన మహిళల్లో చైతన్య జ్ఞాన జ్యోతిని వెలిగించాలని సేవ చేస్తూనేవున్నా; ఆరాటపడుతూనే వున్నాను.

విద్య, లోకజ్ఞానం ఎప్పుడైతే కలిగాయో, ఎప్పుడైతే సంఘ కార్యక్రమాలలో పాల్గొనడం జరిగిందో, అప్పుడు బాధ్యతగల స్థానాలలో వుండి సంఘాలను నడపగలననే ఆత్మస్థైర్యం వచ్చింది. 1957లో బాపట్ల స్త్రీ హితైషిణి మండలి సెక్రెటరీగా వుండి స్త్రీల 'కండెన్సుడ్' కోర్సులు నడపగల్గాను. కో-ఆపరేటివ్ ఉమెన్సు కాటేజి ఇండస్ట్రీస్ సొసైటీకి 14 సంవత్సరాలు కార్యదర్శిగా వుండి 7, 8 వందలమంది స్త్రీలు కుట్లు, అల్లికలు, చేతిపనులు బ్రతుకుతెరువు కోసం నేర్చుకొనేందుకు సాయపడ్డాను. శారదా మహిళా విజ్ఞాన సమితి ప్రెశిడెంటుగా స్త్రీల వక్తృత్వ పోటీలు, సభలు, సమావేశాలు జరపడం జరిగింది. గుంటూరు జిల్లా గౌరవ కుటుంబ

నియంత్రణ ప్రచారకులుగా పల్లెలు, గ్రామాలు, తాలూకాలు తిరిగినప్పుడు స్త్రీ పురుషులో కొంత భావ సంచలనం కలిగించగలిగినందుకు గర్వపడే దాన్ని. ప్రకాశం జిల్లా "ప్రొబేషన్ ఎడ్వయిజరీ కమిటీ" మెంబరుగా వుండి ఖైదీల దీనావస్థ చూచినప్పుడు నైతిక దృక్పథంతో వారు పరివర్తన చెందగలరనే ధ్యేయం పెరిగింది. విజయవాడ ఫిలిం సొసైటీ అధ్యక్షులుగా వుండి స్త్రీ సమానత్వాన్ని, వ్యక్తిత్వాన్ని ప్రతిపాదించే సినిమాలే మనం చూపాలని కమిటీకి ప్రోద్బలం చేయడం జరిగింది. నేను చదివిన స్కూలుకే నేను మనేజరుగా వుండి బాలికల విద్యకు తోడ్పడం, రోటరీ సభ్యుల సేవా కార్యక్రమాల్లో కార్యకర్తగా పనిచేయడం, ఆం.ప్ర. కుటుంబ నియంత్రణ వర్కింగు కమిటీ మెంబరుగా నా సహకారాన్ని అందివ్వడం జరిగాయి. ఆంధ్ర మహిళాసభ, ఆంధ్ర యువతీమండలి మహిళావేదిక, రూరల్ డెవలప్‌మెంటు ఎడ్వయిజరీ సర్వీసులకు జీవిత సభ్యురాలిగా యథోచిత సేవ చేయగలుగుతున్నాను. జంట నగరాలలోని చిన్న చిన్న మహిళా సంఘాలను, వ్యక్తులను సమీకరించి సంఘీకృత భావంతో ప్రజల సమస్యలపై, మహిళా సమస్యలపై జాగృతినీ, పోరాటాన్ని, పెంపొందించే నిమిత్తం అభ్యుదయ మహిళా సమాఖ్యను స్థాపించడం జరిగింది. ఆ సమాఖ్య అధ్యక్ష హోదాతో, సాటి స్త్రీల సహకారంతో అధిక ధరలపై, కల్తీలపై, కూరగాయల ఎగుమతిపై పోరాటం జరిపాను; ప్రదర్శనలు చేసి, ధరణాలు నిర్వహించి, నిరాహారదీక్షలు సలిపి ఎట్టకేలకు విజయం సాధించగలిగాను.

1958 లో నా మొదటి ఉపన్యాసం "సర్వోదయం : స్త్రీలు అనే అంశంపై జరిగింది. ప్రసంగిస్తుంటే నాకప్పుడు ఉద్వేగం, ఉత్సాహం కలిగాయి. ఆ వాగ్ధార ఎలా వచ్చిందో నాకు ఇప్పటికీ ఆశ్చర్యంగా వుంటుంది. ఆరంభంలో కాళ్ళువణికినై; చమటలు పట్టినై. కాని వెంటనే తమాయించుకున్నా. కారణం స్త్రీ జనాభ్యుదయంపై నాకున్న మక్కువే నని చెప్పక తప్పదు. స్త్రీలలో ప్రచారం, ప్రబోధం సాగించటానికి స్త్రీలే తగుదురన్న విశ్వాసం నాకు అప్పుడు కలిగింది. 1962 నుండి రేడియో ప్రసంగాలు ఇవ్వటానికి అవకాశం వచ్చింది. స్త్రీల సమస్యలు, విద్య, ఉద్యోగం, వివాహం, శాస్త్రీయ దృక్పథం, హక్కులకై ఆరాటం, స్వేచ్ఛకై

పోరాటంలాంటి భావాలే వాటి సర్వత్రా ఇమిడి వుంటాయి. అలా వైవిధ్యంతో కూడిన రేడియో ప్రోగ్రాములు, చర్చలు హెచ్చు సంఖ్యలో ప్రసారం చేయడం జరిగింది. ఆంధ్రలో T.V. వచ్చినప్పటినుండి స్త్రీలపై అత్యాచారాలు, వివాహంలో సమస్యలు, ఏది అశ్లీలం, వరకట్న మరణాలు, ఆడంబరాలు, మానభంగాలు, స్త్రీల సమస్యలు లాంటివి చాలా ప్రోగ్రామ్సు ఇవ్వడం జరిగింది. ఇలా ప్రచార సాధనాలలో స్త్రీ జీవిత సమస్యలను చర్చించే అవకాశం దొరకటం ఒక విధంగా సంతోషమే A.I.R కుటుంబ సంక్షేమ శాఖకు సలహాదారు (Advisary Committe Member) గా హైదరాబాద్ రేడియోశాఖ నన్ను ఆహ్వానించారు. అందువల్ల స్త్రీల సంక్షేమాన్ని చర్చించేందుకు విశాలపరిధి, క్రొత్త విషయాలను ప్రతిపాదించే అవకాశం వచ్చింది. ఆలా స్త్రీ జీవిత సమస్యలన్నీ నా ఉపన్యాసాలకు నాందిపల్కాయి; నా రచనలకు ఆలవాలమయ్యాయి.

కొన్ని రాష్ట్ర, కేంద్ర సంఘాలలో బాధ్యతగల పదవులలో వుండి కొంత పనిచేయడం జరుగుతోంది. అఖిలభారత జనతంత్ర సమాజ్ కేంద్రసమితి సభ్యులుగా; భారత రాడికల్ హ్యూమనిష్టు జాతీయ సమితి మెంబరుగాను, ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘ ఉపాధ్యక్షులు లాంటి స్థానాలలో వుండి, కొంత కార్యభారాన్ని స్వీకరించాను.

ఆం.ప్ర. రాడికల్ హ్యూమనిష్టు సంఘ ప్రధాన కార్యదర్శిగా వున్నప్పుడు రాష్ట్రసభలు ఆలిండియా స్టడీక్యాంపు నిర్వహించడం లాంటివి జరిగాయి. ప్రస్తుతం ఇండియన్ రేషనలిష్ట్ అసోసియేషన్ నేషనల్ ఎగ్జిక్యూటివ్ కమిటీ మెంబరుగా; ఇండియన్ రాడికల్ హ్యూమనిష్ట్ నేషనల్ కౌన్సిలు సభ్యురాలిగా, పౌరహక్కుల సంఘ సభ్యురాలిగా వరకట్న మరణాల దర్యాప్తు కమిటీ (Dowry Death Investigation Commitee) లాంటి మెంబరు బాధ్యతాయుత స్థానాలలో వుండి కొంత కార్యభారాన్ని స్వీకరించడం జరుగుతోంది. ఆ సందర్భంగా 'Indian Atheist' పబ్లిషర్ వారు 'Saga of Women's Struggle, అనే ఇంగ్లీషు పుస్తకాన్ని; ప్రచురించారు. Women, Tradition & Culture స్టెర్లింగు పబ్లిషర్సు, ఢిల్లీ వారున్నూ, Women's Movement in A.P. (1860-1963) మినర్వా

పబ్లిషర్సు, కలకత్తావారు ఇంగ్లీషులో ప్రచురించారు. ప్రాంతీయ భాషల్లోకి బెంగాలి, మళయాళం, మహారాష్ట్ర తర్జుమా చేసినవి కొన్ని పుస్తకాలు అచ్చులో వున్నాయి. మిగిలిన సాహిత్యంగూడా ఇంగ్లీషు తర్జుమా చేయించగలం అని హామీ ఇచ్చారు మరో సంస్థవారు.

జిల్లా, రాష్ట్ర, అఖిలభారత సభల కెళ్ళడమంటే నాకెంతో ఇష్టం. హేతువాదం, హ్యూమనిజం, సెక్యులరిజం, కుల నిర్మూలనలు, కుటుంబ నియంత్రణ, స్త్రీల సభలు, సాహిత్య సభలు, తదితర సమావేశాలు, సెమినార్లలో పాల్గొనడం, ఉత్సాహంతో మాట్లాడటం అలవాటయింది. ఈ చొరవే 1978 లో జరిగిన ప్రపంచ హ్యూమనిష్టుల మహాసభకై లండన్ వెళ్ళేదానికి పురిగొల్పింది. ఆ మహాసభలో పాల్గొనే అవకాశం, వివిధ దేశాల ప్రతినిధులతో పరిచయభాగ్యం నాబోటివారికి కష్టసాధ్యం. ఆత్మీయుల ప్రోద్బలంవల్లే నాకు ఆ భాగ్యం కలిగింది. ఆ సందర్భంగా యూరప్ పర్యటించి కొన్ని దేశాలు సందర్శించడంవల్ల పాశ్చాత్య నాగరికతను అవగాహన చేసుకోవటానికి, ముఖ్యంగా వివిధ దేశాల స్త్రీలను కలిసి వారి సమస్యలు, హోదా గురించి తెలుసుకొనే అవకాశం కలిగింది. అనేక నూతన విషయాలపై ఆసక్తి పెరిగింది. ఇదొక అసాధారణ అనుభూతి; మరువలేని మహాస్మృతులు.

అయినా రాజకీయాలలో ఆసక్తి లేకపోలేదు. మున్సిపల్ ఎన్నికల్లో పాల్గొని 35 ఓట్ల తేడాతో ఓడిపోయినా బాధపడలేదు. ఎన్నికల సభలలో పార్టీ రహిత ప్రజాస్వామ్యంపైన, ఓటర్ల కౌన్సిల్సు గురించి, ప్రభుత్వ దమన నీతిపై; ప్రభుత్వ పొరపాట్లపై ఉద్రేకంగా ఉపన్యసించడం అలవాటయింది. 1975 ఎమర్జన్సీలో రామ్మూర్తిగారు జైల్లో వున్నా ధైర్యంగానే వున్నా, ప్రత్యేకాంధ్ర పోరాటంలో 5 సార్లు అరెస్టు అయి 4 రోజులు శిక్షపడి జైల్లో గడపడం జరిగింది. రాజకీయాల్లో స్త్రీల అవకాశాలు గురించి; స్త్రీలకు విద్యా, ఉద్యోగాలలో రిజర్వేషన్సు గురించి; ఆస్తిహక్కు తదితర హక్కులు గురించి వ్రాస్తూనేవున్నా, అరుస్తూనే వున్నాను. అందుకే 1980 లో లోక్‌సభ ఎన్నికల్లో స్వతంత్ర అభ్యర్థిగా, నాలుగువేల ఖర్చుతో హైదరాబాద్ నియోజక వర్గంనుండి పార్ల

మెంటుకు స్వతంత్ర అభ్యర్థిగా అడ్డదారిన ఓట్లకోసం పాల్పడకుండా నిజాయితిగా పోటీ చేసి ఓడిపోయాను. అయినా కాంగ్రెస్ (యు) కంటె నేను హెచ్చు ఓట్లు పొందటం గమనార్హం. రాజకీయ హక్కులు, సాంఘిక హోదా పరస్పరాలుగదా! ఏ పొరపాటు జరిగినా మనం మన నిరసన తెలియజెప్పాలనే ధ్యేయంతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని తొలగించినప్పుడు 'Save democracy' అనే బానర్‌తో అధ్యక్ష హోదాలో స్త్రీల ఊరేగింపు, మీటింగు జరిపాను. 5 వేల కరపత్రాలు పంచటం, అరెస్టు అవటం జరిగింది. ఇలా ప్రతి సమస్యమీద విషయాన్నిబట్టి మెమోరాండం ఇచ్చుట, నల్లజండాలు చూపుట, ధర్నాలు, ఊరేగింపులు చేస్తూనే వుంటున్నాను. అసెంబ్లీలకు, పార్లమెంటుకూ స్త్రీల ప్రాతినిధ్యం పెంచమని ప్రతి సభలో తీర్మానం ప్రవేశపెడుతూనే వున్నా. తోటి స్త్రీలను హెచ్చరిస్తూనే వున్నా. గత ముప్పై ఏళ్ళుగా ప్రతి ఎలెక్షన్ మీటింగులో కార్యకర్తగా పనిచేస్తూనే వున్నాను.

భావ ప్రచారానికి పత్రికలే జీవగర్రలు. అందుకే "వికాసం" మాస పత్రిక 1974లో స్థాపించి పబ్లిషరుగా, మేనేజింగు ఎడిటరుగా వుండి పది సంవత్సరాలు నిర్వహించాను. దాని నొక బిడ్డగా భావించబట్టే "వికాసం" పై నాకు ఎనలేని మమకారం వుండేది. అందులో సాంఘిక, ఆర్థిక రాజకీయ సాంస్కృతిక రంగాలలో స్త్రీకి సమానత్వాన్ని ప్రతిపాదిస్తూ వ్రాయటానికి వీలయింది. అప్పటినుండి ఎప్పుడూ ఏదో ఆలోచించటం, వ్రాయటం వల్ల నాలో రచనా వ్యాసంగం పెరిగింది. అనేక మహిళా పత్రికలకు, దిన, వార, మాస, పక్ష పత్రికలకు, సావనీర్లకు పంపటం నాటినుండి జరుగుతూనే వుంది. పత్రికలు ప్రచురిస్తూనే వున్నాయి. ఈ నా వ్యాసాలను 1980 నుండి పుస్తకాలుగా ముద్రించటం మొదలయింది. అలా ప్రచురించిన పుస్తకాలు ఇప్పటికి ముప్పైకి పైగా పూర్తి అయినాయి. అందులో కొన్ని నవలలు, వ్యాస సంపుటాలు, పరిశీలనా గ్రంధాలు, సంకలనాలు, తర్జుమాలు కూడా వున్నాయి. ఈ సాహిత్యమంతా స్త్రీ సమస్యలమీదనే. అందులో ఆమె జీవితాంతం అనుభవిస్తున్న ఇబ్బందులు, వాటి పరిష్కారాలూ కూడా వుంటాయి. అయినా ఇంకా రాయాల్సినవి అమితంగా

వుంటూనే వున్నాయి. బుర్రనిండా పుట్టెడు ఆలోచనలు వున్నాయి. ఎంత వరకు ఆ సమస్యలను వ్రాసి కృతకృత్యురాలను అవుతానో చెప్పడం కష్టం; ఆసక్తి మాత్రం వుంది.

అప్పటికప్పుడు పాల్గొనే కార్యక్రమాలు కొన్ని వుంటూ వుంటాయి. హిందూ, ముస్లిం కొట్లాటలు, చంపుకోవటాలు హైదరాబాద్‌లో జరిగినప్పుడు ఆ ప్రాంతమంతా సర్వేచేసి రిపోర్టు రాయడం జరిగింది. వరకట్నం బిల్లు సవరణలపై ప్రజాభిప్రాయం కోరినప్పుడు సలహాలు ఇవ్వడం, హిందూ వారసత్వ బిల్లుపై అభిప్రాయాలు, నివేదికలు చెప్పడం, కేంద్ర సాంఘిక సంక్షేమవారు కోరితే అభిప్రాయాలు, సలహాలు, మార్పులు చెప్పడం వాటిని వ్రాసి ఇవ్వటం లాంటివి కొన్ని ఉదాహరణలు. అలాగే యూనివర్సిటీలవారు అనేక సంఘాలవారూ జరిపే సెమినార్లల్లో వర్కు పేపర్లు వ్రాయడం; పాల్గొనటం తరచూ వుంటుంది. ఇక రచయిత్రుల సభలలో పాల్గొనడం, శిక్షణా తరగతుల్లో పాఠాలు చెప్పడం, వక్తగామాట్లాడటం లెక్కకు మిక్కుటంగా వుండవచ్చు. ఈ రకరకాల అనుభవాలవల్ల సామాజిక అవగాహనవల్ల స్వచ్ఛందంగా సంస్థలు స్థాపించి శేషజీవితాన్ని గడపాలని నిశ్చయించుకున్నాను.

మిత్రులతో కలసి ముందుగా నేను 1973 లో స్థాపించిన సంస్థ ప్రజాస్వామ్య ప్రచురణలసంస్థ. ఇది కేవలం హ్యూమనిస్టు, రేషనలిస్టు. స్త్రీ వ్యక్తిత్వానికి అంకితమైన సాహిత్యాన్ని ప్రచురించే పబ్లిషింగుహౌస్. నేను గత 12 ఏళ్ళుగా మేనేజింగు డైరెక్టరుగా వుండి 38 పుస్తకాలను ప్రచురించడమైనది. అందులో నావి 30 ఇతర మిత్రులవి 8 వున్నాయి.

ఎం.ఎన్. రాయ్ భావాల ప్రభావంతో రాడికల్ హ్యూమనిష్ట్ ఉద్యమానికి జీవితం అంకితం చేశా. అలా గత ముప్ఫై సంllరాల నుండి వ్యక్తి స్వేచ్ఛ, సమానత్వం, సహకారం, కులతత్వ వ్యతిరేకత, అంటరానితనంపై నిరసన, హేతుత్వం, శాస్త్రీయ దృక్పథం అనే భావాలు నాలో జీర్ణించినై. పార్టీలులేని ప్రజాస్వామ్యమే నా గమ్యం. వ్యక్తికి నీతి నిజాయితీ, దృఢసంకల్పం ముఖ్యమనే నమ్మకం నాకు దృఢపడింది. విధి

త్రిలో వ్యక్తి కీలుబొమ్మ కాడని, తన భవిష్యత్తుకు తానే కర్త అనే భావ
ప్రభావంతో హేతువాది నయ్యాను. పుణ్యపాపాలు, పునర్జన్మ, కర్మ
ండలపై నమ్మకం పోయింది. విశుద్ధ పరివర్తనమే వ్యక్తికి ముఖ్యము
నే విశ్వాసం ప్రబలింది. ఈ భావాలే నాలో జీర్ణించి నా భవిష్యత్తుకు
ాటలు పరిచాయి; నాకు చేయూతనిచ్చి నా కార్యరంగ పరిధిని పెంచాయి.
ాని పర్యవసానమే నా సంస్థల పుట్టుక; వాటి కార్యక్రమాల అభివృద్ధి.

మహిళాభ్యుదయ సంస్థ వ్యవస్థాపకురాలిగా 1980 లో స్థాపించడం
రిగింది. ఇది కేవలం మహిళలో విజ్ఞానాన్ని పెంచుట, వారిని సమీక
ంచుట. చర్చలు, సెమినార్లు, స్టడీ క్లాసులు, వర్కుషాపుల ద్వారా
ప్రబోధం చేయుట ఈ సంస్థ ప్రధానాశయం. 1981 లో అభ్యుదయ
వాహ వేదికకు ఫౌండర్‌గా పెద్దల ఆధ్వర్యంతో నిర్మించాము. వర్ణాం
ర, వరకట్నరహిత వివాహాలు జరపటం దీని ముఖ్యోద్దేశం. ఆ పెళ్ళిళ్ళు
ేయుట, అడ్రసులు ఇచ్చుట చేస్తున్నాను. మహిళల్లో ఆలోచనాశక్తిని
ృద్ధిచేయుటకు విజ్ఞానాన్ని పెంచుటకు మహిళాభ్యుదయ గ్రంథాలయాన్ని
ెలకొల్పడం అవసరమనిపించింది వెంటనే ఆ లైబ్రరీని రిజిష్టరు చేశాను.
ెండువేల గ్రంధాలున్న లైబ్రరీ ఇది. 83 లో కుటుంబ సలహా కేంద్రాన్ని
్థాపించి తద్వారా భార్యభర్తల తగవులు తీర్చడం; వీలుకానివారిని వేరు
ురచటం చేస్తున్నాం. ఈ సంస్థ సలహాలను ఆశించేవారు ముఖ్యంగా
్త్రలే. వారి సమస్యలు తలకొక రకం వుంటున్నాయి. ఎంత శ్రమపడినా
ాన్ని చాల రిజిడ్‌గా, కాంప్లికేటెడ్‌గా వుంటున్నాయి. వారికి కొంత
ునస్థయిర్యాన్ని ఇచ్చివంపటం జరుగుతుంది. వికాసకేంద్రం ఈ సంస్థ
ుకు కార్యస్థానం. వీటి విధి నిర్వహణకు ఒక ట్రస్టును పెట్టాలనిపించింది.
ందుకుగాను నా మిగిలిన సొంతడబ్బుతో "మల్లాది సుబ్బమ్మ ట్రస్టు"
ెట్టి రిజిష్టరు చేసి ఏటా వచ్చు ఆదాయం వీటికి ఖర్చు చేస్తున్నా. ఇంకా
ీవిత సభ్యత్వం, విరాళాలద్వారా కొంత సమీకరిస్తున్నా.

ఒకప్పుడు ఇల్లే స్వర్గంగా భావించిన నేను; సమాజమంటేనే తెలి
యని నేను; స్వేచ్ఛ అంటే వినని నేను ఈనాడు స్వచ్ఛంద సంస్థలు
స్థాపించి ప్రబోధ కార్యక్రమాలు నిర్వహిస్తున్నానంటే, సెమినార్లకు చీఫ్‌గా

చర్చా వేదికలకు మోడరేటర్‌గా, వరకట్న మరణాల కేసుల దర్యాప్తులకు తోడ్పడగలుగుతున్నానంటే— స్టడీ కేంపులకు డైరెక్టరుగా వెళ్ళగలుగుతున్నానంటే దానికి అండదండలు ఎవరు? అన్నప్పుడు ఎవ్వరి సహాయ సహకారాలు లేవని చెప్పడం అమానుషం. ముఖ్యంగా పత్రికలవారు, T.V. రేడియోలవారు, ప్రజలు, స్త్రీలు, ప్రజాసంఘాలవారు, అభిమానులు, మిత్రులు అని సంతోషంగా, సగర్వంగా, కృతజ్ఞతతో చెప్పుకుంటున్నాను.

నా భవిష్యత్తుకు బాటలు వేసింది ముఖ్యంగా నా అత్తమామలు. ఒకప్పుడు సంఘ బలిమికి భయపడిన మా అత్తమామలు తరువాత ఎన్నో రకాలుగా నా చదువుకు, ఉద్యోగానికి, ఉద్యమాల నిర్వహణకు అవకాశమిచ్చి తోడ్పడ్డారు. అంతకన్నా గొప్పవారు నా బిడ్డలు. వారు నిజంగా రత్నాలలాంటివారు, సామాజిక స్పృహ వున్నవారు. నేనుగా వారికి ఏవిధంగా తోడ్పడకపోయినా, వారు నా రకరకాలైన ఉద్యమాలకు అంకితం కాకపోయినా నాకు, నా పుస్తకాల ప్రచురణలకు ఎనలేని సహాయం చేస్తున్నారు. అండదండలుగా నిలబడుతున్నారు. స్వతహా వారు బుద్ధిమంతులు, ఉత్తములు. వారికి తల్లిని గావడం నా అదృష్టంగా చెప్పుకుంటున్నాను. నేనన్నా, నా కార్యక్రమాలన్నా వారు ఏనాడు కాదనలేదు, వ్యతిరేకించలేదు. మా తల్లిదండ్రులైనా చేస్తున్నారని వారికి గర్వం, సంతోషం, గౌరవంకూడా వున్నాయి. వారి ఈ సహాయ సహకారాలను నేను ఏనాడూ మరువలేను.

నాలో రగిలిన అగ్నికి ఆజ్యంపోసి ప్రజ్వరిల్ల జేసి మహాదావానలంగా మలిచింది నా జీవిత భాగస్వామి రామ్మూర్తిగారు. నేను తలపెట్టిన సంస్థలు, కార్యక్రమాలు నిర్విఘ్నంగా సాగుతున్నాయంటే ఆహరహం వారి శ్రమ ఔదార్యాలవల్లనే. స్త్రీ జనాభ్యుదయం తన ధ్యేయమైనా ఆ పని ఒక స్త్రీ చేస్తే విలువ పెరుగుతుందని గుర్తించారు. అలా నా భవిష్యత్ బాటకు పునాదులు వేసింది నా జీవిత సహచరులని చెప్పుకోటానికి నేను గర్వపడుతున్నాను. వారికి నేనుగా ఏమిచేసినా నా రుణం తీరేదికాదు. తీర్చాలంటే ఒకటే మార్గం. నిష్కల్మషంగా, త్యాగబుద్ధితో, సామాజిక సమస్యలకు, ముఖ్యంగా స్త్రీ విముక్తికి జీవితాంతం సేవచేస్తే రామ్మూర్తి

గారి ఋణం తీరినట్లే. తనకంటూ ఏమీ కోరుకోని వ్యక్తి పరులకై తప పడే అజ్ఞాతజీవి ఎవరంటే రామ్మూర్తిగారేనని చెప్పటం సాహసం కాదు. పనిచేయటమే తప్ప ప్రగల్భాలు ఎరుగని మహోన్నత మానిసి. న్యాయ వాద వృత్తిలోకూడా నీతిని, ఇతరుల శ్రేయస్సులను ఆకాంక్షించే మహా మనీషి వారు. గత 50 ఏళ్ళనుండి సహ కార్యకర్తలంగా, సమాన భాగస్తులంగా, మేమిద్దరం ఒకరికొకరం సహధర్మచారులంగా వుంటున్నాం. సేవా ధర్మం మా ఊపిరి. సాంఘిక సంస్కరణ మా ధ్యేయం. స్త్రీ జాతి విముక్తి అంటే పురుష బంధవిముక్తి అని మా భాష్యం. డబ్బుకు గల ప్రయోజనం చాలా పరిమితి అని అవసరాన్ని మించిన డబ్బు అది మన్ని దహిస్తుందని నమ్ముతున్నాము. ఇవి మా ప్రవృత్తి లక్షణాలు. ఆ దృక్పధంతోనే జీవిస్తున్నాం. ఆ తరహా ఉద్యమాలు సృష్టించడం, సారధ్యం వహించడం గత 30 సంవత్సరాలుగా జరుగుతోంది.

సమాజాభ్యుదయానికి నేను చేయతలచింది ఎంతో వుంది. చేసింది అత్యల్పం. చేయాల్సింది అనంతంగా వుంది. కృషికి తుది అంటూ వుండదు కదా! ఆ ప్రయత్నంలోనే తృప్తి, ఆనందంకూడా ఇమిడి వుంటాయి.

ప్రస్తుతం తలపెట్టినవి మరికొన్ని వున్నాయి. స్త్రీ విముక్తి శిక్షణా శిబిరం (Women's Liberation Training Centre) ప్రతిష్టించి ప్రతినెలా కొందరికి వివిధ సిద్ధాంతాలపై శిక్షణ ఇస్తే వారు లీడర్సుగా తోటి స్త్రీలలో జాగృతి, చైతన్యం కలిగిస్తారనే ధ్యేయంతో ఆ ఏర్పాట్లు చురుకుగా జరుగుతున్నాయి. శిక్షణతోపాటు సరళమైన భాషలో అనేక అంశాలపై సాహిత్యాన్ని వారికి అందజేయటంకూడా చేస్తున్నాం. ఆ విధానంవల్ల సమాజం త్వరితగతిన మారుతుంది. ఇప్పటికే ఈ మహిళా దశాబ్దంలో కొంతగా కొంత స్త్రీ హోదా మారింది. ఇంకా మారుతుంది. మరి అలాగే మార్పు అనివార్యం కదా!

ఓపెన్ యూనివర్శిటీవారు 1986 నుండి Out Standing Work (అసాధారణమైన పని) చేసినవారికి డైరెక్టుగా Phd. (డాక్టరేటు) చేసే

అవకాశం ఇవ్వబడిన వారిలో నేనుండటం మరో ముఖ్య విషయం. స్త్రీల పైనే రచించిన నా సాహిత్యమే నాకు ఈ అవకాశాన్ని ఇచ్చింది. అందువల్ల (P. Hd.) కి రిజిష్టరు చేసుకోవడం "సర్వేచేసేపని ప్రారంభించడం మొదలయింది. అదొక అద్వితీయ అవకాశమని నేను గర్వపడుతున్నాను. నేనెక్కడ ? ఆ పి.హెచ్.డి. స్థానమెక్కడ ? అని నాకనిపించడం లేదు. మనకు సంకల్పబలం వుంటే మానవుడు సాధించలేనిది లేదు. ఏదైనా ఫలించలేదంటే అని మన ప్రయత్న లోపమేనని నా విశ్వాసం మానవ మేధస్సు అసాధారణం; అద్వితీయం అని మనకు తెలుసు. ఆ నమ్మకంతోనే అడుగు ముందుకు వేస్తున్నాను. ఒక హ్యూమనిస్టుగా, సంఘసేవకురాలిగా అమెరికా "ఓల్డర్ ఉమెన్ లీగ్" (O.W.L.) కన్వీనర్ Evelyn Wexler 1982 డిశంబరులో ఆ సంస్థ సింబల్ (లాకెట్, చైన్) ఒక సభలో ఇచ్చి నన్ను గౌరవించారు.

ఇలా నా గురించి చెప్పుకుంటూ పోతూవుంటే అతిశయోక్తి అని మీరు అనుకోకండి. హేతువాదిగా, మానవవాదిగా, వ్యక్తిగా, నిజాయితీగా తోటి స్త్రీకి "నమూనా"గా మనగల్గితే అదే నా జీవితానికి ఆనందం. అలాంటి అజ్ఞాత సమాజంలో పుట్టి ఇలా మారుతూవచ్చి కడకు సాధించింది ఏమిటీ! అని విస్తుపోతున్నారా! ఏదో కొంత వుందని అనడం అతిశయోక్తి కాదు; సాహసం అంతకన్నా కాదు. ఇది నా జీవిత విధానం. ప్రశ్నించిన మీరు మీరేమంటారో మీరేచెప్తే బాగుంటుంది కదూ!

(ఇది నా స్వంత పొగడ్తకాదు. నాలాంటి స్త్రీలు ఈ దేశంలో కోట్ల సంఖ్యలో వున్నారు. వారికి యథోచితమైన ప్రోత్సాహం, ఉత్సాహం ఇవ్వటానికే ఈ స్వవిషయం వ్రాయడం జరిగింది.)

రచయిత

# నారీ సంస్కృతి గురించి!

ప్రపంచంలో సగమైన మనం నిజంగా తరతరాల బంధితులం ఆలోచనా రహితులం. మన మనసూ, ఉనికి మనవికావు. పెళ్ళే మన జీవిత లక్ష్యమయింది. సంతానోత్పత్తికి మనం సాధనాలమయినాం. స్వేచ్ఛారక్షణలు లేని మొండి బ్రతుకులు మనవి. మన నోటికి, కాలికి నొసటికి బంగారు సంకెళ్ళున్నాయి. అవి ఏనాటికీ విడిపోక అనుక్షణం మనల్ని పీడిస్తూ వుంటాయి. ఆ సంకెళ్ళ గలగలలకు మనమెంతో మురిసిపోతూ వుంటాం. కాని అవి ఖైదీలను కట్టిపడేసే గొలుసులని గుర్తించని అజ్ఞానులం మనం. సంగీత, సాహిత్యాలలో, చిత్రకళల్లో మనం గుణవంతులం, శీలవంతులం, మాతృమూర్తులం, అని శ్లాఘిస్తుంటే ఆ కితాబులకు, ఆ మెప్పుకోలుకు మురిసి పోతున్న అల్పజీవులం. అది నిజమనే భ్రమలో వున్న అల్పజ్ఞులం. బాధతెలియని బాధామయులం అసలు స్వేచ్ఛ ఎందుకు ? అందులో ఏముంది ! బాధ్యతలు తప్ప ! అని ఆలోచించే స్థితిలోనే ఇంకా మనమున్నాం. నోములు, వ్రతాలు, పతిసేవ మనకు ముక్తి ఇస్తాయని ధర్మశాస్త్రాలు, ఆచారాలు చాటుతుంటే అది నిజమని నమ్ముతున్నాం. స్వార్థపరులు ఏం చెప్పినా, అది ఎంత కష్టమైనా, త్యాగమే పుణ్యవతికి శీలమని ఆత్మార్పణకు సంసిద్ధమవుతున్నాం. మనం విముక్తి కోరని రీతిలో శిక్షణ పొందిన సైనికులం. ఏనాటికీ పారిపోని ఖైదీలెవరంటే "సుశిక్షితు"లైన మహిళలే. అలా తర తరాలుగా మన బ్రెయిన్ వాష్ చేయబడింది. హక్కులూ, గట్రా అంటేనే మనకు ఎలర్జీ. అందుకే మన చట్టాలన్నీ "లా" పుస్తకాలకు అంకిత మయినాయి అవి మనం కోరితే తప్పు. అడిగితే అపరాధం, కోర్టుకెడితే పరమ కిరాతకం. అవి కోరని వారు మహాసాధ్వీమతల్లులు, పుణ్యవతులు ఆదర్శనారీమ తల్లులు.

స్త్రీల ఇక్కట్లు, బాధలు వివరించాలంటే స్త్రీల సమస్యలపై ఒక "ఎన్‌సైక్లోపీడియా" రాయవచ్చు. ఆమె పుట్టింది మొదలు-అసలు పుట్టకముందే మొదలవుతున్నాయి అమ్మాయిల బాధలు.

శాస్త్ర పరిశోధనా ఫలితం వల్ల గర్భస్థ పిండం ఆడదో, మగదో చెప్పే రోజుల్లోకి చేరాం అంటే పుట్టకముందే ఏ శిశువో తెలియడం వల్ల "ఆడ" అని వినగానే ఒక గర్భస్రావం చేయిస్తారన్నమాట. "ఆడపిల్ల" అని ఇంట్లో

వుంచి పనిపాటలు, అణకువలు నేర్పిస్తారు. అయినా కట్నం ఇచ్చుకోలేక, తగిన వరుడు లభించక అనేక మంది ఆడపిల్లలు ముసలి కన్యలుగా మిగిలి పోతున్నారు. కొందరు భర్తల వల్ల, అత్త మామల వల్ల మితి మీరిన హింసలకు లోనవుతున్నారు.

మహిళాదశాబ్దం వల్ల, సాంస్కృతిక విప్లవం వల్ల, నాగరికత ప్రభావం వల్ల, పాశ్చాత్య విలువల వల్ల, సాంఘిక పరిస్థితుల వల్ల స్త్రీలలో కొంత అలజడి, సంచలనం వచ్చింది. ముఖ్యంగా పారిశ్రామికీ కరణం వల్ల, ధరల పెరుగుదల వల్లా స్త్రీలు ఉద్యోగాలు చెయ్యక తప్పటం లేదు. ఈ ప్రభావం వల్ల వారిలో కొంత ఆలోచన, మార్పు వస్తోంది. "మేమెందుకు చదువు కోరాదు? ఆస్తి హక్కుల్ని ఎందుకు అనుభవించరాదు? ఉద్యోగాల్లో ఎందుకు చేరరాదు? మా భాగస్వాములను ఎన్నుకునే హక్కు మాకు ఎందుకుండరాదు? సామాజిక కార్యక్రమాలకు మేమెందుకు దూరం కావాలి! మా భర్తలు ఇంటి పనిలో, పిల్లల పెంపకంలో మాకు ఎందుకు సాయపడరాదు? ఉత్పత్తి రంగాల్లో మేమెందుకు తోడ్పడ కూడదు? ఇల్లు, పిల్లల పెంపకంలో విసిగి వేసారి పోతున్నాం- అంటూ ఈనాటి ఆడవారు ఆలోచించి పోతున్నారు. ఇదంతా ఒక విధంగా అభివృద్ధి అని మనం గర్వపడాలి. అయినా ఇది చాలదు. గమ్యం చేరేదాక పోరాడాలి. అందుకై కృషి చేస్తారు. చెయ్యగలరనే విశ్వాసం నాకు వుంది.

"సమస్యలు-సంస్కరణలు" అనే ఈ గ్రంథంలోని వ్యాసాలన్నీ ప్రముఖ దిన, వార, పక్ష, మాస పత్రికల్లో ప్రచురించ బడ్డవే. అప్పు డప్పుడూ సెమినార్ల కొరకు వ్రాసినవి కొన్ని, రేడియో ఉపన్యాసాలు కొన్ని, శిక్షణా తరగతుల పాఠాలు కొన్ని ఇందులో కూర్పు చేయబడ్డాయి. వీటి అన్నింటినీ పుస్తకరూపంలో ప్రచురించుకొనే అవకాశం కల్పించిన ఆయా పత్రికాధి పతులకు, తదితరులకు నా ధన్యవాదాలు తెలుపుకుంటు న్నాను. నా వ్యాసాలలో బలమున్నదనీ, వాటికి విలువ వున్నదని నాకు కొంత వుత్సాహాన్నిచ్చి నన్ను ప్రోద్బలపరచి, వాటిని గ్రంథ రూపంగా తెచ్చిన నా జీవిత సహచరులు, నా శ్రేయోభిలాషి ఎం. వి. రామమూర్తి గారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు తెలుపు కుంటున్నాను.

రచయిత :

మల్లాది. సుబ్బమ్మ

# ఈ పుస్తకంలో ఇదీ వరస

# నా తొలి రచనానుభవాలు

కన్యకు తొలిరేయి లాంటిది రచయితకు తొలి రచన. ఎన్నో రాత్రులు వస్తాయి; పోతాయి. కాని మొదటి రాత్రి మధురస్మృతులు మరువలేనివి; మరువరానివి. అలాగే మొదటి రచన వెలుగు చూచినప్పుడు కలిగే అనుభూతి చిరస్మరణీయం అనిర్వచనీయానందం. నా తొలి రచన ప్రచురణకు పూర్వం నా ప్రసవవేదన మాత్రం వర్ణనాతీతం. అదొక చిత్రాతి విచిత్రం.

అది 1964 సంవత్సరం రేడియోలో ఒక ముఖ్య వార్త అంటూ నీగ్రోల దాస్య విముక్తికి పోరాడిన అబ్రహాం లింకను, నీగ్రోల హక్కుల రక్షణ కొరకు శ్రమించిన కెనడీ తెల్లవారిచేత హత్య చేయబడినట్లే, నల్ల వారి మౌలిక హక్కులకై కృషి చేస్తున్న మార్టిన్ లూథర్ కింగును ఒక తెల్లవాడు ఈ రోజు హత్య చేశాడు." అని పల్కింది ఆకాశవాణి. ఆ వార్త విని అయ్యో! అంటూ కుమిలిపోయాను. మానసిక సౌందర్యానికంటే బాహ్యసౌందర్యాని కింత విలువా! రక్తంలో లేని తేడా రంగులో ఎందుకో! ఎలా! ఏం చెయ్యాలి అనే ఆందోళనతో నిద్రపట్టలా. అంతుచిక్కని ఆలో చనలతో భళ్ళున తెల్లారింది. నాలో ఉద్రేకం, ఉత్సాహం, ఏదో చెప్పా లనే ఆకాంక్ష నన్ను వెన్నాడుతూనే వున్నాయి. చివరి కొక నిశ్చయాని కొచ్చి కలం చేపట్టా. రాస్తూనే వున్నా; కొట్టెస్తూనే వున్నా; చింపేస్తూనే వున్నా. చూస్తే నవ్వుతారని బిక్కమొగంతో నింగి నింగి చూస్తూనే వున్నా. ఒక కథ చెప్పాలి. అందులో ఒక సందేశం వుండాలి. ఎలా మొదలెట్టాలి? ఎలా పూర్తి చేయాలి? అతికష్టంమీద ఆరు పేజీలు పూర్తి చేసేటప్పటికి తలప్రాణం తోకలో కొచ్చింది. దిమ్మతిరిగినంత పనయింది. నిస్సత్తువ నన్నావరించింది.

కథ సారాంశం-ఒక తల్లికి మొదటి కొడుకు నల్లగా అందవికారంగా పుట్టాడు. భర్త, ఆ తల్లీ బిడ్డలను వెళ్ళగొట్టి ఒక తెల్ల పిల్లను పెళ్ళాడి నట్లు, ఈసారి తెల్లని బిడ్డ పుట్టినట్లు, వాణ్ణి అతి గారాబంతో పెంచినట్లు, వాడొక త్రాగుబోతుగా, రౌడీగా తయారై తండ్రిని తరిమేసినట్లు, బిచ్చ

గాడై తిరుగుతున్న భర్తను మొదటి భార్య గుర్తుపట్టి తెస్తే ఆ నల్ల పిల్లవాడెంతో గౌరవించి పోషిస్తాడు. ఇదీ కథ సారాంశం. ఇందులో శిల్పం లేదు. భాషాసౌందర్యం లేదు. రచనా విధానంలో మెరుపులు లేవు. పాత్రపోషణ లేదు. ఇన్ని అవలక్షణాలతో రాసిందే చాలని పెద్ద పేరుగల పత్రికకు గొప్ప గర్వంతో పంపా. ఏమౌతుంది? శీఘ్రంగా తిరిగొచ్చింది తిరుగు టపాలో. అయ్యో! ఇంత మంచి సందేశం పాఠకులు వినలేకపోయ్యారుగదా అని వాపోయాను. వారిపై జాలితో కథ పేరు "పనికిమాలిన ముత్యం" కథకు 'థీమ్' మాత్రమే చాలదని నా కప్పుడు తెలియదు. నాలో తీరని కోరిక నన్నింకా బాధిస్తూనే వుంది. ఈసారి కథ కొంత మార్చా. ఆ తండ్రి హాస్పటల్లో నర్సుకు కొంత లంచ మిచ్చి పిల్లల్ని మార్పించినట్లు (తన నల్ల బిడ్డను మరో తల్లి కిప్పించి ఆమె తెల్ల పిల్లను తనకు చేర్పించుకున్నాడు) మిగతాదంతా మామూలే కొద్ది మార్పులు తప్ప. మరో పత్రికకు మళ్ళీ పంపా. ఫలితం సున్న. షరా మామూలే అయింది. అయినా ఆశ చావలేదు. ఆ కథలోని పాత్రలు నా దృష్టిపథం నుండి దూరం కాలేకపోతున్నాయి. నన్ను వెన్నాడుతూనే వుండేవి. ఎలాగైనా నా కథ వెలుగు చూడాలనేదే నా ఆకాంక్ష.

తర్వాత ఇతరుల కథలు చాలా చదివాను. వాటిలోని వైవిధ్యాన్ని, రచనా చాతుర్యాన్ని, శిల్పాన్ని పాత్ర పోషణా, సన్నివేశాల ఔచిత్యాలను, కథా సంవిధాన్ని అర్థంచేసుకోలేని నా తొందరపాటుకు సిగ్గుపడ్డాను. ఆ తర్వాత ఆ కథనే మలిచి ఎత్తుగడలో, శయ్య, శైలి, భాష, చమత్కృతి, మనోవిశ్లేషణలలో నూతన ప్రక్రియలు జోడించి ఉత్కంఠతను రెకెత్తించే నడకతో శాయశక్తులా కష్టపడి వ్రాశా. ఆ కథ పది సం॥రాల తర్వాత ఒక మాసపత్రికలో బాలారిష్టాల నధిగమించి బ్రతికి బైటపడ్డది. ఏదైనా అది నా కష్టాల ఫలితం. నా తొలిరచనా సృష్టితో బైటపడ్డ ముద్దుబిడ్డ. నా తొలి కానుకగా దాన్ని పరిగణిస్తా నిప్పటికీ. అయితే ఈ మధ్యకాలంలో ఈ కథ మొదలెట్టి ముద్రితమయ్యేలోగా అనేక వ్యాసాలు స్త్రీల సమస్యలపై వ్రాయటం ప్రచురిత మవటం జరిగింది. అంటె 1964 లో ఆంధ్రజ్యోతి దినపత్రికలో ప్రతి మంగళవారం మహిళాజ్యోతి శీర్షికపెట్టి ఒక పేజి స్త్రీలకు కేటాయించారు. అప్పుడు మొదట నేను వ్రాసిపంపింది "కుటుంబ కలహాలు"

అది అసలు నా తొలిరచన. అది ప్రింటు అయింది ఆ సందర్భంగా కట్నాల బెడద, అతివలు; ఆడంబరాలు అధిక ధరలు, కుటుంబ నియంత్రణ లాంటివి వ్రాసి పంపేదాన్ని పంపినవన్నీ ఆ పత్రికవారు వేశారు. తర్వాత అనేక వార, దిన, పక్ష పత్రికలలో నా వ్యాసాలు తరుచూ వస్తూవుండేవి. అవన్నీ కలిపి పన్నెండు వ్యాస సంకలనాలుగా పుస్తకాలు వేయించుకొన్నా. ఆరు నవలలు వ్రాసి ప్రింటు చేయించుకున్నా. 24 కథలు వ్రాసి ఒక కథల పుస్తకం వేశాను. వివాహ వ్యవస్థ, ఇస్లాం, క్రైస్తవం, హైందవ మతాల్లో స్త్రీలు, ఆంధ్రలో 125 సం॥ల మహిళోద్యమ చరిత్రలాంటి పరిశోధనా గ్రంథాలు మొత్తం నావి అన్నీ 28 పుస్తకాలు ప్రింటులోకి వచ్చాయి. ఇంకా హేతువాదం, మానవవాదం, మహిళాభ్యుదయాలపై యధోచితంగా వ్రాస్తూనే వున్నా. ప్రస్తుతం "మానవ జీవితంలో సెక్స్ పాత్ర"పై పెద్ద పరిశోధనాత్మకమైన పుస్తకం 300 పేజీలలో చిత్తురూపం ధరించింది. ఇలా 20 ఏండ్లుగా రాస్తున్నా ఆ మొదటి కథ "పనికిమాలిన ముత్యం" అనుభూతి మరే రచనపై నాకు కలుగలేదు. ఆనాటి జ్ఞాపకాలు, నన్ను అలరింపజేస్తూనే వుంటాయి. మరుపురాని ఆ నా కథ-అదే నా తొలిరచన-ఆ అనుభవాలే ఈనాటి ఈ నా పరిస్థితికి కారణభూతాలయినాయి. అందుకే అవి నా తొలిరచనా అనుభవ మధుర స్మృతులు కనుకనే నేను ఆనాటి ఆ వ్రాత ప్రతిని జ్ఞాపకార్థం భద్రంగా పదిలపరుచుకున్నాను. ఏ మ్యూజియంకైనా ఏనాటికైనా పనికివస్తుందేమో! అలా నా తొలిరచనా అనుభవాలు మరువలేనివి; మాసిపోనివి; మరుపురానివి మరి అవి అంత అమూల్యాలు కదా! మరి మీరుమాత్రం కాదంటారా ?

---

# నేనెలా హేతువాది నయ్యాను : రచయిత నెందు కయ్యాను.

అది సంఘసంస్కరణగాని, మత సంస్కరణగాని, విద్యా సంస్కరణ గాని, రాజకీయ మార్పుగాని నా మనస్సెప్పుడూ స్త్రీ జనాభ్యుదయాన్నే కాంక్షిస్తుంది. స్త్రీలు మారితేనే సమాజంలో మార్పు వస్తుందని, దేశ ప్రగతికి అదొక సోపానమని నా నమ్మిక. ఉద్యమాలు నడుపుతున్నా, రచనలు చేస్తున్నా నా లక్ష్యం అదే. అందుకు భిన్నంగా ఎన్ని విమర్శలొచ్చినా, మరెన్ని నిందలు పొడసూపినా ఆ విషయంలో రాజీలేదు. అసలు నాలో ఈ మార్పు ఎప్పుడొచ్చింది ? ఎలా వొచ్చింది ? ఎందుకొచ్చింది అనేవి మౌలిక ప్రశ్నలు. అసలు నేను రచయిత్రి నెలా అయ్యాను? అంటే అదొక విచిత్రకరమైన చరిత్ర; ఆశ్చర్యకరమైన గాథ. మరి వింటారా!

అవి బాల్య వివాహపు రోజులు. నలుగురు పిల్లలు కలిగేనాటికి నా వయస్సు 22 సం॥ నే పుట్టినిల్లు, మెట్టినిల్లు సనాతన సంప్రదాయాలకు నిలయాలు; మూఢవిశ్వాసాలకు ఆలయాలు. అందువల్ల నేనొక ఉత్తమ గృహిణిగా, పతివ్రతగా మన్ననలందాలనేదే అనాటి నా ధ్యేయం. నేను చేయని పూజలేదు. పట్టని వ్రతంలేదు. మ్రొక్కని దైవంలేదు. వంటపని, ఇంటిపని, పిల్లల పెంపకంతో సతమత మయ్యేదాన్ని. నా అత్తమామలు మహా నిష్ఠాగరిష్ఠులు. అందులో మా అత్తగారు అద్వైత వేదాంత శిఖామణి. స్వాములవార్లను, గురువులను సేవించి తరించాలనేదే ఆమె ఆరాటం. సంతర్పణలతో, పురాణాలతో, వేదాంత చర్చలతో మా యిల్లొక ఆశ్రమంలా వుండేది. మా సంపదలో కొంత వాటికే చెందేది. మా కాలము, శ్రమ అందుకే వినియోగిస్తూ తృప్తిపడేవాళ్ళం. మా అత్తగారికి శిష్యులు, శిష్య, పరమాణువులూ వుండేవారు. వారికి మా అత్త ఆదిశంకరుని లెవెల్లో కూర్చుని "అహం బ్రహ్మాస్మి" అంటూ అద్వైత బోధలు చేస్తూ వుండేది. అయినా ఆమెకూ బోధగురువులూ, బాధగురువులూ వుండేవారు. మా అత్తా, ఆమె శిష్యులూ "దొడ్డగురువు" వద్ద ఉపదేశాలు పొందారు.

"గురుర్బ్రహ్మ, గురుర్విష్ణుః, గురుదేవో మహేశ్వరహః" అంటూ రోజూ సాష్టాంగ ప్రణామాలు చేసేవారందరూ. "చైతన్యపూజ" అంటూ ఆయన నఖశిఖపర్యంతం వెన్న మర్దించి బిందెలతో జలకమాడిస్తూ ఆ నీటిని తీర్థంగా పుచ్చుకొనేవారు. ఆయన ఉచ్ఛిష్టాన్ని "ప్రసాదం" అంటూ తినేవారు. ద్రాక్షరసం, ఆవుపాలు, పండ్లు, బాదంపప్పు ఆయనకు ఆహార పానీయాలు. ఎ.సి. లేనిదే సహించలేడు. పట్టుబట్టలే ఆయన కౌపీనాలు. పీతాంబరాలే ఆయన "శాటీలు" (కట్టు బట్టలు) పంచభక్ష్య పరమాన్నాలతో ఆయనకు రోజూ భిక్షలు జరిగేవి. ఆయనకు శిష్యురాండ్రే అధికంగా వుండేవారు. అందులో యువతులు, ధనవంతులు, భర్తృవిహీనలు ప్రియశిష్యులు.

ఒక్కగానొక్క కోడలినైన నన్ను మా అత్త అతి వాత్సల్యంతో చూచుకొనేది. నేనుకూడా ముక్తిపొందాలని, తరించాలనే ఆదుర్దాతో మంత్రోపదేశం చేయించి శిష్యకోటిలోకి నెట్టేసింది నన్ను. ప్రపంచజ్ఞానం లేని నేను జన్మతరిస్తుందని, పునర్జన్మ రాహిత్యం కలుగుతుందని ఉప్పొంగిపోయాను. కాని ఆ శుశ్రూషలు, సేవలు, బోధలూ వింటుంటే జుగుప్స కలుగుతూ వుండేది. గురువేది కోరినా ఆనందంతో సమర్పించాలని, గురుద్రోహం చేస్తే పంచమహాపాతకాలు చుట్టుకుంటాయని శిష్యులందర్నీ నమ్మించాడు. వ్యతిరేకిస్తే నానామాటలు అని బహిష్కరించేవాడు. అమాయకులమైన మేము ఆయన చర్యలు, వాక్కులు శిరసావహించేవారం. ఒకనాడు నాతో "గురువుకు తను, ధన, మాన, ప్రాణాలు సమర్పించాల"ని అన్నాడు. అదేమిటి స్వామి శరీరాలు భర్తకు సమర్పించాం గదా అన్నా అజ్ఞానంతో, "మీ ముష్టి శరీరా లెవరికి కావాలి" అన్నాడు రౌద్రాకారంతో. మరోసారి మా ఆశ్రమానికి వచ్చి తత్వబోధలు వినాలని శాశించాడు. గడగడలాడిపోయింది నా మనస్సు. గజగజలాడిపోయింది శరీరం. గుండె వేగం హెచ్చింది. కణతలపై సుత్తెతో కొట్టినట్లయింది. తడారిపోయిన నా నోటినుండి మాట పెగిలిరాలా. కళ్ళొత్తుకుంటూ బిత్తర చూపులతో తప్పుకున్నా నప్పుడు.

"గురుదేవులు సర్వసంగ పరిత్యాగులమ్మా! మోక్షం విషయంలో భర్త ఆజ్ఞ అవసరంలేదు. నీ బిడ్డల్ని కంటిరెప్పల్లా కాపాడుతూ వుంటా

వెళ్ళిరామ్మా"! అని బుజ్జగించింది. కల్లాకపటా లెరుగని మా అత్త. పక్కా ప్రజాస్వామికవాది, "లిబరల్ వ్యూస్" గల నా భర్తకు ఇవేమీ పట్టేవి కావు. రాజకీయాల్లో మునిగి ప్రచారంకోసం తిరుగుతూ వుండేవారు. పైగా తల్లిగారిపై అమిత గౌరవం. కుడితిలోపడ్డ ఎలుక పరిస్థితి అయింది నాకప్పుడు. నేనా తెల్లవార్లూ దీర్ఘంగా ఆలోచించుకొన్నా; వితర్కించుకొన్నా. నాలో సంచలనం చెలరేగింది. మేల్కొలుపు కలిగింది; భయం పోయింది. కోపం వచ్చింది. ఇదంతా "హంబగ్" అనిపించింది. మొదటి నుండి ఆ మాటలు, ఆ చర్యలు, ఆ భోగలాలసత, పట్టుపరుపులు, వెండి కమండలాలు చూస్తుంటే నాకు రోతగా వుండేది. పైగా నాకారోజుల్లో ఒంటెడు నగలుండేవి. దీనికంతటికీ కారణం నా అజ్ఞానం, అవివేకం ఐశ్వర్యమని గ్రహించుకున్నాను.

జపాన్ని గంగలో కలిపా, గురుత్వాన్ని నాశనంచేశా. సంప్రదాయాలకు "గుడ్‌బై" చెప్పా. హేతువాదినయ్యా క్రమంగా నా జీవిత విధానమే మారిపోయింది. విద్యకు ఉపక్రమించా. బి.ఏ. దాకా చదివి సంఘాలు స్థాపించా. తదాది ఉద్యమాలద్వారా కార్యక్రమాలు నిర్వహిస్తున్నాను. ఆనాడు నేను ఆశ్రమాభిముఖినైతే భ్రష్టనై సర్వనాశనమయ్యేదాన్ని. నాలో తర్కబుద్ధి వుండబట్టే బాగుపడ్డా. ఈ నా అనుభవాలను తోటి స్త్రీలకు పంచిపెట్టాలనే ధ్యేయంతో "నేను హేతువాదిని ఎలా అయ్యాను" అనే ఈ వ్యాసంలో నా అనుభవాల వివరాలువ్రాసి హేతువాద అవసరాన్ని తెలియజేస్తున్నాను. ఏ స్త్రీ ఇలాంటి ఇనుపకచ్చడాల బోనులో చిక్కుకోరాదనే నా ధ్యేయం నెరవేరింది. అప్పటినుండి నాలో ఉద్వేగం, ఉత్సాహం, ఆర్తి కలిగినప్పుడల్లా స్త్రీల సమస్యలపై వ్యాసాలు వ్రాసి పత్రికలకు పంపటం జరుగుతోంది. పత్రికలవారు ప్రచురించి నాకు చాలా ఉత్సాహాన్ని ఇచ్చేవారు. వారు ముఖ్యంగా ఆంధ్రజ్యోతి 1964 లో మహిళాజ్యోతి అనే శీర్షిక పెట్టి నే పంపినవల్లా ప్రచురించేవారు. తర్వాత నా వ్యాసాలతో పన్నెండు పుస్తకాలు అచ్చువేయించుకొన్నా. ఆరు నవలలు (స్త్రీలపై) వ్రాశా. ఇస్లాం, హిందూ, క్రైస్తవ మతాలలో స్త్రీలు, వివాహ వ్యవస్థపై ఆంధ్రలో వంద సం॥రాలు మహిళోద్యమంలాంటి పరిశీలనాత్మకమైన పుస్తకాలు ప్రచురణ చేయించుకున్నా. "వికాసం"

మాసపత్రికను 10 సం॥రాలు మేనేజింగు ఎడిటరుగా వుండి నిర్వహించా. ఇంకా చెప్పాల్సింది, వ్రాయాల్సింది, తెలుసుకోవలసింది అనంతంగా వుందని ఇటీవలే నాకు తెలిసింది. అలా అస్థిత గురువువల్ల నా స్త్రీకురాలి నయ్యానంటే ఆ మార్పుతెచ్చి నన్ను వ్యక్తిత్వంగల వ్యక్తిగా మలుచుకో నిచ్చిన ఆ "మలిన" గురువును నేను విస్మరించలేను. నిజంగా నేను గొప్ప రచయితను కానని నాకు తెలుసు. కాని 30 సం॥రాలుగా ఏదో ఒక సందేశం స్త్రీల కందివ్వాలనే తపన మాత్రం నాలో ప్రజ్వరిల్లుతూనే వుంటుంది. నా భావాలు చెప్తూనే వుంటున్నా, వ్రాస్తూనే వుంటున్నా అలా నేనొక సామాన్య రచయిత్రిని అయ్యాను. ఇటీవల 'Women Tradition & Culture' అనే ఇంగ్లీషు పుస్తకంతోపాటు "Saga of Women's Struggle" అనే మరో సంకలనం వెలువడ్డాయి. బెంగాలీ, మరాటీ, మళయాళాలలోకూడా ఈ సంకలనాలు వస్తున్నాయి. ఆంధ్రలో మహి ళోద్యమం ఇంగ్లీషులో అచ్చులో వుంది. నాలో సంచలనం కలిగిన నాటి నుండి వైవిధ్యంతో కూడిన స్త్రీల సమస్యలపై రేడియో, టి.వి. లలో చర్చలు, సెమినార్లలో వర్కుపేపర్లు వ్రాయటం, సభలలో పాల్గొనడం, సారధ్యం వహించడం నాకు దినచర్య అయింది.

అన్నింటిలో కొలికిపూస స్త్రీ స్వేచ్ఛా; స్త్రీ పురుష సమానత్వం అవి హారంలో, ధారంలా వుంటాయి. నా లక్ష్యాలు, ఆదర్శాలు మారవు. అవి కంటిచూపు మేరలో దృగ్గోచరం కావనే అపనమ్మకం నాకు లేదు. నిరాశ అసలే లేదు. ఏదైనా మన కోర్కె నెరవేరలేదంటే అది మన ప్రయత్న లోపమేనని నా నిశ్చితాభిప్రాయం. తరతరాల బానిసత్వ భావాలు ఒక నాటితో పోవు. దానికి తగ్గ ప్రయత్నమూ, పట్టుదలా, ధైర్యమూ ఆత్మ విశ్వాసం మనలో వుండాలి. స్వార్థంపోవాలి. పేరుప్రతిష్టలకై తాపత్రయం నశించాలి. ఇవి నా ఇప్పటి ఆదర్శాలు, లక్ష్యాలు.

---

# ఏది అశ్లీలం? ఏది అసభ్యత? ఎవరు నిర్ణయించాలి?

సెక్సు రచనలు వ్రాసి యువతలో నైతికపతనానికి కారణభూతు లవుతున్నారని, రచయితలు సమాజంపట్ల బాధ్యతారహితంగా ప్రవర్తిస్తున్నారని, అతి త్వరలో 'పాపులర్' పోవాలనే కాంక్ష వారిలో మిక్కుటమై అపభ్రంశ రచనలు చేస్తున్నారని, పాశ్చాత్యపోకడలను అనుసరిస్తున్నారని, అనవసరంగా స్త్రీల అంగాంగవర్ణనలు, కామకేళీ విలాసాలు తమ రచనల్లో గుమ్మరిస్తున్నారని ఇటీవల ఒకవాదం బహిర్గత మవుతోంది. అశ్లీల సాహిత్యాన్ని నిషేధించాలని, శృంగారపరమైన వాల్‌పోస్టర్లను చింపివేయాలని కొందరు పోరాడుతున్నారు. మరోవర్గం వారు కేవలం సెక్సు సినిమాలే మన పవిత్రతను సర్వనాశనం చేస్తున్నా యని ఆక్షేపిస్తున్నారు. అసలు "కంబైండు" ఎడ్యుకేషనే మన కొంప తీస్తోందని స్త్రీలకు వేరే కళాశాల లుండాలనేవారు లేకపోలేదు. పురాణాల్లోని సెక్సు సాహిత్యం సున్నితంగా, మధురంగా వుండేదని, నేటి సాహిత్యం ఉద్రేకాన్ని రెచ్చకొడుతోందనే వారుసైతం అన్ని రకాల సెక్సు పుస్తకాలు చదువుతూనేవున్నారు; 'A' అనే బూతు సినిమాలు చూస్తూనేవున్నారు. మనం వాటికి దూరంగావుంటే ఆ రచనలు, ఆ సినిమాలు అంతగా ఎదిగేవి కావు. కనుక కారణం మనమేనని చెప్పకోకతప్పదు.

అసలు ఎలాంటి సెక్సు కావాలి? ఏది బహిష్కరించాలి? ఎంతవరకు నిషేధించాలి? మరెంతవరకు సెక్సుపరిధి ఆమోదయోగ్యం అనే విషయాల్లో మళ్ళీ తేడాలున్నాయి. అందువల్ల అతి ముఖ్యమైన దనుకున్న సెక్స్‌ను అతి రహస్యంగా వుంచాలనడంలో అర్థమేమిటి? శరీరంలోని ఇతర అవయవాలను గురించి తెల్సుకోవాలన్నప్పుడు జీవిత ముఖ్యభాగమైన సెక్స్ విజ్ఞానానికి ఇంత రభస ఎందుకు? ఇన్ని అడ్డంకు లెందుకు? అటు శృంగారమనుకున్నా, ఇటు శాస్త్రజ్ఞానమనుకున్నా అనుభవించే విషయా

ఆనాటి వ్యవస్థలో స్త్రీని ఒక విలాసవస్తువుగా పరిగణించారు.

నాటి శృంగారమంతా సంస్కృత భాషలో వర్ణించారు కనుక, ఆ పదాల మాధుర్యానికి ముగ్ధులయ్యేవారు. భాష తెలిస్తేకూడా ఆ తన్మయత్వంపోయి చిందులు త్రొక్కుతారనేది అనుమానాస్పదమే. గీత గోవింద కావ్యంలోని జయదేవుని అష్టపదులన్నీ పచ్చి శృంగారాన్ని వర్ణిస్తాయి. నానారకాల రతిక్రీడలను దేవుని పేరుతో చిత్రిస్తే వాటిని కంఠస్థం ఎందుకు చేస్తున్నాం? పుణ్యమని చేస్తున్నామా? జీవితానుభవమని ఆహ్లాదిస్తున్నామా? ఆలోచించండి! సీతా వియోగ విరహాన్ని రతి ఉపరతులతో (తమ్ముడైన లక్ష్మణునితో) రాముడు వర్ణిస్తుంటే విని ఆనందిస్తున్నామేకాని, ఆ వాల్మీకిని దూషిస్తున్నామా? ఆ రామాయణ గ్రంధాన్ని చింపేస్తున్నామా? లేదు. ఎందుకని అవి మన అనుభవైక వేద్యాలు. ఇలా ఇంకా ఎన్నో పచ్చిబూతులు మన "పవిత్ర" శాస్త్రాలనిండా దర్శనమిస్తాయి. కాళిదాసు విరచితమైన కుమారసంభవంలోనూ, "వివాద ప్రోత్థిత శ్రీకుచోపరిచేలాంచలమైన వీడడు" అన్న పోతన్నగారి భాగవతంలోను, "కాంతుడూ, నీవు ఏకాంతమున పెనగువేళ" లాంటివి రామదాసు కీర్తనల్లోనూ పాడుతున్నాంకదా! ఇంకా రాసక్రీడలు, జలక్రీడలు, గోపికాక్రీడలు, క్షేత్రయ్య పదాలు, అన్నమాచార్య జావళులు ఇలా ఎన్నో! మరెన్నో!! మన కావ్యాలనిండా వున్నాయి. పెద్దన్నగారి వరూధిని పాత్ర అద్వితీయమైనది. స్త్రీకి కూడా కామవాంఛ వుంటుందనే సిద్ధాంతానికి ఆమె ప్రతీక. కులానికి దేవవేశ్య అయినా ప్రవరుణ్ణి మనోవాక్కాయ కర్మలా ప్రేమించి తన కోర్కెను నిష్కల్మషంగా ప్రకటించింది. సహజంగా స్త్రీ లైంగికవాంఛను ప్రకటించదు. కాని "ప్రాంచత్ భూషణ బాహుమూల రుచితో పాలిండ్లు పొంగారి" - మనుచరిత్రకే ఇది ఒక సవాల్. మరి మనం ఆ మను చరిత్రను భస్మంచేస్తామా? పవిత్రంగా భావిస్తామా? ఆఖరికి దేవీస్తుతిలో కూడా "శ్రీ రమణీకుచ దుర్గ విహారా" అంటూ "కుచోన్నతే కుంకుమరాగ శోభితే" అని వర్ణిస్తూ స్తుతిస్తున్నామంటే మనతో శృంగారం జీర్ణించిపోయింది. విడదీయరాని అనుభవైకవేద్యం అయిపోయింది.

ఆహార నిద్రా మైథునాలు మానవ జీవిత ముఖ్య ధర్మాలు. కేవలం సినిమాలవల్ల, సాహిత్యంవల్ల మానవుడు సెక్స్ ప్రేరేపితుడుకాడు. అది అతనికి ప్రకృతి నేర్పిన విద్య. పుట్టుకతో వచ్చిన దేహధర్మం. జవసత్వాలుడిగినా కామవాంఛ నశించదు. అది సహజమేకాని యాదృచ్ఛికం కాదు. యవ్వన దశను, ఆ మధుర స్మృతులను అపేక్షిస్తూ, తృప్తి పడతాడు వృద్ధుడు సైతం. ఆదిమ మానవుడు సెక్సును ఇచ్ఛావిశృంఖలత్వంగా, విచ్చలవిడిగా అనుభవించేవాడు. నాగరిక సమాజంలో సెక్సుకు ఎల్లలు, హద్దులు, పరిమితులు నిర్దేశించటానికి వివాహ వ్యవస్థ ఏర్పడింది. తద్వారా జంతుదశను దాటి, ఆనందోపాసకు డయ్యాడు మానవుడు.

ఇటీవల సెక్స్‌కు పెద్దపీటలు వేస్తున్నాయి. ఆ సిద్ధాంతాలు అపభ్రంశాలు; అవి ఆచరణ సాధ్యంకాకపోగా పెడదారినిపట్టిస్తాయి. అందులో కొన్నిరకాలున్నాయి. రజనీష్‌లాంటివారు ఆశ్రమాలు నెలకొల్పి సెక్సును మోక్షసాధనంగా అభివర్ణించి కాముకక్రీడలద్వారా మోక్షప్రాప్తికి సోపానాలు నిర్మిస్తామని ప్రజల్ని మోసంచేస్తున్నారు. కొందరు గురువులు తాంత్రిక పద్ధతుల్లో పాంచరాత్రి విధానంలో సెక్సుకు విపరీత స్థానం కల్పిస్తున్నారు. వావివరుసలు లేకుండా, మత్తు పదార్థాలను సేవిస్తూ కేవలం సంతోష సాధనంగా సెక్సునువాడే హిప్పీలున్నారు. దాహంవేస్తే నీరు త్రాగినట్లు "డ్రింక్ ఆఫ్ వాటర్ థియరీ" శారీరక ఉద్రిక్తతను తీర్చుకోవటంలాంటివి కేవలం ధర్మవిరుద్ధాలు, నీతిబాహ్యాలుగా చెప్పుకోవచ్చు. అలాగే రెచ్చగొట్టే దృశ్యాలు, ఉద్రేకపరిచే సాహిత్యం బలహీనుల్ని మాత్రం కొంత తహతహలాడిస్తుంది, కొంతమందికి చీరె చూస్తేనే, స్త్రీ మాట వింటేనే మనిషిని తాకితేనే ఉద్రేకపడవచ్చు. అది వారి దుర్బలత్వం, చిత్త చాంచల్యం. అంతమాత్రాన సర్వులకు సెక్సు సాహిత్యం, సెక్సు విద్య, సెక్సు విజ్ఞానం, సెక్సు ప్రబోధం నిషేధించాలనుకోవటం సాహసమేకాదు; అజ్ఞానానికి నిదర్శనంకూడా. కేవలం సెక్సు సాహిత్యమే లైంగిక ఉద్రేకాన్ని పెంచుతుందని, హింసకు, దౌర్జన్యానికి ప్రోద్బలపరుస్తుందనుకోవటం అసభ్యం, అజ్ఞానం. ఆమాటకొస్తే విద్యావిహీనుడు ఏ సాహిత్యం చదివి "రేప్" చేస్తున్నాడు. అది వారివారి ప్రవృత్తి.

లైంగిక వాంఛను స్త్రీ కోరినా, పురుషుడు కోరినా అది శారీరక ధర్మంగా భావించాలి. స్త్రీ అయితే తప్పు, పురుషుడయితే ఒప్పు అను కోవడం అపభ్రంశం. లైంగిక నీతిని చెడ్డగా వల్లెవేసే ప్రబుద్ధులు తమ దాంపత్య జీవితాన్ని సుఖప్రదం చేసుకోవాలని ఎందుకు తపనపడాలి? తమ పిల్లలకు పెళ్ళిళ్ళుచేసి వారు ఆనందంగా వుండాలని ఎందుకు కోరుకుంటున్నారు? ఆలోచిస్తే తప్పుఒప్పులు వారికే తెలుస్తాయి. పేరు ప్రఖ్యాతులకోసం సెక్సు రాస్తారని భావించటం పొరపాటు. రచయిత వేషభాషలు, వయస్సునుబట్టి యిలా రాయడం అవివేక మనడం మరీ తప్పు. రచయిత చెప్పిన సందేశమేమిటి? అది మానవ జీవితానికి దర్పణం పడుతుందా? వక్రమార్గాన పయనిస్తుందా? అని ఆలోచించాలి.

నేటి మానవ మేధస్సుకు, విజ్ఞానానికి అవధులు లేవు. లైంగిక సంపర్కంలేకుండా టెస్టుట్యూబు బేబీలను తయారుచేస్తున్న ఈతరుణంలో సెక్సు ఉనికికే మార్పు వచ్చింది. అన్ని రంగాలలో సమూలమైన మార్పులు వస్తున్నప్పుడు అన్నింటికన్నా ముఖ్యమైన సెక్సును గురించి ఆలోచించటం తప్పా? చర్చించటం తప్పా? వ్రాయటం తప్పా? రాసే విధానం తప్పా? ఈ తప్పొప్పులకు గీటురాయి ఏది? ఈ సందర్భంలో సెక్సును గురించి అపోహలు, అనుమానాలతో పవిత్రత సాంప్రదాయాలూ అంటూ తపించటం అర్ధరహితం. 11 సం॥ అమ్మాయినుండి 80 సం॥ల తాతయ్యవరకు సెక్సును గురించి ఉత్సాహపడడం చూస్తున్నాం. జడదారులను సైతం పరివశింపజేసే సెక్సుకు విధినిషేధాలు, హద్దులు అడ్డంకులు నిర్మించడం హాస్యాస్పదం. ఎవరిని ఎవరు ఆపగలరు? ఎలా దాచిపెట్టగలరు? ఎందుకు దాచిపెట్టాలి? పైగా పాశ్చాత్యులను మంచికీ చెడుకూ విమర్శించటం సభ్యతకాదు. అంతమాత్రాన విచ్చలవిడి ప్రవర్తన కావాలని కోరటంలేదు. నీతినియమాలుండాలనే వాంఛిస్తున్నాం. కాని సుఖవ్యాధులున్న వారినిసైతం ఆ మాట నోటితో చెప్పుకోరాదనడం, రహస్యంగా దాచటం పరమ కిరాతకం. అన్ని జీవిత సమస్యల లాగానే సెక్సునుకూడా తిలకించాలి. అది కథ, నవల, నాటకం, వ్యాసం, ఏదయినాకాని వైవిధ్యంతో కూడిన మానవ జీవిత సమస్యలను వెలికి తెచ్చేదే సాహిత్యం. దానికి ఎల్లలు లేవు. ఆ రచయితే నిజమైనస్రష్ట. అతనికే సమాజంలో శాశ్వత స్థానముంటుంది.

# మానవవాదం - మహిళోద్యమం

మానవవాదం మానవుని అభ్యుదయాన్ని కాంక్షిస్తుంది. స్వేచ్ఛను అభిలషిస్తుంది. వ్యక్తిత్వాన్ని ఆశిస్తుంది. వ్యక్తి వికాసానికి ప్రాముఖ్యత నిస్తుంది. నైతిక వలువలు సూచించే నైతిక దృక్పథం కలది. సమాజాన్ని మానవ వ్యక్తుల సంఘంగా పరిగణిస్తుంది. సమాజాభ్యుదయమంటే మానవులందరి వ్యక్తిగత సంక్షేమాల సముదాయం అని భావిస్తుంది. వ్యక్తివినా సమాజానికి వేరే అస్తిత్వం ఉందని మానవవాదం అంగీకరించదు. కనుక జాతి, సమాజం, వర్ణం, కులం మతాలపేర్లతో వ్యక్తిని అణగద్రొక్కటాన్ని సహించదు. మానవ సమాజానికి మానవుడే మూలమని ఘోషిస్తుంది. సమాజాభ్యుదయానికి మానవ వ్యక్తిగత అభ్యుదయమే గీటురాయి అని ప్రబోధిస్తూ జీవితాలు యాంత్రికం కాకూడదని నిర్దేశిస్తుంది.

పాతకాలపు మానవవాదం మానవుని అస్తిత్వాన్ని, స్వభావాన్ని నిర్వచనంచేసే సందర్భంగా దేవుని లేక పరమాత్మను ప్రాతిపదికగా తీసుకుని ఆలోచించింది. మానవునితో దైవాంశ లేక పరమాత్మ అంశ వున్నదని తలచి అందరు మానవులు దేవుని బిడ్డలు లేక అఖండమైన బ్రహ్మయొక్క అంశ కలిగి జీవాత్మభాసితులని తలపోసింది. ఇది మత మానవవాదుల దృక్పథం. కాలం గడిచింది. సైన్సు వృద్ధిచెందింది. జ్ఞానం పెరిగింది. మానవ విశిష్టతను తరచిచూడటం జరిగింది. సాంప్రదాయం పేరిట మత మౌఢ్యానికి తలవంచని రీతిలో విజ్ఞాన వికాసాలతో, తర్కంతో ప్రగతి ప్రధాన మానవుని నడిపించే చైతన్యవంతమైన సిద్ధాంతం అవసరమయింది. అన్వేషణ జరిగింది. అది రాడికల్ హ్యూమనిజమని తేలింది. శాస్త్రీయ దృక్పథం, శాస్త్రీయ అవగాహన, హేతుత్వం హ్యూమనిష్టు సిద్ధాంతానికి ప్రాతిపదికలు.

ప్రతి మానవ వ్యక్తిలో హేతుత్వం భాసిల్లుతున్నదని, అది మానవుని శారీరక ధర్మమనీ నిర్ణయానికి రావడానికి అవకాశం కల్గింది. మానవులందరిలో "హేతుత్వం" ఉన్నపుడు స్థూలదృష్టితో మానవులు అందరూ సమానులని భావించడం విడ్డూరంకాదు. ఈ ఆలోచన రాడికల్ హ్యూమనిజం, లేక నవ్య మానవవాదం, లేక సమగ్ర మానవవాదం యొక్క మౌలిక భావన. ఇదే ఎం.ఎన్. రాయ్ చేత ప్రవచింపబడిన నవ్య మానవవాద మౌలిక సూత్రం.

పైన చెప్పబడిన సమానత్వ సూత్రం ప్రజాస్వామ్య భావనకు దారి తీస్తుంది. అంతేకాక దానిని సమర్థిస్తుంది. దానికి సిద్ధాంత ప్రాతిపదికను ఏర్పరుస్తుంది.

ప్రజాస్వామ్యాన్ని అంగీకరించిన తరువాత స్త్రీ పురుషుల సమానత్వాన్ని ఎవరూ కాదనకూడదు, కాదనజాలరు. ఇంతవరకు స్త్రీల యెడల పురుషుల ధోరణి, సమాజ దృక్పథం ప్రజాస్వామ్య విరుద్ధంగా ఉంది. ఒకనాడు స్త్రీని ఆస్తిగా పరిగణించేవారు. ఆమెకు మనసువున్నా అది పనిచేయరాదు. ఆమెకు వ్యక్తిత్వం లేదు; ఉండరాదు. ఇప్పటికీ ఆ భావనయొక్క అవశేషాలు మనకు కనపడుతున్నాయి. భర్తయొక్క పరోక్ష సమ్మతిలేకుండా, దోహదం లేకుండా భార్య వ్యభిచరిస్తే ఆ భార్య మిండగానిపై భర్త నేరారోపణ చేసి క్రిమినలు కేసు పెట్టవచ్చును. అది భారత శిక్షాస్మృతి క్రింద ఇప్పటికీ నేరమే. దీని అంతరార్థం ఏమిటి? భార్య భర్తయొక్క ఆస్తి కనుక ఆ ఆస్తిని మరొకరు దొంగిలించరాదు! తమ సొంతం చేసుకోరాదు. ఈ భావనను విస్మరిస్తూ "ప్రేమ+సెక్సు=నీతి" అనే నవల వ్రాశాను నేను. మరో ఉదాహరణ కావాలంటే, 20వ శతాబ్దంలో వివాహిత స్త్రీలకు ఆస్తిహక్కునిచ్చే చట్టం ఇంగ్లండులో వచ్చేదాకా వివాహిత స్త్రీ యొక్క ఆస్తిపై భర్తదే పెత్తనం. అంతేగాక 19వ శతాబ్దంలో కూడ భార్య సంపాదనను భర్త తీసుకొని అనుభవించేవాడు. ఆమె ఫ్యాక్టరీలో పనిచేస్తే ఆమె జీతాన్ని ఫ్యాక్టరీ యజమానులు భర్తకు చెల్లించేవారు.

కాలం గడిచింది. పురుషుడు ఆమెను బానిసగా చూచాడు. ప్రాణం వున్న వ్యక్తి, జీవంవున్న మనిషి అయినా ఆమెకు స్వేచ్ఛలేదు. భర్త చెప్పినట్లు, తండ్రి ఆదేశించినట్లు, కుమారుడు నిర్దేశించినట్లు ఆమె నడుచుకోవాలి. ఆమె సర్వదా రక్షింపబడేదే. మనువు ఈ విషయాన్ని చాలా స్పష్టంగా నిర్మొహమాటంగా చెప్పాడు. కన్యగా తండ్రి రక్షణలో, భార్యగా భర్త పోషణలో, భర్త మరణానంతరం కుమారుని సంరక్షణ కత్వంలో ఆమె ఉండాలి.

అంటే ఆమె శాశ్వతంగా మైనరు. ఆమెకు ఇచ్ఛాసంకల్పాలు వుండరాదు. యుద్ధాలు జరిగినపుడు పరదేశ స్త్రీలను చెరపట్టేవారు. వారిని బలవంతంగా వివాహమాడేవారు. (చూడు బైబిలు ద్వితీయోపదేశ కాండము-అధ్యాయం 20, వాక్యం 14). ఇతరులకు ఇచ్చి బలవంతంగా వివాహం చేసేవారు. భారతంలో భీష్ముడు తన తమ్ములకు వివాహం చేసే నిమిత్తం అంబ, అంబిక, అంబాలికలను దౌర్జన్యంగా తెచ్చిన సంఘటన గుర్తుచేసుకోవాలి యీ సందర్భంగా. కాఫిరులను ఓడించిన తరువాత వారి స్త్రీలను నీకు యిష్టమయితే వివాహమాడవచ్చునని తన అనుయాయులకు హితవు చెప్పాడు మహమ్మదు (చూడు ఖురాను 33:50). ఇక్కడ స్త్రీల యిష్టాయిష్టాల ప్రసక్తిలేదు. ఇలా ఎన్నో మనం ఉటంకించవచ్చును.

ఈనాడు మూడవ దశకు చేరుకున్నాము. స్త్రీలను రెండవ జాతిగా చూడడం జరుగుతోంది. ఆమెకు రాజకీయ స్వాతంత్ర్యం యివ్వబడింది; ఓటు హక్కు వచ్చింది. ప్రజాప్రతినిధులుగా కొంతమంది స్త్రీలు ఎన్నికవుతున్నారు. మరికొందరు హైకోర్టు న్యాయమూర్తులుగా ఉన్నారు. నిన్న మొన్న చనిపోయిన ఇందిరాగాంధీ అత్యున్నతమైన ప్రధానమంత్రి పదవిని 15 సం॥లు నిర్వహించింది. కాని, మొత్తంమీద చూస్తే స్త్రీలకు రాజకీయ రంగంలో తగినంత స్థానంలేదు. ఆ రంగంలో వారి చొరవ, ప్రవేశం లేవు. రాజకీయ స్వాతంత్ర్యం వారిపట్ల కేవలం లాంఛన ప్రాయంగానే మిగిలిపోయింది.

మహిళలకు ఆర్థిక స్వాతంత్ర్యం లేదు. స్త్రీలు ఉద్యోగాలు చేయటానికి, కార్మికులుగా ఉండటానికి, సంపాయించుకోటానికి, ఆస్తిని పొంది వుండడానికి ఈనాడు హక్కు కలిగివున్నారు. కాని, వారి ఆస్తిమీద, వచ్చే ఆదాయంమీద, వారి జీతాలమీద వారికి అధికారం లేదు, విద్యావంతులై ఉద్యోగినులుగా వున్న స్త్రీలు పందలు వేల రూపాయలు సంపాయించుకొంటూ అదంతా భర్తల చేతుల్లో, అత్తమామల చేతుల్లో పోసి, కొద్దిమొత్తం తమ ఖర్చుల నిమిత్తం వారివద్ద తీసుకొని, తమ జీవితాలు వెళ్ళబుచ్చుకుంటున్నారు. ఆస్తులు ఆడవారి పేర ఉంటాయి. కాని, వాటిపై అజమాయిషీ, అదుపు భర్తలది. మెడనిండా, వంటినిండా నగలు ఉంటాయి కొందరికి. కాని, వాటిపై యాజమాన్యంవారికి లేదు. దీనిని ఆర్థిక స్వాతంత్ర్యమని అనగలమా? ఇది మధ్యతరగతి పరిస్థితి మాత్రమేనని భావించేవారు చాలా పొరపడుతున్నారు. ధనిక స్త్రీల పరిస్థితి ఇందుకు భిన్నంగా లేదు. కాకపోతే తినటానికి తిండి, ఉండటానికి ఇల్లు, వేసుకోవటానికి నగలు ఉంటాయి. నిజానికి ధనికవర్గపు స్త్రీలు "షోకేసు"లో బొమ్మలు. అందాల ఆటవస్తువులు. ఇక శ్రామిక స్త్రీల విషయం చెప్పనక్కరలేదు. భర్త సంపాదన అంతా త్రాగుడుక్రింద ఖర్చుపెట్టి, అది చాలక ఆమె కూలిడబ్బులను బలవంతంచేసి కాజేస్తాడు. మంచి మంచి ఆహారం భర్తకూ పిల్లలకూ పెట్టి తను గంజినీళ్ళతో తృప్తి పడుతుంది ఆమె. పుష్టికరమైన ఆహారం లేనందువల్ల ఆమె ఆరోగ్యం కుంటుపడుతుంది. నీరసించి పోతుంది ఆమె. అంతటితో ఆగదు ఆమె దైన్య స్థితి. భర్తచేత చీవాట్లు, చెప్పుదెబ్బలు ఆమెకు నిత్యానుభవంగా తయారవుతున్నాయి. దీనినంతా ఆర్థిక స్వాతంత్ర్యమని ఎవరైనా ప్రచారంచేస్తే, అంతకన్న స్త్రీజాతిపట్ల అత్యాచారం మరోటి ఉండదు.

స్త్రీకి సాంఘిక స్వాతంత్ర్యం సున్న. ఆమె జీవితాన్ని ఆమె నిర్ణయించుకోటానికి ఆమెకు అవకాశం లేదు. ప్రతి ఆడపిల్ల విధిగా వివాహం చేసుకోవలసినదే. వివాహమే ఆమె గమ్యం, ఆమె జీవిత లక్ష్యం. ఇలాగని సంఘం నిర్దేశిస్తోంది. తల్లిదండ్రులు ఆమోదించి అమలుపరుస్తున్నారు. తనకు భర్త కాబోయే వ్యక్తిని తనుగా ఆమె

ఎన్నికచేసుకోవటానికి వీలులేదు. ఆ అంశాన్ని తల్లిదండ్రులో, లేకపోతే అన్నదమ్ములో, కాకపోతే దగ్గర బంధువులో నిర్ణయిస్తారు. వారి నిర్ణయాన్ని ఆమె శిరసావహించవలసి వుంటుంది. పైగా వారి మతంలోనే, కులంలోనే, శాఖలోనే ఆమె వివాహం జరగాలి. ఇలా ఎన్నో ఆంక్షలు, ప్రతిబంధకాలు వున్నాయి. ఆమెకు అర్హతవున్నా స్వుద్యోగం చేయటానికి అత్తమామల అనుమతి, భర్త సమ్మతి కావాలి. అత్తమామల సేవ, భర్త అడుగుజాడలలో పయనించడం, సంతానాన్ని కనడం ఆమె విద్యుక్త ధర్మాలు. ఆమెకు వ్యక్తి స్వేచ్ఛ మృగ్యం. విడాకుల హక్కును వినియోగించుకోవటాన్ని కొన్ని మత ధర్మ శాసనాలు వ్యతిరేకిస్తాయి; మరికొన్ని అడ్డంకులను కలుగజేస్తాయి. విడాకులు పొందిన స్త్రీని సమాజం హేళన చేస్తుంది. వివాహం చేసుకోకుండా కన్యగా ఉంటే ఈసడిస్తుంది. ఒంటరి స్త్రీని వేటాడుతుంది; వెన్నాడి ఆమె జీవితాన్ని దుర్భరం చేస్తుంది. కొన్ని మతాలవారు, తెగలవారు, జాతులవారు స్త్రీకి వేర్పాటు కలిగిస్తున్నారు. మేలిముసుగు, పర్దా వారి పట్ల క్రూర సర్పాలయినాయి. ఆమె జీవితం అంతా సెక్సుపరంగా చిత్రించి, వేడుకలు, పండుగలు నిర్ణయించింది హిందూమతం. అంటే ఆమె సెక్సుకు తప్ప మరెందుకు పనికిరాని వ్యక్తిగా పరిగణించబడుతోంది. వివక్ష సర్వేసర్వత్రా కొట్టవచ్చినట్లు కనపడుతోంది. సంతానాన్ని కనడం, కనకపోవడం ఆమె యిష్టాయిష్టాలపై ఆధారపడదు. అంతా భర్త ఇష్టంమీదనే నిర్ణయింపబడుతుంది. ఉద్యోగాలలో, పనులలో పురుషులకే మంచిమంచివి కేటాయించబడతాయి. శిక్షణ విషయంలో ఆమెను చిన్నచూపు చూస్తారు. ప్రమోషన్ల అంశాన్ని గమనిస్తే పురుషులకు త్వరత్వరగా అవి లభిస్తాయి. చదువు విషయం సరేసరి. ఆడది "ఉద్యోగాలు చేస్తుందా? లేక ఊళ్ళేలుతుందా" అని చెప్పి ఆడపిల్లలకు చదువు ఎగవేస్తారు. మంచి మార్కులు తెచ్చుకొంటూ తెలివితేటలు గల ఆడపిల్లల చదువు మాన్పించి, బండరాయి అయిన మగపిల్లవానికి చదువు చెప్పిస్తారు తల్లిదండ్రులు. ఇలా ఆమెకు సమాజంలో ఎదురుదెబ్బలు ఆజన్మాంతం తగులుతూనే వుంటాయి.

సాంస్కృతిక రంగంలో స్త్రీది ఎల్లప్పుడూ రెండవ స్థానమే. లలిత

కళలలో దిట్టలుగా పురుషులు చెలామణి అవుతున్నారు. ప్రముఖ కవులు, గాయకులు, చిత్రలేఖకులు, కథకులు, నాట్యాచార్యులు, రచయితలు చివరకు పాకశాస్త్ర ప్రవీణులు అందరూ మగవారే. స్త్రీలు సకుర్తిగా లేరనికాదు. వారి సంఖ్య బహు స్వల్పం. వారికి వచ్చే పరిగణన అత్యల్పం. సాహిత్య సంగీత లలితకళా అకాడమీలలో పురుషులదే పెత్తనం. అలంకారప్రాయంగా ఒకరిద్దరు స్త్రీలకు చోటు పెడ్తారు. వారి వ్యక్తిత్వాన్ని ఎదగనీయరు. వారికి కీలక స్థానాలు ఇవ్వరు. వారిని నిరుత్సాహ పరుస్తారు. ఈసడింపు మాటలతో హేళనా వాక్యాలతో అస్తమానం దెప్పిపొడుస్తూనే వుంటారు.

ఇలా అమలులోవున్న స్త్రీ పురుషుల వివక్షవల్ల స్త్రీలు శోచనీయ స్థితిలో వున్నారు. కన్యగానో, వితంతువుగానో, లేక భర్తకు దూరమైతేనోతప్ప స్త్రీ యొక్క వ్యక్తిత్వం వికశించటానికి అవకాశాలు కన్పడటం లేదు. లేకపోతే సంపూర్ణ సహకారం అందించే పురుషుడు భర్తగా లభించిన భాగ్యశాలినికి తప్ప మరే వివాహిత స్త్రీకి ఆమె శక్తియుక్తులను ప్రదర్శించటానికీ, ప్రతిభావ్యుత్పత్తులను వెలువరించటానికి వీలుకలగడం లేదు. ఇది చాల బాధాకరమైన పరిస్థితి. వివాహమాడటానికి, దాంపత్య జీవితం గడపటానికి పురుషునితోపాటు సమానంగా స్త్రీకి హక్కున్నది. కాని, దాంపత్య జీవితం ఆమెపాలిట కాలసర్పమై పరిణమించి ఆమె వ్యక్తిత్వాన్ని చిదిమివేయటం అక్రమం, అన్యాయం.

ఇన్ని రకాలుగా ఇబ్బందులకు, కష్టనష్టాలకు లోనవుతున్న స్త్రీ అభ్యుదయం కొరకు మహోద్యమం చేపట్టవలసి ఉన్నది. స్త్రీలకు పురుషులతో సమానంగా స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు జీవితంలోని అన్ని రంగాలలో లభించవలసివున్నది కనుక, దీనిని ఏ ఒక్కరో సాధించలేరు. సమిష్టిగా స్త్రీ లందరూ కలిసి కృషి చేయవలసిన తరుణం ఆసన్నమైంది. అంతేకాదు. విజ్ఞానవంతులూ, వివేచనాపరులూ అయిన పురుషులుకూడా అట్టి స్త్రీలకు చేయూతనీయాలి. కనుక ఈ మహోద్యమానికి ఒక సిద్ధాంతం, ఒక మార్గం నిర్ణయించబడటం సముచితం.

స్త్రీ విమోచన సిద్ధాంతాలు అనేకం. వాటిని మహిళోద్యమ కార్యకర్తలు అధ్యయనం చేయాలి. వాటిలో సరియైనదానిని ఎంపిక చేసికొని తదనుగుణంగా వ్యవహరించాలి. అందుకు ముందుగా వైవిధ్యం కల కొన్ని సిద్ధాంతాలను విశ్లేషించటం అవసరం.

ఉదారవాద స్త్రీ విమోచనకారులు (Liberal Feminists) ఎక్కువగా రాజకీయ సమానత్వానికి, సామాజిక సమానత్వానికి కృషి చేస్తారు. అయితే వారుకోరే పరిష్కారమార్గం పెట్టుబడిదారీ విధాన పరిధిలోనే ఉంటుంది. దానిని వారు దాటిపోరు. అలాకాక మార్క్సిస్టు స్త్రీ విమోచనకారులు (Marxist Feminists) సోషలిష్టు సామాజిక వ్యవస్థను ఆశిస్తారు. కార్మిక జనసంక్షేమం, స్త్రీ కార్మికుల ప్రత్యేక సమస్యలు, వేతనాల విషయంలో స్త్రీ పురుష సమానత్వం, వీటికోసం పోరాటం సాగిస్తారు. వర్గపోరాటానికి పెద్దపీట వేస్తారు. మహిళోద్యమం వర్గ పోరాట అవసరాలకు లోబడివుండాలి వారి దృష్టిలో. ఇది సాంప్రదాయ మార్క్సిస్టుల అంచనా. కాకపోతే సృజనాత్మక మార్క్సిస్టులు (మావో. అతని అనుచరలు) మహిళోద్యమానికి, సాంస్కృతిక విప్లవానికి మరి కొంత ప్రాధాన్యత ఇచ్చినా, సోషలిస్టు సామాజిక వ్యవస్థలోనే స్త్రీల సమస్యలకు పరిష్కారమార్గం దొరుకుతుందని భావిస్తారు. సోషలిస్టు స్త్రీ విమోచనకారులు (Socialist Femenists) ఆర్థిక పునాదిని భావసౌధాన్ని సమాన ప్రాధాన్యత కలవిగా పరిగణిస్తారు. అయితే వారూ సోషలిస్టు సామాజిక వ్యవస్థనే అభిలషిస్తారు. హ్యూమనిస్టు స్త్రీ విమోచనకారుల దృక్పథం వేరు. వారు ఆశించే ఆదర్శ సమాజ ఆర్థిక స్వభావం వేరు. అది సహకార సూత్రంపై నిర్మితమవుతుంది. అంతేగాక వారు ఆర్థిక పునాదికి ప్రప్రథమ స్థానం ఇచ్చి భావసౌధానికి ద్వితీయ స్థానాన్ని ఇవ్వరు. ఆర్థికానికి ప్రాధాన్యత వున్నమాట వాస్తవమే కాని, అది భావ సౌధాన్ని కించపరచేదిగా వుండదు. రెండూ సమానస్థాయి కలవే వారి దృష్టిలో. అంటే మహిళోద్యమానికి ద్వితీయ స్థానాన్ని కేటాయించి, వర్గ పోరాటానికి ప్రథమ స్థానాన్ని ఇవ్వరు. మహిళోద్యమాన్ని వాయిదా వేయరు. మహిళోద్యమమూ, ఆర్థిక పోరాటమూ రెండూ ఏకకాలంలో

ఒకేసారిగా జరగాలని కోరతాను. అంటే, సమాజంయొక్క సర్వతోముఖ అభ్యుదయాన్ని కాంక్షిస్తారు.

ఈ రకంగా హ్యూమనిస్టు స్త్రీ విమోచన సిద్ధాంతం యెలా స్త్రీల రాజకీయ, ఆర్థిక, సామాజిక సాంస్కృతిక పురోభివృద్ధికి ఉపకరిస్తుందో తెలుసుకున్న తరువాత మానవవాదుల కర్తవ్యం ఏమిటి అనే ప్రశ్న ఉదయిస్తుంది. మహిళోద్యమంపట్ల మానవవాదుల కర్తవ్యం ద్వివిధం. ఒకటి మానవవాది వ్యక్తిగతంగా నిర్వహించవలసినది, రెండవది సామూహికంగా చేపట్టవలసినది.

మానవవాది మున్ముందుగా తన కుటుంబంపై దృష్టి సారించాలి. తన ఇంట్లో ఉన్న స్త్రీల విద్యాభివృద్ధికి, సర్వతోముఖ వికాసానికి సాయపడాలి. వారి కృషికి దోహదం చేయాలి. వారి ప్రయత్నాలను వ్యతిరేకించక పోవటం ఒక ఎత్తు. వారిని ప్రోత్సహించడం మరొక పద్ధతి. రెండవ మార్గాన్ని అనుసరించాలి మానవవాది. విద్య విషయంలో పట్టణవాసులైన మానవవాదులు కొంత ముందంజవేసినా, స్త్రీలను ఉద్యోగాలను చేయనియడంలో కొంత పురోగాములుగా కన్పడినా, స్త్రీలలో శాస్త్రీయ దృష్టివ్యాప్తికి వారి కృషి అత్యల్పము. ఇక గ్రామవాసుల స్థితి-శ్రామిక స్త్రీలు అనాదిగా కాయకష్టముచేసి తమ కుటుంబ పోషణ చేసుకుంటున్నారు. గ్రామాలలో రైతు కుటుంబాలలో స్త్రీలు-మధ్య తరగతి రైతు, ధనికరైతు, భూస్వాముల కుటుంబాలలో స్త్రీలు గౌరవం పేరుతో కాయకష్టం చేయటం లేదు. ఏదైనా ఒక్క భూస్వాములు, ధనిక రైతుల కుటుంబాలలో తప్ప స్త్రీ విద్యపట్ల ఆసక్తి తక్కువేకాక, అసలు ప్రోత్సాహమేలేదు. శాస్త్రీయ భావనా మరి వేరే చెప్పనక్కరలేదు. అది అసలే మృగ్యం. గ్రామస్థులుగా ఉన్న హ్యూమనిస్టులు పట్టణవాసులైన హ్యూమనిస్టులకన్న స్త్రీల విద్యావ్యాప్తి విషయంగా వెనుకబడి వున్నారనేది సుస్పష్టం. ఈ అఖాతాన్ని పూడ్చవలసిన బాధ్యత హ్యూమనిస్టులపైనే వున్నది.

ఇక హ్యూమనిస్టులు సాముదాయకంగా మహిళోద్యమానికి ఏమి చేస్తున్నారు, ఏమి చేయగలరు, ఏమి చేయాలనేది చర్చనీయాంశ మవు

తుంది. భారతదేశంలో హ్యూమనిస్టు భావ ప్రభావిత మహిళోద్యమం లేదు. ఉదారవాద స్త్రీ విమోచనకారుల సంఘాన్ని నిర్మించుకొని (అఖిల భారత మహిళా మహాసభ) కృషిచేస్తున్నారు. భారత కమ్యూనిస్టు పార్టీ అనుయాయులైన స్త్రీలు భారత మహిళల జాతీయ ఫెడరేషనుద్వారా పనిచేస్తున్నారు. మార్క్సిస్టు కమ్యూనిస్టు పార్టీని అనుసరించే మహిళలు భారత ప్రజాస్వామ్య మహిళల సంఘంద్వారా మహిళోద్యమానికి తమకు అనుకూలమైన మలుపు ఇస్తున్నారు! మహిళా దక్షతా సమితి పేరుతో ప్రమీలా దండావతే బోటి నాయకమ్మన్యులు సోషలిస్టు భావాలతో స్త్రీ విమోచనోద్యమాన్ని నడుపుతున్నారు. కొంతమంది తీవ్రవాద భావాలు గల స్త్రీలు ఢిల్లీలోని "మానుషి" పత్రికద్వారా భావవ్యాప్తి చేస్తున్నారు. హ్యూమనిస్టు భావాలుకల స్త్రీలు తక్కువగా ఉన్నారు. వారికి కేంద్ర సంస్థగాని, చెప్పుకోతగినంత బలంగా రాష్ట్ర సంస్థగాని లేదు. ఏదో రాష్ట్రానికి ఒకరిద్దరు మాత్రం రాష్ట్రాలలో యథోచితంగా మహిళోద్యమాన్ని ముందుకు తీసుకొనిపోవడానికి పాటుపడుతున్నారు. ఇది శోచనీయమైన పరిస్థితి. ఈ స్థితి మారాలంటే పురుష హ్యూమనిస్టులుకూడా మహిళోద్యమం పట్ల ఆసక్తిని ప్రదర్శించాలి. ఆ ఉద్యమ ఆవిర్భావానికి అనువైన పరిస్థితులను కల్పించాలి. మహిళా కార్యకర్తలను తయారుచేయటానికి ఉద్యమించే కొద్దిపాటి సంఖ్యలోవున్న ఉద్యమ సంచాలకులకు చేయూత నివ్వాలి. మహిళోద్యమం ప్రజాస్వామ్య ఉద్యమంతో ప్రధానభూమిక వహిస్తుందని గుర్తించాలి. సమాజంలో నూటికి ఏబదిమందిగా ఉన్న స్త్రీలు వెనుకబడి ఉన్నంతకాలం సమాజం పురోగమించజాలదనే సత్యాన్ని అన్ని రాజకీయ పార్టీలు, ఉద్యమాలు సంపూర్ణంగా గ్రహించలేదు. ఏదో కళ్ళతుడుపు మహిళోద్యమాన్ని ప్రోత్సహిస్తున్నట్లు నటన చేస్తున్నారు. మహిళోద్యమ నాయకులకు పార్టీ నాయకత్వాలలో తగిన స్థానం ఇవ్వటం లేదు. వారినికూడా ద్వితీయశ్రేణి వారినిగా రాజకీయ పార్టీలు చూస్తున్నాయి. తరతరాలుగా సమాజంలో పెత్తనం సాగించిన పురుషాధిక్యత, పురుష దురహంకార భావాలు అజ్ఞాతంగా పురుష విప్లవకారుల మనస్సులలో కూడ చోటుచేసుకున్నాయని ప్రకటిస్తే అది సత్యదూరంకాదు. కమ్యూనిక

విప్లవకారులుగా చలామణీ అవుతున్న పురుషులు ఎంత త్వరగా ఆత్మ విమర్శ చేసుకొని ఎంత త్వరగా మారితే దేశానికి అంత అభ్యుదయం లభ్య మవుతుంది. ఈ సూత్రం హ్యూమనిస్టు ఉద్యమకారులకుకూడా వర్తిస్తుందని వేరే చెప్పనక్కరలేదు. మరి చరిత్ర వారిపై మోపిన భారాన్ని వారు మోయగలరా ? వారి విద్యుక్త ధరాన్ని వారు నిర్వహించగలరా ?

(కలకత్తా అఖిల భారత రాడికల్ హ్యూమనిస్టు మహాసభలో [1984] ప్రసంగ పాఠం)

---

# పిల్లల మానసిక సమస్యలు : తల్లుల కర్తవ్యాలు

బాల్యదశ చాల ఉత్కృష్టమనీ, ఆ దశలో పిల్లలకు ఏ బాధలూ, బాధ్యతలూ లేవనీ, కష్టాలు అసలే వుండవు అనే నమ్మకం పెద్దలకు గాఢంగా వుంటుంది. అసలు పిల్లల కేమండీ, చాల అదృష్టవంతులు. వాళ్ళు సుఖదుఃఖాలకు, లాభనష్టాలకు అతీతులు; పరిస్థితులకు పొంగిపోరు, కృంగి పోరు. అందువల్ల పిల్లలకు మానసిక సమస్యలే వుండవని, సమస్యలన్నీ మనకే వుంటాయని మనం తరతరాలుగా నమ్మే ముఖ్య సిద్ధాంతాలలో ఇది వకటి. ఏ కష్టమైనా మరే నష్టమైనా మనం బైటికి చెప్పుకుంటాం. సగం బాధను వెళ్ళగక్కుకుంటాం. తద్వారా కొంత మనశ్శాంతిని పొంద గల్గుతాం. కాని పిల్లలు తమ బాధలను చెప్పుకోగల పరిజ్ఞానం వారిలో వికసించని కారణంగా మానసికంగా మధనపడతారు. అభం, శుభం తెలియని పిల్లలకు సమస్య లేమిటండీ! మీరు అసహజమైన వింత భాష్యం చెప్తున్నారు అని మీరు నన్ను దుయ్యబట్టవచ్చు. కాని పిల్లల మనస్తత్వ శాస్త్రం చదివితే వారి మానసిక సమస్యలు అర్థం అవుతాయి.

అంతే కాదు పిల్లల నడవడి, మాటల తీరుతెన్నులు, వారి ప్రశ్నలు పరిశీలిస్తే పిల్లల కెన్ని రకాలైన మానసిక సమస్యలున్నాయో మనకే స్పష్టంగా తెలుస్తాయి.

కేవలం భాషాజ్ఞానం తెలియని పసిపిల్లలు మాత్రమే ఆకలికి, బాధకూ అన్నింటికీ ఏడుస్తారు. క్రమేపి వారిలో అనేక మార్పులు రావటం మనం గమనిస్తూనే వుంటాం. ఉ॥ ఆరునెలల పాపను ఒంటరిగా విడిస్తే ఏడుస్తుంది. తనను లాలిస్తూ, పల్కరిస్తూ వుండాలని కోరుకుంటుంది. అంటే తనను ప్రేమించేవారూ, గుర్తించేవారూ వుండాలనే ప్రగాఢ వాంఛ ఇందులో ద్యోతకమవుతోంది. అలాగే ఊహ పెరిగేకొద్దీ పిల్లల్లో రకరకాలైన మానసిక లక్షణాలు ఏర్పడతాయి. కుతూహలం, అనుకరణ, కోపం, ఆదుర్దా, భయం, అసహ్యం, అసూయ, స్వార్థంలాంటి లక్షణాలు అవి. ఇంగితజ్ఞానం లేని పిల్లల్లో అసూయ, ద్వేషం, ఈర్ష్యలాంటి దుష్టగుణాలు వుంటాయనుకోవటం భ్రమండీ! మీరు అలాంటి లక్షణాలు పిల్లలకు ఆపాదించటం మీ తెలివితక్కువతనమని నన్ను మీరు దూషించవచ్చు. అపార్థం చేసుకోవచ్చు.

ఇక్కడొక ముఖ్యలక్షణం మనం చెప్పకోక తప్పదు. ప్రకృతిసహజ లక్షణాలు బిడ్డకు పుట్టుకతోనే కొన్ని వస్తాయి. పరిసరాల ప్రభావంవల్ల కొన్ని నేర్చుకుంటాడు. కుటుంబాచారాలవల్ల కొన్ని, స్నేహితులవల్ల మరికొన్ని సంక్రమిస్తాయి. వివేకి అయిన వ్యక్తి బుద్ధిని ఉపయోగించి దుర్లక్షణాలకు దూరమై సన్మార్గుడవుతాడు. చిన్నపిల్లల్లో బుద్ధివికాసం వుండదు కనుక ఆలోచించరు. అందువల్ల బిడ్డల్లో రకరకాలైన మానసిక లక్షణాలుంటాయి. పిల్లల్లో అన్నింటికన్నా ముందుగా బహిర్గతమయ్యేది అనుకరణ. నవ్వితే నవ్వటం. చిలుకపలుకులు పల్కటం. చప్పట్లు కొడితే కొట్టటం, ధ్వన్యనుకరణ చేయటం లాంటివి అవి. పెద్దవాళయ్యేకొద్దీ సినిమా చూచివచ్చి తామూ అలాంటి "ష్టంటు" చేయ్యటం నేర్చుకుంటారు. ఇంకా పెరిగాక సినిమాల్లోలాగా దొంగతనాలు, హత్యలూకూడా చేస్తారు. ఇవి చూచి నేర్చుకునేవి.

పిల్లలకు కోపం తృటిలో వస్తుంది. అమ్మ ఎత్తుకోకపోయినా, అడిగింది ఇవ్వకపోయినా అమ్మమీది కోపంతో బొమ్మలు పగలకొడతారు. తమ్ముడిమీది కోపంతో వాణ్ణి కొడతారు. తండ్రిమీద కోపంవస్తే అతని కాగితాలు చింపేస్తారు. పరాయి ఇంట్లో వస్తువులు పగలగొట్టటం, విరగ్గొట్టటంలాంటివి చేస్తూ వుంటారు. అప్పుడు తల్లులు వారిని చావకొడతారు. కొట్టినకొద్దీ చేసినపనినే తిరిగి చేస్తారు. ఇతరు లేమనుకుంటారో అని తల్లి మళ్ళీ కొడుతుంది. అప్పుడు ఆ పిల్లవాడు మరీ మూర్ఖుడై పోతాడు. తాను బాగుపడకపోగా తల్లిపై ద్వేషం పెంచుకుంటాడు. అందువల్ల తల్లి బిడ్డను కొట్టినందువల్ల ప్రయోజనం శూన్య మవుతుంది. కనుక ముందుగా బిడ్డ కోపకారణం తెలిసికొని నేర్పుగా అతనికి నచ్చచెప్పాలి.

అలాగే పిల్లల్లో అశక్తత, నిస్సహాయత ప్రబలంగా వుంటాయి. తనకు అన్యాయం జరిగినప్పుడు చేసినవాడిమీద పడి కొట్టాలని కొడతాడు. కొట్టలేకపోతే తానే కృంగిపోతాడు. ముడుచుకుపోతాడు; తల్లడిల్లి పోతాడు. ఈ పరిస్థితి పిల్లల మానసిక సమస్యల్లో ముఖ్యమైనది. పిల్లల్లో ఆదుర్దా తప్పనిసరిగా వుంటుంది. తల్లి రెండో పిల్లను దగ్గర తీసినప్పుడు తనకు దూరమయిందని, తన్ని ప్రేమించటం మానివేసిందనే భయంతో సతమతమయిపోతారు. ఆఖరికి, తన తల్లి తన తండ్రికి చేరువయినా సహించలేని స్వార్థం పిల్లల్లో వుంటుంది. తాను ఏకాకినై పోయాను అనే మానసిక వ్యథ వారిలో వుంటుంది. మరో ముఖ్య విషయం అదేమిటంటే అన్నివస్తువులు తనకే చెందాలనే స్వార్థంతో చెల్లికంటె తమ్ముడికంటే తనకే ఎక్కువ వుండాలనే వాంఛ మిక్కుటంగా వుంటుంది. అందుకే వాళ్ళ చేతుల్లోవి లాక్కోవటం, ఇవ్వకపోతే ఏడవటమూ సర్వ సామాన్యంగా పిల్లలు చేసే పని.

ప్రతి విషయం తెల్సుకోవాలనే కుతూహలం పిల్లల్లో అత్యధికంగా వుంటుంది. అనేక రకాలైన యక్షప్రశ్నలు అడుగుతారు. ఆ ప్రశ్నలు చిత్రాతిచిత్రంగా వుంటాయి. వింటుంటే నవ్వొస్తుంది, ఆశ్చర్యం కలిగిస్తుంది. కొన్ని సమయాల్లో కోపంకూడా వస్తుంది! నే నెలా పుట్టానమ్మా!

అంటూ ప్రశ్నిస్తా డొకసారి. పక్షులు ఎందు కెగురుతాయమ్మా, మేఘ నల్లగా వుంటా యెందుకమ్మా, నక్షత్రాలు పడిపోవా? సముద్రం ఉప్పగాను, మన పంపు నీరు తియ్యగా వుంటా యెందుకూ? ఇలా మానం వెంటపడి అడుగుతూనే వుంటారు. మనం ఇతరులతో మాట్లా టప్పుడుకూడా అడ్డుపడి గొణుగుతూనే వుంటారు. వారు అడిగినప్పు ఓపిగ్గా అర్థం అయ్యేలా చెప్పాలికాని ఛీ! ఛో! అని విసుక్కోరాదు. పదే అడిగినా మనం అసహనం కనపరచరాదు. అబద్ధాలు చెప్ప అసలే పనికిరాదు. ఇతరులతో మాట్లాడేటప్పుడు ప్రశ్నించరా నెమ్మదిగా నచ్చ చెప్పుకోవాలి. కాని తిట్టటం, దూషించ లాంటివి చేస్తే పిల్లలు తలక్రిందులై పోతారు. వారిలో జిజ్ఞా కుతూహలం, ఆలోచనా శక్తి నశించిపోతాయి. తాము చెప్ప మీ మేష్టార్ని అడుగు! అంటారు తల్లులు. అందువల్ల పిల్లలు మాన క్లేశాన్ని పొందుతారు. మనం చెప్తూ వున్నప్పుడు పిల్లల్లో తగిన జ్ఞాన అనుభవం లేకపోఇట్టి కొన్ని వారికి అర్థంకావు. అర్థం అయ్యేట్లు చెప్పా లేదా నీవు పెద్దయ్యాక నీకు ఆ విషయం అర్థం అవుతుందని నచ్చచెప్పా ఎంత ఓపిగ్గా చెప్పగలిగితే అంత ప్రశాంతత, గ్రహణశక్తి వారిలో కలు తాయి.

పిల్లలకి రెండోక్లాసునుండి అబద్ధం ఆడరాదు. అని పెద్దలు నేర తారు కాని తాము పుటికీ, పుటికీ అబద్ధాలు చెప్తూనే వుంటారు. అందువ పిల్లలకు తల్లిదండ్రులపై విశ్వాసం, గౌరవం సన్నగిల్లే ప్రమాదం వుం పిల్లలుకూడా అబద్ధాలు చెప్పటం తప్పుకాదనుకుంటారు. పైగా త దండ్రులు అస్తమానం దెబ్బలాడుకుంటుంటే పిల్లలు వారిని చులకన చూస్తారు. హేళన చేస్తారు. పిల్లల్లో పిల్లలు గుసగుసలాడుకుంట వుంటారు. తామూ కొట్టుకోవడం, తిట్టుకోవడం నేర్చుకుంటారు. అంద వల్ల ఏ పరిస్థితుల్లోనూ వారి ఎదుట మనం పోట్లాడుకోరాదు. కొంద తల్లిదండ్రులు తమ కోపాన్ని పిల్లలపై చూపిస్తూ చావబాదుతారు. ఇష్ట వచ్చినట్లు తిడతారు. కొడతారు. దాంతో పిల్లలకు తల్లిదండ్రులపై ద్వేషం, అసహ్యంలాంటి భావాలు ఏర్పడుతాయి. అది మానసిక వ్యధ మారిపోతుంది. గజగజ వణికిపోతారు. తద్వారా ఇతరులతో సైతం

మంచిగా మాట్లాడలేని స్థితికి లోనౌతారు. కనుక ఎంతో శాంతితో, ఓర్పుతో సహనంతో వుండాలి పిల్లలపట్ల.

ఒక్కసారి తోటి పిల్లాడితో తగవులాడి, వాణ్ణి కొట్టివస్తాడు. అది చాలక ఇంకా ఏడుస్తూ తల్లినికూడా వాణ్ణి కొట్టమని అడుగుతాడు. ఆ సమయంలో ఎంతో నేర్పుగా బిడ్డకు హితబోధ చెయ్యాలి తల్లి. పరిస్థితుల్ని వివరించాలి. కొట్టటం తప్పని చెప్పాలి; నీతికథలు చెప్పాలి.

ఇటీవల చాలామంది స్త్రీలు ఉద్యోగాలు చెయ్యక తప్పటం లేదు. పెద్ద డిగ్రీలకై పిల్లలు పుట్టాకకూడా చదవక తప్పటం లేదు. ఈ పరిస్థితుల్లో ఇంటా, బైటాకూడా పనిచెయ్యకపోతే స్త్రీకి జరగటం లేదు. ఇలా సతమతమవుతున్న గృహిణులు పిల్లల విషయంలో తగిన శ్రద్ధ చూపలేకపోతున్నామని బాధపడుతున్నారు. వారికి విద్య చెప్పలేకపోతున్నారు. పిల్లల ఆరోగ్య విషయంలోకూడా శ్రద్ధాశక్తులు చూపలేకపోతున్నారు. ఒక్క స్త్రీ ఎన్ని గంటలు పనిచేస్తుంది? ఎన్ని బాధ్యతలు నెరవేరుస్తుంది అనే భావం పురుషులలో శూన్యమవుతోంది. కేవలం పిల్లల బాధ్యత తల్లులకే వుండాలి అనే సనాతన భావంతో వారు పట్టించుకోకపోవటంవల్ల తల్లులకు అదనపు చాకిరీ చెయ్యాల్సివస్తోంది. అదికాక నిరాదరణ అనేది పిల్లల భవిష్యత్తుకే గొడ్డలిపెట్టులా పరిణమించే ప్రమాదంకూడా లేకపోలేదు అందువల్ల తండ్రులు కేవలం పోషణాభారమేకాక పిల్లల పెంపకంలోకూడా శ్రద్ధాశక్తులు చూపాలి.

పిల్లల పెంపకం కర్తవ్యంతో కూడిన భారమైన బాధ్యతగా భావించాలి. కేవలం "డ్యూటీ"గా చేస్తే చాలదు. ఇంత తిండీ, గుడ్డా, నీడా ఇస్తే సరిపోదు. అదొక అసిధారావ్రతం లాంటిది. బిడ్డల్ని క్రమశిక్షణ, నీతి నిజాయితీ గల పౌరులుగా చక్కదిద్దాలంటే ముందుగా తల్లుల కెంతో విద్యా వివేకాలుండాలి. త్యాగం వుండాలి. బిడ్డల శ్రేయస్సుకై దీక్ష బూనాలి. సర్వవేళలా వారి చర్యలను, లక్షణాలను కనిపెట్టి చూస్తూ వుండాలి. వారిలో దుష్టప్రవృత్తి గోచరించగానే దగ్గరికి చేరదీసి ఎంతో మెలకువతో నీవు చాలా మంచివాడివి నాయనా అలాంటి పొరపాటు మనం

చెయ్యరాదని నచ్చచెప్పి మాన్పించాలి. కేవలం భయంవల్లనే చేయించ లేము. వారి మనస్సు పరిణతి చెందేలా ఉత్తమ లక్షణాలను వారి భాషలోనే వారికి చెప్పాలి. వారిలో మార్పుతేవాలి. అలాంటి నడత నేర్పటం కొంత కష్టమైనా దుస్సాధ్యం మాత్రం కాదు. చిన్ననాటనే అలాంటి స్వభావ సిద్ధుడైన బిడ్డ తన జీవితాంతం అతని పరివర్తనలో చెడ్డపనులు చేయ లేడు. తన బిడ్డలో ఆ పరిణతి తెచ్చుటకై తల్లి దీక్ష బూనాలి. అలాంటి బిడ్డలవల్లే సమాజానికి, దేశానికి భవిష్యత్తు వుంటుంది.

"యథారాజా తథాప్రజా" అన్నట్లు పిల్లలు దొంగలైనా, దుర్మార్గులు కావటానికైనా, విద్యావిహీనులు అయినారన్నా, సంఘ విద్రోహులుగా జీవిస్తున్నారన్నా అందులో 99 పాళ్ళు తల్లిదండ్రులకే చెందుతుంది. చిన్న నాటి క్రమశిక్షణా రాహిత్యమే వారినలా తయారుచేస్తుంది! మొక్కయి వంగనిది మ్రానై వొంగుతుందా! అనేది అక్షరాలా నిజం. పిల్లలు చెడు నడతకు తల్లిదండ్రులే బాధ్యులు. నీతిగా బిడ్డల్ని పెంచలేనివారు, పోషించ లేనివారు బిడ్డల్ని కనడం మానేయడం శ్రేయస్కరం. మనం బిడ్డల్ని చీడ పురుగులుగా తయారుచేస్తే, బాధ్యతా రహితంగా ప్రవర్తిస్తే అది సాంఘిక నేరంగా భావించాలి. అందరూ అలా చేస్తున్నారని కాదు. కొందరు తల్లులు పట్టీపట్టనట్లు ప్రవర్తిస్తున్నారు. అది కేవలం ఉద్యోగినులకే వర్తించదు. కొందరు ఉద్యోగినులు సైతం సమర్థత గలవారు లేక పోలేదు. కేవలం గృహిణులుగా వున్నవారుకూడా పిల్లలపై శ్రద్ధాశక్తులు చూపనివారూ వున్నారు. అది వారి విలువలనుబట్టి వుంటుంది. వారి సామాజిక దృక్పథాన్నిబట్టి వుంటుంది. పిల్లల్లో దయ్యాలు, భూతాలపై నమ్మకం కలిగించే తల్లులు కొందరైతే కేవలం భక్తిప్రపత్తులవల్ల, నమ్మ కాలవల్ల పరీక్షలు పాసవుతారనే భావానికి బీజాలు నాటుతారు మరికొందరు. అందువల్ల పిల్లల్లో స్వశక్తి, ఆత్మవిశ్వాసం సడలిపోతాయి. కాపీలు కొట్టి కొందరూ, ముడుపులు కట్టి కొందరూ కృతార్థులు కావాలని వాంఛిస్తారు. కనుక ముందుగా తల్లుల్లో మానసిక వైఖరి మారాలి. తార్కిక చింతనా మార్గంనుండి అభూతకల్పనలవైపు పిల్లల్ని మరలించరాదు. మన చుట్టూ వున్న ప్రకృతిని, సమాజాన్ని, సర్వప్రపంచాన్ని గురించి తెలుసు

కోవాలన్న తపన, ఆరాటం వారిలో కలిగించాలి. పూజలు చేస్తే కోర్కెలు సిద్ధిస్తాయని, అమ్మప్రక్కన చెల్లిని దేవుడు తెచ్చి పడేశాడనే మూఢవిశ్వాసాలకు వారిలో తావుండరాదు. సైన్సు దాని పరిణామం, శాస్త్రీయజ్ఞానం వారిలో కలిగించటం చాలా అవసరం. తోటి మానవుణ్ణి గౌరవించే విధానాన్ని చిన్ననాటినుండే వారికి అలవర్చాలి. సహనం సౌశీల్యం, దాతృత్వం, నిస్వార్థంలాంటి లక్షణాలు విధిగా నేర్పాలి.

విద్యావంతులు సైతం శిక్షణక్రింద కొట్టటం, తిట్టటం, గుంజీలు తీయించటం, గెంటటం లాంటి క్రూరశిక్షలు వేసి దండిస్తూ వుంటారు. ప్రతి పని చెయ్యవద్దు అని చెప్పేబదులు వారికా అవసరాన్ని సహేతుకంగా వివరిస్తే వారిలో ఆలోచనా శక్తి పెరుగుతుంది. అందువల్ల విజ్ఞాన విషయాలపై వారి దృష్టి మళ్ళుతుంది. పిల్లల పెంపకం ఎంతో బాధ్యతతో, జాగ్రత్తతో జరుగవలసిన పని. వారిలో హేతుత్వాన్ని పెంచాలన్నా, వివేకవంతులుగా రూపొందించాలన్నా ముందుగా మనలో వైజ్ఞానిక దృక్పథం సంతరించుకొని తద్వారా అలాంటి వైఖరి వారికి కలిగేటట్లు చేయాలి. అది మన ముఖ్య కర్తవ్యం.

(1985 లో ఆలిండియా హైదరాబాదువారి సౌజన్యంతో)

---

# సాహిత్యంలో ఆధునికత అడుగంటుతోందా ?

సామాజిక స్పృహలేని రచన సాహిత్యం అనబడదు ; అది ప్రయోజన శూన్యమవుతుంది ; దానికి శాశ్వతత్వ ముండదు. సాహిత్యం రెండు రకాలు. శాస్త్రీయ దృక్పథం కలిగి ఆలోచింపజేసేదాన్ని (లాజికల్‌గా) ఆధునిక సాహిత్యం అని చెప్పుకోవచ్చు. ఆ రచనలు అభ్యుదయ ప్రధాన, సంస్కరణల విధానాలతో నడుస్తాయి. ఆ సాహిత్యం సమూల మార్పును కోరుతుంది ; తిరుగుబాటును ప్రోత్సహిస్తుంది. శ్రీశ్రీ లాంటివారి రచనలు ఆధునికతతో కూడిన అభ్యుదయ సాహిత్యంగా పేర్కొంటాం. రెండవది సంప్రదాయ సాహిత్యం. విశ్వనాథలాంటివారి రచనలన్నీ సనాతన వాదాన్ని, మతధర్మాలను గౌరవిస్తాయి. ఆ సాహిత్యాన్ని భారతీయ సంస్కృతిగా హెచ్చుమంది గౌరవిస్తున్నారు ; స్వీకరిస్తున్నారు ; పోషిస్తున్నారు. అయినా ఆధునిక సాహిత్యం కూడా నశించకపోగా పెరుగుతూనే వుంది. కారణం భావవాదం, భౌతికవాదం తోడునీడల్లా ప్రక్క ప్రక్కనే పయనిస్తూ వుంటాయి. అవి ఏనాటికీ కలువని సమాంతర రేఖలు. కాని ఆధ్యాత్మికవాదం అతి పెద్దది. దాని పరిధి విశాలమైనది. 99 మందిని మలుచుకోగల శక్తి దాని కున్నది. ఎక్కడ అజ్ఞానం, అశాస్త్రీయత, అవివేకం వుంటాయో అక్కడల్లా సంప్రదాయపు ప్రభావం వుంటుంది. అది స్త్రీపురుషు లిద్దరిలోనూ వుంటుంది. ఆ రచయితలద్వారా (స్త్రీ పురుషులు) వేలసంఖ్యలో వెలువడుతున్న వారి సాహిత్యం అంతా ఆధునికతను నిరశిస్తుంది. అందువల్ల ఆ రచనలవల్ల సాంఘికంగా స్త్రీల పరిస్థితి మారుతోందా? రాజకీయంగా వారు చైతన్యవంతులౌతున్నారా? ఆర్థికంగా సమాన -త్వాన్ని వాంఛిస్తున్నారా, సాంస్కృతికంగా పురోగమిస్తున్నారా ? శాస్త్రీయ దృక్పథం, ఆధునికత, అభ్యుదయ భావాలు ఎందరిలో ప్రోది చేసుకుంటున్నాయి? అసలు సాహిత్యానికి గీటురాయి ఏది? మరి ఎందుకు అలాంటి రచనలు చేస్తున్నారు అని ప్రశ్నిస్తే వాటికి సమాధానం దొరకదు.

యు.ఎన్.ఓ. వారి ధర్మమా అని ప్రపంచ మహిళాసంవత్సరం,

దశాబ్దాల వచ్చి మీదపడి స్త్రీలను వెన్నుతట్టి లేపాయి. రెక్కలు గుంజి ముందుకు తోశాయి. నీ స్థాన మెక్కడ? నీవెక్కడ? అని కలవర పరిచాయి. నీ గురించి ఆలోచించుకోమని హెచ్చరించాయి. నీకు వ్యక్తిత్వ ముందా అని ప్రశ్నించాయి. నీ భవిష్యత్తుకు బాటలు వేసుకో అంటూ ఒక్కతోపు తోసి ఉక్కిరిబిక్కిరి చేశాయి. ఆ తాకిడికి తట్టుకోలేని తరుణులు వంటింటిని, పడకటింటిని దాటి వీధి గుమ్మంలోకి తొంగిచూచారు. ఆ సందర్భంగా సభలు, సమావేశాలు, చర్చలు, సెమినార్లు విరివిగా జరి గాయి. అన్నింటికన్నా ముఖ్యమైనది మహిళలపై సాహిత్యం వెల్లివిరి సింది. అంతేకాదు మహిళలే ఉద్రేకంతో, ఉత్సాహంతో రచనా ప్రక్రియను చేబట్టారు. మహిళా సాహిత్యాన్ని పత్రికలు ఆదరించాయి. స్త్రీ పేరు చూస్తేకాని వేసుకోని పత్రికలు, చదవని పాఠకులు తయారయ్యారు. రచయిత్రులకు గొప్ప పాఠకలోకం లభించింది. పత్రికలకు "డిమాండు" పెరిగింది. అలా రచయిత్రులతోపాటు మహిళా చదువరులుకూడా గొప్ప సంఖ్యలో పెరిగారు. ఒకవిధంగా ఆలోచిస్తే ఇది కొంత పురోగమనం కావచ్చు కాని వ్రాసిందంతా అభ్యుదయకరమైనదా? ఈ సాహిత్యంవల్ల స్త్రీజాతిలో మానసికవికాసం, జాగృతి వస్తోందా అంటే అది వేరే విషయం: చర్చనీయాంశం కూడాను.

గుండెల్లోంచి వచ్చేది బాధ అయితే మెదడులోంచి వచ్చేది వేదన. ఆ వేదనే సాహిత్యరూపం తాలుస్తుంది. ఆ సాహిత్యం ఆయా రచయితల విలువలనుబట్టి వుంటుంది. సనాతనధర్మంపై నడవాలనే ధోరణిలో రచనలు చేస్తారు సంప్రదాయవాదులు. విజ్ఞానశాస్త్ర పరిశోధనా ఫలితాల కనుగుణ మైన రీతిలో తమ రచనావ్యాసంగాన్ని సాగిస్తారు ఆధునికులు. ఎవరి భావాలు వారివి; ఎవరి మార్గాలు వారివి. ఈ రెంటికీ సమన్వయం లేకపోగా ఎడతెగని పోరాటం సాహిత్యరూపాల్లో దర్శనమిస్తూనే వుంటుంది. అయితే ఆధునికభావాలు గలవారు అత్యల్పం అనక తప్పదు. సనాతన సంప్రదాయ భావాలను అత్యధికులు ఆమోదిస్తారు. ఆ సిద్ధాంతాలతోనే వారు స్త్రీ ధర్మాలు, కర్తవ్యాలు ఆమె హోదా నిర్వచిస్తున్నారు. వాటిని అత్యధిక సంఖ్యలో ప్రజలు గౌరవిస్తున్నారు. ప్రాచీన ఋషులు, ధర్మ

శాస్త్రకారులు, పురాణకర్తలు అంతా పురుషులే. వారంతా పురుషాధిపత్యంతో స్త్రీని నిరసిస్తూ, చులకనగా చూస్తూ ఆనాటి సాహిత్యంలో వ్రాశారు. నాటి స్త్రీని కేవలం సెక్సు సింబల్‌గా చిత్రించారు. ఆమెపై విధి నిషేధాలు, ఆంక్షలు లెక్కకు మిక్కుటంగా వుండేవి. ఆ వరవడిలోనే, వాటి ఆధారంతోనే భారతదేశ చట్టాలు నిర్మించారు. తర్వాత మళ్ళీ మతాలనుబట్టి శాసనాలు రూపొందించబడ్డాయి. ఇక మతవిషయంలో స్త్రీని ముస్లిములు భూమితో పోలిస్తే, హిందువులు వ్యక్తిత్వం లేని బొమ్మను చేశారు. మనువు స్త్రీని పురుషుని ఆస్తిగా జమకట్టాడు. నీకు ఆజన్మాంతం విధేయురాలిగా వుంటానని పెళ్ళిలో ప్రమాణం చేస్తుంది క్రైస్తవ మహిళ. సంప్రదాయం కోసం వ్యక్తిని బలిచేసేవే సంప్రదాయ సిద్ధాంతాలన్నీ. చిత్తశుద్ధికన్నా సిద్ధాంతాలకే విలువ ఇస్తారు మతవాదులు. ప్రాణానికన్నా కళేబరానికే విలువ వుంది మన సంప్రదాయంలో. ఆ దృష్టితోనే రచింపబడింది మన ప్రాచీన సాహిత్యం. వాటి ఛాయలతోనే నేటి మన సాహిత్యం వెల్లివిరుస్తోంది. ఈలాంటి రచనలు చేసేవారిలో స్త్రీలుకూడా అత్యధికంగానే వున్నారు.

స్త్రీ విమోచనపైకాని, స్త్రీల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలపై కాని దృష్టి కేంద్రీకరిస్తూ వ్రాసే రచనలు దరిదాపు శూన్యం. సంప్రదాయాన్ని బలపరిచే విషయంలో స్త్రీ పురుష రచనల్లో తేడా అన్నది కాగడాలేసి గాలించినా దృగ్గోచరం కావడం లేదు. పురుషాధిక్య భావాలు జీర్ణించుకొన్న మహిళలు సైతం వాటినే బలపరుస్తూ వ్రాస్తున్నారు. వారి దృష్టిలో వివాహంతో స్త్రీ పురుషుడి సేవకురాలుగా మన్ననలందుకోవాలి. ఆమె పతివ్రత, ఉత్తమగృహిణి, ఆదర్శమహిళగా బ్రతకాలి. పాపం, పుణ్యం అనే బూచీలను చూపి విధి నిషేధాల పేరుతో అనేక బాధ్యతలు ఆమెపై పెట్టారు. అవి తమకు తామే నమ్మి ఆచరించే రీతిలో బోధించబడ్డాయి. అధిగమిస్తే అధోగతి అంటారు. లేక సంఘ బహిష్కరణ చేస్తారు. అలాంటి భయభక్తులతో మలచబడ్డది భారత నారీమణి. భర్త ద్వారానే ఆమెకు గుర్తింపు వుండాలనేది మనవారి ధ్యేయమయింది. తన దేహంపై, తాను కన్న బిడ్డలపై సర్వాధికారాలు భర్తకే వుండాలట. ఈ భావ ప్రచారానికై

నీతి చంద్రిక, సీతా దమయంతుల చరిత్రలు, పతివ్రతల కథలులాంటివి మన విద్యావిధానంలో చేర్చబడ్డాయి. మన విద్యకు ఆధారం మన ధర్మ శాస్త్రాలు, పురాణాలు దీనికి నాందిప్రస్తావన వేదాల్లోనే జరిగింది. పితృ స్వామిక విలువలకు, బహు భార్యాత్వానికి బీజాలు ఋగ్వేదంలోనే రూపు ధరించాయి. మగబిడ్డని కనని స్త్రీని హీనంగా చూడటం సామవేదం నాటికి బలపడింది. అక్రమ సంబంధమున్న స్త్రీకి ఆడపిల్ల పుడుతుంది అనే అనౌచిత్యాన్ని దేవవాక్కుగా చెప్పింది. అథ్వరణవేదం, కుమార్తె దుఃఖ హేతువు; కుమారుడు స్వర్గదీపంగా చిత్రించింది బృహదారణ్యం. పిల్లల్ని కనలేని స్త్రీకి విలువే పోయింది. తైత్తిరీయ బ్రాహ్మణంలో, గృహ్య సూత్రాలనాటికి స్త్రీ కేవలం పరాన్నభుక్కుగా (Parasite) అయిపోయింది. ఆమె జీవితం ఇంటిపనికీ, భర్తసేవకు, అర్పితమయింది. తన శ్రమకు విలువే కోల్పోయింది. ఆస్తిహక్కు, బిడ్డలపై యాజమాన్యం లాంటివి తిరస్కరింపబడ్డాయి. అర్థశాస్త్ర లేఖకుడు, మహాపండితుడైన చాణుక్యుడు స్త్రీపై చూపిన నిరాదరణ, కఠినశిక్షలు, పన్నాగాలు మిక్కుటంగా వున్నాయి. రహస్యంగా స్త్రీ మాట్లాడినా, రమించినా రోడ్డుమీద నిలబెట్టి ఛండాలునిచేత బొంగుతో కొట్టించాలని వ్రాశాడు. స్త్రీ గోళ్ళు పెంచుకున్నా, జుట్టుముడి విప్పుకున్నా, పతాపకా నవ్వినా లెక్కప్రకారం 24 పణాలు పన్ను చెల్లించాలి. చాణుక్యుని వారసుడే మనువు. నేటికీ మన స్త్రీలచేత పూజింపబడే మహాసిద్ధాంతకర్త. ఆడది అపరిశుద్ధ, నమ్మకద్రోహి, ముక్కోపి, దుష్టురాలు కనుక "ఆడదాన్ని నమ్మరాదు" అనేవి బోలెడన్ని సూత్రీకరించిన మను ధర్మశాస్త్ర నిర్ణేత మనువు. ఆమెకు కర్తవ్యాలే తప్ప హక్కులుండరాదని వాదించిన చండప్రచండుడు ఆయనే. ప్రపంచాన్ని జయించి మానవత్వాన్ని కాలరాచిన నియంత యెవరంటే మనువని చెప్పుకోవచ్చు.

వేశ్యావృత్తికి నిమ్నజాతి స్త్రీలు మాత్రమే అర్హులనీ, బ్రహ్మణ, క్షత్రియ స్త్రీలు భర్తల పాదసేవకు అంకితం కావాలని కామసూత్రాల్లో లిఖించాడు వాత్స్యాయనరుషి. పిల్లలు తన ప్రతిరూపాలనే నిర్ధారణ పురుషునికి ముఖ్యమని ఆయన సిద్ధాంతీకరించాడు. అందుకొరకే బాల్య వివాహాలు విధిగా జరపాలని సూత్రీకరించాడు. కేవలం వంశోద్ధారకుణ్ణి

కనడమే భార్య కర్తవ్యమన్నీ, తన కామ సుఖాలన్నీ వేశ్యలద్వారా అనుభవించవచ్చని చక్కగా వ్రాసిన పెద్దమనిషి వాత్స్యాయనుడు పురుషుడు కాకపోతే భార్య అయినా, వేశ్య అయినా ఇద్దరూ బుట్టబొమ్మలే.

అలాగే రామాయణ భారతాలలో స్త్రీ పాత్ర చాలా ఘోరస్థితికి దిగజారిపోయింది. అగ్నిలో దూకి శీల స్వచ్ఛతను నిరూపించుకోవడం, జూదంలో పణం పెట్టబడటం, అప్పుకోసం ఆలిని అమ్మడం, అతిధులకు అర్పించటంలాంటివి కోకొల్లలు. అలాంటి పురాణ స్త్రీల చెరలన్నీ భరించటానికి (నాటినుండి నేటివరకు) మన మహిళాజాతి అంతా, మానసికంగా సిద్ధం చేయబడింది నాటి సాహిత్యంద్వారా, "ఆ సీతమ్మ తల్లి కష్టాల ముందు నేనెంతా!" అని తమ స్థితికి గర్వపడటం సర్వసాధారణమయింది మన మహిళలకు.

నాటి సంప్రదాయ సాహిత్య వారసత్వమే నేటి సజీవ దహనాలు, వరకట్న పిశాచాలు. భర్తకు స్వర్గసుఖం ఇవ్వాలని ఆనాడు భార్యను చిచ్చుకు అర్పించేవారు. విధవరాలికి మనుగడ అపరిశుద్ధమని అగ్నికి ఆహుతి చేయడమే "సతి" ఆ దురాచారం చట్ట వ్యతిరేకమైనందున నేడు మరోరూపంలో అమలు జరుగుతోంది. తగిన కట్నం, వస్తుసామగ్రి తేలేదని కోడల్ని కాల్చిచంపడం. దాన్ని ఆత్మహత్యగా నిరూపించటం జగమెరిగిన సత్యమే. ఆ హత్యకు న్యాయ నిరూపణ అసాధ్యమవుతోంది. ఎందువల్ల? అంటే తనపై భర్తకు అన్ని అధికారాలు వున్నాయని, ఎదిరించే హక్కు తనకు లేదనే భావదాస్యంతో స్త్రీలుండడంవల్లనే, అందువల్లే మరణ వాంగ్మూలంలో అది హత్య అయినా ఆత్మహత్య అని చెప్పుకుంటున్నారు. వంశగౌరవంకోసం, బిడ్డల భవిష్యత్తుకోసం స్త్రీ తనను తాను బలిచేసుకొనే సందర్భాలుకూడా కొన్ని వుంటున్నాయి. అసలు పుట్టెడు కోరికలతో కాపురానికొచ్చిన నవవధువు ఆత్మార్పణం ఎందుకు చేసుకుంటుందని ఏ భర్త అయినా ఆలోచిస్తున్నాడా? ఆఖరికి పాలిచ్చే గొడ్డుచస్తే ఏడ్చేవారుకూడా కోడలుచస్తే మళ్ళీ కట్నంతో మరో పిల్ల వస్తుందిలే అని సంతోషిస్తారు మమతా, మానవత్వాలు లేని వ్యక్తులు. కన్యాశుల్కం పేరుతో తండ్రి బిడ్డను అమ్ముకొనే రోజులుమారి వరశుల్కమిచ్చి దాస్యం వహి

స్తోంది నేటి ఆడబడుచు. "భర్త భరించాలి కనుక కొంత మూల్యం చెల్లించడం నేరమా!" అనే భావం అంతరాంతరాల్లో వుండబట్టే కట్నం ఇవ్వడం, పుచ్చుకోవడం జరుగుతున్నాయి. మౌలికంగా ఆలోచిస్తే స్త్రీ తక్కువ అనే భావంవల్లనే ఆమెపై అత్యాచారాలు, హత్యలు, కొట్టడం, మానసిక హింసలులాంటివి జరుగుతున్నాయి. ఈ భావంతోనే సాహితీకారులు సాహిత్యాన్ని తమ సాధనంగా వాడుకుంటున్నారు. ఇవి తరాతరాల ఆలోచనలు. విద్యావిజ్ఞానాలుండి ఉద్యోగాలు చేస్తున్నారు అనేకమంది స్త్రీలు. అంతమాత్రాన సమానస్థాయి ఆమెకు వున్నదనుకొనుట భ్రమ. ఆమె ఆస్తిపై, శరీరంపై సంపాదనపై భర్తకే అధికారం వుంటోంది. అది ధర్మ సమ్మతమేనని పలువురి అభిప్రాయం. ఈ ప్రాతిపదికతోనే రచయితలు, పురుషులు స్త్రీని సమానస్థితికి ఎదగనివ్వరు. కనీసం రచయిత్రులైనా సమాజ కట్టుబాట్లతో బందీలైన స్త్రీలకు విముక్తి కలిగించాలి కాని ఇంకా తమ రచనలద్వారా వారిని ఆ మురికికూపాల్లోకి నెట్టడం క్షంతవ్యం కాదు. భారతీయ సంస్కృతి పేరుతో అణగారిన స్త్రీ జాతిని ఇంకా అధోగతికి త్రోసే సాహితీపరులు మార్గదర్శకులు కాకపోగా వారికి చరిత్రలో స్థానం వుండదు. కనుక రచయితలు ముందుగా సమస్యను సమ్యక్ దృష్టితో పరిశీలించాలి; అంటే నేటి స్త్రీల స్థానం, పరిస్థితి 16 వ శతాబ్దంనాటి దశలోనే వుంది. పురుషాధిపత్యం, స్త్రీల అణచివేత రూపంలో మారినా మౌలికంగా మారలేదనేది అక్షరాల నిజం. కారణం స్త్రీల అజ్ఞానమే.

అమెరికాలో నీగ్రోలకు బానిసత్వంనుండి విమోచన ఇచ్చిననాటి రాత్రి వారికి నిద్రపట్టలేదట. తెల్లారితే మనం మనంగా ఎలా ఆలోచించాలి? ఏంచెయ్యాలి ? ఎలా క్రొత్త జీవితాన్ని గడపగలం అని తల్లడిల్లిపోయారట. అలాగే ఈ తాళాలు పుచ్చుకొని స్త్రీలను మీరు నడిపించండి అంటే చెయ్యిచాచి పుచ్చుకోగల ధైర్యం, చొరవ కలవారుంటారా ? అనే దొక చిక్కుప్రశ్న. అందువల్లే ఈనాడమల్లోవున్న హక్కులుకూడా అనుభవించలేని వారు స్త్రీలలో కోకొల్లలు. శాస్త్రవిజ్ఞానం పెరిగింది కాని దైనందిన జీవితవిధానం మారలేదు. మార్పు కోరనివారిలో స్త్రీ పురుష లిద్దరూ వున్నారనేది పచ్చినిజం. సమానత్వం, మానవత్వం ముఖ్య లక్షణాలని

తెలిసినా స్త్రీ అంటే ఒక వస్తువనే భావంలో మార్పురాలేదు. ఇది సమాజ ప్రగతికే విఘాతమని గ్రహించకపోవటం శోచనీయం.

సామాజిక స్పృహ, సంస్కరణ, ఆధునికత లేని సాహిత్యం నిష్ప్రయోజనం. వ్యక్తి సమాజం సాహిత్యానికి పునాదిరాళ్ళు కనుక సగభాగమైన స్త్రీ సంక్షేమాన్ని, ఆమె స్వేచ్ఛా, సమానత్వాలను బలపరిచేదే అసలయిన సాహిత్యం. యథాతథ వాదమంటూ ఉన్న స్థితిని బలపరిచే సాహిత్యం లోపభూయిష్టమే కాక శుద్ధదండుగకూడాను. ఈనాడు లెక్కకు మిక్కుటంగా పత్రికలొస్తున్నాయి. నవలలు, కథలు విరివిగా వెలువడుతున్నాయి. ఆ సాహిత్యం మత మౌఢ్యాన్ని, కులతత్వాన్ని అరికడుతున్నదా? పెట్టుబడిదారి వ్యవస్థను, భూస్వామ్య పద్ధతిని కూలతోస్తోందా? ముఖ్యంగా స్త్రీ పురోగతిని అభిలషిస్తోందా? దాన్ని చదివిన స్త్రీలలో చైతన్యస్రవంతి పెరుగుతోందా అని ప్రతి రచయితా, ప్రతి చదువరి ఆలోచించాలి.

ఏ ప్రాతిపదికమీద సాహిత్యస్రవంతి జరగాలి అని ఆలోచిస్తే వ్యక్తిగతంగా స్త్రీలలో చైతన్యం పెరగాలి. ఆమె పరిస్థితిలో మార్పురావాలి. మూఢవిశ్వాసాల సంకెళ్ళనుండి వ్యక్తులు బైటపడాలి. అసలు మన ఆలోచనా సరళిలో సమూలమైన మార్పురావాలి. సమకాలీన దృష్టితో మానవ సమస్యలకు, సాంఘిక సమస్యలను అర్థంచేసుకోవాలి. రచయిత కేవలం స్రష్ట మాత్రమేకాదు ద్రష్టకూడాను. రచనకు ఉదాత్త లక్ష్యం కావాలి. మానవ శీలాన్ని పరిపుష్ట మొనర్చగల పదునైన సాహిత్యానికే శాశ్వతత్వం వుంటుంది. తన కృషిద్వారా పాఠకునిలో సృజనాత్మకశక్తి ఆలోచనా పటిమ, స్వచ్ఛందత కలిగించాలి. అందుకు ముందుగా రచయితకు నిబద్ధత, (కమిట్‌మెంటు) ఉదాత్త లక్ష్యం, ఆదర్శం వుండాలి. అప్పుడే ప్రజలు రచయితను గౌరవిస్తారు; చేరువవుతారు. రచయిత పాత్ర చాలా విశిష్టమైనది. మహర్షి ధర్మశాస్త్రాలు వ్రాస్తాడు. శాస్త్రకారుడు దృక్పథాన్ని వివరిస్తాడు. మేధావి విజ్ఞానంతో ప్రభవిల్లుతాడు. కాని సాహితీవేత్తకు ఒక్క కలంపోటుతో సామాజిక రుగ్మతలనే రూపుమాపగల

విశిష్ట స్థానమున్నది. రచయిత బాధ్యత పరిపూర్ణమైనది; శాశ్వత మైనదికూడాను.

స్త్రీ విమోచనను కోరే సాహితీవేత్తలలో భిన్నాభిప్రాయాలున్నాయి. ఒకరు సంస్కరణ వాదాన్ని ప్రతిపాదిస్తే మరొకరు తిరుగుబాటు వాదాన్ని బలపరిస్తే వేరొకరు విప్లవ ధోరణికే అగ్రస్థానమిచ్చారు. అసలు స్త్రీ తన విముక్తికోసం వ్యవస్థకు బానిస అయిన పురుషునితో కలిసి పోరాడినవాడు శ్రామిక వర్గ విముక్తి వస్తుందని తద్వారా తాను కూడా బంధ విముక్తిని పొందగలదనే మరో వాదనకూడా వుంది. కాని ఈ వాదం సర్వరోగ నివారిణి కాదు. గుండెజబ్బు వేరు, కడుపునొప్పి వేరు. రెంటికీ విడివిడిగా చికిత్స తప్పదుకదా! సంస్కరణద్వారా స్త్రీ విముక్తి పూర్తికాదు. చిన్నచిన్న మార్పులు బాల్య వివాహాలు, విధవావివాహాలు, "సతి" లాంటివి ఎంతోకాలం కష్టపడితేనేజరిగాయి. కాని మరో విధమైన సమస్యలు చుట్టుముట్టాయి. కేవలం వ్యక్తిగత తిరుగు బాటువల్ల ఎంతకాలం అరికట్టగలం? పోరాటం జరుగుతున్నంతవరకే ఆపగలం, అసలు తిరుగుబాటులో ఎంతమంది పాల్గొంటారు. ఎందరికి ధైర్యసాహసాలున్నాయి? అనేవి మరికొన్ని ప్రశ్నలవుతాయి. కనుక విప్లవధోరణి అంటే సమూలమైన మార్పుద్వారానే స్త్రీ విమోచన సాధించ గలం. విప్లవ విధానంలో ప్రజల్ని ఉత్తేజితుల్ని చేస్తాం. సాహిత్యం ద్వారా, సభలద్వారా, ఉద్యమాలద్వారా మానసిక చైతన్యాన్ని కలి గించగలం; ఆలోచింపజేయగలం. వ్యవస్థను అన్ని కణాలనుండి దర్శించగలం. అనుకూల ప్రతికూల సిద్ధాంతాల అధ్యయనం చేయగలం. దేశదేశాలలో జరిగిన స్త్రీల పోరాటాలనుండి కొంత నేర్చుకుంటాం. సమ స్యలను చారిత్రిక దృష్టితో సునిశిత అవగాహనద్వారా అర్థంచేసుకోగలం. ఇది దీర్ఘకాలిక పోరాటం అయినా మానసిక దాస్య విముక్తి లభిస్తుంది. చట్టాలద్వారా, సమాజంద్వారా, భయంద్వారా జరిగే విధానాలు తాత్కాలికాలు. కనుక మావో అన్నట్లు సాంస్కృతిక విప్లవంద్వారానే స్త్రీ పురుష లిద్దరిలో మార్పు వస్తుంది. ఇది ఏ ఒక్కరివల్లా జరుగదు. బాధితులు, దోపిడి చేయబడే వర్గం ఇద్దరిలో చైతన్యం వచ్చిననాడే స్త్రీ విముక్తి జరుగుతుంది.

మహిళా దశాబ్దపు చైతన్య స్రవంతిని పెంచి, వృద్ధిచేసి, శాఖోప శాఖలుగా విజృంభించి మహా ఓషధిగా మార్చే రచయితలు కావాలి. తమ చైతన్య పరిధిని విశాల దృష్టితో విస్తృతం చేసుకొని, తమ గురుతర బాధ్యతలను విస్మరించని రీతిలో సాహిత్య ప్రక్రియను సాగించాలి. నిద్రాణమైన స్త్రీ జాతిని మేల్కొల్పాలి. వారిలో సాంఘిక, ఆర్థిక, రాజకీయ చైతన్యాన్ని పెంచాలి. స్వేచ్ఛా సమానత్వ విలువలు, హేతువాద దృక్పథం, సాంకేతిక అవగాహనలు వివరించాలి. స్త్రీలు గృహోపఅలంకరణలుగా, సంతాన సాధనాలుగా వున్నంతకాలం పురుషుల విముక్తి కూడా వుండదని, తద్వారా జాతి మనుగడకే ముప్పని చాటాలి. రచయితల బాధ్యత గురుతరమైనది కనుక నూతన దృక్కోణాల నుండి, అధునిక పోకడలతో, సాహిత్య కృషిద్వారా నూతన, సమాజావిర్భావానికి ప్రేరకులు కావాలి. కత్తి కంటే కలం గొప్పదనే జాతీయాన్ని రచయిత్రులు సహృదయంతో గ్రహించి స్త్రీ జనాభ్యుదయానికి బాటలు వేస్తారని ఆశించటం అనూహ్యం కాదుగదా!

---

# సహకారోద్యమము : స్త్రీలు

---

సహకార సంఘాలపై స్త్రీలు విముఖత చూపుతున్నట్లు వింటున్నాం. వాటి విలువ తెలియకనా, లేక సంఘాలు నిర్వహించగల దక్షత లేకనా అని ఆలోచిస్తే స్వార్థపరులు చేరి సంఘాలను నష్టపరికి వాటిని అప్రతిష్ఠపాలు చేస్తున్నారు. పూర్వపు విలువ తగ్గినందువల్ల ఈ వుద్యమంలోకి క్రొత్తవారు చేరడం లేదు. అసలు సహకార సంఘాలు ఎందుకు? వాటి స్వభావం ఏమిటి? వాటి ఆవిర్భావం ఏనాటిది? ఎన్నిరకాల సంఘా

లున్నాయి; వాటి విజయాలు వైఫల్యాలు ఎలా వుంటున్నాయి; ఎలా వుండాలి; స్త్రీలు ఈ రంగంలో ఎందుకు పాల్గొనాలి; పురుషు లెందువల్ల సఫలీకృతులు కాలేకపోతున్నారు; సంస్థలను నిర్వహించగల సత్తా స్త్రీల కున్నదా అనేవి నేటిసమస్యలు.

అడ్డూ ఆపూలేని స్వేచ్ఛా వ్యాపారం చలరేగేచోట తమ లాభాల కోసం కృత్రిమపు కొరతను సృష్టించి వస్తువులను దాచి ధరలు పెంచి ప్రజలకు వస్తువులను అందకుండా చేయడం జరుగుతోంది. వ్యక్తిగత రంగంలోని బ్యాంకులు, భీమాసంస్థలు ప్రజల పొదుపరి మనస్థత్వాన్ని (దాచిన డబ్బును) వాడుకొని వాళ్ళను దోచుకోవడం, ఇబ్బంది పెట్టటం పరిపాటి అయింది. ప్రజలకు వ్యవసాయాది ఉత్పత్తి కార్యక్రమాలకు నిధులు లేకుండా బ్యాంకులద్వారా, భీమాసంస్థలద్వారా వచ్చిన ధనాన్ని అంతా తమ చెప్పుచేతలలోవున్న పరిశ్రమలకే వాడేవారు. పెట్టుబడి దారులు. ఈ సమస్యలను దాటడానికి అవసరమైన వస్తువులను పొంద డానికి సహకార సంస్థలను స్థాపించుకోవలసిన అవసరం కలిగింది. అందుకే వినియోగదారుల స్టోర్సు, సహకార బ్యాంకులు, సహకార జీవిత భీమాసంస్థలు, సహకార కుటీర పరిశ్రమలు పుట్టాయి. అలాగే వడ్డీ వ్యాపారస్తుల బారినుండి తప్పించుకోవటానికి సహకార పరపతి సంఘాలు వెలిశాయి. భూమి అభివృద్ధికోసం భూమి తాకట్టుమీద అప్పులిచ్చే భూమి తనఖా బ్యాంకులు పుట్టాయి. వాటినే ఇప్పుడు వ్యవసాయ అభి వృద్ధి బ్యాంకులు అంటున్నారు. సహకార రంగాన్ని గురించి రెండు రకాలుగా ఆలోచించవచ్చు.

పెట్టుబడిదారీ సమాజంలో కొట్టవచ్చినట్లు కనపడే చెడుగులను చాలావరకు తొలగించి, పెట్టుబడిదారులకు పోటీగా సహకార సంస్థలను నడపడం అంటే వ్యక్తిగత వ్యాపారం అన్ని రంగాలలో వుంటుందన్న మాట. వ్యాపారం, పరిశ్రమలు, పంపిణీ, బ్యాంకింగు వగైరా లన్నింటిలో వ్యక్తిగత యాజమాన్యం, సహకార సంస్థలు ఒకే కాలంలో మనుగడ సాగిస్తాయి. మరోరకం ఏమంటే ఇటు వ్యక్తిగత వ్యాపార రంగానికి,

అటు ప్రభుత్వ రంగానికి ప్రత్యామ్నాయంగా సహకార రంగాన్ని వ్యాప్తి చేయడం. ఈనాడు అటు పాశ్చాత్య దేశాల్లోగాని, అంటే బ్రిటన్, అమెరికా, ఫ్రాన్సు, పశ్చిమ జర్మనీలలోగాని, ఇటు మన దేశంలోగాని మొదటి పద్ధతినే అవలంబిస్తున్నాం. సంపూర్ణంగా రెండో పద్ధతిని అవలంబించే దేశం ఈనాడు ప్రపంచములోనే లేదు.

బ్రిటన్‌లో రాక్‌డేల్ అనే ప్రదేశంలో మొట్టమొదటి వినియోగదార్ల సహకార స్టోర్సు పుట్టింది.

ఇండియాలో 1904 లో సహకార పరపతి చట్టం వచ్చింది. ఆ శాసనంవల్ల మన దేశంలో సహకారోద్యమం ఆవిర్భవించింది. తదుపరి కొంతమంది కలిసి తమకు కావాల్సిన వస్తువులను సంఘంద్వారా కొనుగోలు చేసి సంఘంనుండి ఖరీదుచేసేవారు. వారి కొనుగోలునుబట్టి సంవత్సరాంతానికి బోనసు ఇచ్చేవారు. అందువల్ల వస్తువులు వ్యాపారస్తుల దగ్గర కొనుగోలు చేసేదానికన్నా తక్కువ ధరకు లభించేవి. ఇలా పుట్టిన సహకార ఉద్యమం అన్ని రంగాలకు విస్తరించింది. డిపార్టుమెంటల్ స్టోర్సు, పరపతి సంఘాలు, వ్యవసాయదార్ల సర్వీసు సంఘాలు - అంటే విత్తనాలు, ఎరువులు, పనిముట్లను సప్లై చేయడం రైతుల ధాన్యాల నిల్వకోసం గిడ్డంగులు, వెంటనే అమ్ముకొని నష్టపడకుండా నిల్వ చేసుకోగల ఆర్థిక స్తోమత కోసం ధాన్యం హామీమీద అప్పులు వగైరా సదుపాయాలు కల్పించడం, పాల ఉత్పత్తిదారులు, కోడిగ్రుడ్ల ఉత్పత్తిదారుల సహకార సంఘాలు, చేనేత ఉత్పత్తి సంఘాలు, కుటీర పరిశ్రమల సహకార సంఘం వగైరాలు పుట్టాయి; పని చేస్తున్నాయి. ఈ సందర్భంగా ఒక విషయం గమనించాలి. ఉమ్మడి మదరాసు రాష్ట్రంలో రామలింగ చెట్టియారు, వేమవరపు రామదాసు పంతులు, నరశింహదేవర సత్యనారాయణగార్ల కృషి ఫలితంగా సహకారోధ్యమం విస్తరించింది. బ్రిటిష్‌వారి హయాంలో లంక భూములను కౌలుదార్ల సహకార సంఘాలకు కొద్దిపాటి అద్దెలకు కౌలు కిచ్చేవారు. ఉత్తర భారతదేశంలో ద్వితీయ ప్రపంచ యుద్ధానికి పూర్వం ఈ ఉద్యమం పెరగలేదు. తరువాత యుద్ధ సమయంలో దీని అవసరాన్ని

వారూ గుర్తించారు. దరిమిలా ప్రణాళికల కాలంలో ఉద్యమానికి బలం చేకూరింది.

ఈనాడు సహకార సంఘాలు అనేక రంగాలలో పనిచేస్తున్నాయి. వినియోగదారుల సహకార సంఘాలు కొన్ని ప్రాంతాలలో తప్ప హెచ్చుగా విజయవంతం కాలేదు. చాలాచోట్ల అవి దివాలా తీశాయి. పాల వుత్పత్తి సహకార సంఘాలు మొత్తంమీద బాగానే పనిచేస్తున్నట్లు లెక్క. ఇక పోతే చేనేతరంగంలో ఎమ్మిగనూరు సహకారసంఘం విజయవంతంగా నడుస్తోంది. దానికి షుమారు 500 ప్రాథమిక సంఘాలు ఉన్నాయి. ఆంధ్రలో అంతకన్నా హెచ్చు సంఘాలు వున్నా సమర్ధవంతంగా పని చెయ్యటం లేదు. పరిమిత బాధ్యత వున్న గ్రామీణ సహకార బ్యాంకులు, పట్టణ సహకార బ్యాంకులు దరహంమీద బాగానే పనిచేస్తున్నాయి. చెప్పుకో తగ్గది తిరుపతి సహకార బ్యాంకు. పరిమితిలేని బాధ్యత గల సహకార పరపతి సంఘాలు దెబ్బతిన్నాయి. సర్వీసు సహకార సంఘాలు కొద్దిమంది వ్యక్తుల చేతుల్లో బందీలయినాయి. ఉ॥ రైతులకు కావాల్సినంత ఎరువు దొరకక ఏ నాలుగోవంతో దొరికినప్పుడు తతిమ్మ సభ్యులకు అందకుండా కొద్దిమంది డైరెక్టర్లు తాము పుచ్చుకోవడమో లేక దాన్ని అమ్మితే వచ్చిన డబ్బును గ్రామ సాముదాయిక అవసరాలకు వాడుతున్నారు. కుటీర పరిశ్రమల సహకార సంఘములు నామమాత్రావశిష్టంగా వున్నాయి. ఇది ఈనాటి పరిస్థితి. మహిళలు నిర్వహించే కొద్దిపాటి స్టోర్సు మాత్రం ఇంకా అక్కడకూడా బ్రతికి వున్నాయి.

సహకార సంఘాల విజయాలకు, వైఫల్యాలకు కారణాలు చాలా వున్నాయి. సభ్యులలో సహకార భావం లోపించుట మొదటిది. డైరెక్టర్ల స్వార్ధం మరొకటి. డైరెక్టర్ల అసమర్ధతకూడా లేకపోలేదు. ఇక సిబ్బంది అవినీతి చాలా ముఖ్యమైనది. ప్రజా పరిపాలనలో ప్రజాస్వామ్యం అంతరించుట. రాజకీయ నాయకులు అధికారంకోసం, పెత్తనంకొరకు వీటిలో ప్రవేశించి తిష్టవేసుకుని ఆశ్రిత పక్షపాతం, బంధుప్రీతి, ముఠాతత్వం జొప్పించుట. ప్రభుత్వ సహకారశాఖ అజమాయిషీ (ఆడిట్) అంతంత మాత్రంగా వుండటం. రాజకీయ పార్టీలయొక్క ప్రయోజనాలకోసం ప్రతి

పక్షాల పార్టీవారు పార్టీవారిచేత నడిపిస్తున్న సంఘాలను కుంటిసాకులతో రద్దుచేయుట. ఇలాంటివెన్నో ఇంకా వున్నాయి. తక్కువ ధరలకు అమ్మలేకపోవటం, సభ్యులకు సరుకులు, బోనస్‌లాంటివి ఇవ్వలేకపోవటం, ఉత్పత్తి సంఘాలవారికి సౌకర్యాలలోపం లాంటివి అవి ;

కొన్ని సహకార సంఘాలు విజయవంతం కావటానికి కారణాలు డైరెక్టర్ల నిజాయితీ, సమర్థతలు ముఖ్యమైనవి. సభ్యుల శ్రద్ధా, ఆసక్తతలు క్రమశిక్షణలుకూడా చెప్పుకోతగ్గవి. ఇంకా డైరెక్టర్లకున్న వ్యక్తిగత సమర్థతవల్ల, పలుకుబడివల్ల వనరులు సమకూడుతాయి. సిబ్బందిపై డైరెక్టర్ల పర్యవేక్షణ చాలా అవసరం.

ప్రతి ఒక్కరము "అందరికోసం" అందరము "ప్రతి ఒక్కరికోసం" అనే సహకారభావం వెలివిరిస్తే తప్ప సంఘాలు బ్రతకవు. ఆ భావాలు ప్రతి సభ్యుని మనస్సులో చోటుచేసుకోవాలి. ఆ భావం లేనప్పుడు ప్రభుత్వపు వత్తిడివల్లకాని లేక ప్రోద్బలంవల్లకాని, లేక డైరెక్టర్ల బోర్డును ప్రభుత్వం నామినేట్ చేయగా ఏర్పడిన సంఘాలుగాని సిసలైనవికావు. అవి హెచ్చుకాలం బ్రతకలేవు అలాంటివి ఇటీవల వందలసంఖ్యలో దివాలా తీశాయని మనకు తెలుసు. సహకార సంఘ సభ్యులందరి ప్రయోజనాలను విస్మరించి డైరెక్టర్లకు మాత్రమే లాభం చేకూర్చి సదుపాయాలు కల్పించే సహకార సంఘాలు దొంగవాటిక్రింద లెక్క. ఈనాడు దేవాదాయ, ధర్మాదాయ భూములు, పంచాయితీ బోర్డులు ఈ మూటిపై పెత్తనంకోసం స్వార్థపరులు విజృంభిస్తున్నారు. వీరి కబంధహస్తాలనుండి బైటపడితేనే సహకార సంఘాలు విజయవంతంగా పనిచేస్తున్నాయి.

పురుషులు నిర్వహించేవి విఫలమగుటకు కొన్ని కారణాలున్నాయి. పురుషులకు అధికార వ్యామోహం మెండు. ఇంతవరకు సమాజంలో మొత్తంమీద సంపాదించేవారు పురుషులే కనుక ఎలాగోలాగు అంటే అవినీతికరంగా కూడా సంపాదించాలనే తాపత్రయం వారిలో మెండుగా వుంటుంది. నిత్యావసర వస్తువుల వాడకం స్త్రీల చేతుల్లో వుంటోంది. కనుక వారు స్టోర్సు నిర్వహణ వగైరాలలో

హెచ్చు శ్రద్ధ వహిస్తారు. ఇన్ని సంవత్సరాలు నిర్వహణా బాధ్యతను స్వీకరించనందున తాము విఫలుల మవుతామనే భయంతో స్త్రీలు డైరెక్టరులుగా హెచ్చు శ్రద్ధ వహిస్తారు. పురుషులకు ఆ భావం లేనందువల్ల వారు పర్యవేక్షణా బాధ్యతను విస్మరిస్తున్నారు. పురుషులలో ముఠా తత్వం ప్రబలి ఒక ముఠా మరో ముఠాను నాశనం చేయతలచి సంఘాన్నే నాశనం చేసుకొనే ప్రవృత్తి కలదు.

ఈనాడు స్త్రీలు జీవితంయొక్క అన్ని రంగాలలోనూ సమానంగా కృషిచేస్తున్నారు. కుటుంబంలో వేల సంవత్సరాలుగా ఒత్తిడులకు లొంగి సహన స్వభావాన్ని అలవరచుకున్న స్త్రీలు ఇప్పుడిప్పుడే వినూత్న చైతన్యంతో ప్రగతిపథంలో నడుస్తున్నారు. సహజంగా హింసకు, దౌర్జన్యానికి, విద్రోహస్వభావానికి, దురాక్రమణ మనస్తత్వానికి దూరంగా వుంటున్న స్త్రీలు ఈ రంగంలో ప్రముఖపాత్ర వహించవలసి వుంటుంది. అంతేకాక పాలవుత్పత్తి, కోడిగ్రుడ్ల వుత్పత్తి, కూరగాయల పెంపకం, చేతిపనులు చేయడం, కుట్లు, అగ్గిపుల్లలు చేయడం మొ॥ రంగాలలో స్త్రీలు మాత్రమే పనిచేస్తున్నారు. కనుక ఆయా రంగాలలోని కష్టనష్టాలు వారికి హెచ్చుగా తెలుసు. ఉ॥ పాడి పరిశ్రమలో పాడి పశువు అను పెంచేది, పోషించేది స్త్రీలే. కనుక కనీసం ఈ రంగాలలోనైనా స్త్రీలు ముందంజ వెయ్యటం అవసరం. అంతేకాక వీటికి అనుబంధమైన బ్యాంకింగు, పరపతిరంగాలు, సర్వీసు సహకార సంఘములు వీరిచే నిర్వహింపబడటం అవసరం. అలాగే సంఘ సభ్యులకు వైద్యాన్ని అందించే సహకార సంఘములను స్త్రీలే నిర్వహించడం సముచితం.

సంఘ నిర్వహణా సామర్థ్యం స్త్రీలకు లేదని ఈసడించడం దురహంకారు లయిన పురుషులకు సర్వ సామాన్యమయిపోయింది. నిజానికి సమర్థత జాతినిబట్టి, లింగభేదాన్నిబట్టి వచ్చేదికాదు. ఆయా వ్యక్తుల నీతి, నిజాయితీ, సామర్థ్యాలపై ఆధారపడి వుంటుంది. కాకపోతే ఒక్కోవర్గం కొన్ని పరిస్థితుల్లో వెనుకబడి వుండవచ్చు; అభ్యుదయాన్ని సాధించనూవచ్చు; తగిన ప్రోత్సాహం, శిక్షణ, సానుభూతివస్తే స్త్రీలు తమ

వంతు బాధ్యతలను సమర్థవంతంగా నిర్వహించగలరనే మాట వాస్తవం.

స్త్రీల సమస్యలు కోకొల్లలు కావడం, మహిళోద్యమ కార్యకర్తల సంఖ్య తక్కువకావడంవల్లనే ఇంతవరకూ ఈ రంగంలో కొద్దిమంది స్త్రీలు మాత్రమే కృషిచేస్తున్నారు. కార్యకర్తల్లో కొందరు స్త్రీలు భావ చైతన్య ఉద్దీపనకు కృషిచేస్తుంటే మరికొద్దిమంది స్థానిక స్థాయిలో మహిళా సంఘముల నిర్మాణాన్ని విజయ పరంపరలతో సాగిస్తున్నారు. కాగా సేవా కార్యక్రమాలయందు అభినివేశము, అభిమానము కల కార్యకర్తలు ఇతోధికంగా ఈ రంగంలోకి ప్రవేశించాలి. అప్పుడే సమాజం పురోగమిస్తుంది. సమ సమాజం ఏర్పడుతుంది. సంక్షేమాన్ని సాధిస్తుంది.

(ప్రకాష్ ఇన్‌స్టిట్యూట్ వారి సెమినార్ వర్కు పేపరు 8-6-85)

---

# మహిళా సంక్షేమం : కుటుంబ నియంత్రణ

కుటుంబ నియంత్రణ మంటే జనాభా పెరుగుదలను అరికట్టటమే కాదు; జననాలపై అదుపు పెట్టటమే కాదు. కుటుంబంయొక్క పరిమాణాన్ని అంటే కుటుంబ సభ్యుల సంఖ్యను నియంత్రణం చేసుకోవడం అన్నమాట. అసలు కుటుంబానికి ఆలుమగలు ఆద్యులు. వారూ, వారి సంతానమూ కలిసి అణు కుటుంబం ఏర్పడుతుంది. పారిశ్రామికాభివృద్ధి జరుగుతూ, తద్వారా పట్టణాలకు ప్రజలు అశేష సంఖ్యలో వలస వచ్చి నివాసం ఏర్పరచుకుంటున్న ఈ తరుణంలో అణు కుటుంబాల సంఖ్య అత్యధికంగా పెరుగుతున్నది. సమిష్టి కుటుంబాలు కనుమరుగవుతున్నాయి. కనుక కుటుంబం అనే పదం వాడినప్పుడు అణు కుటుంబాన్నే మనం దృష్టిలో వుంచుకోవాల్సి వుంటుంది.

కుటుంబ నియంత్రణ సమస్యను అనేక దృక్కోణాలనుండి పరిశీలించవచ్చు. ప్రపంచ జనాభా పెరుగుదలను అరికట్టడానికి, సామాజిక వనరులపై వొత్తిడి తగ్గించటానికి, ప్రజా సంక్షేమానికి ప్రభుత్వం బాధ్యత వహించాలి కనుక ఆ విధి నిర్వహణలో ప్రభుత్వానికి చికాకు కలిగించకుండా వుండడానికి కుటుంబ నియంత్రణ ఉపకరిస్తుంది. ప్రపంచ సమస్యలను మనస్సులో వుంచుకొని, దేశం ఎదుర్కొనే ఇబ్బందులను గమనించి, సామాజిక శ్రేయస్సును పరికించి కుటుంబ నియంత్రణావశ్యకతను నొక్కి చెప్పవచ్చును. ఈ సమాజంలో శ్రామిక కుటుంబాలలో స్త్రీ పురుషు లిరువురూ కాయకష్టమో లేక మానసిక శ్రమో చేసి కుటుంబాదాయానికి దోహదం చేస్తున్నా సామాజిక ఆచారాలనుబట్టి పురుషుడే కుటుంబానికి అధిపతిగా వుంటున్నాడు. అధిక సంతానంయొక్క అవసరాలను తీర్చడానికి కుటుంబాదాయం చాలక కుటుంబ పెద్దలు నానా అగచాట్లూ పడుతున్నారు. అందువల్ల కుటుంబ పెద్దలకు మానసిక వ్యధ కలుగుతోంది. దానిని నివారించడానికి, కుటుంబ పెద్దలకు మానసిక శాంతిని ప్రసాదించడానికి కుటుంబ నియంత్రణావశ్యకతను గురించి ఆలోచించక తప్పదు. అంతేకాదు అధిక సంతానం వున్న కుటుంబంలో తండ్రికి విశ్రాంతి సుఖసంతోషాలు ఇంట్లో అరుదవుతాయి. అందువల్ల తను పనిచేసే కర్మాగారంలో లేక గనిలో లేక ఆఫీసులో అందరికి ప్రశాంతత వుండదు. ఉల్లాసము, ఉత్సాహము అసలే లభించదు. అందువల్ల అతడు బాధపడతాడు; దేశం నష్టపడుతుంది. ఇలా కుటుంబ నియంత్రణ అమలు పరచనందున ప్రపంచానికి, దేశానికి సమాజానికి సర్వసాధారణంగా కుటుంబ పెద్దగా వుండే పురుషునికి కలిగే చికాకులు, ఇబ్బందులు కష్టాలు వీటిదృష్ట్యా కుటుంబ నియంత్రణ సమస్యను అధ్యయనం చేయవచ్చును. వీటికి ప్రత్యామ్నాయంగా మహిళా సంక్షేమాన్ని లక్ష్యంగా పెట్టుకుంటే కుటుంబాన్ని పరిమితం చేసుకోవడం ఎంత అవసరమో మనం పరిశీలిద్దాం.

స్త్రీ సంతానోత్పత్తి కాలమంతా కంటుంటే 10, 13 మంది బిడ్డల్ని కనవచ్చు. ఆ అవకాశాన్ని అంతా ఆమె వినియోగించుకుంటే సంతానం

తామరతంపరగా వృద్ధిచెందుతుంది. పురుషుడికన్నా పదిశాతం స్త్రీకి శరీర దార్ఢ్యత వున్నా పెక్కు సంతానాన్ని కనడంవల్ల ఆమె ఆరోగ్యం దెబ్బతింటుంది. సమాజంలో కనీసం 40% పైగా దారిద్ర్య రేఖకు దిగువన వుంటున్న ఈ స్థితిలో, పిల్లలమాట అటుంచి, తల్లికి పోషకాహారం దుర్లభమవుతుంది. సామాన్యంగానే ఉన్నదికాస్తా భర్తకు, బిడ్డలకు పెట్టి కుండ కడుక్కొని, అడుగూ బొడుగూ తిని తృప్తిపడే శ్రామిక కుటుంబాలలోని ఇల్లాళ్ళకు కడుపునిండా తిండి, అందులోనూ పుష్టికరమైన ఆహారం దొరకడం అసంభవం. కనుకనే మన దేశంలో ప్రసూతి మరణాల సంఖ్య తదితర దేశాలతో పోలిస్తే వారిదే తక్కువగావుంటోంది. స్త్రీలు రక్తహీనత, నీరసంలాంటి రుగ్మతలకు లోను అవుతున్నారు. పదిమంది అనారోగ్యవంతులైన శిశువులకన్నా ఒక్క ఆరోగ్యవంతమైన సంతానాన్ని కని పెంచుకోవడంవల్ల స్త్రీయొక్క ఆరోగ్యం సదా పరిరక్షింపబడుతుంది.

హెచ్చుమంది సంతానంవున్న కుటుంబంలో తల్లి తన కాలమంతా బిడ్డల్ని కనడంతో, పెంచడంలో గడిచిపోతోంది. నవమాసాలు మోయడం, బిడ్డను పెంచడం చాలా కాలవ్యవధి-అంటే మూడు సంవత్సరాలు వినియోగించాల్సి వస్తోంది. అందువల్ల నలుగురు పిల్లలున్న స్త్రీకి పన్నెండేండ్లు తన జీవితకాలాన్ని కేటాయించక తప్పడంలేదు. స్త్రీకూడా ఒక ప్రాణియే కాని కేవలం యంత్రం కాదుకదా! యంత్రాలకే విరామ సమయాలను ఏర్పాటుచేస్తున్న ఈరోజుల్లో జీవంగల స్త్రీకి విశ్రాంతి అవసరంలేదా అనే ప్రశ్న మన్ని ఎదుర్కొంటోంది. స్త్రీకి విశ్రాంతి విధిగా వుంటేతప్ప ఆమె జీవితం దుర్భరమవుతుంది.

మన దేశంలో అనేక కుటుంబాలకు కాపురం వుండటానికి గృహవసతి లేదు. ముఖ్యంగా నగరాలలో జనభాలోని ఆరవవంతు స్త్రీ పురుషులు రోడ్లప్రక్క పేవుమెంట్లమీద కాపురాలు చేస్తున్నారు. శ్రామిక కుటుంబాలు అధిక సంఖ్యలో ఒక్కగదిలోనే నివసిస్తున్నారు. అశేష సంతానం, ఆలుమగలు అందరూ కలిసి ఒకేగదిలో ఉండాల్సి వస్తున్నప్పుడు దంపతులకు ఏకాంతవాసం దుర్లభం. అందువల్ల భార్యాభర్తలు ఇబ్బందుల పాలవుతారు. ముఖ్యంగా స్త్రీ సిగ్గుతో, మానసిక బాధతో కుంచించుకుపోతుంది.

సంతానపు ఉనికిని గుర్తించకుండా భార్యాభర్తలు దాంపత్య జీవితం సాగిస్తే పిల్లలకు తల్లిదండ్రులపై సదభిప్రాయం నశిస్తుంది. పిల్లల బాధ్యతను అధికంగా వహించే స్త్రీ తల్లిగా తన గౌరవాన్ని కోల్పోయే అవకాశం వుంది. కనుక చాలా తక్కువ సంతానం కలిగివుంటే ఆమె దాంపత్య జీవితం సుసంపన్నం కావటానికి అవకాశాలు ఎక్కువగా వుంటాయి.

పెళ్ళినాటి చదువు స్త్రీల పరంగా సర్వసాధారణంగా వివాహంతో ఆగిపోతుంది, గృహ నిర్వహణ, సంతాన ప్రాప్తి, పిల్లల్ని పెంచి పోషించడం ఇవన్నీ ఆమె శక్తియుక్తులను తినేస్తున్నాయి. ఆ కొద్ది పాటి విద్యను వాడుకోవటానికి, వృద్ధిచేసుకోవటానికి ఆమెకు తీరికే వుండదు. పుట్టెడు నీరసంతో, గంపెడు సంతానంతో ఆమె సతమత మవుతూ వుంటుంది. వివాహానికి పూర్వం వచ్చిన కాస్త చదువును విస్మరిస్తుందామె. మెదడుకు పరిశ్రమ లేక ఆమె స్తబ్ధురాలవుతుంది ఆమె మానసిక వికాసం ఆగిపోతుంది. విద్యాభ్యాసం లేని జ్ఞాన సము పార్జనలేని ఆమె శక్తియుక్తులు అణగారిపోతాయి. ఆమె సజీవ యంత్రంగా మారుతుంది. ఆమెకు ఇచ్ఛా సంకల్పాలు మృగ్యమవు తాయి. ఈ పరిస్థితి చాలా శోచనీయం. అలాకాక ఆమె ఏ ఒక్క బిడ్డనో కని ఆ బిడ్డను జాగ్రత్తగా ముద్దుగా, మంచిగా పెంచుకుంటే ఆమె తన జీవితంలో మహాఅయితే 3, 4 సంవత్సరాలకన్నా హెచ్చుకాలం వెచ్చించాల్సిన పని వుండదు అలా ఆమె తన కాలాన్ని విద్యా సంస్కృతు లను అలవర్చుకోటానికి తన వ్యక్తిత్వ వికాసాన్ని ఇతోధికంగా పెంచు కోవటానికి అవకాశం లభిస్తుంది.

సామాజిక శ్రేయస్సు, దేశ సంక్షేమాలదృష్ట్యా స్త్రీ పురుషులలో ప్రతి ఒక్కరూ బహుసంతానం. అపరిమితమైన కుటుంబంలో అవస్థపడేది స్త్రీయే అని మనం గుర్తుంచుకోవాలి. ఒక్క శిశువును మాత్రమే పొంది దానిని అల్లారుముద్దుగా శ్రద్ధాసక్తులతో పెంచుకోగలిగిన తల్లి పిల్ల పెరిగి పెద్దయ్యాక ఉద్యోగం చెయ్యటానికి అవకాశం లభిస్తుంది.

మనది ప్రజాస్వామ్య దేశమని చెప్పుకుంటున్నాం. స్త్రీ పురుషులు సమానులని పేర్కొంటున్నాం. ప్రజలందరికీ సమానావకాశాలు ఉండాలని ఆశిస్తున్నాం. పౌరుల దరూ సమాజంపట్ల బాధ్యతలు నిర్వహించాలని నిశ్చయించుకున్నాం. మరి సమాజంలో స్త్రీ తన బాధ్యతను నిర్వర్తించాలంటే ఆమె కుటుంబం వెలుపల జరిగే సామాజిక కార్యక్రమాలలో పాల్గొనక తప్పదు. అపరిమిత కుటుంబంలో అష్టకష్టాలు పడే స్త్రీ ఇంటికే అంకితమయిపోతుంది. సమాజానికి ఆమెవల్ల ఇసుమంతకూడా ప్రయోజనం వుండదు. ఇలాంటి పరిస్థితి సంభవించకుండా దేశంయొక్క సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక కార్యక్రమాలలో స్త్రీ పాల్గొనాలంటే ఆమెకు తీరుబాటు, వెసులుబాటు కావాలి. పరిమితమైన సంతానాన్ని కలిగివుంటేనే అది సాధ్యం అవుతుంది.

తన ఆరోగ్యంకోసం, తనకు విశ్రాంతికోసం సుఖప్రదమైన దాంపత్య జీవితం కొరకు, విద్యాలాభం పొందే నిమిత్తం, జ్ఞాన సముపార్జనకోసం, ఉద్యోగం చెయ్యగల స్తోమతకోసం సామాజిక కార్యక్రమాలలో పాలుపంచుకొనేటందుకు, తన వ్యక్తిత్వ వికాసానికి స్త్రీ ఇల్లాలుగా మాత్రమే మిగిలిపోరాదు. బహుకొద్ది సంతానంతో కుటుంబాన్ని పరిమితం చేసుకొని తన జీవితాన్ని శుభప్రదమూ, శోభాయమానమూ, ఆనందదాయకంగా మలుచుకోవలసిన బాధ్యత ప్రతి స్త్రీపై వుందని మనం గ్రహించిననాడు స్త్రీ సంక్షేమం ఒనగూడుతుంది. స్త్రీ ఉద్యోగం చెయ్యడం అవసరం. ఇంతకాలం ఈ పురుషాధిక్య సమాజంలో "ఉద్యోగం పురుష లక్షణం" అంటున్నారు ఆ మాటపోయి "ఉద్యోగం ప్రతివ్యక్తి లక్షణం" అనేమాట సర్వజనాంగీకారం పొందాలి. కేవలం వేతనంకోసం, భృతికోసం మాత్రమే ఉద్యోగం చెయ్యాలనుకోవడం పొరపాటు. ఉద్యోగం అనగానే మరొక వ్యక్తివద్దనో, సంస్థలోనో కొలువుచెయ్యడమేనని చాలామందికి స్ఫురిస్తుంది. నిజానికి తనుగా ఒక వృత్తిలో నైపుణ్యాన్ని సంతరించుకొని స్వంతంగా పనిచెయ్యడంకూడా ఉద్యోగంక్రిందికే వస్తుంది. సోమరి అయిన వ్యక్తి పరాన్నభుక్కుగా మారడం సహజం. అలా జరిగిననాడు ఆ వ్యక్తియొక్క ఆత్మగౌరవానికి దెబ్బతగులుతుంది. అంతేకాక దేశంలో

సోమరులు పెరుగుతున్న కొద్దీ దేశానికి నష్టం మరింత పెచ్చుపెరుగుతుంది. ఈ శోచనీయ పరిస్థితి రాకుండా అడ్డుపడాలంటే స్త్రీకూడా ఉద్యోగం చెయ్యాలి. గ్రామిక కుటుంబాల్లో స్త్రీలు ఈనాటికీ పనిచేస్తూనే వున్నారు. కాకపోతే ధనిక కుటుంబాలలో, మధ్యతరగతి కుటుంబాలలో స్త్రీలు కేవలం ఇల్లాళ్ళుగా వుంటున్నారు. దేశ సౌభాగ్యం విషయం అలావుంచి ఇది ఆ స్త్రీలకుకూడా శ్రేయస్కరంకాదు. ఉద్యోగం చేయడంవల్ల "నేనూ ప్రయోజకురాలినే" అనే భావం ఉదయిస్తుంది. ఒకరిపై ఆధారపడి జీవించే వ్యక్తిగా ఉండాల్సిన అవసరం తీరిపోతుంది. తద్వారా ఆమె ఆత్మగౌరవం పెరుగుతుంది. అదేకాక ఆమె ప్రతిభకు, అభినివేశానికి, అభిరుచికి సరి అయిన ఉద్యోగం ఆమె చేపట్టిననాడు ఆమె శక్తియుక్తులు వికశిస్తాయి. తద్వారా ఆమె వ్యక్తిత్వం దినదినాభివృద్ధి చెందుతుంది. అయితే ఉద్యోగం చెయ్యటానికి స్త్రీకి అనేక అడ్డంకులు వున్నాయి. అందులో ముఖ్యమైనది. మహిళల్లో చైతన్యం, వికాసం లేనంతకాలం మహిళా సంక్షేమం జరగదు. ఆమె చిక్కుకున్న విషవలయాలన్నింటిలో ముఖ్యమైనది ఆమె సంతానోత్పాదన శక్తి ఆమె అదుపులో లేకుండుటే. అధిక జనాభా వల్ల నష్టపడేది స్త్రీయా, పురుషుడా, సమాజమా, దేశమా అని ప్రశ్నిస్తే అందరూ అని తేలిగ్గా చెప్పగలం. కాని అందరికన్నా కష్టనష్టాల పాలయ్యేది ఆడమనిషి మాత్రమే ననేది నగ్న సత్యం. ఆర్థికంగా శ్రమించేది పురుషుడు, వత్తిడివల్ల నష్టపడేది సమాజం, వనరులు సమకూర్చలేనిది ప్రభుత్వం అయినా మిక్కుటంగా బాధపడేది మహిళ. ఆమె శారీరక, మానసిక ఆర్థిక వొత్తిళ్ళకు లోనవుతోంది. ఇంటా బైటా చాకిరీతో సతమత మవుతోంది. బలహీనతవల్ల దుర్బలురాలవుతోంది. కనుక స్త్రీ సంక్షేమాన్ని దృష్టిలో పెట్టుకొని మనం పథకాలు నిర్మించుకోవాలి.

(హైదరాబాద్ రేడియో సౌజన్యంతో మే-1985)

---

# రాజకీయాలు స్త్రీలకు నిషేధాలా ?

"ప్రతి వంటకత్తె ఒక రాజకీయవేత్త కావాలి" అన్నాడు లెనిన్. అయితే దానికి వ్యతిరేకమైన భావప్రచారం ప్రపంచమంతటా జరుగుతోంది. "ప్రజాప్రాతినిధ్య అవకాశాన్ని స్త్రీలకు ముప్పై శాతమన్నా పెంచక తప్పదండీ" అన్నప్పుడు ఎలాగూ ఓడిపోతున్నప్పుడు మీకెందుకమ్మా ఆ శ్రమ" అన్నారు తెన్నేటివారు. అంటే ఓడిపోవటానికికూడా స్త్రీలు "అనర్హులా" అన్న ప్రశ్నకు సమాధానం దొరకడంలేదు. రాజకీయాలు కేవలం పురుషుల సొమ్ము అయినట్లు. స్త్రీలు వాటికి దూరంగా వుండాలి అనే భావం పురుషాధిక్యతకు, సంప్రదాయాలకు చిహ్నం. మహిళా దశాబ్దం ముగిశాకకూడా ఈ దృక్పథంలో చెప్పుకోతగ్గ మార్పురాలేదు. శాస్త్ర సాంకేతిక విజ్ఞానం, సాంఘిక రాజకీయ అభివృద్ధి ఎంతగానో ఎదిగినా స్త్రీలు మాత్రం గృహోపకరణాలుగా, ఆటవస్తువులుగా చూడబడే పరిస్థితి ఇంకావుంది. అందువల్ల నష్టపొయ్యేది పురుషులతోబాటు సమాజంకూడా నని గుర్తించలేని పరిస్థితే నేటి మన స్థితి.

ఆనాటినుండి ఈనాటివరకు రాజకీయాల్లో పాల్గొనే స్త్రీలు అతి కొద్దిమంది మాత్రమే వుంటున్నారు. వారైనా తండ్రులలో, భర్తలో రాజకీయాల్లోనో, సంఘసంస్కరణ ఉద్యమాల్లోనో, గొప్ప ధనవంతులైతేనో జరుగుతుంది. అంటే బంధుత్వ, వారసత్వ హక్కులు కోరడం ప్రభావాలు బాగా పనిచేస్తాయి. 1940 కి పూర్వం స్త్రీలు సంఘాలుగా చేరటం జరుగనే లేదు. గాంధీజీ పిలుపుతో కాంగ్రెసులో చేరిన స్త్రీలు కొందరు దేశ స్వాతంత్ర్యానికై పోరాటంలో పాల్గొన్నారు. కాని రాజకీయ అధికారాన్ని, ప్రతిపత్తిని వారు ఆశించి ఎరుగరు. తదుపరి కాంగ్రెస్ మహిళా విభాగం ఏర్పడినా రాజకీయ చైతన్యం స్త్రీలలో జరుగలేదు. కేవలం స్త్రీ విద్యా, వివాహ వయస్సు, విధవా వివాహం, సహగమనంలాంటి సంస్కరణలకే పరిమితమయింది ఆనాడు. అసలు ఏనాడూ, ఏ రాజకీయపార్టీ స్త్రీ పురుషుల మధ్య రాజకీయ సమానత్వం వుండాలని ప్రతిపాదించనేలేదు. పైగా రాజకీయాల్లోకి వారు రాకూడదని, రాలేరని, పాల్గొంటే సమాజం భ్రష్టమై

పోతుందని, కుటుంబ వ్యవస్థ పతనమైపోతుందనే భావం స్త్రీ పురుషులిద్దరికీ వుండేది.

స్త్రీల సమస్యలు వేరయినా, అన్నిరకాల సమస్యలకు ఎలా పరిష్కరిస్తాయో స్త్రీలవికూడా అందరూ కలిసి పరిష్కరించాలి. అంటే అణచబడ్డ వర్గాలలో, స్త్రీలూ వకభాగం. అందువల్ల "అణచబడ్డ ప్రాణి తలెత్తక తప్పదు" అని డార్విన్ అన్నట్లు వారు తమ హక్కులకై పోరాటాలు చెయ్యాలి. తమ పదవులు పోతాయనే స్వార్థపరులు ఇందుకు వ్యతిరేకిస్తారు ఇక్కడ పురుష సహాయం లేకపోవచ్చు. అందువల్ల తమకు తామే రాజకీయ రంగంలోకి దూకాలి. దీనికి కొంత పూర్వచరిత్ర అవసరం.

పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాల్లోకూడా స్త్రీలు రాజకీయ రంగంలో చాలా వెనుకబడి వున్నారు. అందువల్ల సామాజిక సాంస్కృతిక కార్యకలాపాలలో తగినంత చొరవ చూపిస్తున్నా, పాఠశాల కమిటీలు, పట్టణ పురోభివృద్ధి సంఘాలు, సాంస్కృతిక ఉద్యమాలలో ప్రముఖపాత్ర వహిస్తున్నా దేశ రాజకీయ రంగంలో వారి వునికి అంతంత మాత్రంగా వుంది. ఇది కొంతమందికి విడ్డూరంగా, అసంబద్ధంగా తోచవచ్చు. సమాజం భిన్నభిన్న కోణాలను, రంగాలను కలిగివుంటుంది. ఒక జీవిత రంగంలో పురోగమనం, మరొక జీవిత రంగంలో తిరోగమనం లేక స్వభావ విచిత్రమే కాకుండా పరస్పర వ్యతిరేక మవుతుంది. అందువల్ల జీవితం కుంటుపడుతుంది.

అమెరికాలాంటి దేశంలో స్త్రీల రాజకీయ ప్రవేశంపై ఆంక్షలు లేకపోయినా, స్త్రీల ఆర్థిక కార్యకలాపాలపై నిషేధాజ్ఞలు విధించకపోయినా, ఆయా రంగాలలో వారి వునికి చెప్పుకో తగింది కాదు. పరిశ్రమలలో వ్యాపార కంపెనీలలో అత్యధిక వాటాలను కలిగివుండి పెత్తనం చేయగల స్త్రీలుకూడా యాజమాన్యాన్ని పురుషులకు అప్పగిస్తున్నారు. అలాగే జనాభాలో సగభాగంగా వున్న స్త్రీలు శాసనసభల్లో కాంగ్రెసులో చాలా తక్కువ సంఖ్యలో వున్నారు. అలా పోల్చిచూస్తే ఇటీవల స్వాతంత్ర్యాన్ని పొందిన భారతదేశ స్త్రీల పరిస్థితి ఈ అంశంలో అమెరికన్ స్త్రీల స్థితి

కన్నా మెరుగ్గా వుంది. కాని మొత్తంమీద అసమానత్వం ఏ పరిధిలో వుందో విచారించడం చాలా అవసరం.

భారత స్త్రీలకు 1921లో ఓటు హక్కు వచ్చినా 1929లో మాత్రమే ప్రత్యక్షంగా పాల్గొన్నారు. 1935లో శాసనసభల్లోకి ప్రవేశించిన స్త్రీలు అత్యల్పం. 1937లో మాత్రం 42 రిజర్వు స్థానాలు 8 జనరల్ స్థానాల నుండి ఎన్నికయ్యారు. అన్ని రాష్ట్రాలలో మంత్రుల సంఖ్య ఆనాడు ఆరుగురు మాత్రమే. 1952లో 499 లోక్‌సభ సీట్లలో 22 మంది స్త్రీ సభ్యులున్నారు. 1980 నాటికి 544 M P. లలో 28 మంది స్త్రీలు వున్నారు. 1985 ఎలెక్షన్లలో 544 సీట్లలో స్త్రీల సంఖ్య 42. అలాగే రాజ్యసభలో 1952లో మొత్తం 218 మంది సభ్యుల్లో 15 మంది స్త్రీలు. 1976 లో రాజ్యసభ 236 మందిలో 24 మందికన్నా లేరు. అలాగే 1952 లో కేంద్ర మంత్రివర్గంలో 26 పురుషులు వుంటే అందుల్లో ఒక్క స్త్రీ మంత్రిగా వున్నది. 19‹0 లో 51 మంత్రుల్లో నలుగురు స్త్రీలున్నారు. ఇక ఆంధ్ర విషయం ఆలోచిస్తే 1956 నుండి 60 వరకు ఒక్క స్త్రీ లేదు. 1985 లో అసెంబ్లీకి ఎన్నికయిన స్త్రీలు పదిమంది మాత్రమే. 1963 నుండి మంత్రుల స్థానాలెన్ని పెరిగినా స్త్రీ మాత్రం ఒకర్తే వుండటం బహు శోచనీయం. అదైనా స్త్రీ సంక్షేమంలో మార్పులేదు.

కేంద్ర ప్రభుత్వ ఉన్నత సర్వీసుల్లో అతి కొద్దిమందిగా వున్న స్త్రీలు ఐ.ఏ.ఎస్. 2556 పు. 216 స్త్రీలు వున్నారు. ఐ.పి.యస్. 1917 పు. లుంటే 10 మంది స్త్రీలు ఐ.ఎఫ్.ఎస్. లో 409 మంది పురుషులూ 88 మంది స్త్రీలు. ఇది గత 38 స॥రాల స్వరాజ్యానంతరం స్త్రీలకు లభించిన స్థానాలు. ఈ విధానం జిల్లా పరిషత్తులు (లేక మండలాలు) పంచాయితీలు మరేమైనా కొద్దోగొప్పో మార్పులు తప్ప.

అసలు రాజకీయం, సాంఘికం బొమ్మ బొరుసూలాంటివి. రెండూ మన జీవితానికి ముఖ్య భాగాలు. రాజకీయంగా స్త్రీలకు హక్కులు, అధికారాలు, పదవులు కావాలంటె స్త్రీ ప్రతినిధులైతే పోరాడగలరు. అందువల్ల ఏ పరిస్థితులోనూ ముప్పైశాతం విధిగావుండాలనేది విస్మరించరాని విషయం.

స్త్రీలైనా రాజకీయాలు కేవలం పురుషులకేనని భావించడం పొరపాటు. ఈ సందర్భంలోనే మరొక అంశం గమనించాల్సి వుంటుంది. రాజకీయ ఉద్యమాలలో స్త్రీలు సమాన నిష్పత్తిలో కాకుండా తగుమాత్రంగా మొదటి నుండి పాల్గొంటూనే వచ్చారు. హింసా రాజకీయాలలో సాయుధ దాడులతో, గాంధీ సత్యాగ్రహ సమరంలో, కమ్యూనిష్టు ప్రజోద్యమాలలో, నక్సలైటు సాయుధ పోరాటాల్లో స్త్రీలు విరివిగా పాల్గొన్నారు. ఇన్నింటా విశేషమేమంటే వారు సమరవీరాంగనలుగానే మిగిలిపోయినారు. నాయకత్వంలో పాలుపంచుకోలేకపోయారు. ఈ పరిస్థితికి ఎవరు బాధ్యులు? పోరాట పటిమిచూపిన స్త్రీలా, లేక నాయకత్వంలో అడుగుపెట్టటానికి అవకాశమివ్వని ఉద్యమనాయకులా! కాంగ్రెస్ వర్కింగు కమిటీలో గాంధీ కాలంలోకూడా సరోజినీనాయుడు ఒక్కగానొక్క స్త్రీ వుండేది. కమ్యూనిష్టు పార్టీ పొలిట్ బ్యూరోలలో 15 మందిలో ఒక్కరుకూడా లేరు. ఈ పరిస్థితి వాంఛనీయమని ఎవ్వరూ అనరు. స్వచ్ఛంద సేవికలుగా, గెరిల్లా పోరాటంలో సైనికులుగా ప్రజాయుద్ధ భూమిలో భటులుగా స్త్రీలు మిగిలి పోవాల్సిందేనా! నిర్ణాయక శక్తిని ప్రదర్శించే నాయకత్వంలో వారికి చోటువుండదా? వారికి ఆలోచనా శక్తి లేదా? నిర్ణయానికి రాగల సత్తాలేదా? మరి ఉన్నట్లు చరిత్ర రుజువు చేసింది గదా? రాజ్యాలు ఏలిన చాంద్‌బీబీ, రుద్రమదేవి, నూర్జహాన్, గోల్డామీర్, సిరిమావో, ఇందిరాగాంధి మార్గరేట్ థాచర్‌లను పురుషులు సైతం మెచ్చుకుంటున్నారు కదా! కాబట్టి పురుషులు స్త్రీలకు ధీశక్తిలేదని, పరిపాలనా దక్షతలేదని, నిర్ణయాలు చేయగల సత్తాలేదని అనడం హాస్యాస్పదం. అనర్హతలను ప్రతిపాదించడం అన్యాయం; అక్రమం.

రాజకీయంగా స్త్రీలు వెనుకబడి వుండటానికి కారణాలనేకం. కేవలం రాజకీయాలకు మాత్రమే సంబంధించినవి కావు. సాంఘికం, ఆర్థికం, రాజకీయం, సాంస్కృతికమని విభజించి గాఢంగా పరిశీలిస్తేతప్ప సమస్య యొక్క సమగ్ర స్వరూపం అవగాహన కాదు.

సాంస్కృతికం :- శారీరక బలంలేని స్త్రీలు యుద్ధాలకు పనికిరారు కనుక రాజకీయాలకు అనర్హులుఅన్నారు. "నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి" అని

ప్రవచించిన మన్వాదుల "సూక్తులు" స్త్రీలను అబలులను చేశాయి. గృహిణిగా పేర్కొనబడిన మహిళ ఇంటికి పరిమితమయింది. పతివ్రతగా పేరెన్నికగన్న పడతి భర్త ఇష్టా ఇష్టాలకు బానిస అయింది. ఇలా వినో దానికి, విలాసానికి కేటాయించబడింది మహిళ.

సామాజికం :- వేదకాలంనుండి ఈనాటివరకు, దరహంమీద, రాజకీయాలకు స్త్రీని దూరంగా వుంచారు. బాల్యవివాహాల అమలుతో విద్యకు నోచుకోలేదు; అలంకరణ మోజులో ఆమె బందీ అయింది. అంతఃపురాలలో ఆమె వ్యక్తిత్వం అణచివేయబడింది. జనానాలలో పరదాల చాటున ఆమెను కేవలం సంతానంకనే యంత్రంగా చేశారు. ప్రేమ అనురాగం అనేవాటికి అపార్థాలుచెప్పి సహమరణాన్ని, సహగమనాన్ని ఆమెకు విధించారు. వైధవ్యం పేరుతో ఆమెను నానా యాతనలు పెట్టారు. సదా పతి స్మరణే ఆమె కర్తవ్యమన్నారు. దానితో ఆమె వ్యక్తిత్వం వికసించలేదు. పరాధీనభావం పరాకాష్టకు చేరింది. అస్వతంత్రత అందలమెక్కింది. అబలగా రాణించింది. అలా "బ్రెయిన్ వాష్" చేయబడ్డ మహిళ ఈనాడు చట్టం ఎన్నో హక్కులు ప్రసాదించినా అవి అనుభవించలేని అశక్తురాలయింది. సామాజిక కబంధహస్తాలనుండి అడుగు ముందుకు వెయ్యలేని పరిస్థితిలో వుంది. అందువల్లే చట్టాలకు కట్నాలు పోవు అనేది నిజమయింది. చట్టాలకన్నా మహా బలవత్తరమైనది సామాజిక శాసనం.

ఆర్థికం :- వేదకాలంలో కుటుంబాస్తి పేరుకు దంపతులిద్దరిది. కాని ఆమె స్త్రీధనంపైకూడా ఆమెకు పూర్తిగా అధికారం లేదు. కాలక్రమేణ ఆమె ఆస్తిహక్కు పెరుగుతూ వచ్చింది. మనవర్తినుండి జీవితపు హక్కుగా రూపొందింది. జీవితపు హక్కు పరిమిత హక్కుగా మారింది. చివరకు పరిమితహక్కు సర్వహక్కుల నిలయంగా వెలిసింది. ఆర్థికంగా స్త్రీ అంతస్థు పెరిగినా, సామాజిక శ్రమలో ఆమె పాలుపంచుకుంటున్నా, పాటుపడుతున్నా అనేక ఉద్యోగాలను నిర్వహిస్తున్నా, అధికార పదవులను అధిష్టించినా సమాజంలో స్త్రీలోకం పరిస్థితి మారలేదు. పురుషాధిపత్య సమాజపు నియమాలు సడలలేదు. పురుష దురంహంకారం స్త్రీ సమాజంపై విధించిన సంకెళ్ళు వీడలేదు. రాజకీయాధికారం స్వప్రయోజనపరుల

చేతిలో మిగిలిపోయింది. వారు పురుష దురహంకార మన స్తత్వాన్ని వాడుకొని పురుషులచేత వారి తల్లులను, భార్యలను, అక్కచెల్లెళ్ళను హింసింపచేశారు. బానిసలను చేశారు.

రాజకీయం :- పరిపాలనారంగంలో చొరబడడానికి స్త్రీల సంకోచం, వైముఖ్యం, వ్యతిరేకత స్వప్రయోజనపరులు పెచ్చు పెరగటానికి అవకాశం కలిగించింది. వారు అధికారపీఠాలను అధిష్టించారు. ప్రజాసభలనుండి వెలివేశారు. రాజసభలనుండి బహిష్కరించారు. మొదట్లో వోటుహక్కు లేకుండా చేశారు. తరువాత విధిలేక, గత్యంతరంలేక ఆమె పోరాట పటిమను తట్టుకోలేక స్త్రీలకు వోటుహక్కును ఇచ్చారు. కానీ రాజకీయాలు నీకు తగవమ్మా అని బుద్ధి గరిపారు. నిజమేనని నమ్మి అమాయక అతివలు రాజకీయాధికార రంగంనుండి వైదొలగుతున్నారు. ఆ అదను చూచుకొని స్వప్రయోజనపరులు, అధికార పిపాసువులు, మదాంధులు, పూంజీపతులు, పెత్తందారులు, సామాజిక వనరులను స్వంతంచేసుకొన్న ప్రబుద్ధులూ, అవినీతిపరులూ అట్టహాసం చేశారు. రాజకీయం దుష్టపంకిలం, "రాజకీయం అవినీతికరం" రాజకీయం క్రూరతతో నిండినది అనేమాటలు చెప్పసాగారు. "స్త్రీ ప్రేమమూర్తి, పవిత్రమూర్తి, స్నేహమయి, కరుణామూర్తి, శాంత స్వభావ" మని ఎలుగెత్తి అరచి ఆమెను రాజకీయాలకు దూరంగా వుండమని సలహా చెప్పారు. ఎవరైనా ఒకరు అరా వీరి మాటలు వినకుండా రాజకీయాలలోకి వస్తే ఆ మనిషిని అసి ఆడనీయలేదు. నాయకత్వం లోనికి రానీయటంలేదు. "నీకు నాయకత్వానికి తగిన సామర్థ్యం లేదని" ఆమెకు పిరికిమందు పోశారు. అప్పటికీ ఎదిరించి నిలచిన మహిళను గతిలేక అందలి మెక్కించారు. కాని స్తోత్ర పాఠాలతో అదరింపులతో బెదిరింపులతో, సామ, దాన, భేద దండోపాయాలతో నాయకత్వం సాధించిన స్త్రీని, స్త్రీ లోకంనుండి దూరం చేశారు. స్వప్రయోజనపరులు. అలా స్త్రీలకు సంబంధించి రాజకీయ రంగం విషవలయంగా మారింది. సమర్దత లేదు కనుక నాయకత్వం రాదు. నాయకత్వం లేదు కనుక సమర్థత నిరూపణకు అవకాశం లేదు. ఇలా స్త్రీని క్రూరంగా, దుర్మార్గంగా హింసించి ఆమె వ్యక్తిత్వ వికాసాన్ని చిదిమి వేశారు. విద్య విషయంలో

పూర్వం జరిగిందే రాజకీయంతో నేడు జరుగుతున్నది. విద్యలేదు కనుక ఆమెకు సంస్కారం లేదు. అధికారానికి ఆమె అర్హురాలు కాదు. ఆమె అధికారానికి నోచుకోదు కనుక ఆమెకు విద్య అవసరం లేదు. ఇది స్వప్రయోజనపరుల కుట్ర. అమాయకుల ఆత్మవంచన. ఏదైనా ఫలితం స్త్రీ అధికారానికి అనర్హురాలుగా చేయబడటం, శాస్త్ర, సాంకేతికంగా సాంఘిక, రాజకీయపరమైన అభివృద్ధి విశ్వరూపందాల్చిన ఈనాడు స్త్రీలు కేవలం గృహోపకరణాలుగా మిగిలిపోవటం దేశ భవిష్యత్తుకే గొడ్డలిపెట్టు. కనుక ఎలా మార్పుతేవాలి అనేది నేడు మనముందువున్న ప్రశ్న.

పరిష్కారం :- ఈ విషవలయాన్ని ప్రధానంగా స్త్రీలే ఛేదించాలి. సాంస్కృతిక దాస్యంనుండి విముక్తి పొందాలి. భావవిప్లవంవల్ల ఉత్తేజితమవాలి. సామాజిక ఆర్థిక శృంఖాలాలను తెంచుకోవాలి. స్వేచ్ఛా సమానత్వాలకు అర్థాలను అన్వేషించుకోవాలి. ఎదురుతిరిగి ప్రశ్నించాలి. మానవాళి అంతరాత్మను మేలుకోల్పాలి. స్త్రీ శక్తిని సంఘటితం చేయాలి ఐకమత్యంతో ముందుకుసాగాలి. రాజకీయరంగంలో స్త్రీల ప్రతిపత్తి పెరగటానికి దీర్ఘకాలిక, స్వల్పకాలిక లక్ష్యాలు ఎన్నుకోవాలి.

మంత్రివర్గంలో స్త్రీలకిస్తున్న పోర్టుపోలియో స్త్రీ శిశు సంక్షేమశాఖ మాత్రమే. ఈ పద్ధతిని స్త్రీలు నిరసించాలి. అన్ని రంగాలలో సేవ చేయగలమని పోరాడాలి. గృహిణులు, ఉద్యోగులు తదితర కార్మిక వర్గాల స్త్రీలు సంఘటితమై స్త్రీలకు రాజకీయ ప్రతిపత్తి పెంపుదలకై ప్రభుత్వంపైన, రాజకీయ పార్టీలపైన ఒత్తిడి తేవాలి. పార్టీలలోని స్త్రీ సభ్యులు తమకు హెచ్చు స్థానాలు కేటాయించమని పార్టి నాయకులతో పోరాటం సాగించి స్త్రీలకు ఎన్నికల ఖర్చు తగ్గించాలి. లేదా ప్రభుత్వం భరించాలి. ఈ సదుపాయం లేనిదే స్త్రీలకు దుర్ఘటమవుతుంది. కొంత కాలం స్త్రీలకు కనీసం 40% స్థానాలు రిజర్వు చేయాలి. B.C., S.C. ల స్థితిలోనే స్త్రీలూ వున్నారు కనుక ఈ మార్పు అవశ్య కర్తవ్యంగా భావించాలి.

ముందుగా స్త్రీలకు హక్కులను, రాజకీయ పదవుల విభాగాన్ని,

మౌలిక హక్కులను, పరిపాలనలో వారి బాధ్యతలను ప్రజా సంఘాలు, ప్రభుత్వ రంగాలు భారీఎత్తున ప్రచారం సాగించాలి. వారిలో రాజకీయ చైతన్యం కలిగించాలి. అవకాశాలు ఇవ్వాలి. సాంఘిక కార్యక్రమాల కన్నా రాజకీయ విజ్ఞతకు విలువ ఇవ్వాలి. రాజకీయ వికాసం, సామాజిక స్పృహ కల పురుషులు సైతం సగభాగమైన స్త్రీల సహకారం లేనిదే ఏ రంగమైనా కుళ్ళిపోతుందని గ్రహించడం అవశ్య కర్తవ్యం.

(ఆంధ్ర యువతీ మండలి సిల్వర్ జూబ్లీ సావనీరు
జనవరి-1986)

---

# మహిళల మరణాలు : మానసిక సమస్యలు

---

తెల్లారేసరికి ఊర్మిళ ఉరిపోసుకుందని కిన్నెర కిరసనాయిల్ పోసుకుందని, విమల ఎండ్రిన్ త్రాగిందని, సుందరి నూతిలోకి దూకిందని, మరో చెల్లాయి చెరువులో మునిగిపోయిందనే వార్తలు చదువుతున్నాం; చెవులారా వింటున్నాం; కళ్ళారా చూస్తున్నాం. ఇవి హఠాన్మరణాలు కావు; అకాల మరణాలు. వయస్సు మళ్ళిన చావులు కావు. వలపులు, కోరికలు తీరని దుర్మరణాలు. ఇందులో కొన్ని ఆత్మహత్యలయితే మరికొన్ని హత్యలని చక్కగా చెప్పుకోవచ్చు. ఇక కారణాలు చాలా సుందరముదనష్టంగా వుంటాయి. వింటుంటే తలకొక గాథా, ఇంటికొక రభసా వుంటాయి. ఇవి అమ్మాయిల పెళ్ళితో మొదలవుతాయి; చావుతో పూర్తి అవుతాయి. హత్య అయినా, ఆత్మహత్య అయినా నశించేది ఆడ

కూతురే! అది కాదనలేని నగ్నసత్యం. మరువలేని మానసిక వేదన.

మొగుడు కొట్టాడనో, భర్త రంకు కట్టాడనో, పెనిమిటి వెళ్ళ కొట్టాడనో, మళ్ళీ పెళ్ళాడాడనో కొందరు నిండు ప్రాణాలను తీసుకుంటు న్నారు. కారణం వివాహితకు తన ఇంట్లో స్థానంలేదని తండ్రి పొమ్మన్నా డని, పుట్టింటి పరువు నిలపమని తల్లి ఆదేశించిందని నీడలేని ఆడదాన్ని సమాజం నిరసిస్తుందని, ఒంటరిగా బ్రతకలేమనే బాధతో మరికొందరు మరణాన్ని ఆశ్రయిస్తున్నారు. ఇక కన్యగా గర్భవతి నైనానని, లేక తనను మానభంగం చేశారని, తాను "కులట" నని ప్రచారం చేశారని అనేకమంది ఆడపిల్లలు ఆత్మాహుతి పాలవుతున్నారు. ఇవన్నీ దరిదాపు తమపై జరిగే అత్యాచారాల తాకిడికి తట్టుకోలేని దుర్బలత్వంవల్ల జరిగే ఆత్మహత్యలని చెప్పుకుంటాం. కాని తెరవెనుక గాధకు కారణం సమాజం భర్త, అత్తమామలే ఐనా ధైర్యంలేని మనోదౌర్బల్యంవల్ల ఆత్మహత్యల పాలవుతున్నారు. మానసిక ఒత్తిడికి తట్టుకోలేక శరీరఘాతను భరించ లేక, ఎదురుతిరిగే ధైర్యంలేక, పోరాడే శక్తిలేక మరణించే మహిళలు కూడా కొందరున్నారు. ప్రేమించిన ప్రియుణ్ణి వివాహమాడలేక, మరొకడితో పెళ్ళి ఇష్టంలేక నిరాశతో నిండు జీవితాన్ని బలిచేస్తున్నారు కొందరు. అలాగే తన ప్రియుడు "యాక్సిడెంటు"లో చనిపోతే తామూ దుఃఖ భారంతో పిచ్చివారవుతారు. కొన్ని సందర్భాలలో అనుకోని సంఘటనలు సంభవిస్తాయి. బైటికెళ్ళిన బిడ్డ మరణించడం, భర్త విమాన ప్రమాదంలో విగతజీవి కావటంలేక గుండెనొప్పితో చనిపోవటం లాంటివి జరిగితే గుండె నిబ్బరంలేక తామూ ఉరిపోసుకుంటారు. విషం త్రాగుతారు. ముఖ్యంగా మానసిక క్షోభను భరించలేక, దిక్కుతోచక, పదిమందికి చెప్పుకోటానికి పరువుపోతుందని బెంబేలెత్తి విగతజీవులవుతారు. అపవాదులొస్తే అసలే భరించలేరు. సాంఘిక అవమానాన్ని అసలే సహించలేరు. దగ్గరివారు దూరమైతే, హితులు అహితులైతే అత్త పోరుపెడితే, భర్త దుర్భాష లాడితే మనస్సు ఊగిపోయి కడకు మూర్ఛలపాలయిన కేసులెన్నో వున్నాయి. అలాంటి సున్నిత మనస్కులు అనుక్షణం ఆఖరికి ఏ విమర్శ వచ్చినా భూమిలోకి కృంగిపోతారు.

ప్రతి చిన్న విషయానికి తల్లడిల్లిపోయి ఆఖరికి మానసిక వ్యాధి పాలయ్యే మహిళలూ వున్నారు. అలా అయితే రోజూ ఏదో ఒక సమస్య తయారవుతూనే వుంటుంది. ఒకటి పోగానే మరొకటి తయారై మన్ని కృంగదీస్తూ వుంటాయి. అబ్బాయి పరీక్ష తప్పినా, అమ్మాయి పెళ్ళి కాకపోయినా, భర్త ఉద్యోగం వూడినా, అత్తమామలు ఆరడి పెడుతున్నా ఆఖరికి తనకొక బిడ్డ పుట్టకపోయినా, అంతా ఆకసంతానం కలిగినా ప్రతి దానికి మనోవ్యాధితో మంచంపడతారు. కొందరయితే గోరంతలు కొండం తలు చేసుకొని తమతోపాటు తమవారి నందరినీ ఇబ్బంది పెడతారు. ఉదా॥ తన కొడుకు ఆఫీసునుండి ఆలస్యంగావస్తే ఎవరో ఘాత చేశారని ఈలోగా ఊహించుకొని గలభాచేస్తారు. అమ్మాయి కాలేజీనుండి వేళకు రాలేకపోతే ఎత్తుకెళ్ళారని బెంబేలుపడతారు. భర్తకు జ్వరంవస్తే "చాత బడి" చేశారని ఇల్లూవాకిలీ ఏకంచేస్తారు. ఏ చావుకబురు విన్నా పడి పోతారు. ఏ నష్టంవచ్చినా తట్టుకోలేరు. ఆఖరికి పిల్లీ, కుక్కా, విధవ రాలు ఎదురుపడినా, ఉదయాన్నే దర్శనమిచ్చినా ఆరోజంతా ఏ కీడు వస్తుందోనని ఊహించుకొని భయభ్రాంతులవుతారు. ప్రతి చిన్న సంఘ టనకూ అనుమానంతో హతాశులైపోతారు. ఇంట్లో ఒంటరిగా ఉండలేమని వాపోతారు. తన్ని ఏ దయ్యమో, భూతమో ఆవహించి పీడిస్తోందని, వెన్నాడుతోందని ఆహార నిద్రలకుకూడా దూరమైపోతారు.

కొందరు స్వయంగా సమస్యలు సృష్టించుకొని అల్లాడిపోతారు. తమ శక్తి సామర్థ్యాలను మించిన కోర్కెలు కోరతారు, అవి తలకుమించిన భారమైతే అపజయాన్ని భరించలేక కృంగి కృశించిపోతారు. తమ భర్తలు ఆలస్యంగావస్తే అనుమానపడతారు. పరాయి స్త్రీతో మాట్లాడితేనే ఇక ప్రళయం వచ్చినట్లు తల్లడిల్లిపోతారు. ప్రేమించిన ప్రియుడు దగాచేసి మరో ప్రియురాలితో కులుకుతున్నట్లు ఊహించుకుంటారు. కుటుంబాన్ని నరకప్రాయం చేస్తారు. దీర్ఘ వ్యాధి వచ్చినా, అంగవైకల్యం కలిగినా మానసిక క్లేశాన్ని పొందుతారు. కొందరు మంకుపట్టుపట్టి తన మార్గమే, తన లక్ష్యమే గొప్పదనుకొని అవి సాగనప్పుడు సాధిస్తూనే వుంటారు. ఉద్వేగం వచ్చినప్పుడు కంట్రోల్ చేసుకోలేక తాడో పేడో తేలాలంటారు.

ఓటమిని అంగీకరించలేక నిట్టూర్పులతో ఇక జీవితమే దుర్భరమంటూ చావుకు తెగిస్తారు; లేదా పిచ్చివాళ్ళవుతారు. పిల్లలూ చావక, తల్లులూ పోక మొగుళ్ళూ దూరంకాక, ఆస్తులూ హరించక ఏ కష్టనష్టాలూ కలుగక జీవితం వర్ధించిన విస్తరిలా ఎలా వుంటుంది! సంసారాన్ని, మన జీవితాలను సుఖప్రాయంగాని, నరకప్రాయంగాని చేయడం మన ప్రవృత్తి మీద ఆధారపడి వుంటుంది. మన మానసిక ఔదార్యంమీద, తృప్తిమీద, నడవడిమీద వుంటుంది. కేవలం లక్షల ఆస్తివున్నా మానసిక వికాసం, ఆలోచన లేనివారికి శాంతిలేదు.

మనోవ్యాధికి మందులేదు; మానసిక జాడ్యానికి చికిత్స వుండదు. శారీరక ఘాతకన్నా మానసిక ఘాతమిన్న. అది మనిషినే కృంగదీస్తుంది; ఆరోగ్యాన్ని హతమారుస్తుంది; ఆందోళన కలిగిస్తుంది; రక్తపోటు తెస్తుంది. చీకాకులకు కారణభూతమవుతుంది. చిత్తచాంచల్యానికి దారితీస్తుంది; నరాల బలహీనతవల్ల హిస్టీరియా, మూర్ఛలను తెస్తుంది. కడకు అది మరణానికి లేక ఆత్మహత్యకు దారితీస్తుంది.

"యాక్సిడెంట్సు" గృహదహనాలు, లూటీలు, హత్యలు లాంటివి అనుకోని సంఘటనలు వచ్చినప్పుడు గుండెనిబ్బరం కావాలి. అది మన మనస్సును శరీరాన్ని రక్షిస్తుంది. మనోధైర్యానికి మించిన సంపద లేదు. ఆ సంపదకు అభివృద్ధేకాని నశింపు వుండదు. అది తోటి స్త్రీకి ఆదర్శప్రాయమేకాని అవినీతికి మార్గం కాదు; అది గుణపాఠమేకాని అశని పాతం కాదు.

ఆర్థిక సమస్యలు, వైవాహిక సాంఘిక సమస్యలు, గృహచ్ఛిద్రాలు లాంటి సమస్యలు అందరికీ వస్తాయి. మానవ జీవితమే సమస్యల విష వలయం. తలకొక చరిత్రా, జీవితానికొక సమస్య వుండవను కోవడం భ్రమ. వాటిని ధైర్యంతో ఎదుర్కోవాలేకాని చిత్త చాంచల్యం తెచ్చుకోవడం అవివేకం. సంసారం సాగరం లాంటిది అయితే మనసుల కోతిలాంటిది. అంటే ఎప్పుడూ ఏవో చికాకులు, పేచీలు, రుగ్మతలు తెచ్చి పెట్టటం దాని స్వరూపం. అప్పుడు మనం మన బుద్ధిని వినియోగించి

వివేకంతో, విజ్ఞానంద్వారా ఆ చిక్కులనుండి తప్పించుకోవాలి. లేకుంటే ఆ సమస్యలు మనల్ని హతమారుస్తాయి. అని మానసిక శాస్త్రం నిర్వచించింది. పిడుగులాంటి వార్త అయినా రెప్పపాటుగా భరించగల ధీశక్తిని మనం పొందగలిగాలి. ఎన్ని కష్టాలొచ్చినా ఎంత ఘాత జరిగినా, ఎన్ని అపనిందలొచ్చినా ఏది ఏమయినా మనం నిర్లిప్తంగా వుండాలి. అంటే చెడ్డపనులుచేస్తూ ధైర్యంగా వుండమనికాదు; మనపై వచ్చిపడి మన్ని నాశనంచేసే ఇబ్బందులను తట్టుకోమని అర్థం. స్వయంగా పరిష్కరించలేని సమస్యలను ఆప్తులకో శ్రేయోభిలాషులకో చెప్పుకోవాలి. ఎప్పుడో ఒకప్పుడు ఏదో విషమ సమస్య, మానసిక ఘాత పొందని వ్యక్తి వుండడు. అప్పుడే మనలో ఆత్మ విశ్వాసం క్షీణించరాదు. అందువల్ల మనలో ఎల్లప్పుడూ ధైర్యసాహసాలు ఉప్పొంగుతూ వుండాలి. మన ధైర్యమే మనకు అంగరక్ష.

మనశ్శాంతి, మానసిక తృప్తి మన ఆదర్శం కావాలి. దానికి ప్రాతిపదిక మానసిక విశ్వాసం మనోధైర్యం. ఇవి మన మనస్సును ఛిన్నాభిన్నం చేసే విపరీత శక్తుల బారినుండి రక్షిస్తాయి. అందువల్ల మనం చావరాదు. చచ్చి సాధించేది ఏమీలేదు. అది పిరికితనం; అసమర్థత. అంతేకాదు ఆదర్శప్రాయం కాదు. న్యాయం కోసం పోరాడాలి. లేదా అన్యాయానికి, అధర్మానికి దూరంగా పోయి నీతిగా బ్రతకాలి. దానికి కొండంత మనోబలం, ధైర్యం, వివేకం, దూరదృష్టి మనలో రావాలి.

("కలువబాల" నవంబరు 1985)

---

# మానవ హక్కులు ; మహిళల మనుగడ

"మానవ" అన్నప్పుడు అది స్త్రీ పురుషు లిద్దరికీ వర్తిస్తుంది. అంటే మానవ కుటుంబంలోని సభ్యులందరికీ అనుల్లంఘనీయమైన ఆత్మగౌరవాన్ని ఈవిశ్వమానవ హక్కులప్రకటన గుర్తిస్తుందని "హ్యూమన్‌రైట్స్" ప్రణాళికలో పేర్కొన్నారు. జాతి, వర్ణ, వర్గ, కుల, మత, లింగ విభేధాలు అందులో విస్మరించబడ్డాయి. ఇది ప్రపంచ పౌరులందరికీ వర్తిస్తుందని నిర్వచించిందా ప్రకటన. కనుక మానవ హక్కులు స్త్రీ పురుష లిద్దరికీ సమానంగా వర్తిస్తాయి. అందువల్ల హక్కులు అన్నప్పుడు అవి ఎన్ని రకాలు వున్నాయో, వాటిలో ముఖ్యమైన స్త్రీ హక్కులు ఏమిటో, వాటిని అనుభవిస్తున్నామా ? లేదా? వాటికి అడ్డంకులేమిటో? తెలుసుకోవలసిన బాధ్యత మనకు వుంది. మనం హక్కులు అనుభవించేందుకు ముందుగా మానవ హక్కులు, తదితర హక్కులు, అవి ఎందుకు పుట్టాయో, వాటి వివరణలు గురించి విచారిద్దాం. అది చాలా అవసరం.

ఫాసిస్టు ప్రభుత్వాలు అమలుజరిపిన నేరపూరిత చర్యలు ప్రపంచ మానవాళిని వెన్నుతట్టి లేపాయి. రెండవ ప్రపంచ యుద్ధకాలపు విషాదానుభవాలు, మారణహోమాలు జరిగిన తరువాత ప్రపంచ మేధావులు జరిపిన చర్చల ఫలితమే విశ్వమానవ హక్కుల ప్రకటన. అది 1948 డిశంబరులో ఏర్పడింది. వీటిలో ముఖ్యమైన అంశాలు కొన్ని వున్నాయి. అవి మానవ వ్యక్తిత్వాన్ని, గౌరవాన్ని, అస్తిత్వాన్ని నిలుపుతాయి. అయినా వాటి వల్ల సమాజ శ్రేయస్సుకు, వ్యక్తి శ్రేయస్సుకు సంఘర్షణ లేదని ఆ హక్కులు నిర్వచించాయి. అంతేకాదు వ్యక్తిత్వం వికసిస్తేనే సమాజ శ్రేయస్సు పెరుగుతుందని పలికాయి. మానవసమాజం సామరస్యంతో ప్రతిభావంతంగా ప్రజ్వరిల్లటానికి ఈ మానవహక్కులు ప్రాతిపదికలు అయ్యాయి. మానవాళికంతటికీ అన్వయించే ఈ విశ్వమానవ హక్కులు ప్రపంచశాంతిని, స్వేచ్ఛను నైతిక విలువలను, వ్యక్తి గౌరవాన్ని, సమానత్వాన్ని అభిలషించాయి. మానవ వ్యక్తిత్వ వికాసాన్ని పరస్పర

సహకారంతో శాంతితో స్నేహభావాన్ని ఆకాంక్షించే విధానంలో అనుభవించే హక్కును ప్రతిపాదించాయి. మానవాళి అంతా ఒకే కుటుంబమనే గీటురాయిపై నిర్వచింపబడ్డదే విశ్వమానవ హక్కుల ప్రణాళిక.

ఇందులో ముఖ్యమైనవి ముప్పైసూత్రాలు వున్నాయి. మానవులంతా స్వేచ్ఛగా, సమానంగా జన్మించారు కనుక అందరూ సోదరులు. అందరూ వివేకం, ఆలోచనాశక్తి కలవారు కనుక అన్ని హక్కులకూ, స్వేచ్ఛలకూ అందరూ సమానులే; వ్యత్యాసంలేదు. అలాగే స్వేచ్ఛతో మనుగడ సాగించడానికి, భద్రతకూ, హక్కు వుంది. న్యాయదృష్టిలో వ్యక్తికి వ్యక్తికి తేడాలుండరాదు. వ్యక్తిని చిత్రహింసలు పెట్టడం, క్రూరంగా బాధించడం, శిక్షలు విధించడం బానిసలుగా కొనడం, అమ్మడం లాంటివి చేస్తే న్యాయస్థానంలో తన హక్కులను కాపాడుకునే హక్కు ప్రతి వ్యక్తికీ వుంది. అన్యాయంగా ఏ వ్యక్తినైనా నిర్బంధించడం, దేశ బహిష్కరణ చేయడం నిషేధం అమలులోవున్న చట్టంప్రకారమే చెయ్యాలి. అలాగే చట్టసమ్మతమైన ఆస్తిహక్కును తొలగించరాదు. ప్రతి వ్యక్తికి ఆస్తిహక్కు, పౌరుడుగా వుండేహక్కు, మరోదేశంలో వుండడానికి, వెళ్ళి రావడానికి హక్కువుంది. (చట్టానికి వ్యతిరేకమైన ఆరోపణలు వుంటేతప్ప.)

వ్యక్తిగత హక్కులు-తనకు ఇష్టమున్న మతాన్ని స్వీకరించవచ్చు; మతాన్ని మార్చుకోవచ్చు, భావస్వాతంత్ర్యం, పత్రికా స్వాతంత్ర్యం, సభా స్వాతంత్ర్యం, సంఘ నిర్మాణ స్వాతంత్ర్యం వున్నాయి. ఆ హక్కులను శాంతియుతంగా, న్యాయ సమ్మతంగా జరుపుకోవాలి. పరిపాలనలో భాగస్వామ్యం, కోరవచ్చు కాని దాన్ని ఎన్నికలద్వారా సాధించుకోవచ్చు. విద్యను పొందేహక్కు, పనిచేసుకునే హక్కు, దేశంలో ఎక్కడైనా నివసించే హక్కు వున్నాయి; ఆయా దేశాల శాసనాలకు లోబడి ఏ దేశంలోనైనా పౌరసత్వం పొందవచ్చు.

వ్యక్తులమధ్య సమరస భావాన్ని, దేశాలమధ్య శాంతి, సౌహార్ద్రాలను, సహాయ సహకారాలను ప్రతిపాదించిన ఈ మానవ హక్కులకు నాంది న్యాయపరిపాలన. తద్వారానే మానవ మనుగడ సాగించాలని

సామాన్య మానవుడు (స్త్రీ కూడా) సైతం స్వేచ్ఛాయుతమైన జీవితాన్ని గడపాలని నిర్దేశిస్తున్నాయి న్యాయసూత్రాలు. ప్రపంచంలో మితిమీరుతున్న పాశవిక శక్తుల్ని, భరించలేని యుద్ధ ప్రయత్నాన్ని, అమానుషమైన హింసా విధానాన్ని ఎదుర్కొనడానికి విప్లవం, పోరాటం తప్ప గత్యంతరం లేదనే వాదనకు ప్రతివాదగా శాంతియుత విధానాలద్వారా, న్యాయ పద్ధతులద్వారా తమ హక్కులను కాపాడుకోవచ్చని వక్కాణిస్తాయి మానవ హక్కులు. తరువాత రాజ్యాంగంయొక్క మౌలిక నిర్మాణాన్ని **(Basic Structure)** ను మార్చకుండా రాజ్యాంగం మార్చవచ్చని కేశవానంద భారతి కేసులో సుప్రీంకోర్టు తీర్పు ఇచ్చింది. ఇది చారిత్రాత్మకమైన తీర్పు. ఇది ఈ నాటికీ అమలులో ఉన్న సూత్రం. రాజరికంలోని రాజ్యం, ప్రజాస్వామ్యం, సెక్యులరిజం రాజ్యాంగంయొక్క ప్రాథమిక లక్షణాలు. ప్రజా ప్రతినిధులను ప్రజలు ఎన్నుకునే హక్కు, పౌరుడు ప్రజాప్రతినిధిగా పోటీచేసే హక్కు, పాలకులు ప్రజలకు రాజ్యాంగానికి బాధ్యులయ్యేటట్లు చేయడం ప్రజాస్వామ్య హక్కులు. గణరాజ్యం, ప్రజాస్వామ్య వ్యవస్థ, సెక్యులరిజం రాజ్యాంగంయొక్క ప్రాథమిక నిర్మాణాంశాలుగా పరిగణించవచ్చును.

అవి స్వేచ్ఛను, సమానత్వాన్ని, స్త్రీల ప్రతిపత్తిని సాంఘిక ఆర్థిక ప్రగతిని నిర్దేశిస్తాయి. వీటిని ఐక్యరాజ్యసమితి మానవ హక్కుల సంఘం విశ్వమానవ హక్కుల ప్రకటన **(UNIVERSAL DECLARATION OF HUMAN RIGHTS)**లో పొందుపరచింది.

మానవుడికి ఈ హక్కులు ఎలా కల్గాయి ? అంటే మానవునికి తన ఉనికివల్లనే కలిగిన వాటిని ప్రకృతిసిద్ధమైనవి లేక సహజహక్కులు **(NATURAL RIGHTS)** అంటాం. జీవించటానికి గల హక్కును ఎవరూ ప్రసాదించలేదు కనుక సహజమైన హక్కుగా పేర్కొనవచ్చు. కొన్ని దేశాల శాసనాలు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు వ్యతిరేకంగా వుంటాయి (ఉ॥ జర్మనీలో హిట్లరు పెట్టినవి) అవి న్యాయసూత్రాలకు **(RULE OF LAW)** భిన్నమైనవిగా వుంటాయి.

ఆచారాలవల్ల సంక్రమించే హక్కులను **(CUSTOMARY RIGHTS)**

అంటారు. మన పైరుకు నష్టంలేనివిధంగా మన పొలంలోచి ఎండ్లకు బాట, మనుష్యులకు దారి ఇవ్వటం; ప్రభుత్వ స్థలంలో మనం నిర్మించిన చెరువులు, బావులు, సత్రాలు అందరూ అనుభవించే హక్కులలాంటివి కొన్ని హక్కులను చట్టాలు ప్రసాదిస్తాయి. ఉ॥ ఖూనీకేసు విచారణ సెషన్సు జడ్జి చేయాలని క్రిమినల్ ప్రొసీజర్ కోడులో వుంది. అంతకు తక్కువ స్థాయితో ఉన్న కోర్టు ఆ కేసును విచారిస్తే ముద్దాయి ఆ తీర్పును రద్దు చెయించుకోవచ్చు. ఇది శాసనంవల్ల వచ్చిన (STATUTORY RIGHT)

ఒక వ్యక్తిపై నేరారోపణ చేస్తే ఆ నేరాన్ని నిందితునికి తెలియజేసి సంజాయిషీ చెప్పుకోటానికి అవకాశం ఇవ్వాలి. అతడు లేక ఆమె సాక్షి సాధనాలను విచారణాధిగారి యెదుటపెట్టానంటే నిందితునికి వీలుకల్గించాలి. నేరారోపణచేసే వ్యక్తి విచారణాధికారి ఒకే మనిషిగా ఉండరాదనేవి న్యాయ సూత్రాలు; ధర్మ అంశాలు. వీటిని సభ్యసమాజాలు అంగీకరిస్తాయి. నిరంకుశ పాలకులు, నియంతృత్వ పాలకులు వీటిని వమ్ముచేస్తారు. అంతే కాక ఒక్కొక్కప్పుడు (అవగాహనా లోపంవల్ల) సదుద్దేశం కలవారుకూడా వీటిని అతిక్రమిస్తారు. ఈ ప్రమాదాలను అరికట్టటానికి కొన్ని దేశాలు రాజ్యాంగంలోనే పౌరుల ముఖ్యమైన హక్కులను పొందుపరిచాయి. వీటిని మౌలిక హక్కులని (FUNDAMENTAL RIGHTS) అని పిలుస్తాం. వీటిని ప్రాథమిక హక్కులనికూడా పేర్కొనవచ్చు. వీటి ఉల్లంఘన జరిగినప్పుడు అన్యాయానికి గురి అయిన వ్యక్తి న్యాయస్థానానికి వెళ్ళి తన హక్కును స్థిరీకరించుకోవచ్చు. అలాగే రాజ్యం అనుసరించవలసిన విధానాన్ని నిర్దేశిస్తూ మార్గదర్శక సూత్రాలు (DIRECTIVE PRINCIPLES OF STATE POLICY) కూడా రాజ్యాంగంలో పేర్కొనడం జరిగింది. ఏదైనా శాసనం చెల్లదగునా లేదా అనడానికి గీటురాయిగా రాజ్యాంగం లోని నిబంధనలు పనిచేస్తాయి. రాజ్యాంగ నిర్ణయ సభను సమావేశ పరచి మరో రాజ్యాంగాన్ని నిర్ణయించుకోవడం ద్వారానే మౌలిక హక్కులను మార్చవచ్చని సుప్రీంకోర్టు గోలక్‌నాథ్ కేసులో తీర్పు ఇచ్చింది. అంటే ఆ హక్కులు అంత బరువైనవని, విశిష్టమైనవని భావం.

తరువాత రాజ్యాంగంయొక్క మౌలిక నిర్మాణాన్ని (BASIC

STRUCTURE)ను మార్చకుండా రాజ్యాంగాన్ని మార్చవచ్చని కేశవానంద భారతి కేసులో సుప్రీంకోర్టు తీర్పు ఇచ్చింది. ఇది చారిత్రాత్మకమైన తీర్పు. ఇది ఈనాటికి అమలులో ఉన్న సూత్రం. రాజరికంలేని రాష్ట్రం ప్రజాస్వామ్యం; సెక్యులరిజం మన రాజ్యాంగంయొక్క ప్రాధమిక లక్షణాలు. ప్రజా ప్రతినిధులను ప్రజలు ఎన్నుకునే హక్కు, పౌరుడు ప్రజా ప్రతినిధిగా పోటీచేసే హక్కు, పాలకులు ప్రజలకు రాజ్యాంగానికి బాధ్యులయ్యేటట్లు చేయడం ప్రజాస్వామ్య హక్కులు. గణరాజ్యం, ప్రజాస్వామ్య వ్యవస్థ, సెక్యులరిజం రాజ్యాంగంయొక్క ప్రాధమిక నిర్మాణాంశాలుగా పరిగణించవచ్చును.

మరికొన్ని విలువైన ముఖ్యహక్కులు వున్నాయి. అవి పౌరహక్కులు (CIVIL LIBERTIES) ఇవి వ్యక్తికి వాక్స్వాతంత్ర్యం, సభాస్వాతంత్ర్యం, సంఘస్వాతంత్ర్యం, సంచార స్వాతంత్ర్యం, జీవించటానికి హక్కు, స్వేచ్ఛను ఇస్తాయి. పౌరహక్కులు ప్రాధమిక హక్కులలో భాగంగా (BASIC RIGHTS) చెప్పుకుంటాం. అంటే అవి లేని దేశంలో తదితర ఏ హక్కులూ వుండవు; ఉన్నా అనుభవంలోకిరావు. ఇలా మానవ జీవితానికి సంబంధించిన వివిధ రకాలైన హక్కులూ వున్నాయి. ఇవి స్త్రీ పురుషు లిద్దరికీ వర్తిస్తాయని ముందుగానే చెప్పుకున్నాం. ఇంతవరకూ స్త్రీ రక్షణా, స్వేచ్ఛా, సమానత్వం చాలా పరిమితంగా అనుభవిస్తోంది. చట్టాలలో ఎన్నివున్నా ఆచారాలు అవి వమ్ముచేస్తున్నాయి. ఉ॥ పెళ్ళికానిదే ఏ స్త్రీ తల్లికాకూడదని, అయితే శిక్ష వున్నదనీ ఏ చట్టం చెప్పకపోయినా సమాజం శిక్షిస్తోంది. అందువల్ల అసహాయురాలైన స్త్రీకి కొన్ని ప్రత్యేక హక్కులు వున్నాయి. వాటిని గమనించడం అత్యంత అవసరం.

మానవ హక్కులలో స్త్రీలకు సంబంధించిన హక్కులు కొన్ని వున్నాయి. అవి వివాహానికి మాతృత్వానికి, సమాన వేతనానికి ఆమెకు గల హక్కులను రక్షిస్తాయి. యుక్త వయస్కులైన స్త్రీ పురుషులు జాతి, మత, దేశ విభేదాల ప్రమేయం లేకుండా వివాహ మాడటానికి, కుటుంబంగా ఏర్పడటానికి హక్కు కల్గివున్నారు. కుటుంబం సహజమైన వ్యవస్థ. మౌలికమైన వ్యవస్థకూడా. కనుక వివాహ వ్యవస్థ కుటుంబ

వ్యవస్థల గురించి మానవ హక్కులు అలా స్పష్టం చేశాయి.

19'5లో బ్రిటిష్ సైనికులు తాము వివాహమాడిన రష్యన్ వనితలను తమ దేశానికి తీసుకుపెడదామనుకుంటే, ఆనాటి రష్యన్ ప్రభుత్వం అనుమతించలేదు. కనుక కుటుంబ వ్యవస్థ మౌలిక స్వభావాన్ని స్పష్టపరచడం అవసరమైంది. భారతదేశ శాసనాల ప్రకారంకూడా ఇష్టం వచ్చిన వారిని వివాహమాడే హక్కు (1954లో స్పెషల్ మ్యారేజి యాక్టు)లో ఇవ్వబడినా భిన్న జాతుల మతాల దేశాలకు చెందిన వివాహాలను సమాజం ఈసడిస్తుంది. కనుక ఈ హక్కు ఆచరణలో మృగ్యమయింది. ఏదయినా ప్రపంచ దేశాల మధ్య, జాతుల మధ్య, మతాల మధ్య వివాహాలు చెల్లుతాయని ప్రకటించింది విశ్వమానవ హక్కుల ప్రణాళిక.

యుక్తవయస్కులైన వారు అంటే మేజర్లు స్వేచ్ఛగా, సంపూర్ణంగా అంగీకరిస్తేనే వివాహం జరగాలని మానవ హక్కుల ప్రకటన పునరుద్ఘాటించింది. అంటే మైనర్ల వివాహం ధర్మ సమ్మతం కాదన్న మాట. అయినా హిందువులూ, ముస్లింలు మైనర్లుగా వివాహమాడటానికి వారివారి ధర్మశాస్త్రాలు ఇంకా అనుమతి ఇస్తూనే వున్నాయి. విద్యావిహీనతవల్లే మనం కొన్ని హక్కులను, చట్టాలను (వరకట్న నిరోధ శాసనం లాంటివి) అధిగమిస్తున్నాం. వివాహ మాడటానికి, దాంపత్య జీవితంలోను, విడాకులు పొందడానికి కూడా స్త్రీ పురుషులకు సమాన హక్కులు వుండాలనికూడా మానవ హక్కుల ప్రణాళిక వక్కాణించింది. ఇది చాలా ఉన్నతమైన హక్కుగా స్త్రీలు చెప్పుకోవచ్చు.

చాలా ముఖ్యమైన హక్కు ఒకటి స్త్రీలకు ప్రసాదించింది మానవ హక్కుల పత్రం. అది సంతానం అక్రమమైనా, సక్రమమైనా సంఘం యొక్క రక్షణకు ఆ సంతానం అర్హత కలిగి వుంటుందని, అంతేకాక అక్రమ సంతానంపట్ల, ఆ తల్లులపట్ల ప్రభుత్వం, సమాజం ఈ రెండూ ప్రత్యేక శ్రద్ధను, జాగ్రత్తను ప్రదర్శించాలనికూడా పేర్కొన్నది.

స్త్రీ పురుషులు ఒకే పనిచేసినప్పుడు వారికి సమాన వేతనాలు ఇవ్వాలని ఐక్యరాజ్యసమితి మానవహక్కులద్వారా స్పష్టంచేసింది. కాని

ఈ సూత్రం ఈనాటికీ అభివృద్ధి చెందిన దేశాల్లోకూడా అమల్లో లేదు. పబ్లిక్ రంగంలో సమాన వేతనం ఇస్తున్నా, వ్యక్తిగత రంగాల్లో ఆ సూత్రం నిరాకరించారు ఇది ఘోరమైన దురన్యాయం. ఈ దుస్థితిని తుదముట్టించేవరకు స్త్రీలు పట్టు విడువరాదు; విశ్రమించరాదు.

మానవ హక్కులలో స్త్రీ జీవితానికి సంబంధించినవి, ముఖ్యమైనవి, మూడు హక్కులు వున్నాయి. అవి వివాహం, మాతృత్వం, ఆర్థికపరమైన సమాన వేతనంలాంటివి వాటిని యు.ఎన్.ఒ. ప్రకటించిన మానవహక్కులలో స్థిరీకరించడం ముదావహం. జాతి మత లింగ వివక్ష లేకుండా ప్రతి మానవుడికి స్వేచ్ఛగా జీవించడానికి, భద్రతకు హక్కు వున్నదని మానవ హక్కులలో ప్రప్రథమంగా పేర్కొనబడింది. కనుక స్త్రీలకు సమానహక్కులు సముచిత రక్షణ సంపాదించుకోవడానికి స్త్రీలే ముందంజ వేయాలి. (4) స్త్రీలలో సామాజిక చైతన్యం కలవారు తమ తోటి స్త్రీల అజ్ఞానాన్ని తొలగించి వివిధరకాల హక్కుల గురించి చెప్పాలి. స్త్రీలు సుసంఘటితులై సంఘాలను నిర్మించుకొని సామూహిక బలంతో ముందుకు సాగిపోవాలి. స్వేచ్ఛాపిపాసులైన పురుషులుకూడా అందుకు చేయూతనివ్వడం సముచితం; సమంజసం.

అందుకు ముందుగా మానవ హక్కులలో స్త్రీలకు సంబంధించిన హక్కులేవో, రాజ్యాంగం ప్రసాదించిన హక్కులేవో, అవి ఎన్నిరకాలో తెలియజెప్పడం అవశ్య కర్తవ్యం. ఈనాడు అమల్లోవున్న హక్కులవల్ల, శాసనాలవల్ల స్త్రీకి ఏఏ సౌకర్యాలు సమకూరుతున్నాయో ఇంకా ఏఏ సవరణలు అవసరమో గుర్తించాలి. వాటిని గురించి చర్చించుకోవాలి. ముఖ్యంగా స్త్రీలు తమ స్వశక్తిపై ఆధారపడాల్సిన పరిస్థితి వచ్చింది. ఈ జాతిలో ఈ హక్కులవల్ల, వాటి అనుభవంవల్ల చెప్పలేని లాభాలు వున్నాయి.

(ఆంధ్రపత్రిక–డిశంబరు 1985)

---

# విద్య : ఉద్యోగం : వివాహం–
# స్త్రీకి ఏది ముఖ్యం ?

యువతికి చదువా; ఉద్యోగం ముఖ్యమా; వివాహం ముఖ్యమా అనే ప్రశ్నకు సమాధానం చెప్పడానికి పెద్దగా ఆలోచించనక్కర్లేదు. కష్ట పడాల్సిన పనిలేదు. యువతికూడా ఒక వ్యక్తి అని ముందుగా మనం గ్రహిస్తే సమస్య సగంపైగా తెలిపోయినట్లే. ప్రజాస్వామ్య సమాజంలో స్త్రీలు, పురుషులు సమాన హోదాగలవారై సమాన అవకాశాలు కల్గి ఉండాలికదా! అలాంటప్పుడు స్త్రీని మాత్రమే పేర్కొని ఆమెకు వివాహం ప్రథమ కర్తవ్యమని బోధించటం, వాదించటం పొరపాటేమో! ప్రతి పౌరునికి వ్యక్తి వికాసానికి అవకాశమున్నప్పుడే ఆ సమాజం నిత్యకల్యాణం పచ్చతోరణంగా విలసిల్లుతుంది. వ్యక్తిలోని అంతర్గత శక్తులు వెలికి వొచ్చి అతని స్వభావాని కనుగుణంగాను సమాజ శ్రేయస్సుకు అనువైన రీతిలోను పరిఢవిల్లితేనే వ్యక్తి వికాశం కల్పించిందంటాం. దీనికి చదువు ముఖ్యం. విజ్ఞానంతోపాటు, శాస్త్రీయ దృక్పథం, మానవతాభావం విద్య వల్ల కలుగుతాయి. క్రిమికీటకాదులు, పశుపక్ష్యాదులు అన్నీ అనుభవం నుండి కొన్తో కూన్తో నేర్చుకుంటై. మరి జీవజాతుల్లో ఉత్కృష్ట జీవియైన మానవుడు తన వివేచనాశక్తితో వివేకబలంతో అనుభవంనుండి గుణపాఠాలు నేర్చుకోవడంలో ఆశ్చర్యంలేదు. అయితే పశువులకులేని వెసులుబాటు మానవుడికుంది. భాష, సాధనసామగ్రి, పనిముట్లు పంతరించుకున్నాడు. కనుకనే యావత్ మానవాళియొక్క అనుభవాన్ని తను తెల్సుకోగల్గుతున్నాడు. చిత్రాలు, గ్రంథాలు, సినిమాలు, రేడియో, టెలివిజన్, నృత్యాలు, నాట్యాలు, నాటకాలు వీటన్నిటిద్వారా తోటి మానవుల జీవిత అనుభవసారాన్ని స్వీకరించగలుగుతున్నాడు. ఇందుకు చదువు విధిగా అవసరమౌతోంది. విద్యావంతుడు తెలిసికొన్నంతగా విద్యా విహీనుడు గ్రహించలేడుగదా! కనుకనే విద్యాహీనుని వింతపశువు అంటున్నాం.

ప్రతి పౌరునికి విద్య అవసరమని అంగీకరించిన వారుకూడా స్త్రీ విద్య అనేసరికి చాలా ఛాందసంగా వాదిస్తారు. పాపం అది వారి తప్పు కాదు. సనాతన సంప్రదాయాలలో మూఢాచారాలలో పుట్టి పెరుగుట వల్లనే వారు అలా భావిస్తున్నారు. తరతరాలనుండి స్త్రీని అబలని, కనుక స్త్రీకి రక్షణ కావాలని, అందుకోసం ఆమె ఇతరులకు లోబడి వుండాలనీ చిన్నప్పటినుంచీ అతనికి పెద్దలు చెవినిల్లుకట్టుకొని బోధించారు. పితా రక్షతి కౌమారే, భర్తా రక్షతి యవ్వనే, రక్షాంతి వార్ధకే పుత్రా నస్త్రీ స్వాతంత్ర్య మనర్హతి! అని మనువు చెప్పింది మనందరికీ తెలుసు. నిజానికి సాంస్కృతిక దృష్ట్యా మన దేశం ఇంకా 15వ శతాబ్ధంలోనే వుంది. మనుష్యులు భావాలు గణనీయంగా మారలేదు. మార్పు ఏ కొద్దోవున్నా అది మౌలికమైన మార్పుకాదు. అంతరిక్షంలో స్త్రీ యాత్ర చేసినా, విమానాలు నడుపుతున్నా, పరిశోధనా రంగంలో పురుషులతో సమానంగా పరిశ్రమిస్తున్నా, రాజ్య పరిపాలనా వ్యవహారాల్లో తన శక్తి సామర్థ్యాలు నిరూపిస్తున్నా స్త్రీకి గృహిణి అనే బిరుదు ఇచ్చి వంటకత్తెగా, తన పిల్లల తల్లిగా, తన ప్రియురాలిగా, ఆఖరికి తన పరిచారికురాలుగా చేసుకోవాలనే కాంక్ష మాత్రం పురుషుడికి చావలేదు. అందుకే చదువు సంస్కారాలకంటే యువతికి వివాహం ముఖ్యం అంటాడు. ఇందులోనూ కొంత స్వార్థం లేకపోలేదు. నిపుణుడయిన కార్మికుడు కావాలనే ఫ్యాక్టరీ యజమానిలాగా చదువుకున్న పెళ్ళాం కావాలి కానీ వుద్యోగం చేసే భార్య వొద్దు అంటున్నాడు. ఇది ఈనాటి యువకుల మనోభావం. దరహం మీద ఉద్యోగం సంగతి ఆలోచిస్తే "ఉద్యోగం పురుష లక్షణం" అని యువకులకు తరచుగా బోధిస్తారు. "ఉద్యోగం చేస్తుందా, వూళ్ళేలుతుందా" అని బాలికలను బడి మాన్పించి వేస్తారు. ఈ మాటలోనే "స్త్రీ ఉద్యోగం చెయ్యరాదు, పౌర వ్యవహారాల్లో పాల్గొనరాదు" అనే భావం ప్రస్ఫుటంగా కన్పడుతోంది. ఉద్యోగమనేది సంపాదన కోసం మాత్రమేననే వూహ చాలామందికుంది. మూలానికి పోతే ఈ వూహ నిరర్థకమని తేలుతోంది. ఉద్యోగంవల్ల సంపాదించే మాట నిజమే. కానీ ఇతరత్రా ప్రయోజనాలు అనేకం. ఉద్యోగం చేసే వ్యక్తి మానసిక స్థితికీ, నిరుద్యోగి మనోభావాలకు చాలా వ్యత్యాస

ముంటుంది. తన సమర్థత ప్రదర్శించే అవకాశం లేకపోయిందనీ, తన పాండిత్యం అడవికాచిన వెన్నెల అయిందనీ, తన వ్యక్తిత్వ వికాసం వమ్మయిందనీ నిరుద్యోగి అనుక్షణం మనఃక్లేశం అనుభవిస్తాడు, కృంగి కృషిస్తాడు. నిష్ప్రయోజకత్వం వెన్నాడుతూనే వుంటుంది. గోపీచందు "అసమర్థుని జీవయాత్ర"లో చిత్రించినట్లు చివరకు తనవారిపైకూడా కోప తాపాలు ప్రదర్శించలేక ఎందుకూ కొరగాని జీవితం సాగిస్తాడు. సమాజంలో ఎన్నో హక్కు లనుభవిస్తున్న పురుషుడికే ఈ గతి పడుతున్నపుడు తరతరాలుగా భావదాస్యంలో మ్రగ్గుతూ మంచితనం పేర వ్యక్తిత్వాన్ని చంపుకుంటూ పాతివ్రత్యం పేర పరులకోసం జీవిస్తూవుండే నిరుద్యోగ స్త్రీ స్థితి ఇంకా వర్ణనాతీతం. తాను ఇతరులపై ఆధారపడి జీవించాల్సి వస్తోంది గదా అని ఏ మాత్రం వ్యక్తిత్వం గల స్త్రీ అయినా ప్రతి నిమిషం మానసిక వ్యధకు లోనౌతుంది. కనుక స్త్రీకి ఉద్యోగం అవసరం అని నిర్ధారణ అయింది. స్త్రీ కూడా వుద్యోగం చేస్తేతప్ప గడవని పరిస్థితి మితిమీరుతోంది. ప్రస్తుత సమాజంలో ఒక్క పురుషుని సంపాదనతో సంసార జీవయాత్ర సాగని పరిస్థితి ఏర్పడింది. కనుక ఏ రీతిగా ఆలోచించినా ఉద్యోగం పురుష లక్షణం మాత్రమే కాదని తేలిపోయింది. ఇకపోతే యువతికి వివాహం అక్కరలేదా అని కొంతమంది విడ్డూరంగా ప్రశ్నించవచ్చు. స్త్రీకి వివాహం అక్కరలేదని ఎవరూ వాదించరు. ఆమాటకొస్తే పురుషునికికూడా వైవాహిక జీవితం అవసరమే. సంపూర్ణ జీవితానుభవానికి వివాహం ఒక సాధనం. అయితే స్త్రీకి మాత్రమే వివాహం విధిగా అవసరమని చెప్పడంవల్లనే తగాదా వస్తోంది. విద్యావంతురాలైన స్త్రీ తన వ్యక్తిత్వ వికాసానికి తన శక్తియుక్తుల ప్రకటనకు తన సహజ స్వభావానికి అనువైన వుద్యోగం చేస్తూనే వైవాహిక జీవితంద్వారా జీవిత సాఫల్యాన్ని పొందుతుంది. అంతేకాని ఈనాటి స్త్రీకి వివాహమే ముఖ్యమని చదువు సంస్కారం లేకుండా వృత్తినైపుణ్యం సంపాదించుకోకుండా గృహిణీస్థానం సంపాయించుకొని పరాన్నభుక్కుగా బ్రతుకుతూ తన కుటుంబీకుల ఈసడింపులకు, కోపతాపాలకు ఐలౌతూ జీవితం గడపాలవడం న్యాయంకాదు, ధర్మంకాదు. అది మానవత్వానికే సిగ్గుచేటు. ఉద్యోగార్హత పొందాకనే స్త్రీకి వివాహం జరిగితే ఆమెకు వ్యక్తి వికాసం, భద్రతా రెండూ కూడా లభిస్తాయి.

ఇంతచెప్పినా ఉద్యోగాలు చేస్తానంటె మాత్రం స్త్రీలందరికి ఉద్యోగాలు ఎక్కడ వున్నాయి ? ఉద్యోగం వచ్చేదాకా ఆగితే స్త్రీకి వివాహమే కాకపోవచ్చు. అపుడు ఆమె కన్యగానే మోడులాంటి జీవితం సాగించాలి కదా ? వ్యక్తిత్వం పేరుతో ఆమెకు ఈ శిక్ష ఎందుకు అని ప్రశ్నిస్తారు కొందరు. నిజమే చదువుకున్న స్త్రీలందరికీ ఉద్యోగాలు దొరకడంలేదని బాధపడడం మరో ఎత్తు-స్త్రీ ఉద్యోగం చేయడం మంచిదని ప్రథమంగా అంగీకరిస్తే తరువాత ఆమెకు ఉద్యోగం విధిగా ఇచ్చే సమాజంకోసం అందరూ, స్త్రీలు పురుషులూ ప్రయత్నించాలి; ప్రయత్నిస్తారు. ఉద్యోగాలు దొరకటంలేదు కనుక స్త్రీకి ఉద్యోగం వద్దనటం స్త్రీలపై గల న్యూనతాభావం మరోరకంగా ప్రదర్శించుకోవడమే అవుతుంది.

స్త్రీలంతా ఉద్యోగాలుచేస్తే పురుషులలోని నిరుద్యోగం ప్రబలుతుందనే మరో వితండవాదన వుంది. అందరికి ఉద్యోగం, పని ఉండే సమసమాజంకోసం కృషిచేద్దాము. ఈలోగా సంధికాలంలో కొంతమంది నిరుద్యోగులుగా ఉండవలసి రావటం తప్పనిసరి కావచ్చు. అయితే స్త్రీలు మాత్రమే నిరుద్యోగులు కావాలనడం ఏమి సబబో అర్థంకాదు. సమసమాజంవస్తే నిరుద్యోగం అంతర్ధానమవుతుంది. నిరుద్యోగాలు ఉండేవారు స్త్రీలు కావచ్చు-పురుషులూ కావచ్చు అంతగా అవసరమొస్తే ఉద్యోగియైన స్త్రీ నిరుద్యోగియైన పతిని పోషించవచ్చు. ఈ స్థితి రావాలని ఎవరూ కోరుకోరు. కాని ఆ స్థితివస్తే తమ పురుషత్వానికేదో లోటని మగవారు బాధపడనక్కరలేదు. అర్థరహితమైన వితండ వాదనలకు దిగనవసరంలేదు. ఒకరికి రెండోవారు తోడ్పాటు, అండదండలు అందివ్వడం సమానత్వ చిహ్నం కాని ఆ ఇచ్చేది స్త్రీయా, పురుషుడా అని ఆలోచించడం అర్థరహితం.

అవివాహిత స్త్రీ ఉద్యోగి అయినా అందరికీ చులకన అవుతుందని, ఆమె పరిస్థితి ఆమెకే ముప్పు తెస్తుందని, ఆమె అవినీతికి లోనవుతుందని ఏవేవో కబుర్లు చెప్పి భయపెట్టే స్త్రీ పురుషులు సమాజంలో అసంఖ్యాకంగా వున్నారు. భద్రత, గౌరవ మర్యాదలు, నీతి, స్త్రీకి, పురుషునికి

ఇద్దరికీ కావల్సినవని అర్థం చేసుకున్ననాడు ఈలాంటి భయసందేహాలకు అపోహలకు ఆస్కారం వుండదు.

వివాహం స్త్రీకి పరమ ధర్మమని నిర్దేశించి, దేవునికి ముడుపు చెల్లించినట్లుగా వరకట్నం ఇమ్మని చెట్టెక్కి కూర్చునే అహంకారపూరిత యువలోకానికి, వారిని సమర్ధిస్తున్న సనాతన ఛాందస కుటుంబీలకు సవాలుగా యువతులు చదువు నేర్చి, ఉద్యోగాలు చేసి సమాన హోదాతో తమరిని చూడగల్గినవారినే వివాహమాడతామని ప్రతిన పూనటం అవశ్య కర్తవ్యం. అలాకానినాడు తన వ్యక్తిత్వాన్ని చంపుకొని, జీవితాలను బలి చేసుకొని, ఆజన్మాంతం దాస్యశృంఖలాలలో మ్రగ్గడంకంటే స్త్రీలు కన్యలుగా జీవించినా ఘోరప్రమాద మేమి లేదనే మానసిక మార్పు స్త్రీలలో కల్గిననాడే పురుషుడు దిగివచ్చి స్త్రీని గౌరవించగలడు. అపుడే స్త్రీకి స్వేచ్ఛా సమానత్వం లభించే కుటుంబం, సమాజం ఏర్పడుతాయి. అందుకు ప్రతి యువతి విద్యావివేకాలు కల్గి తన కాళ్ళపై తాను నిలువ గలిగిన శక్తి సామర్థ్యాలు సంతరించుకోవాలి. ఆ తరువాతనే వివాహ ప్రస్తావనకు అవకాశం వుండాలి. అందువల్ల ఏది ముఖ్యమని ప్రశ్నించి నప్పుడు విద్యా, ఉద్యోగాలే ముఖ్యమని చెప్పక తప్పదు.

(ఆకాశవాణి, హైదరాబాద్ 1976)

---

# తరతరాల స్త్రీల పరాజయ గాథ

"మగువను మగవారితో సమానం చేస్తే ఆమె అతనికంటే అధికురాలు అవుతుంది" అన్నాడు సోక్రటీస్ విషపానీయం సేవిస్తూ. బహుశా తన భార్య పరమ గయ్యాళి కనుక ఆ అపోహ కలిగి ఉండవచ్చు. వేసక్టమీ ఆపరేషను చేయించుకోండని సలహా ఇస్తే "కష్టాలకు, బాధలకు, బాధ్యతలకు అలవాటుపడ్డ దాన్నే చేయించుకోమనండి. అదిచస్తే పిల్లలను పుట్టించలేని నాకు రెండో పెళ్ళికి పిల్ల నెవరిస్తారండి" అన్నాడొక ఘరానా పెద్దమనిషి. "ఏమండీ మీరు పోతేనో" అంటే, "తప్పు తప్పు అశుభం పల్కరాదంటుంది భారత నారీమణి" ఇదీ మన సంస్కృతి. మన ఆడవారి మనస్తత్వం, దీనికి మూలకారణ మేమిటి అన్నప్పుడు దానికి చాలా చారిత్రక గాథ వుంది. మానవుడు పాశవిక దశనుంచి పురోగమించినా, ఒకనాటి అసాధ్యాలు ఈనాటి సాధ్యాలుగా మారినా, స్త్రీ జాతి మాత్రం దరహంమీద నిద్రాణంగానే వుంది. ఈ పరిస్థితి మారి భారత నారీలోకానికీ జాగృతి కలిగేది ఎలా? ఎప్పుడు? అనేది నేటి ముఖ్య సమస్య.

పురాణ కాలంనుండి మనువువరకు మనవునుండి నేటివరకు స్త్రీని ఆటబొమ్మగా ఎంచి, అబలగా తలచి కడపటి స్థానాన్ని ఇచ్చాడు. స్త్రీకి నిర్దేశించిన బాధ్యతలు గృహ నిర్వహణ, శిశుపోషణ, పాతివ్రత్య పరిపాలన పరిపాలనాది కీలకస్థానాలన్నీ పురుషపరమైనాయి. ఇది నాటినుండి నేటివరకు నడుస్తున్న చరిత్ర. స్త్రీ జీవితాన్ని ఆజన్మాంతం పరిశీలిస్తే ఇది నిజమని విశ్వసించగలము.

"అయ్యో ఆడపిల్లేనా, ఆడదే పుట్టిందే ఖర్మ" అంటుంది బామ్మ. "వంశోద్ధారకుడు పుడతామని ఆశిస్తినే" అని తహతహ లాడతాడు తాత. "ఈ కరువుకాటకాలలో ఎలాసాకేది ఈ ఆడసంచుని?" ఇది తండ్రి ఆవేదన. ప్రసవవేదనకంటే ప్రమాదంగా భావిస్తుంది తల్లి. "ఇవే స్త్రీ

పుట్టుకకునాంది ప్రవచనాలు. తదాది నాసిరకం జాతిగా పెంచబడుతుందా పిల్ల "నీవు ఆడదానివి. అదుపు ఆజ్ఞల్లో మసలుకోవాలి సుమా. నీవు పుట్టింటికి మెట్టినింటికి పేరు ప్రతిష్ఠలు తేవాలి. భర్తకు, అత్తమామలకు లోబడి బ్రతుకుటే నీ జీవిత ధ్యేయం కావాలి ఇదీ శిక్షణ. నేను ఆడపిల్లను అబలను" అని అనుక్షణం గుర్తుచేసి వాతావరణంలో పెరుగుతుందా పిల్ల. ఆడవారి నీతులు, వారి నడత, వారి క్రమశిక్షణ అన్నీ వేతుగా వుంటాయి. మూసపోసిన జీవితం, చిగురించని యవ్వనం. ఆచారాలను, సంప్రదాయాలను తలదాల్చడంలాంటి ఆ మనస్తత్వం జీవితాంతం మరువలేనంతగా ఆ నరనరాల్లో నాటుకుపోతుంది. పొరపాటున ఎదురుతిరిగితే మగరాయుడిలా అంత తలబిరుసా? అని నోరు మూయిస్తారు. ఆ నాటిన విత్తు మహావృక్షమై శాఖోపశాఖలై ఫలపుష్పాదులు నిస్తుంది. అంటే మళ్ళీ అలాంటి మనస్తత్వంతోనే తన పిల్లను పెంచుతుంది. ఇదొక విషవలయంగా తయారైంది.

బాల్యంనుండి అమ్మాయికి ఇంట్లో పనిపాటలు, అణుకువలు, మర్యాదలు మన్ననలు నేర్పిస్తారు. కొద్ది రోజుల విద్యాభ్యాసంలో (ఆడపిల్లల స్కూళ్ళలో) కుమారి శతకం, రుక్మిణీ కల్యాణం, పతివ్రతల కథలు (సీతా, సావిత్రి, దమయంతి, చంద్రమతి) లాంటివి చదివిస్తారు. ఈ విద్యతో ఆమె భావజీవితానికి పునాదులు పడతాయి. పతియే పరమ దైవమని, అతని ఆరాధనే తనకు శిరోధార్యమని, అతడు క్రూరుడైనా, దుష్టుడైనా, త్రాగుబోతైనా, వ్యభిచారియైనా అతనే ప్రత్యక్ష దైవమని అదే భారత నారీ సంస్కృతి అనే విశ్వాసం ప్రబలుతుందా చిన్నారి మెదడులో.

ఇంతటితో చదువుకు స్వస్తి. "ఉద్యోగాలు చేస్తుందా! ఊళ్ళేలుతుందా ఆడదానికి చాకలిపద్దు చాలదా". ఇంకా ఈ రొమ్ముమీద కుంపటిని దింపుకోకపోతే మనం భరించతేమని వరాన్వేషణకు ఉపక్రమిస్తారు. "పాడగలవా, పనిపాటలు చేస్తూ అత్తవారిని మెప్పిస్తూ వారి కుటుంబానికి సేవచేయగలవా?" లాంటి ప్రశ్నలతో మగధీరులు వస్తూ పోతూవుంటారు.

ఏ పిల్లయినా ఎదురు ప్రశ్న వేస్తే ఇక ఆ పిల్లని జీవితంలో మాయని మచ్చగా "అది బరితెగిన ఆడదిరా దాన్ని పెండ్లాడేకంటే గుక్కెడు విషం త్రాగటం మంచిదిరా" అంటూ ప్రచారం చేస్తారు. చివరికామె అణుకువలు నచ్చితే ఫరవాలేదులే, కట్నకానుకల బేరాలు కుదిరితే, పెండ్లివారు తమ వ్యక్తి విలువ అంతస్తులవారి జమకట్టి అమ్ముడు పోతారు పురుష పుంగవులు. అప్పోసాప్పో తెచ్చి కట్నం సమర్పించి, అమ్మాయిని అల్లుడికి ధారపోసి ధన్యులవుతారు. ఇంతటితో ఆమె కన్నెచెరకు విముక్తి లభిస్తుంది. తమ బరువు బాధ్యతలు, తాము వదిలించుకొని ఈ బరువును ఆ యజమాని చేతిలో పెట్టి "ఇక ఈమె నీ సొత్తు పాల ముంచినా, నీటముంచినా నీవే దిక్కు" అని అప్పగించి తప్పుకుంటారు తల్లితండ్రులు.

కొత్త అభిరుచులతో, నూతన అనుభూతులతో తీపి, చేదు, కలిపిన వేపపువ్వు పచ్చడిలా ప్రారంభమవుతుంది మూడవ దశ. స్త్రీకిది జీవితంలో ముఖ్యభాగం. ఇందులోని వడుదుడుకులు, కష్టసుఖాలు వర్ణనాతీతం. "ఇల్లు నాది, కుటుంబం నాది, భర్త నావాడు. నేను లేకుంటే క్షణం జరగదు" అనుకుంటూ వెట్టిచాకిరీ చేస్తుంది. పతి అడుగుజాడలలో అతని కోర్కెలు, ఆశయాలే, తనవిగా భావిస్తూ, ఇల్లే స్వర్గమని భావించి కూపస్థ మండూకపు స్థితిలో వుంటుంది. అతనికి పరిచర్య చేస్తూ, పెడితే తింటూ, కొడితే పడుతూ, అతనే సర్వస్వమని నమ్మి, తను, ధన, మాన, ప్రాణాలర్పిస్తుంది భర్తకు. పొలం పశువులతోపాటు భార్యాపిల్లలు అతని ఆస్తి అవుతారు. ఆమె గొడ్రాలైతే అతను మళ్ళీ వివాహ మాడవచ్చు. మరి అతను నపుంసకుడైతేనో! ఆమె ఆత్మాభిమానాన్ని చంపుకొని కుటుంబ శ్రేయస్సుకై తననుతాను త్యాగం చేసుకోవడమే పాతివ్రత్య నిర్వచనం కుష్ఠువాడైన భర్తను వేశ్యవద్దకు మోసుకెళ్ళిన సుమతే ఆమెకు ఆదర్శం. పితృీయ పాలనలోని పిల్లలు ఫలానా రామయ్య కొడుకు నంటారేగాని సీతమ్మ బిడ్డనని చెప్పలేరు. వ్యభిచారం జరిగితే "అది చెడింది. దాని బ్రతుకు బండలుగాను, సర్వనాశనమైంది" అంటుంది సంఘం. "అది పతితరా, కులటరా, వాడికేం మగధీరుడు"

అంటారు స్త్రీలు సైతం. స్త్రీ శీలం ప్రాణంకంటే గొప్పదట. మరి పురుడి శీలాని కసలు విలువేలేదా? బాగుందీ వరుస. ఒకతి కొకనీతి, మరొక రికి ఇంకొక నీతి–ఇదేనా సమానత్వ చిహ్నం. పావలా సినిమాకు, పైసా ధర్మానికి, పది పైసల పూలకు పురుషులపై ఆధారపడుతున్నారు మన మహిళలు. అలా ఆజన్మాంతం పరాధీన బ్రతుకుతూ ఉత్తమ ఇల్లాలని మహా పతివ్రత అనిపించుకోవాలని ఆకాంక్షిస్తుంది. నీపై నాకు సర్వాధి కారాలున్నాయి. నేను నిన్ను భరించేవాణ్ణి" అని మొగుడనే ధీమాతో ఆజ్ఞాపిస్తే గతిలేక శరీరాలప్పగించే స్త్రీలు కోకొల్లలు. వ్యతిరేకించిన స్త్రీ వ్యక్తిత్వాన్ని చంపుకొని దిక్కుమాలిన జీవిగా బ్రతకాలి లేదా చావాలి కాని ఆఖరికి పుట్టింట్లో కూడా ఆమెకు చోటు దొరకదు. జీవిత ముఖ్య భాగమయిన యవ్వన దశంతా కుటుంబ చికాకులు, పెద్దల ఒత్తిళ్ళతో గడిచిపోతుంది. స్వేచ్ఛా సమానత్వాలన్నా, హక్కులన్నా ఆమెకు అర్థంకాకుండా వాటిని ఆశించకుండా ఒక పూజా మందిరాన్ని కట్టించి దానికి ఆమెను అధిపతిని చేస్తారు, "నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి" అని స్త్రీకి యావజ్జీవ పరాధీనత కల్పించాడు మనువు. ఆమెకు అనేక ఆంక్షలు కఠిన నియమాలు నిర్దేశించాడు. అవే సాంఘిక నియమాలై క్రమేపి మను ధర్మశాస్త్రమని ప్రామాణీకత కల్గించారు అలా శతాబ్దాల తరబడి ఆమెకు "బ్రెయిన్ వాష్" చేయబడి ఇష్టపూర్వకంగా బందీ అయింది. మనువు బిగించిన మలిన శృంఖలాలను ఖండించి స్త్రీలే విముక్తి పొందాలి. సంఘ నియమాలు అనేకబంధ హస్తాలనుంచి వారికి వారే బయటపడాలి. స్త్రీ జాతి తన పునర్వికాసాన్ని అవసరంవస్తే విప్లవాలద్వారానైనా పొంద గలగాలి. పురుషాధిక్యత తగ్గకుండా, ఈనాడున్న కుటుంబ వ్యవస్థ పునాది కదలకుండా స్త్రీకి ప్రగతిలాదు. సాంఘిక, ఆర్థిక, రాజకీయ రంగాలలో స్వేచ్ఛా సమానత్వంరానిదే ఆమెకు వ్యక్తివికాసం లేదు. దీనికి ముందుగా స్త్రీలలో మానసిక దాస్యవిముక్తి కలగాలి కనుక స్త్రీలే మారాలి.

సమానుల మధ్యే నిజమైన ప్రేమకు అవకాశము ఉంది. యజమాని బానిసల మధ్య అది అసంభవం. నిజమైన ఆప్యాయత కోరే పురుషుడు స్త్రీకి సమానత్వ మివ్వాలి. స్త్రీకి సంపూర్ణ స్వేచ్ఛనిస్తే తన కర్తవ్యాలను

విస్మరిస్తుందని తమపై దండెత్తుతుందని భయపడుతున్నారు. పురుషుని లాలించేది, ప్రేమించేది, అతని వ్యక్తిత్వాన్ని వికసింపజేసేది భార్య. మాతృత్వంలోని మాధుర్యాని ప్రసాదించి బిడ్డల మనుగడకు తోడ్పడేది మాతృదేవత. పరిపూర్ణత్వం కల స్త్రీ స్వయంశిక్షణ ద్వారా తన జీవితాన్ని దిద్దుకొని, తన్ను తాను శాసించుకొని ఇతరులనూ అలాగే గౌరవించగలదని విశ్వసింపక తప్పదు. ఆధునికత అత్యంత వేగంతో పయనిస్తున్న ఈ 20 వ శతాబ్దంలో స్త్రీ పరిస్థితి మారితేనే సమాజానికి దేశానికి ప్రగతి వుంటుంది.

(ఆంధ్రజ్యోతి దినపత్రిక 10–2–1976)

---

# మహిళా దశాబ్దపు సభలపై సమీక్ష

---

మహిళా దశాబ్ది ముగింపు సభలు కీన్యా రాజధాని నైరోబీలో జులై 10 నుండి 19 వరకు ఐక్యరాజ్య సమితివారి ఆధ్వర్యంలో జరిగాయి. ఈ సభలలో 13 వేలమంది ప్రతినిధులు పాల్గొన్నారు. 160 దేశాల ప్రతినిధులు తమ, తమ సమస్యలను చర్చించడం ఈ సభల ప్రత్యేకత. రెండు వేల సం॥ నాటికి స్త్రీల విముక్తికి, అభ్యుదయానికి సంబంధించిన "భవిష్యత్ వ్యూహాలు" అనే మార్గదర్శక సూత్రాలను రూపొందించడం ఈ అంతర్జాతీయ సదస్సుయొక్క ముందడుగు. ఆయా దేశాల ప్రతినిధులు, తమ రాజకీయ, ఆర్థిక, సాంఘిక దృక్పధాలకు ప్రాతినిధ్యం వహించారు. మున్నెన్నడూ చర్చకురాని ఒక నూతనాంశాన్ని–గృహిణుల ఇంటి పనికి, వంటపనికి ఆర్థిక విలువ అంటే వేతనాన్ని నిర్ణయించాలని ఈ సభవారు డిమాండ్ చేశారు. ఇంతవరకు గృహిణి శ్రమ శక్తికి విలువ కట్టడం స్త్రీకి అవమానంగా భావించేవారు. మొత్తం శ్రమలో

డిమూంట రెండు వంతుల శ్రమ స్త్రీలే చేస్తున్నట్లు, ప్రపంచ ఆదాయంలో 1/10 వంతు మాత్రం స్త్రీలు అనుభవిస్తున్నట్లు ఒక ముఖ్య సర్వేలో తేలింది. స్త్రీలు ఇంట్లో కూర్చుని తినే పనికి విలువేముంది అని లెక్కించే స్త్రీ శ్రమకు ఈ మహాసభ విలువ కట్టింది. ఇలాంటి విషమ సమస్య ఒకటి వుందని ప్రపంచ పౌరుల ముందుకు తెచ్చి స్త్రీ గౌరవాన్ని నిల బెట్టింది. ఆమె 'పేరాసైట్' కాదని స్థిరీకరించింది ఈ మహాసభ.

సమానత్వ, అభివృద్ధి, శాంతి ప్రపంచ మానవాళి (స్త్రీలకు)కి చెందాలనే ధ్యేయంతో U.N.O వారు (1976-85) మహిళా దశాబ్దాన్ని ప్రకటించారు. అందులో ముఖ్యమైనవి మూడు. ఆ లక్ష్యాలలో విద్య, ఉద్యోగం, ఆరోగ్యంకూడా వున్నాయి. న్యాయపరమైన (LEGAL) రాజకీయ, సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక, వ్యవసాయిక, పారి శ్రామిక, సైన్సు, టెక్నాలజి, జనాభా, గృహవసతిలాంటి సౌకర్యా లను స్త్రీలకుకూడా చెందే విధానాలమీద స్త్రీలుఅభివృద్ధి చెందా లని U.N.O. వారి లక్ష్యం. ఈ దశాబ్దంలో స్త్రీల వివిధ సమ స్యలను చర్చించి, నివారించి తద్వారా ప్రపంచశాంతిని స్థాపించాలని వారి ఆకాంక్ష. అందువల్ల ఈ పది సం॥రాలలో సాధించేది ఏమిటి? అసలు సమస్య లేమిటి? ఏం సాధించలేకపోయాం? వాటికి గల అడ్డంకు లేమిటి? ఏంచెయ్యాలి? అనే ప్రశ్నలకు ఒక సమీక్షలాంటిదే ఈ నైరోబి సదస్సు.

మహాసభ చర్చల్లో ముఖ్యమైనవి కొన్ని వున్నాయి. అందులో స్త్రీల గురించిన భావన మొదటిది. ఇది చర్చల్లో కీలకపాత్ర వహించింది. కొలంబియానుండి వచ్చిన "సిసిలియా లోపేజ్ డిమూంటినో" ఇలా అన్నది. "వస్తూత్పత్తిలో స్త్రీ స్థానంకన్నా సంతానోత్పత్తి రంగంలో ఆమె పాత్రకు ఇతోధిక ప్రాముఖ్యత ఇవ్వడం జరుగుతోంది. అంటే గత రెండువేల ఏళ్ళనుండి మాతృత్వ సమస్యకే ప్రాముఖ్యత వచ్చింది. కాని మరో ముఖ్య విషయం సమాజ దృష్టికి రావాల్సి వుంది. అది స్త్రీలుకూడా మేధాసంపన్నులు. అందువల్ల మాతృత్వ విషయంలోనేకాక ఇతరత్రా కూడా వారు సృష్టికర్తలు. స్త్రీలు సంతానాన్ని వుత్పత్తి చేస్తున్నారు.

పిల్లల్ని స్త్రీలు కంటున్నారని, స్త్రీలే కనగలరని స్త్రీలకు తెలుసు. కానీ స్త్రీలు తమ శారీరక ధర్మాన్ని నిర్వర్తిస్తున్నంత మాత్రాన స్త్రీలే ప్రతిపనీ చెయ్యాలని, పిల్లల పెంపకం, ఇంటి పని, బజారు పని, వంటపని లాంటి బండచాకిరి చెయ్యాలని సమాజం భావిస్తున్నది. దీనిని స్త్రీలు ఇకముందు ఎంతమాత్రం అంగీకరించరు". ఈ సమస్య పదేపదే మహాసభలో చర్చకు వచ్చింది. ఎందుకంటే అభివృద్ధి చెందుతున్న దేశాలలో జనాభా సమస్య; అభివృద్ధి సమస్య రెండూ పెనవేసుకొని వున్నాయి. దేశ భవిష్యత్తును గూర్చి ఈ సమస్యకు ప్రాముఖ్యత రావలసిందే కాని పాత సంప్రదాయ పద్ధతులతో మాత్రంకాదు. స్త్రీ తన ఆరోగ్యంకోసం, తన పిల్లల ఆరోగ్యం కోసం, తన దేశాభివృద్ధికోసం కుటుంబాన్ని ఎలా పరిమితం చేసుకోవాలి, అనే దృష్ట్యా ఈ సమస్యను పరిశీలించాలని బలంగా వాదించారు.

మరల ఇలాంటి ఒక అంతర్జాతీయ మహాసభను ఏర్పరచాలా లేదా అనేది చర్చకొచ్చింది. ప్రభుత్వాలు మేము ఇది చేయ పూనుకున్నాం, అది చేయ పూనుకున్నాం అని చెప్తూవుంటాయి. ఇంకో రెండు సం॥కు సమీక్ష జరుగుతుందనగా ఉలిక్కిపడి పనిచేయడం ప్రారంభిస్తాయి. అంటే చాలా ఉదాసీనత వున్నదన్న మాట. కనుక స్త్రీలే ఈ విషయంపై శ్రద్ధ వహించాలి అన్నది సిసిలియా అంటే ఒక తీర్మానం స్త్రీల సభ ఆమోదించిందనుకోండి, దాన్ని అమల్లోకి వచ్చేటట్లు చూడాల్సిన బాధ్యత స్త్రీలదే కావాలి. ముమ్ముందు జరగాల్సిన కృషి తాలూకు వ్యూహాలను రూపొందించడం జరిగింది. ఏమి జరిగింది ? ఎలా జరిగింది ? ఎంతవరకు ఉపయోగించింది ? అనేది మదింపు జరగాలి. ఇదంతా స్త్రీ హోదాను గురించిన "యు. ఎన్. కమీషన్ ఆన్ ది స్టేటస్ ఆవ్ వుమెన్" ద్వారా జరగాలి. ఆ కమీషన్‌ను బాగా పటిష్టం చెయ్యాలి. ఇది చాలా ముఖ్యమైన విషయం. కాబట్టి నైరోబిలాంటి మహాసభ మళ్ళీ జరగాలా లేదా అనే విషయంపై చర్చ సాగవచ్చు, కాని రాబోయే 15 ఏళ్ళలో ఏమి జరుగుతున్నది అనేదానిపై, మదింపు పైన పేర్కొన్న కమిషన్‌ద్వారా ఒక సర్వే లాంటిది జరుగుతూ వుండాలి. కమిషన్‌వారి సమీక్ష, మదింపు జరిగినంత మాత్రాన పని జరుగుతుందా అని కొందరు ప్రశ్నించవచ్చు.

స్త్రీలు వ్యవసాయ రంగంలో ఉత్పత్తిదార్లుగా వున్నారు. అభివృద్ధి

చెందుతున్న దేశాలలో ఆహారాన్ని పండించేది వారే. కాని దేశంయొక్క గరిష్ట జాతియ ఉత్పత్తిని లెక్కకట్టడంలో స్త్రీలు సాధించిన వస్తూత్పత్తి పరిగణింపబడడం లేదు. ఇది దేశ ఆర్థిక స్థితిగతులను అస్తవ్యస్తం చేయడమే కాక స్త్రీలకు ప్రభుత్వ సహాయ నిధులు అందకుండా చేస్తున్నది. అంటే స్త్రీలు దేశ ఆర్థిక అభ్యుదయానికి ఎంతగా దోహదం చేస్తున్నారో మహాసభ గుర్తించింది.

కార్మిక స్త్రీలు దేశ అభ్యున్నతికి చేస్తున్నదానికన్నా స్త్రీలు మొత్తం మీద చేయగలుగుతున్న కృషి చాలా హెచ్చుగా వున్నది. వారు చేసే అనేక పనులను ఆర్థిక విలువవున్న పనులుగా గుర్తించడం లేదు. వాటికి ఏమాత్రం వేతనాలు ముట్టడంలేదు. ఇంటిపని పిల్లలపెంపకం చేస్తూనే వ్యవసాయరంగంలో ఉత్పత్తిదారులుగా వుంటున్నారు. ఆహారాన్ని పండించేదికూడా వారే. చిన్న చిన్న వ్యాపారాల్లో కొద్దిపాటి దుకాణాల్లో వీధుల వెంబడి తిరిగి వస్తున్నారు. విక్రయించే వారిలో స్త్రీలు పెక్కు మంది వున్నారు. ఈ రంగాల్లోని స్త్రీల కృషిని గరిష్ట జాతీయ వుత్పత్తి వేసేటప్పుడు పరిగణించడం లేదు. సంప్రదాయసిద్ధంగా స్త్రీలు వహిస్తున్నటువంటి పాత్రను, స్థానాన్ని మార్చాలి. అంటే ఆహార వస్తూత్పత్తి విషయంలో పూర్తిగా సంప్రదాయాన్ని విడనాడమని కాదు. కాని సంప్రదాయ సిద్ధంగా చేసేపనిని మెరుగుగా, బాగా చేయగలగడం ఎలా అనే విషయం చర్చించింది మహాసభ. అంతేకాక "మేము సమాజానికి సహాయకారిగా వుంటున్నాం. మా కృషిని సమాజం గుర్తిస్తోంది. అనే భావనతో ఒక నూతన శక్తిని వుత్సాహాన్ని తెచ్చుకొని మహిళలు ఎలా ముందుకు సాగిపోవాలో సభవారు చర్చించారు.

గత మహిళా దశాబ్దంలో గర్భిణీ స్త్రీలకు, శిశువులకు ప్రాథమిక స్థాయిలో ఆరోగ్య విషయమై శ్రద్ధవహించడంపై నొక్కిచూపడం జరిగింది. ప్రపంచంలో నల్గురి శిశువుల్లో ప్రతిఒక్కరూ పోషకాహార లోపం వల్ల బాధపడడం జరుగుతోంది. ఇలా వ్యాధినిరోధక, ఆరోగ్య పథకాలలో స్త్రీలు కీలకపాత్ర వహించారు. అభివృద్ధి చెందిన దేశాల్లోకూడా పిల్లలందరికి పోషకాహారం, గృహవసతి దొరకటంలేదని, గర్భిణీ స్త్రీలకు మంచి ఆహారం

లేని కారణాన పిల్లల ఆరోగ్యం దెబ్బతింటుంది. వారి మెదడు అభివృద్ధి చెందదు. ప్రజల్లో అసంతృప్తివుంటే అది రాజకీయాన్నికూడా ప్రభావితం చేస్తుంది. అనేక సమస్యలపై ప్రభుత్వాల దృష్టి ప్రసరించడం లేదు. ఈ సందర్భంగా ఇతరులకు సలహా చెప్పేముందు అభివృద్ధి చెందిన దేశాలు తమ పరిస్థితిని బాగుచేసుకోవాలని హెచ్చరించింది. ఆరోగ్యంపై జరిగిన ప్రత్యేక అధ్యయన (వర్క్ షాపు) శిబిరాల్లో హెచ్చుమంది స్త్రీలు హాజరైనారు. స్త్రీలు ఆరోగ్య విషయమై శ్రద్ధ వహించాలని ఆ ప్రణాళికలను వారు నడపాలని వాటి వనరులు వారు సమకూర్చాలనే అభిప్రాయాలు చర్చకొచ్చాయి. స్త్రీలు తమ పిల్లలకు తామే నర్సులుగా, వైద్యులుగా వ్యవహరించాల్సి వుంటుందని, ఈ రకమైన పనిచేయడానికి తగిన విజ్ఞానాన్ని, శిక్షణను తల్లికి కలుగజేయటం చాలా అవసరమని పలువురు అభిభాషించారు.

ఈ మహాసభ సెక్రటరీ జనరల్ లెటిసియా షాహానీ ఇలా అన్నారు.

"2000 వ సంవత్సరానికి చేరుకోవలసిన గమ్యం సందర్భంగా "భవిష్యత్ వ్యూహాలు" రూపొందించబడడం నిజంగా మనం సాధించిన అభ్యుదయం. కాని మహిళాదశాబ్దం ప్రారంభమయిన నాటికన్న ఆర్థిక పరిస్థితులు చాల హీనంగా ఉన్నాయి. శాసన ప్రకారం సమానత్వం విషయంలో కొంత పురోగతిని సాధించినా నూతన సమస్యలు భవిష్యత్ వ్యూహంలో చేర్చాము. ఇంటిలో పనికి వేతనం అనేదే ఆ సమస్య. ఇది సమానత్వానికి సంబంధించిన సమస్య. దీనిని మెక్సికో కార్యాచరణ ప్రణాళికలోకాని కోపెన్ హాజెన్ కార్యక్రమంలో కాని చర్చించలేదు. మహిళాభ్యుదయానికి ఏ ఆటలయితే ఉన్నాయో వాటిని గుర్తించటం, నిర్దేశించటం జరిగింది. వ్యవసాయ రంగంలో స్త్రీల పాత్రను గుర్తించినదానికి గుర్తుగా భవిష్యత్ వ్యూహాలలో ఆహారం, మంచినీరు, వ్యవసాయం వీటిపై ప్రత్యేక విభాగాలను ఏర్పరిచాం. పరిశ్రమలపైన నొక్కి పెట్టాం. వ్యాపారం, వ్యాపార ఉద్యోగాలు తగు ప్రాధాన్యతను పొందాయి. ప్రసార సాధనాలు, శక్తి, పరిసరాలు వీటిని క్రొత్తగా చేర్చాం. అంతర్జాతీయ, ప్రాంతీయ స్థాయిాలలోను కుటుంబ స్థాయిలోనూ శాంతిని గురించి

భవిష్యత్ వ్యూహాలలో తగు స్థానం కేటాయించబడింది. కుటుంబంలో స్త్రీలపై హింస, స్త్రీలపై లైంగిక దౌర్జన్యం వీటి విషయంలో చొరవ చూపాలనే నిర్ణయానికి వచ్చాం.

చావు బ్రతుకుల మధ్య ఊగిసలాడుతూ జీవిస్తున్న స్త్రీలను, ఆర్థికంగాను, దోపిడీకి అధిక సంఖ్యలో గురి అవుతున్న మహిళలను "భవిష్యత్ ఊహాలు" అనే పత్రం విస్మరించలేదు. ప్రత్యేక శ్రద్ధ చూపవలసిన సమస్యలుగా వారి సమస్యలను పేర్కొనటం జరిగింది". అంటూ తన ఉపన్యాసాన్ని ముగించింది షాహాని, మహాసభ జనరల్ సెక్రెటరీ.

చాలామంది మహాసభయొక్క అవసరాన్ని, విలువను నొక్కి చెప్పారు. ఇలాంటి సమీక్షలు, సదస్సులు తరుచూ జరుపుతూ వుండాలని ప్రజలను, ప్రభుత్వాలను, U N.O. వారిని అభ్యర్థించారు. మహాసభలు చాలా ఖర్చుతో కూడిన పని అందువల్ల అంత త్వరగా జరపటం అనవసరమని కొందరు వ్యతిరేకించారు. ముఖ్య విషయ మేమంటే కొన్ని ప్రభుత్వాలు ఇలాంటి మహాసభలకు ప్రతినిధులను పంపటానికి సంకోచిస్తున్నారు. కారణం ధనలోపం కాదు. తదితరులు "మీ దేశం ఫలానా తీర్మానాన్ని అమలుపర్చలేదు. ఫలానా ప్రణాళికను పూర్తి చేయలేదు. ఫలానా పనిని ప్రారంభించలేదు" అని వేలుపెట్టి చూపిస్తుంటే సిగ్గుపడాల్సి వస్తుందని మరో మహాసభ వద్దంటారు అలాంటి ప్రభుత్వాలు. ఇలా వైవిధ్యంతో కూడిన చర్చలు ఫలవంతంగా జరిపింది మహాసభ.

నైరోబి మహాసభలో 1986 నుండి 2 వేలవరకు జరగాల్సిన కృషిని గురించి వ్యూహాలను తయారుచేశారు స్త్రీలు ఏంచేస్తున్నారో, వారు ఏం కోరుకుంటున్నారో ఏ విషయమై శ్రద్ధచూపుతున్నారో అనేవాటిపై మనకు పరిజ్ఞానం వుంది. మనకున్న సమాచారం లెక్కలు, గణాంకాలు వీటి అన్నింటిని ప్రభుత్వాలు, ప్రణాళిక వేసేవారు, మహిళా సంఘాలు, మహిళోద్యమ నాయకులు అందరూ ఉపయోగించుకొని కృషిని ప్రారంభించాలి. అదే దశాబ్దం మనకిచ్చిన పిలుపు; సందేశం.

(సౌజన్య మాసపత్రికలో నవంబరు 1985 లో ప్రకటితము)

# మహిళా వికాసం : పురుష వైఖరి

సమాజంలో సగం సంఖ్యలోవున్న స్త్రీల శక్తియుక్తులు వికసించటము లేదనేది నగ్నసత్యం. ఈ స్థితిని తొలగించాలంటే ప్రధానంగా, ముమ్మొందుగా స్త్రీలే మార్పుకోసం కృషి చెయ్యాలి. అయితే సమాజంలో ఏ ఒక్క వ్యక్తీ, తెగ వర్గం, జాతి, సముదాయం తమంత తాముగా ఏ పనీ చెయ్యలేరు. సమాజమంటేనే మానవ సంబంధాల సముదాయం. కనుక స్త్రీలు చేపట్టే కార్యక్రమాలకు పురుషులనుండి వ్యతిరేకత, లేక సహకారము సాధారణంగా వస్తుంది. పురుషుల సహకారం ఎలా వుండాలి, ఎలా వస్తుంది అనేదే ఈ వ్యాసంలోని చర్చనీయాంశాలు.

పురుషుల సహకారం రెండు రకాలని పేర్కొనవచ్చు. వ్యతిరేకత ప్రదర్శించకుండ ఉండుట ఒకటి. ప్రోద్బలం చేసి, ప్రోత్సాహపరచి సహకరించుట మరొకటి. మానవ సమాజావిర్భావం నుండి నేటివరకు ఏవో కొన్ని దశలలో తప్ప మొత్తంమీద మహిళా వికాసానికి పురుషులు తెలిసో, తెలియకో అడ్డుపడుతూనే వున్నారు. ముమ్మొందుగా ఈ స్థితి తొలగాలని చెప్పడం విడ్డూరం కాదు.

స్త్రీ పురుషులమధ్య శారీరక నిర్మాణ భేదాలవల్ల శక్తియుక్తులలో, ప్రతిభావ్యుత్పత్తులలో తేడాలు వచ్చాయని, అందుచేత సమాజంలో ఇరు వర్గాల పాత్ర విభిన్నంగా వుంటుందని విశ్వసించేదాన్ని "సెక్సిజం" లేక "లైంగిక వివక్షావాదం" అని పిలుస్తాం. ఇది మూడు రకాలుగా దర్శనమిస్తుంది. ఆలోచనలలో భావాలలో ఊహాపోహలలో కనిపించేది మొదటిరకమైతే ప్రవర్తనలో సాక్షాత్కరించేది రెండవది. కేవలం ఇతరులను అనుకరించడంవల్ల అలవాటుగా మారి మామూలు దైనందిన చర్యల్లో కొట్టవచ్చినట్లు కనపడేది మూడోరకం వ్యక్తి. ఆలోచనా జీవి కనుక సాధారణంగా భావాలు ఆ వ్యక్తి సొమ్ముగానే కని

పిస్తాయి. కాని నిజానికి సంస్కృతి అందించిన వారసత్వంవల్ల మన ఊహాపోహాలు కూడా రూపొందుతాయి. అంటే ఆలోచనలు, భావాలు పూర్తిగా వ్యక్తి సొంతంగావచ్చు. లేక పూర్వీకులనుండి అరువు తెచ్చుకున్న సరుకు కావచ్చు. ఏదైనా వాటికి ఆ వ్యక్తియే బాధ్యత వహించాలి. నడత సాధారణంగా భావాలవల్ల ప్రభావితమవుతుంది. ఇంకా వివరించా లంటే, భావాలే ప్రవర్తనకు దారితీస్తాయి. ఆలోచనలేని ప్రవర్తనను కూడా మనం చూస్తున్నాం. అది కేవలం అలవాటుగా వచ్చేది. పెద్దల అనుకరణవల్ల పిల్లలు నేర్చుకునేది. శ్రేష్టుల ఆచరణనుండి సామాన్యులు గ్రహించేది. పురుషుల ఎదుట స్త్రీ దీటుగా కూర్చుండరాదని నియమం ఇలా పాటింపబడుతున్నదే. సమాజంలో పెద్ద ఎత్తు ప్రచారంద్వారా ఆందోళనద్వారా ఈ లైంగిక వివక్షావాదానికి చావుదెబ్బ కొట్టాలి. ఇక్కడ ఒక్క అంశాన్ని విస్మరించరాదు. స్త్రీ పురుషు లిద్దరూ ఈ వాదాన్ని అంగీకరించి, తమ సొంతంచేసుకొని తమ జీవితాల్లో అనుసరిస్తున్నారనేది సర్వజన విదితం. కనుక ఈ లైంగిక వివక్షా వైఖరిని మొదలంట నరికి వేయడంలో పురుషులు స్త్రీలకు సహకరిస్తే స్త్రీల పోరాటం తేలికవుతుంది. వారు త్వరగా విజయాన్ని పొందగలుగుతారు. దానినే మహిళా వికాసానికి పురుషుల తోడ్పాటు అని పేర్కొంటాం.

సమాజంలో మనం పలురకాలుగా లైంగిక వివక్షావాదాన్ని ప్రద ర్శించే వారిని చూస్తున్నాం. వారిని ఇలా వర్గీకరణ చేయవచ్చు. తమ భావాలకు సాక్ష్యాధారాలున్నాయని వాదిస్తూ, వాటిని ఉటంకించే వ్యక్తి సిద్ధాంత సెక్సిస్టు (Doctrinaire Sexist) తమ భావాలకు రుజువు అక్కరలేదని, అవి వాటంతట అవే సమర్థనీయాలని ప్రకటించే వ్యక్తి "ఆదిమ సెక్సిస్టు" (Premitive Sexist), మూడవతెగ సెక్సిష్టులలో భావాలు కలగాపులగంగా వుంటాయి. మత భావాలకు సిద్ధాంత ప్రాతిపదిక ఉన్నట్లు వారికి తెలియదు వారు అలా వాదించరు. వారికి కార్యాచరణ "సెక్సిష్టులని" (Operational Sexists) అని పిలుస్తాం. ఇక నాలుగవ తెగ విచిత్రమైనది. వీరిని "అవకాశవాద సెక్సిష్టులు" అని అభివర్ణించడం పొరపాటు కాదు. వీరికి లైంగిక వివక్షపై విశ్వాసం వుండదు. ఆలోచనా పాటవం లేదు. సిద్ధాంత బలిమిని వారు ఆశించరు. కాగా లైంగిక

వివక్షను పాటిస్తే తమకు కొన్ని సదుపాయాలు, లాభాలు వస్తాయి కనుక, దానిని చేపడతారు. ఇది కేవలం అవకాశవాదం; స్వప్రయోజన పరతత్వం. దీనివలన స్త్రీలచేత సేవ చేయించుకోగలుగుతారు. తాము విశ్రాంతి, సుఖం తీరిక, గౌరవం పొందగలుగుతున్నారు.

ఇలా నాలుగురకాల వివక్షావాదులు సమాజంలో మనగలుగుతున్నారు. సమాజపు రాజకీయ ఆర్థిక స్థితిగతులు మారినంత త్వరగా భావాలు మారవు. సాంస్కృతిక మార్పు ఆలస్యంగా వస్తుంది. అయితే సాంస్కృతికంగా పురోగమించినవారు సమాజపు అభ్యుదయ మార్గాన్ని ముమ్మందుగా చేపట్టారు. తతిమ్మా ప్రజానీకం వారిని తరువాత అనుకరిస్తారు. ఇది అనుభవ సత్యం.

సాధారణంగా స్త్రీ విమోచనోద్యమకారులు "పురుష దురభిమానాన్ని" (Male Chauvinism) నిందిస్తూ వుంటారు. ఇది ఇంగ్లీషు భాషనుండి పుట్టిన భావం. "ఛావనిజం" అంటే విపరీతమైన దేశభక్తి అన్నమాట. తన దేశం మంచిచేసినా చెడుచేసినా దాన్ని ప్రేమించడమన్నమాట. ఈ భావనలో మనిషి దేశంతో తాదాత్మ్యం అవడం జరుగుతోంది. ఈ భావనను పురుషజాతికి అంటగట్టడం సబబా కాదా అనే విషయంలో భేదాభిప్రాయాలు వున్నాయి. కనుక దీనిని కొంతమంది "పురుష దురహంకారం" అని పిలిస్తే మరికొందరు "పురుష ప్రాధాన్యత" అని పేర్కొంటున్నారు. లైంగిక వివక్షావాదంవలె ఈ భావాన్నికూడా చాలామంది స్త్రీలు ఆమోదిస్తున్నారు. తదనుసరణంగా నడుచుకుంటున్నారు.

బండగా చెప్పాలంటే బానిసలు బానిసత్వ సిద్ధాంతాన్ని అంగీకరించిన తీరు ఇలాంటిదే. ఇలా ఈ ఆలోచనా పద్ధతికి లొంగిపోయిన స్త్రీలలో కొంతమంది చైతన్యవంతులైన స్త్రీలు ఈ అక్రమాన్ని, అన్యాయాన్ని గుర్తించి సహించలేక ఎదురు తిరుగుతున్నారు. వారి ఆలోచనలకు ప్రయత్నాలకు దోహదం చేయడం తతిమ్మా స్త్రీల విధి. అది వారు తమ విముక్తికోసం చేపట్టాల్సిన చర్య. కాగా స్త్రీలను కించపరచి, అవ

మాన పరిచి అష్టకష్టాలపాలు చేసే అక్రమ భావనాసరళినుండి విముక్తి, పొందిన కొద్దిమంది పురుషులుకూడా చైతన్యస్ఫూర్తి వున్న స్త్రీల ఉద్యమాలకు చేయూత నివ్వాలి.

పురుష ప్రాధాన్యత కల సిద్ధాంతంలో వున్న లోపాలను ముందుగా పరిశీలిద్దాం. సమాజంలో పురుష వర్గాన్ని సమానం చేసుకొని తామే సమాజమైనట్లు ప్రవర్తిస్తారు ఆ సిద్ధాంతవాదులు. అంటే స్త్రీలు వారి దృష్టిలో సమాజంలో భాగం కాదన్నమాట. కనుక స్త్రీలను వారు మనుషులుగా చూడరు. ఇది క్షంతవ్యంకాని ఆలోచనా పద్ధతి. సమాజవు సంస్కృతి, సాంస్కృతిక, వైజ్ఞానిక విజయాలు అన్నీ పురుషులు సాధించినవేనని వారి విశ్వాసం. స్త్రీల మేధస్సుకు వారి దృష్టిలో విలువలేదు; పరిగణనలేదు. వారే సర్వస్వమయినట్లు అహంభావంతో ప్రవర్తిస్తారు.

ప్రతి వ్యక్తికీ శక్తియుక్తులు ఉంటాయి. ప్రతి వ్యక్తియొక్క ప్రవర్తనలో అవి అభివ్యక్త మవుతాయి. ఈ అంశాన్ని స్త్రీలకు వర్తింపచేయరు పురుష దురంహంకారులు. అంతటితో ఆగదు వారి ఆగడం. వారు ఆత్మవంచనకు లోనవుతారు. అసలు స్త్రీలకు శక్తి యుక్తులు లేవని, అది ప్రస్ఫుటం అవుతున్నా, ప్రకటిస్తారు. ఇది ఒక రకం. ఒకవేళ శక్తియుక్తులను వెలార్చి స్త్రీలు తటస్థించినా వారి ప్రతిభ చాల తక్కువ స్థాయిదని మనస్సుకు సమాధానం చెప్పుకొని ఆత్మ వంచన చేసుకుంటారు. ఇది రెండవ రకం. స్త్రీల ప్రతిభావ్యుత్పత్తులు బహిర్గతం కావటానికి ఆటంకాలు ఆమె శారీరక ధర్మ నిర్వహణలు బహిష్టు, ప్రసవం అనేకం వున్నాయి కనుక స్త్రీలు శక్తివంతంగా నడుచు కోలేరని వాదించేవారు మూడవ తెగకు చెందినవారు. వీరందరిని మించి పోయిన రకం మరొకటుంది. వారు వాస్తవాలనే తారుమారు చేస్తారు. ఇంతకన్న ఘోరం మరొకటి లేదు. ఆత్మవంచన తారస్థాయికి చేరి ఇలా రూపం తాలుస్తున్నది. వాస్తవాన్ని అంగీకరించటం ఇష్టంలేక, మానవునిలోని సత్యాన్వేషణా శక్తిని, హేతువాద పటిమను కాదనలేక వాస్తవాన్నే కాదంటే సరిపోతుందని చేసే ప్రయత్నం ఇది.

ఏ వ్యక్తియొక్క తెలివితేటలు, మేధస్సు వికసించాలన్నా తగిన పరిస్థితులు ఉండాలి. ఈ విషయాన్ని సంపూర్ణంగా గ్రహించిన పురుష దురంహంకారి లేక పురుష ప్రాధాన్యతావాది ఒక ఎత్తు వేస్తాడు. పరిస్థితులు అనుకూలంగానే వున్నాయి కాని స్త్రీలో స్వయంగా అంతర్గత శక్తులు లేనందున ఆమె శక్తివంతంగా ప్రవర్తించటం లేదని సమాధానం చెప్పుకుంటారు వారు. మరో రకమైన జిత్తులకు వారు ఒడిగడతారు. స్త్రీల శక్తియుక్తులు వికసించటానికి ముమ్మందుగా స్త్రీలకు ఆత్మవిశ్వాసం ఉండాలి. తాము తెలివితక్కువ దద్దమ్మలమని వారు భావిస్తే వారు రాణించలేరు. అలాగే ఎవరితోనైతే వారు సమాజంలో సంచరిస్తున్నారో అంటే ఏ పురుషులతో అయితే వారు సహజీవనం చేస్తున్నారో వారు, ఆ పురుషులు, తమను అప్రయోజకులుగా విశ్వసించి అలాగని బహిరంగంగా చెప్తున్నపుడు స్త్రీలు ఉత్సాహంగా పురోగమించలేరు. ఈ అంశం పురుషులకు విదితమే. కనుక మేము సహకరిస్తూనే ఉన్నాం, మీకే ప్రతిభలేదు, చొరవలేదు, పట్టుదలలేదు. మీరేమీ సాధించలేకపోతున్నారంటే మీ స్వభావంలోనే ఆ అశక్తత ఉందని" ఆక్షేపిస్తూ వుంటారు. నిజానికి పురుషులు సహకరించకుండానే సహకరిస్తున్నామని అబద్ధాలాడుతున్నారు. పురుషులు ఇలా పరిస్థితులను తారుమారుచేస్తారు. సహకారమిచ్చినట్లే నటిస్తారు; సహకరించరు. ఈ మోసంయొక్క ఫలితాలు చాల విశాలంగాను అర్థయుక్తంగాను ఉంటున్నాయి.

ఇన్ని మోసాలకు, కుతంత్రాలకు పురుష ప్రాధాన్యతను ప్రతిపాదించే పురుష పుంగవులు ఒడిగట్టినా ఒకరో ఇద్దరో స్త్రీలు, పురుషులు కాదనటానికి వీలులేనంతగా ఎదుగుతారు. వారి వ్యక్తిత్వ ఔన్నత్యాన్ని కాదనలేరు ఆ పురుషులు. అపుడు వారు మరో పన్నాగం పన్నుతారు. "అలాంటి స్త్రీలలో స్త్రీత్వంలేదు, వారు పురుష స్వభావులు అని ప్రకటించి పురుషాధిపత్యాన్ని మరోరకంగా సమర్థించుకుంటారు. ఇలా తమ భావనల విషయంలో ఆత్మవంచన చేసుకుంటూ స్త్రీలను వంచిస్తూ అలాంటి పురుషులు కాలం గడుపుతుంటే వారితో వ్యవహరిస్తూ వ్యక్తులుగా మనగల్గటానికి చేసే ప్రయత్నంలో నిరాశా నిస్పృహలు ఎదురయిన స్త్రీ విమోచనవాదులు

ఉగ్రులవుతారు; అగ్రహోదగ్రులవుతారు. అలా వారు కావటానికి పురుష ప్రాధాన్యతావాదుల అక్రమ వాదనలూ, మోసాలూ, ప్రవర్తనలే కారణ భూతాలు.

తమను "వ్యక్తులుగా" పరిగణించటం లేదని స్త్రీ విమోచనకారులు వాదిస్తుంటారు. ఇక్కడ "వ్యక్తి" అనే పదానికి జంతుజాలానికి భిన్నమైన మానవ వ్యక్తియని అర్థం చెప్పుకోవాలి. అంతేకాని స్త్రీలను దయతో చూడటం లేదని వారిపై రాదని భావించరాదు. మనిషిగా ప్రతి వ్యక్తికి ఉండే గౌరవమూ తమకూ కావాలంటారు స్త్రీలు. కొంతమంది భావనలో మనిషి అంటే సమాజంలో సంస్థాపరంగా వ్యవహరించగలిగిన వ్యక్తి అని అర్థం. అలాంటి పాత్రను నిర్వహించటానికి తమకూ అవకాశం లేదని స్త్రీల భావన. ఉదాహరణకు వోటులేని రోజుల్లో, రాజకీయ సంస్థలలో వారు జోక్యం కలిగించుకోడానికి, భాగస్వామ్యం కలిగి ఉండటానికి అవకాశం లేదుకదా! ఈ పద్ధతిలో ఆలోచనా లోపం ఉన్నది. ఒకరు చేస్తే ఒక వ్యక్తి మనిషి కావడం జరుగదు. వస్తుతః ఆ మనిషి వ్యక్తియే. ఇది విస్మరిస్తే "నన్ను మనిషిని చెయ్యి" అని స్త్రీ పురుషుని ప్రాధేయపడ్డట్లవుతుంది. ఈ పని పురుషుని అహంభావాన్ని పెంచుతుంది. అతని ప్రాధాన్యతను గుర్తిస్తుంది. ఈ మార్గాన్ని అనుసరిస్తే స్త్రీ విమోచనకారులు పప్పులో కాలువేసిన వారవుతారు.

"మనుషులుగా చూడండి" అనేదానిని మరో వైఖరితో గమనించవచ్చు. అది భావనకు సంబంధించిన విషయం. భాష సమాజంలో నుండి పుట్టింది. భావించే వారి పదజాలమే భాష. ఆ భావించేవారు ఎవరు? నిజానికి సమాజంలోని స్త్రీ పురుషులందరూ ఆ ప్రక్రియలో భాగస్వాములే. కాగా వచ్చిన చిక్కల్లా ఏమంటే తామే భావించేవారమని, ఊహించేవారమని, భావనిర్మాణ సౌధాన్ని కట్టినవారమని పురుషపుంగవులు విర్రవీగుతారు. అంటే వారే మనుషు లన్నమాట! ఈ అర్థంలో అంటే "భావనా సౌధ నిర్మాతలుగా మా పాత్ర ఉంది. దానిని గుర్తించండి" అనే అర్థంలో స్త్రీ విమోచనవాదులు "మమ్మలను మనుషులుగా గుర్తించండి" అని అంటున్నారన్నమాట.

ఇలా స్త్రీలను భావనా ప్రపంచంనుంచి వెలివేసినందువల్ల స్త్రీల మనోగతాలను, అభీష్టాలను, వాదాలను అర్థంచేసుకొనలేని స్థితికి దిగజారారు పురుష ప్రాధాన్యతను ప్రతిపాదించే పురుషపుంగవులు.

పై చెప్పిన వైఖరివల్ల నైతిక, భావనా సంబంధ ఫలితాలు ఉద్భవిస్తున్నాయి. సమాజం ఆలోచించె తీరు సమాజాన్ని ప్రభావితం చేస్తుంది. సమాజంలో ఆలోచించేవారినుండి స్త్రీలను వెలివేసి మాట్లాడుతున్నారు. పురుషపుంగవులు. దానితో సమాజపు ఆలోచనయే కుంటుపడుతున్నది. అంటే ఆలోచనా శక్తిమీద అదుపు ఏర్పడింది; పోలీసు చర్య అది. దాని వల్ల సమాజపు భావనాశక్తి బందీ అవుతోంది అదీగాక స్త్రీలను కాదనడం నైతికంగా తప్పు. స్త్రీ పురుషు లిద్దరూ సమాజ సభ్యులే. అలాంటప్పుడు ఒక తెగను పూర్తిగా కాదని తిరస్కరించడం అవినీతికర ప్రవర్తన. పరిస్థితులను తమకు అనుకూలంగా మలుచుకోవడంవల్ల పురుష ప్రాధాన్యతావాదులు నెగ్గుకొని వచ్చారు. ఇంతవరకు ఈ దుర్మార్గాన్ని వారు క్రమబద్ధంగా, అలవాటుగా, ఆత్మవంచనతో సాగిస్తున్నారు.

స్త్రీలను భావనా ప్రపంచంనుండి వెలివేయడం వారిని నైతిక సమాజంనుండి నెట్టివేసినట్లే. కనుక నైతిక సూత్రాలను స్త్రీలకు అన్వయింప చేయక పోవడమేకాక స్త్రీలను నైతిక సమాజంతోనుండి వదలివేయడం జరుగుతోంది. దాంతో పురుష ప్రాధాన్యతను బలపరిచే పురుషులు ఎంత నిజాయితీపరులైనా, దైవభక్తులైనా, మృధు స్వభావులైనా- ద్వంద్వ నైతిక ప్రవృత్తి కలవారై వికృతరూపులయి నైతిక మార్గాన్నుండి మరలిన వారవుతున్నారు. నూతన ఆలోచనలు చొరరాని భావనా కారాగారంలో మ్రగ్గుతున్నారు. అలా స్వయంగా బంధించుకొని నిష్కృతి లేకుండా చేసుకున్నారు. ఈ బంధిఖానానుండి విముక్తి లేకుండా వారే జాగ్రత్త పడుతున్నారు. వారి విముక్తికి స్త్రీలు సహాయం చేయటానికి వీలులేకుండా కట్టుదిట్టాలు చేసుకున్నారు. ఇలా పురుష ప్రాధాన్యతవాదులు తమ గొయ్యి తామే త్రవ్వుకున్నారు. వారు పతనమవటమే కాక సమాజాన్నికూడా పతనం చేస్తున్నారు.

స్త్రీలలోకూడా పురుష ప్రాధాన్యతా వాదులు ఉన్నారని, లైంగిక వివక్షావాదులు ఉన్నారని గుర్తుంచుకోవడం అవసరం. ఏదైనా కాలాన్ని బట్టి దృక్పధాలు మారాలి. మారకపోతే అవి మన్నే మట్టుపెడతాయి. ఒకనాడు "అష్టవర్షాత్ భవేత్ కన్యా" అన్నాం. సహగమనాన్ని గౌరవించాం. విధవా వివాహం కాదన్నాం. భార్య లెందరైనా వుండవచ్చన్నాం. కన్యల్ని అమ్ముకున్నాం. ఈనాడు అవి నిషేధాలయినాయి. అలాగే ఈనాడు స్త్రీ జనాభ్యుదయానికి పురుష తోడ్పాటు అనివార్యమయింది. మరి కాదనగలరా ?

(తెలుగు విద్యార్థి పత్రికలో 1985 డిశంబరులో ప్రకటితము)

---

# మనం దేనికి బానిసలం ?

---

అసలు ఈనాడు ఆడది అనుభవిస్తున్న ఇబ్బందు లేమిటండీ? వాళ్ళని పువ్వుల్లో పెట్టి పూజిస్తూ, నగానట్రా ఇచ్చి ఆదరిస్తూ వాళ్ళ బరువు భారాన్ని భరిస్తున్నారు భర్తలు. పిల్లాపాపలతో వంటయింటి పెత్తనం చెలాయిస్తున్న గృహిణిని మీరు నీచంగా బానిసలని, ద్వితీయశ్రేణి పౌరులని, బిడ్డలని కనే యంత్రాలని చిత్రిస్తూ పురుషజాతినే అవమానపరుస్తున్నారని నాతో చాలామంది వాదిస్తూ వుంటారు. అసలు ప్రకృతే స్త్రీని గృహదేవతగా సృష్టించిందని మరో వర్గంవారి భావన. కొన్ని సందర్భాలలో మాత్రమే బానిసత్వమున్నదని మరికొందరి దృక్పథం. అలాకాదు మనం సమాజానికి బానిసలం, సంప్రదాయానికి బానిసలం, పురుషాధిపత్యానికి బానిసలం, అజ్ఞానానికి బానిసలం. అంతేకాదు సాంఘిక, ఆర్థిక, రాజకీయ సాంస్కృతిక రంగాల్లో స్త్రీలకు స్వేచ్ఛా

సమానత్వాలు లేవు. ముఖ్యంగా భర్తలకు, కుటుంబానికి స్త్రీలు బానిసలు అని నా నిశ్చితాభిప్రాయం. స్త్రీకి వ్యక్తిత్వము లేదు. వ్యక్తి స్వేచ్ఛా లేదు. దానికి కావాల్సినన్ని ఉదాహరణ లున్నాయి. మరి వాటిని పరిశీలించి నిర్ణయిద్దామా ?

స్త్రీ కుటుంబానికి బానిస - అని నిరూపించటానికి కొన్ని నగ్నసత్యా లున్నాయి. సహజంగా బానిసను డబ్బు ఇచ్చి కొంటారు. కానీ కట్నం రూపేణా డబ్బు యిచ్చి స్త్రీ తాను బానిసత్వంలోనికి పోతోంది. ఇది మరి బానిసత్వ లక్షణం కాదంటారా ?

ఆమె శరీరంపై ఆమెకు హక్కులేదు. భర్త ఆజ్ఞకు లోబడే పిల్లల్ని కనాలి. కుటుంబ నియంత్రణ ఆపరేషను చేయించుకోవాలంటే నీ భర్త అనుమతి ఉందా? అని అడుగుతారు. మరి ఆమె దేహంపై ఆమెకు హక్కు లేకపోవటం బానిస లక్షణం కాదంటారా?

స్త్రీ భర్తయొక్క భోగ్య వస్తువుగా మాత్రమే పరిగణింపబడుతోంది. కొట్టినా, తిట్టినా, చంపినా ఎదురు చెప్పరాదు. కోర్టు కెక్కిన స్త్రీని సమాజం గర్హిస్తుంది. విడాకులు పొందిన స్త్రీని ఆజన్మాంతం శపిస్తూనే వుంటారు. పిల్లల్ని పెంచే బాధ్యత ఆమెమీద మాత్రమే వుంటోంది. ఉద్యోగినియైన స్త్రీ ఇంటాబయటా చాకిరీ చెయ్యాలి. కాని ఇంటి పను లలో భర్త తోడ్పాటు లభించటం లేదు. సంపాదించే స్త్రీలకైనా ఖర్చు పెట్టే అధికారం లేదు. భర్త దోసిట్లోనైనా పొయ్యాలి. లేదా భర్త ఆజ్ఞకు లోబడైనా ఖర్చుపెట్టాలి. ఇది జరుగుతున్న పచ్చినిజం కాదా!

తను కనిపెంచిన సంతానం తనదికాదు. అతని భార్య, అతని కుమారుడు, అతని కుమార్తె అంటారు. భర్త ఉండగా పిల్లలకు గార్డి యన్‌గా ఉండే అర్హత భార్యకు లేదు. పాప పుట్టుకతోనే సెక్స్ వివక్ష మొదలవుతుంది. ప్లస్సా, మైనస్సా (+ —) అంటూ అబ్బా! ఆడదే పుట్టిందీ! అని ఈసడిస్తూ కొడుకనీ, కూతుర్నీ తేడాతో పెంచుతారు తల్లి తండ్రులు.

"నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి" అని ఆజన్మాంతం స్త్రీ పురుషుని సంరక్ష

కత్వంలో బ్రతకాలి. తీగెతో పోల్చడం, అబలగా నిర్వచించడం ఆ పరంపరలోని లక్షణాలే.

భార్యను దండించే హక్కు భర్తకుంది. కొట్టినా, తిట్టినా, కాల్చినా, చంపినా సమాజం గర్హించదు. పైగా "అది" ఎంత చెడ్డదికాకపోతే అలా చేస్తాడు అంటారు.

ఆడది చదువుకున్నదై వుండాలి. చక్కనిదై వుండాలి. తమకు లోబడి వుండాలి. ఇదీ భర్తల భావం. ఈ భావాన్ని విద్యావంతులైన స్త్రీలు సైతం తరతరాలుగా ఆమోదిస్తున్నారు. ఆచరిస్తున్నారు. ఇలా కుటుంబానికి, పురుషాధిపత్యానికి బానిసలై ఆనందిస్తున్నారు, మన స్త్రీలు, కుటుంబగౌరవం స్త్రీలే నిల్పాలట. ఇల్లాలిగా కుటుంబ బాధ్యతలు స్వీకరించాలి. కాని మరి ఆమెకు హక్కులు మాత్రముండరాదు. అసమానత్వం అధికమైతే దానినే బానిసత్వ చిహ్నంగా నిర్వచిస్తాం. ఇన్ని తెలిశాక మనం మాత్రం కాదనగలమా ?

<u>సమాజానికి బానిస :-</u> ఈ సనాతన సంప్రదాయ సమాజానికి స్త్రీ పెద్ద బానిస. స్వేచ్ఛగా ఉండగలమని, ఉండవలెనని ఎరుగని పూర్వపు బానిసలవలె నేటి స్త్రీలున్నారు. మూఢాచారాలకు, మూఢ విశ్వాసాలకు, సంప్రదాయ భావాలకు తమ జీవితాన్ని అంకితం చేస్తున్నారు స్త్రీలు. ఆధునికత, శాస్త్రీయ దృక్పథం హేతువాదం తాత్త్విక చింతనలు స్త్రీలలో మృగ్యమనవచ్చు. ప్రతిచర్యకు ఆఖరికి తన అభివృద్ధికి సైతం అనుక్షణం సమాజానికి భయపడుతుంది స్త్రీ. తాను పురుషుడికన్నా తక్కువ అనే భావదాస్యం వల్లనే తనకన్నా విద్యాధికుణ్నే వివాహ మాడాలని కోరుకుంటుంది. స్త్రీలపై సమాజ ప్రభావం గురించి ఆలోచిస్తే కన్యకు తన జీవిత భాగస్వామిని ఎన్నుకొని వివాహమాడే హక్కులేదు. ఒక మహిళ గర్భిణైతే స్త్రీనే దూషిస్తుంది సమాజం. విడాకులు పొందిన స్త్రీని పెళ్ళాడకపోగా సంఘం చాలా హీనంగా చూస్తుంది. బాలవితంతువు అయినా వివాహమాడితే ఆమెపై ఏహ్యభావ ముంటుంది. వయస్సు మళ్ళినా, బిడ్డలున్నా, పురుషుడైతే ఎన్నిసార్లయినా వివాహ మాడవచ్చు. ఇవన్నీ

జరుగుతున్న నిత్యసత్యాలు కావా ? స్త్రీకి సామాజిక సమస్యలు కావా ?

లైంగిక విషయాల్లో ద్వంద్వనీతికి బానిస :- ఆమెకు వివాహ పూర్వం కన్యాత్వం చెడరాదు. తర్వాత అన్యపురుష సంపర్కం వుండరాదు. పురుషునికి ఈ పట్టింపులు లేవు. పైగా బహు భార్యాత్వంకూడా అమల్లో వుంది ముస్లిం సమాజంలో.

స్త్రీ కుటుంబమునకు వెలుపలి పురుషులతో స్నేహము, పరిచయం లుండరాదు. ఆమెకు పరదా, మేలిముసుగు లుండాలి. బహిష్టు, ప్రసవకాలాల్లో అపవిత్రురాలిగా, అస్పృశ్యురాలిగా ఆమెను చూడడం సర్వసామాన్యం.

ఆడంబరాలకు బానిస :- స్త్రీకి ఆడంబరాలంటే మోజు ఉన్నమాట వాస్తవమే. ఆడంబరం కావాలనుకోవటం అజ్ఞానానికి నిదర్శనం. అజ్ఞానం అవిద్యవల్ల వస్తుంది. అవిద్య సంప్రదాయబద్ధమైన సమాజ లక్షణం. తమ అజ్ఞానంవల్లే భర్తల్ని పోరుపెట్టి అధిక ధనార్జన గణించమంటారు కొందరు మహిళలు. భార్యల బాధ పడలేక అవినీతిద్వారా ధనం ఆర్జించి సాంఘిక విద్రోహులౌతున్నారు కొందరు పురుషులు. ఆర్థికంగాను, సామాజికంగాను, ఆమెకు స్వేచ్ఛా సమానత్వాలు లేనందువల్ల ఆమె ధనానికీ, ఆడంబరాలకు, బానిస అయినట్లు చెప్పక తప్పదు. అందువల్ల అవిద్య, అజ్ఞానాలు పెరిగేకొద్దీ ఆడంబరాలపై వాంఛ ప్రబలుతుంది. అవిద్యకు ఆడంబరాలకు అవినాభావ సంబంధ ముందనేది గ్రహించాలి.

ఇక అన్ని రంగాల్లోకి అసమానత్వం పరిశీలిద్దాం :- వ్యభిచారం జరిగినప్పుడు "అది చెడింది" అంటూ స్త్రీనే దుయ్యబడుతూ "వాడికేమంతి మగరాయు"డంటూ సమర్థిస్తారు. విద్యా ఉద్యోగాలు స్త్రీలకనవసర మనేభావం ప్రబలంగా ఉంది యింకా. పూజారిగా స్త్రీ ఉండరాదు. అర్చకత్వాని కామె కసలే అధికారం లేదు. యజ్ఞయాగాది క్రతువుల్లో ఆచార్యత్వం వహించరాదు. వివాహాలు స్త్రీలు చేయించే అర్హత లేదు.

భర్త్ృవిహీనకు కఠిన నియమములు, నిషేధాలు (కట్టు, బొట్టు, జుట్టు వగైరా) చాలా వున్నాయి. ఒకే వుద్యోగంలో, ఒకే పనిలోవున్న స్త్రీ పురుషులకు సమాన వేతనం లేదు (ముఖ్యంగా కార్మిక, కర్షక, వర్గ స్త్రీలలో). భర్త క్రూరుడైనా దుష్టుడయినా, అవినీతిపరుడైనా పరిత్యజిస్తే పాతివ్రత్య విఘాతం కలుగుతుందనీ, సంఘం అవహేళన చేస్తుందనీ భయపడి పురుష దౌష్ట్యానికి బలియై బానిసత్వం స్వీకరిస్తోంది భారత స్త్రీ.

ఇలా తను అసమానత్వానికి, దౌర్జన్యానికి లోనౌతున్నానని తెలియకుండానే బానిసత్వ మనుభవిస్తోంది భారత స్త్రీ. ముఖ్యమైన రాజకీయ పదవులకు, ఉద్యోగాలకు స్త్రీలు తగిన అర్హత, సామర్థ్యము లేని వారనే భావం ప్రబలంగా వుంది. నేటి పార్లమెంటు 626 స్థానాలలో 18 మంది స్త్రీలు మాత్రమే వున్నారు. కేబినెట్ లో స్త్రీలు ఏవకరో వుంటారనే విషయం గమనార్హం. వ్యక్తిత్వమున్న పౌరునిగా స్త్రీ ఓటర్ను పరిగణించరు. చివరకు ఓటు విషయంలోకూడా భర్త శాసిస్తాడు. ఆస్తిహక్కు, వారసత్వం, సంరక్షకత్వం, విడాకులు మొదలగు విషయాలలో స్త్రీని రెండవ పౌరునిగా చూస్తున్నాయి కొన్ని శాసనాలు. స్త్రీకి శాసనరీత్యా సమానత్వం ఉంది. స్వేచ్ఛ పేర్కొనబడింది. కానీ ఆచరణలో అదివి-మృగ్యమయినాయి. స్త్రీకి ఆర్థికభద్రత లేదు. కనుక ఆమె బానిసకాక తప్పటంలేదు. ఉద్యోగం చేయటానికి తగిన సామర్థ్యం, నైపుణ్యం, విద్య పెక్కుమంది స్త్రీలకు లేనందువల్ల భర్తలపై ఆధారపడుతూ అవమానాలు, హింసలు భరిస్తూ, భర్తకు బానిసలవుతున్నారు. విడాకు లివ్వబడిన ముస్లిం స్త్రీలకు మూడునెలలవరకే భరణం వస్తుంది. పురుషుడు మూడుసార్లు తలాక్ అంటే చాలు. ఆ స్త్రీకి ఆర్థిక భద్రతలేదు. ఆ వ్యక్తికి సాంఘిక రక్షణా వుండదు. కనుక బానిసత్వం అనుభవిస్తున్నారని నమ్మి విముక్తికై పోరాటాలు జరుపవచ్చు; మార్గాలను అన్వేషించవచ్చు.

బానిసత్వం పోవాలంటే ముందుగా మనం బానిసలుగా బ్రతుకు

తున్నామని గ్రహించాలి. బంధాలలో ఉన్నానని తెలిసిన వ్యక్తే బంధ విముక్తికై తహతహలాడతాడు. విముక్తి కాంక్షించే వ్యక్తి ముందుగా మానసిక దాస్యవిముక్తి పొందాలి. దానికి ఆధునికతతో కూడిన శాస్త్రీయ దృక్పథం, హేతువాదంతో కూడిన తాత్త్విక చింతనలే మూలం కావాలి. అంతర్జాతీయ మహిళా సంవత్సరం వచ్చింది, పోయింది తిరిగి మహిళా దశాబ్దంకూడా పూర్తి అయింది కాని అరంగుళమైనా మనం మారామా? అంటే లేదనే చెప్పాలి. మహిళా శత సంవత్సర ఉత్సవాలైనా, సహస్ర సంవత్సరోత్సవాలైనా మనలో మార్పులేనిదే వాటివల్ల ప్రగతి శూన్యమవుతుంది. మనకున్న విజ్ఞానం, సంస్కారం, భావ స్వాతంత్ర్యం వినియోగించుకొని మన హక్కులు నిలుపుకోవాలి కాని ఎవరో ఉద్ధరిస్తారనుకోవడం శుద్ధ తప్పు. అసలు హక్కులు ఎవరో ఇస్తే పుచ్చుకొనేవి కావు! అవి మనం అనుభవించగల ధైర్యం, చొరవా మనలో రావాలి. అనాడే మన దాస్య శృంఖలాలు పటాపంచలై పోతాయి; స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు దక్కుతాయి.

(ఆలిండియా రేడియో మార్చి 1978)



# మహిళలు : మత సమాజాలు

సమాజంలో మతం మానవ జాతిని అజ్ఞానంలో ముంచి నిష్క్రియ తత్వాన్ని బోధించింది. ఒకనాడు ప్రకృతి సంఘటనలను అర్ధం చేసుకోవడానికి ఊహాధారంగా పనిచేసిన దైవభావం రానురాను మనిషిని బానిసను చేసింది.

మానవ సమాజంలో స్త్రీ పురుషులిద్దరూ వున్నారు. ఒక దశలో పురుషుడు స్త్రీని వస్తువుగా మరొక దశలో బానిసగా, ఇంకొక దశలో ద్వితీయ శ్రేణి వ్యక్తిగా పరిగణించాడు; పరిగణిస్తున్నాడు. పురుషుడే దైవ భావానికి లొంగిపోయి తను దేవుని బానిస అయినప్పుడు అతని బానిస అయిన స్త్రీ అతని చెప్పుచేతల్లో మెలగాల్సిన స్త్రీ మరో బానిస కావటంలో ఆశ్చర్యం లేదు.

ప్రస్తుత చర్చనీయాంశం మతం స్త్రీని ఎలా న్యూనత పరిచింది అనేది–ఈ సమస్యను అవగాహన చేసుకోవాలంటే మతంయొక్క మౌలిక స్వభావాన్ని మత ప్రవక్తల యొక్క లైంగిక పక్షపాత దృష్టిని, మతాలు వుద్భవించిన సమాజపు జీవిత రీతులను కొంతగా కొంత అధ్యయనం చేయాలి.

మానవులు సామాజిక జీవులు వారు ప్రకృతి పరిణామంలో ఉద్భవించారు. ప్రకృతిలో భాగంకాగా ప్రకృతిని అధ్యయనం చేసి దాని సూత్రాలను గమనించి దానిపై కొంతవరకు ఆధిపత్యం పెత్తనం కొనసాగించగలిగినవారు. వారిలో జంతువారసత్వంకూడా వుంది. వారికి వాసనలు వున్నాయి. మెదడు వికసించిన కారణాంగా వారి మనసుకు అనేక శక్తులు కలిగాయి. వారిలో అంతర్బుద్ధి (intuition) పనిచేస్తుంది. జ్ఞాపకశక్తి, ఆలోచనాశక్తి, మననం, ధ్యానం, భావన, ఊహ, మనస్సు యొక్క లక్షణాలు. మనిషికి కలిగిన భావం బలవత్తరంగా మానవ జాతి జీవితాలను ప్రభావితం చేస్తుంది. అలాగే జాతి సముదాయ

జీవితం మానవుల భావజాలాన్ని ప్రభావితం చేస్తుంది. మానవశక్తి ఒంటరిగా జీవించలేదు. కనుక సమాజపు జీవిత రీతుల ప్రభావం భావ ప్రపంచంపై వుంటుంది. ఈ సూత్రాన్ని విస్మరించటం ప్రమాదకరం.

## మతంయొక్క మౌలికతత్వం :-

మతం అంటే అసలు అర్థం "అభిప్రాయం" కాని ప్రతి చిన్న అభిప్రాయానికి "మతం" అని నామకరణం చేయం. ముఖ్యమైన అంశాలపై సైద్ధాంతిక భావాలకు అందులో మౌలిక భావాల సముదాయాన్ని మతమని పేరు పెడతాం. ఇది ఉత్పత్తి అర్థంకాగా రూఢ్యర్థంలో మరో అర్థం స్ఫురిస్తుంది. మామూలుగా దైవంలో విశ్వాసమున్న సిద్ధాంతాలను మతమని పిలుస్తున్నాం. కాని దేవుని ప్రమేయంలేని మతాలుకూడా ఉన్నాయి. జైనం, ఆదిబౌద్ధం అలాంటివి ఈ మతాలలో ఈశ్వరుని ప్రశక్తిరాదు. కాని అవీ మతాలే.

మతంయొక్క మౌలిక స్వభావాలు (1) సాధారణంగా ఒక ప్రవక్త లేక ప్రవక్తల పరంపర లేక ఆచార్యుల పరంపర ఉంటుంది. (2) సర్వసామాన్యంగా ఒక మత ప్రామాణిక గ్రంథం, వేదం, బైబిలు, ఖుర్ ఆన్, జెండ్ అవస్థా (పార్శీమతం) లాంటివి ఉంటాయి. వాటి ప్రవచనాలను శిరోధార్యాలుగా ఆ మతానుయాయులు స్వీకరిస్తారు. (3) మతానుయాయులు సమాజంలోనే విడిగా వుంటూ ప్రత్యేకమైన పూజా విధానాలను, ప్రార్థనా రీతులను అనుసరిస్తారు. వారు ఇతరులను మ్లేచ్ఛులని అన్యులని, కాఫిర్లని అనేక పేర్లతో పిలుస్తారు. తాము దైవానికి ప్రీతిపాత్రు లయినట్లు తతిమ్మావారు దేవుని కరుణకు దూరమయినట్లు భావిస్తారు. లేక తమదే ప్రశంసాయుతమైన విధానమని, తదితరులు తప్పుదారిని పయనిస్తూ, అధోగతి పాలవుతున్నారని తలంచి ఇతరులను, ఈసడిస్తారు. తామే పవిత్ర జీవులమని, తమకు దైవకృపవలననో లేక పూర్వజన్మ సుకృతంవలననో (దేవునిలో నమ్మకం లేకపోయినా జన్మ పరంపరలో విశ్వాసమున్నవారు జైన మతస్థులు-మహావీరుడు వారి ప్రధాన తీర్థంకరుడు) తమకు ఈ మత రహస్యాలను తెలిసికునే అవకాశం లభించిందని

వారు తలపోస్తారు. ఇది అహంభావానికి దారితిస్తుంది ఇతరులను న్యూన తగా చూడటానికి దారితీస్తుంది. (4) దైవ విశ్వాశాన్ని ప్రోత్సాహించే మతాలు మనిషిని దేవునికి లొంగి ఉండేటట్లు చేస్తాయి దేవుడు సర్వశక్తిమంతుడు, సర్వాధికారి. మానవుడు అతని కరుణా కటాక్ష వీక్షణాలకోసం వేచివుండే, కాచివుండే వ్యక్తి. (హిందూ, క్రైస్తవ, మహమ్మదీయ మతాలు అలాటివే) కాగా దేవుని ఉనికి అస్కారంలేని మతాలలో దేవుని స్థానాన్ని ఏ చారిత్రాత్మక అవశ్యకతయో (మార్క్సిజం-మార్క్స్ చరిత్ర డిమాండు చేసినట్లు అనివార్యంగా వస్తుంది) లేక కర్మసిద్ధాంతమో (పూర్వ మీమాంస :- కర్మచేస్తే అంటే యజ్ఞయాగాదులు చేస్తే మనిషికి ముక్తి లభిస్తుంది. దేవుని ప్రమేయంలేకుండా జరిగిపోతుంది) ప్రకృతి పరిణామ సూత్రాలు మానవ జీవితాన్ని శాసిస్తున్నాయి. మానవుని ఇచ్ఛా సంకల్పాదులతో నిమిత్తంలేకుండా జరిగే పరిణామం. మానవుని పుట్టుకకు పూర్వం ప్రకృతి అలా పరిణామం చెందినమాట వాస్తవమే. కాగా మానవుడు ఈనాడు ప్రకృతి పరిణామాన్ని మార్చగలుగుతున్నాడు. "జెనిటిక్ ఇంజనీరింగు" (మనం కోరుకునే మానవులను అలాటి నమూనాలతో తయారుచేసుకోగల ప్రజ్ఞ) ఈనాడు అమలులోకి వచ్చింది. పరిణామ క్రమంపై మానవుడు అధికారం చలాయించనున్నాడు.

అంతేగాక ముమ్ముందు జరిగే పరిణామానికి బాధ్యత వహించగల శక్తిని సంపాదించాడు. (ఈ జ్ఞానం, శక్తి, మానవుడు సంపాదించక పూర్వం ప్రకృతిచేతిలో తనను కీలుబొమ్మగా ఊహించుకున్నాడు) ఇలాటి మతసూత్రాల వలన మానవుడు తనపై ఆధారపడటం మానేస్తాడు. దేవుని మీద ఆధారపడతాడు లేక ఇతర శక్తులు ఇతర సూత్రాలపైన నెపంవేసి తమ బాధ్యతను తప్పించుకుంటారు, లేక ఒక్కొక్కప్పుడు నిజంగానే విధి చేతిలో లేక అతీతశక్తుల చేతిలో తను పనిముట్టు మాత్రమేనని భావిస్తాడు. అందుచేత నిస్సహాయత మానవ జీవితంలో ప్రవేశిస్తుంది. ఇచ్ఛా సంకల్పాదులు బుద్ధి ప్రజ్ఞా ప్రాభవాలు కల మానవ వ్యక్తి బానిసగా తయారు అవుతాడు. ఒక్కొక్క పరిస్థితిలో బానిస యజమానిగా మారతాడు.

దేవుళ్ళు-దేవతలు :-

వ్యవసాయం ఇంకా అమలులోకి రాని సామాజికదశలో స్త్రీలు ఆహార సముపార్జన చేసేవారు. వ్యవసాయం అంటే గింజలుచల్లి వర్షాధారంగా పంటలు పండించే రోజుల్లోకూడ స్త్రీలే ఆ పనిచేసేవారు. కనుక వారికి సమాజంలో ప్రాధాన్యత హెచ్చుగా ఉండేది. పొలాన్ని నాగలితో దున్ని విత్తనాలు చల్లి పైరులు పెంచటం మొదలయిన తరువాత పురుషుల ప్రాముఖ్యత పెరిగింది. ఇలా సర్వేసర్వత్రా జరిగిందని చెప్పలేము ఇప్పటికీ ఆఫ్రికా ఖండంలో స్త్రీలే వ్యవసాయానికి బాధ్యత వహిస్తున్నారు. సామాజిక పరిణామానికీ, భావసౌధానికీ సరాసరి సూటి కార్య కారణ సంబంధం ఉంటుందని చెప్పలేము. కాగా పరస్పర ప్రభావం ప్రస్ఫుటంగా ఉంటున్నది.

ఇంతకూ చెప్పేదేమంటే స్త్రీలకు సమాజంలో ప్రాధాన్యత ఉన్న రోజుల్లో, సంతానోత్పత్తి క్రమాన్ని గురించిన జ్ఞానం మానవునికి లేనప్పుడు సంతానాన్ని కనే స్త్రీకి విశేష ప్రాధాన్యత ఉండడంలో ఆశ్చర్యం లేదు. అప్పుడు దేవతామూర్తులు స్త్రీలే. భారతదేశంలోకూడా ఆర్యులు రాకముందు ఆదివాసులు స్త్రీమూర్తులను దేవతలుగా కొలిచేవారు. "అమ్మతల్లి పూజ" విరివిగా సాగేది. అదే ఆర్యులచేత అణచివేయబడిన ఆదిమ జాతులలో "అమ్మవారి" కొలువులు, జాతరల రూపంలో ఇంకా మనకు కనిపిస్తూనే వున్నాయి. సమాజం మారింది పురుషాధిక్యత రూపు దిద్దుకున్నది. పురుష దేవతలు కోకొల్లలుగా సృష్టి అయినారు. స్త్రీ దేవతలు, పురుషదేవత పత్నులుగా ద్వితీయశ్రేణికి వచ్చారు. దేవీ భాగవతంలోని దేవి త్రిమూర్తుల భార్యలుగా అవతారంతాల్చింది. "అమ్మలకు అమ్మ"గా "అయ్యలకు అమ్మగా" అయ్య పరసన పతిగా నిలచింది.

మతస్థాపకులు, మత ప్రవక్తలు :-

మతం స్త్రీలను ఎలా చూచింది అనే విషయాన్ని అధ్యయనం చేసే ముందు ఒక్క అంశాన్ని గమనించాలి. మత స్థాపకులు, మత ప్రవక్తలు,

దాదాపు అందరూ పురుషులే. ఋగ్వేదంలో ప్రకృతిని చూచి ముగ్ధులై గానంచేసిన ఋషులలో అత్యధిక సంఖ్యాకులు పురుషులే. కొంతమంది స్త్రీలు ఋషులుగా గుర్తింపబడినంత మాత్రాన, పురుష ప్రాధాన్యత తగ్గిపోదు. "ఓ దేవా కుమారుని ఇమ్ము" అని ప్రార్ధనచేసి రోజులువి. యజుర్వేదకాలం నాటికి తల్లి గర్భంలోని ఆడ శిశువును, మగ శిశువుగా మార్చమని దేవుని ప్రార్థించేదాకా వచ్చింది. తరువాత వచ్చిన సూత్ర కారులూ, ధర్మశాస్త్ర నిర్ణేతలూ అందరూ పురుషులే. స్మృతికర్తలు (నారదుడు, కాత్యాయనుడు, మనువు, యజ్ఞవల్క్యుడు, పరాశరుడు, అంతా మగవారే. ఆస్తి మగవారిది; యాజమాన్యం వారిది మనువు చెప్పిన ప్రకారం స్త్రీ పరాధీన, బాల్యంలో తండ్రి, యౌవనంలో భర్త, వార్ధక్యంలో కుమారుడు ఆమెకు సంరక్షకులు.

ఈనాడు హిందువులు భక్తితో ఆరాధించే శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, విష్ణుమూర్తి, శివుడు, గణేశుడు, సూర్యుడు (దేశం మొత్తంమీద సూర్యునికి ఒక రెండు దేవాలయములు ఉన్నాయి [కోణార్క]. బ్రహ్మ ఇతని దేవాలయములు తక్కువే గుంటూరు జిల్లా చేబ్రోలువద్ద ఒక చిన్న ఆలయం మాత్రం వుంది) అందరూ పురుష దేవతలే. తిరుమలలోని వెంకటేశ్వరస్వామి విగ్రహం మొదట్లో స్త్రీ మూర్తి యట. ఇప్పుడు ఆ 'స్వామి' పురుష దైవంగా చలామణీ అవుతున్నాడు. పూజారులు, ఎక్కడవున్నా పురుషులే. పురాణాల రచయితలు వారే. అలా స్త్రీని నిరసిస్తూ పూజారిణిగా పనికిరాదన్నారు.

<u>క్రైస్తవం :-</u> మోషే (Moses) పురుషుడు. తరువాతి ప్రవక్తలు మగవారే. ఏసు బ్రహ్మచారి కావచ్చు. కాని పురుష జాతివాడే. శిష్యులు పదకొండుమంది (ఆయనను మోసపుచ్చిన వానితో సహా) అందరూ మగవారే. రోమను కాథలికు మతశాఖాధిపతులు ఎల్లప్పుడు స్త్రీలే. చర్చిలలో బోధ సాగించేది వారే. ప్రొటెస్టంట్సు శాఖ స్థాపకుడు లూధర్. ఆ శాఖలోని బిషప్పులు వగైరాలు అంతా పురుషులే. స్త్రీ. జాతికి చెందిన పోప్‌ను, కార్డినల్‌ను, ఆర్చిబిషప్‌ను, బిషప్‌ను మత గురువును ఇంతవరకు చూడలేదు.

ఇస్లాం :- ముస్లిం మత స్థాపకుడు మహమ్మదు అతడు పురుషుడు కనుకనే అతడు వర్ణించిన స్వర్గంలో "సెలయేళ్ళు, తోటలు, ఫలవృక్షాలు, అందమైన స్త్రీలు" ఉంటారు అందమైన పురుషుల సంగతి అతనికి స్ఫురించదు.

బౌద్ధ, జైనాలు :- బౌద్ధమతాన్ని ప్రవచించిన బుద్ధుడు పురుషుడు కనుకనే విహారాలలో, మఠాలలో స్త్రీ సన్యాసినులను చేర్చుకోవడానికి నిరాకరించాడు. ఎంతో ప్రగతిపథంలో సాగిన బౌద్ధానికి ఈ స్థితి పట్టింది. జైనమతానికి బహుళ వ్యాప్తి తెచ్చిన మహావీరుడు పురుషజాతికి చెందిన వాడే కనుక స్త్రీ సన్యాసినులకు పురుష సన్యాసులకన్నా తక్కువస్థానం లభిస్తున్నది ఆ మతంలో.

ఇంతకూ చెప్పదలుచుకున్న దేమిటి ? చరిత్రను కాదనం; గత చరిత్రను మార్చలేము; మార్చబోము. కాగా తెల్సికోవాల్సింది ఏమంటే పురుష నాయకులు పురుష మతప్రవక్తలు, పురుష మత స్థాపకులు స్త్రీల స్థితిని అర్థంచేసుకోలేక పోయారని, వారికి మత దృష్ట్యాకూడా సమాజంలో తక్కువ స్థానాన్ని నిర్దేశించారని గ్రహించాలి.

ఈనాడు స్త్రీలు తమ విమోచనకై జరిపే పోరాటంలో ఎదుర్కొనే ఇబ్బందులు రెండని మనం గమనించాలి. ఒకటి సామాజికపరంగా శ్రమ దోపిడి. రెండవది-పురుషాధిక్యత. (ఇది పితృస్వామ్య సమాజ ఫలితం) ఈ రెంటిలో దేనిని విస్మరించినా స్వేచ్ఛా సమానత్వాలను కాంక్షించే స్త్రీలు తమ లక్ష్యసాధనకై చేసే పోరాటంలో తప్పుదారిని ప్రయత్నిస్తారు. అందు వలనే గత చరిత్రలో, ముఖ్యంగా, మతపరంగా పితృస్వామిక విలువలను వ్రేళ్ళుపెట్టి చూపించడమైనది.

ఈనాడు :- పురుష దౌర్జన్యం ఈనాడుకూడా సమాజంలో విలయ తాండవం చేస్తున్నది. స్త్రీని వ్యక్తిగా చూడటం జరగటంలేదు. స్త్రీ పురుషుని వస్తువు. ఇద్దరు పురుషులు పోట్లాడుకుంటే శత్రువుయొక్క స్త్రీని దుర్భాషలాడతాడు. వీలయితే కొడతాడు, చెరుస్తాడుకూడాను. శత్రువు

యొక్క వస్తువును చెడగొట్టటంలో ఆనందం పొందుతాడన్నమాట. అంతే కాదు భార్య వ్యభిచరించిందని మగవాడికి అనుమానంవస్తే ఆమెను చంపుతాడు. మిండగాడిమీద క్రిమినలుకేసు పెట్టటానికికూడా "లా" అనుమతిస్తుంది. వ్యభిచారాన్ని మంచిదని అంటామని, ప్రోత్సహిస్తామని కాదు. వ్యభిచారం నైతికంగా చెడ్డది. అది భార్యాభర్తల పరస్పర విశ్వాసాన్ని వమ్ముచేస్తుంది. కాగా ప్రస్తుతపు సమాజ ధర్మం ప్రకారం స్త్రీ పురుషుని ఆస్తి కాకపోతే అలాంటి శాసనాలకు, ఆచారాలకు అర్థంలేదు.

అథవా కొత్త సంస్కారం పురుషునికి ఉంటే అతగాడు స్త్రీ రెండవ రకపు మనిషిగా చూస్తాడు పెంపుడు జంతువుకు ఇచ్చినట్లు చీరెలు, సొమ్ములు సమకూరుస్తాడు "ఇల్లాలు" అనిపేరుపెట్టాడు, "గృహలక్ష్మి" అని బిరుదు ఇస్తాడు. నీవే కుటుంబానికి "రాణివి" అంటాడు. కాని కుటుంబానికి అతడే "రాజ"ని మనం మరచిపోరాదు. మధ్యతరగతి వాడయితే నిన్నమొన్నటిదాకా ఆమెను ఉద్యోగం చేయనీయలేదు. శ్రామికవర్గం వాడయితే చాకిరీచేయించి ఆ కూలిడబ్బులు తను కాజేస్తాడు. ధనికుడయితే భార్యను పంజరంలో రామచిలుకను చేస్తాడు. ఆమెకు బంగారుసంకెళ్ళు వేస్తాడు ఒకవేళ స్త్రీ ఉద్యోగం చేయడానికి పూనుకున్నా పెద్ద ఉద్యోగాలకు ఎంపిక చేయడు. జీతాలు తక్కువగా ఇస్తుంది సంఘం. ఎన్నో ఆంక్షలు, ఆటంకాలు పెట్టుంది. వివక్ష విలయతాండవం ఆడుతుంది. రాజకీయాల సంగతి సరేసరి. కీలకస్థానాలన్నీ పురుషులకే. ఎప్పుడైనా ఒక స్త్రీని ఉన్నతపదవిలోకి రానిస్తే ఆమె పురుష ప్రపంచపు విలువలను పోషించే వ్యక్తిగా ఉంటేనే అది జరుగుతుంది. ఎంతగా అడ్డంకులు పెట్టినా పరిస్థితులు అనుకూలించి ఉన్నతపదవిని పొందిన స్త్రీని మెచ్చుకుంటాడు పురుషుడు, కాని తన కుటుంబ స్త్రీకి అలాంటి అవకాశము సుతరామూ ఇవ్వడు. తన మంచితనానికి, నిదర్శనంగా మహోన్నత శిఖరాలను అందుకున్న ఏ ఒక్క స్త్రీనో పొగిడి తృప్తిపడతాడు. మనది "అసమాన సమాజమ"ని తేటతెల్లమగుటకు ఇంకా బోలెడన్ని ఉదాహరణలున్నాయి.

పురుషులు, స్త్రీలను హీనంగాను న్యూనతగానూ, అసమానంగానూ చూస్తున్నదానికి మతానికి సంబంధం ఏమిటని ఎవరైన ప్రశ్నించ

వచ్చును. సమాజంలో జరిగే సామాజిక రాజకీయ దోపిడికి స్త్రీ పురుష లిరువురూ సమానంగా బలి అవుతున్నా సమాజంలో పురుషాధిక్యతవల్ల పితృస్వామ్య సహజ భావనలు బలంగా ఉన్నందువల్ల స్త్రీ మరింత బాధ పడుతోంది. ఈ అసమానత్వాన్ని మతసూత్రాలు మత ధర్మశాస్త్రాలూ సమర్థిస్తున్నాయి. అందుకే మతంపై స్త్రీ తిరుగుబాటు చేయాల్సిన పరిస్థితి వచ్చింది. మతప్రాబల్యం ఉన్నన్నాళ్ళూ తనకు విముక్తిలేదని ఆమె గ్రహించి పోరాడవలసి వస్తున్నది.

మతం పురుషాధిక్యతను ఎలా పోషించింది ? దీనిని గురించి సవివరంగా వ్రాయాలంటే ఒక సుదీర్ఘ గ్రంథ మవసరమవుతుంది. కనుక వివరాల జోలికి పోకుండా కొన్ని ముఖ్య అంశాలను మాత్రం స్పృశించడం అవశ్య కర్తవ్యం.

హోదా :- స్త్రీ ఎల్లప్పుడూ సంరక్షింపబడవలసిన వ్యక్తియే మను ధర్మశాస్త్రం అలా శాసించింది. ముస్లిం సమాజంలోని జమాయతు (పంచాయతీ)లోకి ఆమె రారాదు భారతదేశంలో మధ్య ఆసియాలో ఆమె పర్దాలో ఉండాలి. భారతదేశంలో ఆమె మసీదులో ప్రార్థన చేయరాదు. క్రైస్తవమతంలో చర్చిలో ఆమె తలపై ముసుగు వేసుకోవాలి. చర్చిలో మాట్లాడరాదు ఆమెకు ఏమయినా అనుమానంవస్తే ఇంటికివచ్చి భర్తను అడగాలికాని మతాధికారిని అడుగరాదు.

హిందూమత సూత్రాల ప్రకారం భర్త స్త్రీకి ప్రత్యక్షదైవము. ఆమె నోములు వ్రతాలు అతని సంక్షేమంకోసమే చేయాలి. అతని సహధర్మచారిణిగా అతని భావాలే ఆమె అభిరుచులు కావాలి. ద్రౌపది పతివ్రతా లక్షణాలను పేర్కొంటుంది అవి హిందూస్త్రీలకు శిరోధార్యాలు. క్రైస్తవమూ అంతే. చర్చికి క్రీస్తు అయినట్లు కుటుంబానికి భర్త అధిపతి. అతడు ఆమెను దయగా చూడాలి. పెంపుడు జంతువునుకూడా మనం దయగానే చూస్తాము. దయకాదు కావల్సింది సమానత్వ భావన; అది నేటి స్త్రీల ఆందోళన.

ఇక ఇస్లాం విషయం సరేసరి, ఏకకాలంలో ఒక పురుషుడు నలుగురు స్త్రీలను భార్యలుగా పొందగలిగే హక్కు సంక్రమించింది. అందరిని సమ దృష్టితో చూడాలని మహమ్మదు అన్నాడనుకోండి కాని అది సాధ్యమా ? ఇది కావ్యాలలోని దక్షిణ నాయకుని గుర్తుచేస్తుంది. ఒక స్త్రీ నలుగురు భర్తలను ఏకకాలంలో కలిగి ఉండటానికి ఇస్లాంమతం సమ్మతిస్తుందా ? సమ్మతించదు. బహు భర్తృత్వం మంచిదని నేను వాదించడంలేదు సమానత్వం లేదని స్త్రీకి తక్కువ హోదా ఉన్నదని చూపడానికి ఈ వాదన.

III) <u>సంతానం</u> :- హిందూ సంప్రదాయం, ఆచారం వేటి ధర్మ శాస్త్రానుసారం మగ సంతానానికి విలువ ఎక్కువ. కుమారుడే తల్లి తండ్రులకు అంత్యక్రియలు చేయుటకు అర్హుడు. స్త్రీ ఎవరి అంత్య క్రియలను చేయనవసరం లేదు, అర్హత అంతకన్నాలేదు. భర్త కోరిక ప్రకారం స్త్రీ పురుష సంతానాన్ని కనటానికి ఇష్టపడటం ఆచారప్రభావం. వరుసగా ఆరుగురు ఆడపిల్లలు కలిగినా మగపిల్లవాడు కలిగేవరకు ఆమె సంతానాన్ని కంటూ జీవయాత్ర సాగించవలసిందే. క్రైస్తవంలో ఇలాంటి ఆంక్షలు లేవు. కాగా ముస్లిం సమాజంలో పురుషులకు ప్రాధాన్యత ఉన్నది కనుక మగశిశువుపై మోజు మెండు అనక తప్పదు.

IV) <u>సంతానానికి సంరక్షకత్వం</u> :- సంతానానికి భార్యాభర్తలలో భర్తయే సంరక్షకుడు అతడు లేనప్పుడు భార్య సంరక్షకురాలవుతుంది. ఇది హిందూమత శాస్త్ర నిర్దేశం. క్రైస్తవం అంతేకాగా ఇస్లాంమతంలో మరీ ఘోరం సంరక్షకుడు తండ్రి అతని తరువాత అతనిచేత వీలునామాలో నియమింపబడినవాడు తరువాత తండ్రి తండ్రి. ఆ తరువాత తండ్రి తండ్రిచేత వీలునామాలో పేర్కొనబడినవాడు వీరెవరూ లేకపోతే కోర్టు సంరక్షకుని నిర్ణయిస్తుంది. మరో అంశం సున్నీలలో మగపిల్లవానికి 5 ఏండ్లు నిండేవరకు, ఆడపిల్లకు 7 ఏండ్లు నిండేవరకు తల్లి అతనికి "గార్డియను"గా ఉంటుంది. ఆస్తికికాదు సుమండీ! మనిషికి పిల్లలు చిన్నగా ఉన్నపుడు వారిని పెంచటం కష్టం కనుక ఆ బాధ్యతను స్త్రీకి వప్పచెప్పింది ముస్లింలా.

V) వారసత్వం :- హిందూమత ధర్మశాస్త్ర ప్రకారం తండ్రి పిత్రార్జితపు ఆస్తిలో తల్లి కడుపున పడగానే మగపిల్లవానికి వాటా ఏర్పడుతుంది. ఆడపిల్లకు చదువు, పోషణ, వివాహ ఖర్చులు మాత్రమే చెల్లుతాయి. ఇస్లాం ప్రకారం తండ్రి ఆస్తిని కుమారులు కుమార్తెలు పంచుకుంటారు. కాని ఒక కుమారుడు = ఇద్దరు కుమార్తెలతో సమానం, ఇలా ఉంటాయి వాటాలు.

VI) దత్తు :- హిందూ ధర్మశాస్త్రం ప్రకారం స్త్రీ తన భర్తకు దత్తు చేసుకోవాలి. అతనికి పుణ్యలోకాలు కల్పించే నిమిత్తం మాత్రం ఆమె అలా చేయాలి. దత్తు అనే వ్యవస్థ ఇస్లాంలో లేదు. క్రైస్తవులూ, ముస్లింలూ ఎవరినైనా పెంచుకొని వారికి తమ ఆస్తిని ముట్టచెప్పుకో వచ్చును.

vii) మతగ్రంథాలు :- ప్రతి మతానికి ఏదో ఒకటో లేక రెండో మూడో మత ప్రామాణిక గ్రంథాలుంటాయి. కాగా వాటిని ఆయాకాలపు సామాజిక స్థితిగతుల ప్రభావంవల్ల ఉద్భవించిన వాటిగానో లేక వాటిని ప్రతిఫలించిన ఇతిహాసాలుగానో పరిగణిస్తే చిక్కులేదు. ఆలాకాక వాటిని ఈనాటికి ప్రామాణిక గ్రంథాలుగా భావిస్తే చిక్కు వస్తుంది. వాటిలో పేర్కొనబడిన నీతివాక్యాలను సార్వకాలిక నీతి సూత్రాలుగా తలిస్తే ప్రమాదం సంభవిస్తుంది. నాలుగువేల సంవత్సరాలనాటి వేదాలు, ఐదువేల సంవత్సరాలనాటి బైబిలు పాత నిబంధన, 13 వందల సం॥రాల కాలపు ఖుర్ ఆన్ ఈనాటి సమాజాలను శాసించాలనటం హాస్యాస్పదం, విడ్డూరం కాదా? విజ్ఞానం, మేధస్సు, శాస్త్రీయ జ్ఞానం ఆనాటినుండి నేటి వరకు స్థభించి పోయాయంటే వినటానికి సొంపుమాట అటుంచి ఎంత వరకు ఆ వైఖరి హేతుబద్ధం? మహమ్మదు చివరి ప్రవక్తయట. ఆ అంశాన్ని నమ్మనివాడు ముస్లిం కాదట. ఎంత అంధ విశ్వాసం! ఎంత మహామూర్ఖం! మహమ్మదు తెలివి కలవాడు కావచ్చు, ఆ కాలానికి అనుగుణమైన కొన్ని ధర్మాలను నిర్దేశించి ఉండవచ్చు కాని అతడు కనుగొనగలడా? ప్రవచించగలడా? ఇదే సూత్రం అందరు మతధర్మ శాస్త్రజ్ఞులకు వర్తిస్తుంది.

ఎప్పుడైతే మత గ్రంథాలను పరిశుద్ధ గ్రంథాలుగా భావించి వాటికి ప్రామాణికతను ఆపాదిస్తాయో అప్పుడు అసలు వాటి బండారం బయట పడుతుంది. పాత నిబంధనలోని యెహోవా కోపిష్టి, క్రూరకర్ముడు కుసంస్కారి. కాస్త కోపంవస్తే శాపాలు పెడతాడు. శిక్షలు వేస్తాడు. అన్నిటికన్నా మిన్న మీ స్త్రీలను మీ ఎదుట చెరచుదురుగాక అని తిట్టాడు. ఎంత అసభ్యత! ఎంత అనాగరికత! స్త్రీలపై ఎంతఏహ్యభావం! యుద్ధాలు జరిగితే చేజిక్కిన వివాహపు స్త్రీలను చంపాలట. అవివాహిత స్త్రీలను వారి ఇష్టాఇష్టాలతో నిమిత్తం లేకుండా భార్యలుగా స్వీకరించాలట. ఈ ధర్మాలను ఈనాడు ఆచరించగలమా? ఆ మాటకు వస్తే అంగీకరించ గలమా? పాతివ్రత్య మహాత్మ్యాలను వివరించిన హిందూ పురాణాలు సుమ తిని పొగిడాయి. కుష్టురోగి అయిన భర్తను తట్టలో కూర్చోపెట్టి, తట్ట నెత్తిన పెట్టుకొని అతనిని వేశ్య దగ్గరకు తీసుకొనిపోయిన ఉత్తమ ఇల్లాలు సుమతి! పంచ కన్యలలో చేరిన వాలి భార్య తారను అనుసరించ గలరా ఈనాటి స్త్రీలు? వాలి చనిపోయినాడని తలచి ఆమె సుగ్రీవుని భార్య అయింది.

వాలి తిరిగివస్తే అతని భార్యగా మారింది. వాలి మరణానంతరం మరల సుగ్రీవుని చేరింది. తారను తప్పుపట్టటం లేదు. అది ఆనాటి వానర సమాజపు ఆచారం కాగా ఆ తారను ఈనాటికీ ఆదర్శ స్త్రీ మూర్తిగా పరిగణించగలమా?

స్త్రీలను శిక్షించడానికి భర్తకు అధికారం ఇచ్చే "ఖుర్ ఆన్", దొంగ తనం నేరానికి చేతులు, కాళ్ళు నరికించే "ఖుర్ ఆన్", వ్యభిచారులను రాళ్ళతోకొట్టి చంపమనే "ఖుర్ ఆన్" నేరస్తులను బహిరంగంగా కొరడా దెబ్బలు పాలుచేసి చిత్రహింసను ఆమోదించిన "ఖుర్ ఆన్" ఈనాటికి ప్రామాణిక గ్రంథమవుతుందా? అన్నింటికన్న మిన్న కట్టుకున్న భార్యను తృణప్రాయంగా త్యజించటానికి "తలాక్" ద్వారా పురుషునికి సర్వాధి కారాలను ఇచ్చే "ఖుర్ ఆన్" ఈనాటికీ అనుసరణీయమా.

మతగ్రంథాలు ఆ కాలపు నీతులను పొందుపరిచాయి. సమాజము

మారుతున్నది. నీతియెడ దృక్పథం మార్పుచెందింది. కనుక అవి ఈనాడు ఉపకరించవు. వాటిని పాటిస్తే స్త్రీలయెడ మహాపచారం చేసినట్లే.

మతాలను స్త్రీలు ఎందుకు నిరసించాలి :- మతం లేకపోతే నీతి లేదట! దైవదత్తమైన నీతి ఉన్నందువలననే ఈ సమాజం ఇంతమాత్రం చిన్నాభిన్నం కాకుండా మనగలుగుతున్నదట!

మతాన్ని పురుషులు పాటించకున్నా, స్త్రీలు అనుసరిస్తున్నందు వల్లనే మతం ఈనాటికి సుస్థిరంగా ఉన్నదట! అందువల్ల స్త్రీలు విధిగా మతదృష్టిని అలవరచుకొని మతాచారాలను పాటించాలట ఇది మతస్థుల ధోరణి ఈ ఉద్బోధతో స్త్రీలకు నోములు, వ్రతాలు, పూజలు, పునస్కారాలు నిర్దేశించారు. ఏ మతమయితే స్త్రీలను నిర్దాక్షిణ్యంగా అణచివేస్తున్నదో ఏదయితే స్త్రీలను న్యూనతగా చూసిందో దానిని స్త్రీలు గౌరవించాలిట ఎంత విడ్డూరం! పురుషాధిక్య సమాజ విలువలను "మస్తిష్క క్షాళనం" (Brain-washing) ద్వారా పురుషులు స్త్రీలకు అందించారు. స్త్రీలు అమాయకంగా అజ్ఞానంగా వాటిని స్వంతం చేసుకున్నారు అవి వారి భావ పరంపరలో భాగమయినాయి. ఈ స్థితిని తరతరాలవరకు వీలయితే యుగయుగాల వరకు కొనసాగించాలని పురుషహంకార వాముల ప్రయత్నం. దీనిలో భాగంగా మతప్రచారాన్ని స్త్రీలలో ఉధృతంచేసాయి మతసంస్థలు. అందు వల్ల స్త్రీలలో మతభావన పెరుగుతున్నది. నాగరికులు సైతం, సైన్సు అభివృద్ధివల్ల లాభాలు ప్రయోజనాలు పొందేవారు సైతం మతాన్ని పోషిస్తున్నారు ఇలా మతసంస్థలద్వారా జీవనోపాధి సాగించుకొనే మతాధి పతులు యథాతథ స్థితివాదులూ, పురుషాధిక్యతను ఎల్లకాలం నిలపాలని ఆశించేవారు, రాజకీయంగా అధికారాన్ని తమ స్వంతం చేసుకోవాలనే దురాలోచనాపరులు, అందరూ సమాజంలో సగభాగమైన స్త్రీలను మభ్య పెట్టున్నారు. మతాన్ని అందుకు సాధనంగా వాడుకుంటున్నారు.

స్త్రీలు : జాగృతి : మతం

సమాజంలో స్త్రీల పరిస్థితి శోచనీయంగా ఉంది. దానిని గురించి

చాలామంది వ్యధ చెందుతున్నారు. స్త్రీల స్థితిగతులు బాగుపడాలంటే ముమ్ముందుగా తమ స్థితి నైచ్యంగా వుందనే విషయాన్ని వారు గ్రహించాలి. దానిని మార్చడానికి వారు తహతహ చెందాలి, ఆరాటపడాలి. అందుకు ముందుగా స్వేచ్ఛకోసం వారిలో ప్రేరణ కల్గాలి. ఈ జాగృతి ఉంటేనే వారు తమ స్వేచ్ఛా సమానత్వాలకు ముఖ్యమైన వ్యక్తిత్వం కోసం శ్రమించగలరు, పోరాడగలరు. ఇక్కడ మళ్ళీ మతం వారికి అడ్డుపడుతోంది. ఈనాటి స్థితిపూర్వజన్మ సుకృతమనో లేక దైవదత్తమనో చెప్పి సమాజాన్ని తమకు అనుకూలంగా మెరుగుపరచుకోవడానికి వారు ఉపక్రమించకుండా మతం అడ్డుపడుతోంది. మానవప్రయత్నాన్ని నిరసిస్తున్నది. దైవకృపకోసం ఆరాటపడమని స్త్రీలను ప్రోత్సహిస్తున్నది. ఇలా మతం స్త్రీలలో జాగృతిని అరికట్టున్నది. వారిని నిస్సహాయులను చేస్తున్నది. నేటి అసమానత్వ సమాజానికి కొమ్ముకాసేటట్లు చేస్తున్నది. ఈ విషయాన్ని జాగృతిని చైతన్యంకల కొద్దిమంది స్త్రీలు గ్రహించారు. ఇతరుల చేత గ్రహింపచేయాలని కృషిచేస్తున్నారు. వారిలో హేతువాదులు, మానవతావాదు లున్నారు. మతం స్త్రీలకు మత్తుమందుగా పనిచేస్తూ పరమ శత్రువై బైరాయించింది. ఈ సత్యాన్ని ఇతోధిక సంఖ్యలో స్త్రీలు ఎంత త్వరగా గ్రహిస్తే అంతమంచిది.

("హేతుపథం" త్రైమాసిక పత్రికలో 1986 జనవరిలో ప్రకటితము)

---

# ఇందులో . . .

# సమస్యల తోరణాల గురించి

భారతదేశంలో స్త్రీలను దేవతలుగానో, బానిసలుగానో తప్ప మనుషులుగా చూడలేరంటా డొక విమర్శకుడు. అది అక్షరాలా నిజం. అయితే మనం ఆ భావాన్ని కొంత మార్చి ఇలా చెప్పుకోవచ్చు. దేవతలుగా చూస్తున్నామంటూ బానిసలుగా చూస్తా రిక్కడ స్త్రీలను. ఇక్కడ మనం గుర్తుంచుకోవాల్సిన విషయం మరొకటి వుంది. ఏ తల్లి ఒడిలోనుండి, పెరుగుతూ వచ్చారో, ఏ తల్లి భావాలతోనే పెరిగి పెద్దవాళ్ళవుతారో ఆ తల్లుల్ని అజ్ఞానంలో, అవమానంలో వుంచడంవల్ల ఆ నష్టం కేవలం ఆ తల్లులకే పరిమితం కాదు, మొత్తం సమాజం అంతా దానివల్ల నష్టపోతుం దనేది నగ్న సత్యం.

అమ్మాయి పుట్టింది మొదలు అన్నీ సమస్యలే. అసలు సమస్యలనేవి కేవలం ఆడవాళ్ళకో, మగవాళ్ళకో మాత్రం పరిమితమైనవి కావు. ఒక ప్రత్యేకమైన దేశానికో, కాలానికో పరిమితమైనవి అంతకన్నా కావు. వివేకం, విజ్ఞానం కలవాళ్ళు ఆ సమస్యల్ని ఎప్పటికప్పుడు ఎదుర్కొంటూ, పరిష్కరించుకో గలుగుతారు. కాని అనేక కారణాలవల్ల స్త్రీల సమస్యలు చాలా సున్నితమైనవి; పరిష్కరించుకోవటానికి చాలా క్లిష్టమైనవిగానూ, చిక్కుపడిన దారపు ముడిలా వుంటాయి. ఆ చిక్కుల ముడి విప్పటానికి ఎంతో మెలకువ, నేర్పూ వుండాలి. అంతే కాదు. అసలు స్త్రీలకు సమస్యలే లేనట్లు పైకి కనపడుతూ అవి అంతర్వాహినిలా, నిగూఢంగా వుంటాయి. అందుకే తమ దాస్యానికి తామే ముగ్ధులైన స్త్రీలు "మాకేం మేము సర్వ సౌఖ్యాలూ అనుభవిస్తున్నాంగదా" అని అంటున్నారు అజ్ఞానులైన గృహిణులు. తరతరాలుగా ఈ భావదాస్యానికి, పురుషాధిపత్యానికి అల వాటుపడ్డ మహిళలు తమకేమి కావాలో, తామేమి చెయ్యాలో తెలియని అజ్ఞానదశలో పడి కొట్టుమిట్టాడుతున్నారు. సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక రంగాలలో రెండవ తరగతి పౌరులుగా చలామణీ అవుతున్నారు. అయినా అది న్యాయమేనని, పురుషులు అధికులేనని నమ్ముతున్నారు నాటి స్త్రీలు; నేటి స్త్రీలు కూడా. ఇది ఆనాటినుండి ఈనాటివరకు నడుస్తున్న చరిత్ర.

జరిగిపోయినదానికి ఎవరో ఒకరిని తప్పుపడుతూ కూర్చోవడంవల్ల ప్రయోజనం శూన్యమే. అవమానం పొందుతున్న వాళ్ళే అవమానాన్ని ఎదిరించాలి. సమాన హక్కులు కావాలి, కావాలి అని కేవలం వాదించటమే కాక, "మనం సంఘంలో ఒక భాగం, మనకూ సంఘ నిర్మాణంలో ఒక బాధ్యత వుంది" అనే ఆత్మవిశ్వాసం కూడా ఆడవాళ్ళు అలవరచుకోవాలి. విజ్ఞానంతో వ్యక్తులు మానసిక వికాసం పొంది ఆత్మగౌరవంతో మెలగ గలగాలి. స్వేచ్ఛ, సమాన హక్కులు ఒకరు మరొకరికి ఇచ్చేవి కావు అందిస్తున్నారని చెయ్యి చాపి మనం అంది పుచ్చుకునేవి అంతకన్నా కావు.

నేడు మనం అనుభవిస్తున్న ఈ అపమానతకు, అవమానాలకు కారణం అజ్ఞానం, అవివేకం, భావదాస్యం. ఇది కేవలం ఒక్క స్త్రీలలోనే కాదు మొత్తం సమాజంలోనే పాతుకుపోయిన అజ్ఞానలక్షణమేకాక మానసిక జాడ్యం కూడాను. ఈ అజ్ఞానం నుండి విముక్తి పొందటానికి దారి విజ్ఞాన వంతులం కావడమే. అంటే శాస్త్రీయజ్ఞానం పొందడమే. సాంఘికంగా అవమానకరమైన స్థితిలో వున్నవాళ్ళు ఎవరైనా చేయాల్సింది ఇదే. ఇది చెప్పుకోవటానికి తేలిగ్గా వుంటుంది కాని మూడువేల సంవత్సరాలుగా మనలో జీర్ణించిపోయిన సనాతనాచారాలు, మూఢవిశ్వాసాలు, మన్ని ఓ పట్టాన విడిచిపోలేవు. విద్యావంతులైన స్త్రీలు ఎంతమంది మానసిక దాస్య విముక్తి పొందుతున్నారో ఆలోచిస్తే మనకే అర్థమవుతుంది. అలా విముక్తులైన స్త్రీతే తోటి స్త్రీజాతిలో జాగృతి కలిగించగలరు. అలా కానప్పుడు ఈ సమస్య మరీ జటిలమైపొయ్యే అవకాశం లేకపోలేదు.

వ్యక్తి తన జీవితాన్ని సుఖవంతం చేసుకోవటానికి తపిస్తాడు. ఆ లక్ష్య సాధనకై మార్గాన్వేషణాపరు డవుతాడు. అయితే ఆ సుఖం అనే దానికి అర్థం మాత్రం ఆ వ్యక్తుల దృక్పథాలనుబట్టి వుంటుంది. అసలు జీవితంలో ఏమాత్రం స్వేచ్ఛలేకుండా సుఖపడటం అనేదానికి అర్థంలేదు. అలాగే జీవిత సమస్యలు, విలువలపట్ల ఏమాత్రం అవగాహన లేకుండా సుఖపడుతున్నాం అనుకోవటం వట్టి భ్రమే. ఈనాటి భారత సమాజంలో ఆడవాళ్ళు ఇలాంటి భ్రమల్లోనే జీవిస్తున్నారు. ఆ భ్రమ అనే ఊబినుంచి

ఏ ఒక్కరినీ మరొకరు బైటికి లాగలేరు. అలా లాగినందువల్ల బహుశ ఈ సమస్య మరింత గందరగోళం అవుతుంది. కనుక ఎవరికి వారే వాళ్ళ సమస్యలను పరిష్కరించుకో గలిగే వివేకం స్త్రీలలో కలిగించటంవల్లనే ప్రయోజనం వుంటుంది. అది చాలా బాధ్యతతోను, నిజాయితీతోనూ చేయాల్సిన పని. అలా జరిగిననాడే మనలో మార్పు వస్తుంది; మన సమస్యలు అన్నీ సమసిపోతాయి. ఆనాడే తమ హక్కులను కర్తవ్యాలను సైతం స్త్రీలు విస్మరించలేరు. సమసమాజఆవిర్భావానికి, సాంఘిక పురోభి వృద్ధికి, రాజకీయ దక్షతకు స్త్రీలు మార్గదర్శకులు కావాలంటే దానికి తగిన విద్య, వివేకం, సామాజిక అవగాహన, వారిలో ద్విగుణీకృతం కావాలి.

సమస్య లున్నాయని, వాటిని నిర్మూలించు కోవాలనే జాగృతి స్త్రీలలో కలిగిన నాడు సంస్కరించడం సుకరమవుతుంది. వ్యాధిని నిర్ణయించడమే కష్టం. దాని నిర్మూలన చాలా తేలిక. కనుక ముందుగా స్త్రీల పరిస్థితిని వారి సమస్యలను అవగాహన చేసుకోవాలి. చిక్కులను గుర్తించడం ఎంత కష్టమో సంస్కరించడం అంత తేలిక. ఎన్ని రకాలయిన సమస్యలున్నాయో అన్ని విధాలయిన సంస్కరణలు వున్నాయని నిరూపించగలం. బంధాలలో వున్నామని నమ్మితే విముక్తికై మనమే పోరాడగలం. అది మన చేతిలో పని. విముక్తి కాని, సంస్కరణ కాని, చాలా కష్టసాధ్యమే కాని అసలు దుస్సాధ్యం మాత్రం కాదు. ఇది గొప్ప నిత్య సత్యం.

-రచయిత

---

# వ్యభిచారం ఎవరి నేరం?

వేశ్యల సరఫరా, పడుపు గృహాల నిర్వహణాలాంటి వృత్తులు ఈ నాటి వ్యాపారాలలో ముఖ్యమైనవి, తేలికయినవి, లాభసాటివి కూడాను. బొంబేలాంటి పట్టణాలలో పడుపువృత్తి కేవలం కుటీర పరిశ్రమలా తయారయింది. అమాయక పిల్లలను మోసంచేసి వృత్తిలోకి దింపే దళారీలు, వేశ్యావృత్తికై వేశ్యాగృహాలు Brothel Homes) నడిపే యజమానులు, వీరందరినుండి పీడించి లంచాలు పుచ్చుకొనే పోలీసువర్గం బాగుపడుతున్నారు, వేశ్యలు మాత్రం రక్తమాంసాలు, మానాభిమానాలు కోల్పోయి జీవచ్ఛవాల్లా తయారయి, ఛీడపురుగుల్లా గుర్తింపబడి ప్రజల గౌరవాభిమానాలకు దూరమవుతున్నారు.

ఇటీవలి క్రొత్తక్రొత్త వార్తలు కొన్ని వింటుంటే గుండె ఝల్లుమంటోంది. వేశ్యావృత్తిని విడిచి తాము బ్రతకలేమంటూ డెబ్బైమంది వేశ్యలు హైదరాబాద్‌లో ధర్నా జరిపారు. ఈ సమాజం తమను పవిత్రంగా బ్రతక నివ్వదని, తమను వివాహమాడే నాథులు లేరని, తమకు పునరావాసం దుర్లభమని విడమరిచి సంస్కరణ వాదాన్ని వ్యతిరేకిస్తూ ఆ వేశ్యలు చెప్పుకున్నారు. పోలీసుల దౌర్జన్యం నశించాలంటూ, వృత్తి మానుకోలేమంటూ కూడా వారు వాపోయారు. శతాబ్దాల తరబడి జీవనాధారమైన ఆ భయంకరమైన వృత్తిపై విశ్వాసంతో వారు అలా సత్యాగ్రహం జరపడం స్త్రీ జాతికే కాదు మానవాళికే అవమానం కాదా!

సంచలనాత్మకమైన మరో సంఘటన తెలిసింది. పడుపువృత్తిని చట్టపరం చెయ్యాలంటూ ఒక వర్గం అలజడి ప్రారంభించి ఢిల్లీ, బొంబే పత్రికల్లో లేఖలు ప్రకటించారు. అందులో వ్యభిచార నిర్మూలన శాసనం చాలా లోపభూయిష్టంగా వుందని, దాన్ని అమలు పర్చటం అసాధ్యమని, తద్వారా సుఖవ్యాధులు విజృంభించి సామాజిక జీవితమే కలుషితమవుతున్నదని, సంసారులుడా సానులుగా తయారవుతున్నారని వారు

ఆరోపించారు. ఆ వృత్తిపై అదుపు అంటే పడుపు గృహాల నిర్వాహణకు లైసెన్సు లివ్వడం, ఆ గృహాలు విద్యాలయాలకు ఎంత దూరంలో వుండాలో నిర్ణయించడం, వేశ్యలకు తరుచూ ఆరోగ్యపరీక్షలు చేయించడం, వారి సుఖ రోగాలకు వైద్యం చేయించడంలాంటి ముఖ్య విషయాలన్నీ ప్రభుత్వ పర్యవేక్షణలోనే వుండాలని ఆ వర్గ సభ్యులు ఆ లేఖల్లో ఉటంకించారు.

ఈ మధ్య మరో వింత వార్త విన్నాం. పదివేలమంది పడుపు స్త్రీలు కలిసికట్టుగా ఢిల్లీలో ఒక సంఘాన్ని స్థాపించారు. వీరు ఒక వినతి పత్రాన్ని అధికారులకు అందచేశారు. అందులో వారు ప్రతి నెలా మామూలు క్రింద మూడు లక్షల రూపాయల రుసుం పోలీసులకు చెల్లిస్తున్నామని, అయినా ఇంకా తమను వేధిస్తూనే వున్నారని విన్నవించుకొన్నారు. రక్తమాంసాలమ్ముకొని సంపాదిస్తున్న మమ్మ ఇలా బాధించటం న్యాయంకాదని, అధికారుల బంధువులు వచ్చి మాతో సరసాలాడటం అసభ్యమని వారు మొరపెట్టుకున్నారు. ఇలాంటిదే మరో ఘోరం జరుగుతోంది. వేశ్యను ఏ పెద్ద ఘరానా మనిషి "రేప్" చేసినా "నీ వృత్తి అదేగా" అని ప్రశ్నిస్తారు; హేళన చేస్తారు. అంటే ఆమెపై అందరికీ "లైసెన్సు" వున్నట్లు వుంటుందా ప్రశ్న.

బొంబాయి, పూనాలోని వ్యభిచార గృహాలకు ఐదారువేల అమ్మాయిలు ప్రతి ఏటా బట్వాడా చేయబడుతున్నారని తెలిసింది. ప్రజలలోని మూఢనమ్మకాలను, గర్భ దారిద్ర్యాన్ని ఆసరా చేసుకొన్న బ్రోకర్లు తద్వారా ధనాన్ని మిక్కుటంగా గడిస్తున్నారు. అగ్ని దేవత అయిన ఎల్లమ్మకు తమ బిడ్డల్ని సమర్పిస్తే పవిత్ర మవుతారని అక్కడి ప్రజల నమ్మకం. ఆ సాంప్రదాయాన్ని స్వార్థపరులు, ధనపిపాసులు అయిన దళారీలు, బ్రోకర్లు వాడుకొని అభం శుభం తెలియని అమ్మాయిలను ఈ అమానుష వృత్తిలోకి దింపుతున్నారు. ఇలాంటి దారుణ సంఘటనలు చెప్పాలంటే సవాలక్ష ఉన్నాయి. అసలు పడుపువృత్తి శాశ్వత స్థానాన్ని ఎందుకు పొందింది? అది చాలక దాన్ని చట్టపరంగా ముద్ర వేయమనే వాదన ఎందుకొచ్చింది? అమలుపర్చలేని చట్టాలను సంస్కరించాలా? లేక

ఆ చట్టాన్నే మట్టుపెట్టాలా? అసలు ఎవరి సుఖం కోసం వేశ్యలు సృష్టింపబడ్డారు? ఈ వృత్తి ఇంకా ప్రజాదరణ ఎందుకు పొందుతోంది? శాసన పై ఫల్యం ఎందుకు జరిగింది? ఈ దుర్వృత్తిని ఎలా పరిష్కరించాలి అనేవి మౌలిక ప్రశ్నలు; చర్చనీయాంశాలు. అంతేకాదు ఇది ఈనాడు సంస్కర్తలను, మేధావులను వేధిస్తున్న సమస్య.

మతానికి, మన సమాజానికి వున్న ఐక్యత ఈనాటిదికాదు. వేశ్యా వృత్తికి నాంది మతమే. ఇప్పటివరకు మన్ని శాసించిన మతమే ఆనాడు దేవదాసీ వ్యవస్థను స్థాపించింది. వేదాల తర్వాత సంగీత, సాహిత్య, నృత్యాలతో దేవుని పూజించి సంతృప్తి పరచాలని నిర్దేశించారు స్మృతి కర్తలు. కౌటిల్యుని అర్థశాస్త్రంలో దేవాలయ వ్యభిచారిణులను "నృత్య కత్తెలు"గా పేర్కొన్నాడు. దేవునికి దాసీలుగా నియమింపబడ్డ దేవదాసీలు "దైవ ప్రతినిధులైన" పూజారులకు ఉంపుడుగత్తెలుగా దిగజార్చబడ్డారు. మధ్యయుగాల్లో రాజులు, జమిందార్లు, పురోహితవర్గం ఉంపుడుగత్తెలను ఉంచుకోవడం భేషజంగా వుండేది. వారికి రాజులు, భూస్వాములు, జమిందార్లు ఈనాములు ఇచ్చి పోషించేవారు. రాజ్యాలు, జమీలు పోయాక వారు కళావంతులయ్యారు. అంటే ఆడపిల్లలకు ఆటా, పాటా నేర్పించి "కష్టమర్సును" మురిపింప చేయించేవారు. అది పాపమని, అవినీతి అని తెలియనియ్యకుండా అలంకారాలవైపు, ఆస్తులవైపు వారిని మళ్ళించేవారు. వీరికి అసలు వివాహాలే వుండేవి కావు. దేవదాసీలకు మాత్రం కత్తితోనో, విగ్రహంతోనో పెళ్ళిచేసేవారు. అందువల్ల పురుష సాంగత్యం జరిగినా దేవుడు శిక్షిస్తాడనే భయం వారికి ఉండేది కాదు. కొందరు వృత్తి చేసుకుంటూ అంటే ఒక్కనితోనే వుంటూ భోగం మేళాలకు వెళ్ళేవారు. ఆ రోజుల్లో భోగంమేళం లేని పెళ్ళిళ్ళు, సుభకార్యాలు జరిగేవి కావు. క్రమేపి వారి అందం, ఆకర్షణలకు కాముకులైన పురుషులు కళావంతులను ప్రలోభ పెట్టి వారిని చెడగొట్టి వృత్తిలోకి ఈడ్చారు. అలా ఈ వృత్తి అభివృద్ధి చెందుతూ ఈనాటికి ఘనీభవించింది.

ఈ వృత్తిలోకి నానారకాలవారూ వచ్చి చేరుతున్నారు. సంఘ కట్టుబాట్లకు బలియైన బాల వితంతువులు, భర్తల హింసలు భరించలేని

వారు, పెళ్ళికాని తల్లులు, భర్తచేత విడిచివేయబడ్డవారు, కుటుంబ బాధలు (అత్తమామలు, వగైరాలవల్ల) భరించలేనివారూ, ముసలి మొగుళ్ళవల్ల అనుమానింపబడేవాళ్ళూ పారిపోయి బ్రోకర్ల ద్వారా ఈ ఊబిలోకి దిగబడిపోతున్నారు. ఇక పెళ్ళాడుతామని నమ్మించి మోసం చేయబడ్డవారు; రేప్ చేయబడ్డవారుకూడా దారితెన్నూ గమ్యంలేక ఈడ్చబడుతున్నారు. సినిమాల్లో చేరుస్తామని, ఉద్యోగా లిప్పిస్తామని ఆశచూపి నాశనం చేయబడ్డవారూ, ఇందులోకి చేరిపోతున్నారు. అన్నింటికన్నా ముఖ్యమైనది ఆర్థికం. దుర్భరమైన దారిద్ర్యంవల్ల ఆడపిల్లలను అమ్ముకునే తండ్రులు, అన్నతమ్ములు వున్న సమాజం మనది. అలాగే ఇష్టంగానో, అయిష్టంగానో భార్యలను వృత్తి కప్పగించే భర్తలున్నారని చెప్పడం నేరంకాదు. కుటుంబంలో ఏ కష్టమొచ్చినా, ఏ బాధవున్నా, మరే అవమానం జరిగినా అన్యాయం జరిగేది ఆడదాని కనేది నగ్న సత్యం.

ఇక వేశ్యల జీవితాలు సర్వేచేస్తే చాలా హృదయ విదారకంగా వుంటాయి. తలకొక కథ; జీవితానికొక సమస్య; వ్యక్తికొక విషవలయం వున్నాయి. తుదీ మొదలూ లేని చిక్కుపడిన దారపు వుండలు వారు. గమ్యంలేని ప్రవాహం వారి జీవితం. మోడుబారి చిగురించని అభాగినులు ఎవ్వరంటే వేశ్యలని చెప్పుకోవచ్చు. మైనపుబత్తులా భోగ పురుషులకు, కాముకులకు వెలుగునిస్తూ తాముమాత్రం హరించి హతమైపోతున్నారు, పైగా ఏ సమాజమైతే, ఏ పురుషులైతే వారికి ఈ గతి ట్టించారో వారే కులట, పతిత, సానిపిల్ల, అది చెడిందిరా, పగిలిన కుండరా! అంటూ ధుమ్మెత్తి పోస్తున్నారు. అందుకే వారి జీవితాలు మొద్దుబారిపోయినై. వారిలో చలనంకాని, స్పందనకాని, "యాంబిషన్" కాని కాగడాలేసి చూచినా కనిపించవు.

ఆ మధ్య "రెడ్‌లైటు ఏరియా" వెళ్ళి చూచిన కొన్ని జ్ఞాపకాలు ఇవి. ఆ ప్రాంతానికి "కామాటిపుర" అని పేరు. అక్కడ యుక్తవయస్కురాలి నుండి యవ్వనం ఉడుగుతున్న యువతులవరకు దారి కిరుప్రక్కలా వేలసంఖ్యలో బారులు తీర్చి నిలబడి వుంటారు. మేడలమీది కిటికీల్లో,

మిద్దెలముందు పంచల్లో వీధి వరండాల్లో, అరుగులమీదకూడా ముస్తాబై నవ్వుముఖాలతో పలకరిస్తూ వుంటారు. వారి చూపులన్నీ పురుషులను ఆకర్షించేలా వుంటాయి; విటులను ఆహ్వానిస్తూ వుంటాయి. స్నోలు, లిప్‌ష్టిక్‌లు రాసుకుని కనుబొమ్మలకు, చెక్కిళ్ళకు చక్కని రంగులు దిద్దుకొని, పూలు ముడుచుకొని, సెంటు రాసుకొని కస్టమర్సుకొరకై నిరీక్షిస్తూ వుంటారు. ఆ విలాసినులను చూడగానే మనస్సు ఝల్లుమన్నది. శరీరం గగుర్పొడిచింది. నిస్పృహ నన్నావరించింది. అయ్యో! వీరేనా మన తోటి అక్కచెల్లెళ్ళు! మన సంఘసభ్యులు! మన ఇంటి ఆడబడుచులు! మాట పెగిలి బైటికి రాలేదు. వేశ్యావాడల గురించి, వృత్తి మర్మాల గురించి వినటమేకాని కళ్ళారా చూచింది ఆరోజే.

నాలోని సంచలనం కాస్త సద్దుమణిగాక తెలుగు ముఖాలను గుర్తుపట్టి, సానుభూతితో దగ్గరికెళ్ళి తల్లిలా ప్రశ్నించటం మొదలుపెట్టాను. నన్ను చూచి చాలా చికాకుపడ్డారు. నీకెందుకుపో అన్నట్లు కోపంగా చూశారు. మూతులు తిప్పుతూ, కనుసౌజ్ఞలతో ఒకళ్ళనొకళ్ళు చూసుకున్నారు. నాకు భయం, ఆదుర్దా కలిగాయి. నిగ్రహించుకున్నా. కిమ్మనకుండా భుజాలమీద చెయ్యివేసి చూడు తల్లీ! మిమ్మల్ని ఆక్షేపించటానికి రాలేదు మీకేదైనా విముక్తి కలిగించగలనేమోననే పుట్టెడాశతో శ్రమపడి వచ్చానమ్మా! అంటూ బుజ్జగించాను. ఆ! మా కష్టాలు మీకు కథలుగా వుంటాయి లెండి. మీరు రచయిత్రులా! మా జీవితాలు కుప్పేసి కథలు రాస్తారా! అంటూ వెక్కిరించిందొక పిల్ల. కాస్త ఓర్పు, ధైర్యం తెచ్చుకొని మీరు ఎక్కడినుండి ఇక్కడికి చేరారు? ఎందుకొచ్చారు? ఎంత సంపాదిస్తున్నారు? పిల్లలున్నారా? పెళ్ళాడి సుఖంగా బ్రతకరాదా అని నెమ్మదిగా అడిగా. కొద్దిమందికి నా మీద కొంత గౌరవం కలిగింది. మా బాస్ మమ్మల్ని మీతో మాట్లాడనియ్యడమ్మా చూస్తే తంతాడు. ఫోటోలు తీసినా, మా కథ లడిగినా చీల్చేస్తాడు. మీరు త్వరగా పోవాలి. అన్నదొక చిన్నది భయంతో చుట్టుప్రక్కల చూస్తూ, నాకేం భయం లేదు మీ సంగతులు విని పోతానన్నా మళ్ళీ.

మా బ్రతుకులు బండబారి పొయ్యాయి. మా జీవితాలు ఇలా

తెల్లారిపోవాల్సిందే. మమ్మల్ని ఎవరు పెళ్ళాడతారు? అన్నదొక పిల్ల గతాన్ని వూహిస్తూ. ఇక వారి యదార్ధ గాధలు వింటుంటే కాలిక్రింద భూమి కదలాడిపోయింది. నేనొక ఘరానా పెద్ద మనిషిని నమ్మి చెడిపోయాను. వాడు నన్ను ఆరు నెలలు వాడుకొని మా ఓనర్‌కి అమ్మేసి పొయ్యాడని ఏడ్చింది. సవతి తల్లి పోరు పడలేక పారిపోయి మా ఖామందు (ఆడబాస్) చేతుల్లో ఇరుక్కుపోయానని మరో అమ్మాయి చెప్పింది. "తిండీ తిప్పలూ లేక మా అయ్య నన్ను మా యజమానికి ఇచ్చి పారిపోయాడు. ఈడేమిచ్చాడో, ఆడేమి పట్టుకెళ్ళాడో నా కెరుక లేదు. మళ్ళీ మా అమ్మా అయ్యలను చూడనేలేదు" అని గతుక్కుమన్నది మూడో పిల్ల. పెళ్ళాడిన పెనిమిటే దించి పోయాడని, ఉద్యోగాలని, ఊరు చూడాలని, సినిమాల్లో చేరాలని, చెరచబడ్డ వాళ్ళూ కూడా గుడ్డాలేనివాళ్ళూ మా గూడెంలో చేరిపోతున్నారండీ అన్నదో అమ్మాయి బుజాలెగరేస్తూ. మీరంతా స్నేహంగా వుంటారా అన్నప్పుడు, అందరం కూటికేగా వచ్చింది. అయినా పోట్లాటలు, గొడవలూ వస్తాయి. మా పేశింజేరు (విటుడు)ని లాకెళ్ళినప్పుడు జుట్టుపట్టుకుంటాం అన్నది కళ్ళుతిప్పుతూ. ఆ వాతావరణంలో వాళ్ళకు సిగ్గు, లజ్జ, మానాభిమానాలు నశిస్తాయి. వాళ్ళకు కావాల్సింది జతగాళ్ళ సంఖ్య తద్వారా డబ్బు, వారి చూపు, ధ్యేయం అదే.

వారి దినచర్య చాలా హృదయ విదారకంగా వుంటుంది. ఉదయం పదికొట్టేసరికి ఇంత తిని, పిల్లలుంటే పెట్టి ఒక ముసలిదానికింత తినిపించి పిల్లల్ని దాని కప్పగించి వస్తారట. నిస్సత్తువతో, నీరసంతో రాత్రి పవిహాటాక కొంపలకు చేరతారు. వాళ్ళ గుడిసెలు ఊరిచివర మురుగు కాల్వ ప్రక్కన వుంటాయి. భయంలేదా అంటే మాకు పొయ్యేదేముంది! దారిలో ఓ రౌడీ అడ్డగిస్తే పోనీలే అని మిన్నకుంటాం. లేకపోతే తంతాడు గదా! ఇదీ వారి భాష.

వారు సర్వనాశనమైనా వారి ఆదాయం మాత్రం చాలా స్వల్పంగా వుంటుంది. వారిలో రెండు రకాలు. ఓనర్-బాస్ క్రింద వృత్తిచేసే

వారి ఆదాయం అంతా యజమానిదే. తిండి, పై ఖర్చులూ దక్కుతాయి. సొంతంగా వృత్తికునేవారికి మంచం అద్దె ఇంటి యజమానికి రోజుకు పది, పూలు, సబ్బులు కాఫీలకు పది, దళారి లేక డాఫర్‌కు రాబడిలో సగం, ఇచ్చుకోవాలట. ప్రతి పేశింజేరుకు పదికి తగ్గకుండా పరిస్థితినిబట్టి పుచ్చు కుంటారట. రాబడి అదృష్టాన్నిబట్టి వుంటుందట. ఈ రోజు ఒక్క పేశింజేరుకూడా దొరకలేదమ్మా! ఈమధ్య ఈ వృత్తిలోకి చేరుతున్నవారి సంఖ్య పెరిగిపోతోంది. అందువల్ల దీని డిమాండ్ తగ్గిపోయిందని తెల్చి చెప్పారు. కొన్ని సమయాల్లో దళారి ముందుగానే నిన్న మొన్నటి దంటూ పూర్తిగా కాజేస్తాడు. మేము దొంగలెక్కలు చెప్తామంటూ నెపం వేస్తాడు. మాచుట్టూ కాపలా పెడతాడు. న్యాయం చెప్పాలంటె తిండి, గుడ్డా, నీడలకుకూడా గ్యారంటీలేని చీకటిబ్రతుకులు వారివి.

పూర్వం సానివాడలంటూ, భోగంపేటలంటూ ఊరిచివర్లో వుండేవి. అలాగే బొంబేలో దానికొక ప్రాంతాన్ని కేటాయించడం, దాన్ని చట్టం ద్వారా అరికట్టకపోవటం అమానుషమేకాక సాంఘిక నేరం కాదా అని ఒక అధికారిని నేను ప్రశ్నిస్తే "గృహవసతి లేక బొంబేలో అనేకమంది ఉద్యోగులు పెళ్ళాడరు. భారలున్నవారు సైతం తెచ్చి కాపురాలు నిర్వహించ లేరు. మరి వారికి ప్రకృతిసిద్ధమైన సెక్స్ కోరిక తీరేది ఎలా!" అన్నాడు నవ్వుతూ. తమ సుఖసంతోషాలు తప్ప స్త్రీల సమస్యలు, సామాజిక అవ గాహన లేని వారి సంభాషణకు ఈ సమాధానం నిదర్శనం.

ఇందరిచేత పీడింపబడుతూ, ఇన్నిరకాల ఇబ్బందులకు లోనౌతూ కడుపు కక్కుర్తికి వ్యభిచరిస్తున్న వేశ్యలది నేరమా ? మోసగించి తప్పు కునే పురుషులది నేరమా ? పరిస్థితుల నర్థంచేసుకోకపోగా ఆ స్త్రీని నిందించే సమాజానిది నేరమా? వారికి జీవనోపాధి కల్పించలేని ప్రభుత్వా నిది దోషమా ? ఆలోచించండి!

1875 లోనే అంతర్జాతీయ వ్యభిచార నిర్మూలనా సంస్థ ఏర్పడినా అడుగు ముందుకు పడలేదు. 1956 లో మనకు వ్యభిచార నిర్మూలనా చట్టం అమల్లోకి వచ్చింది. ఏటా కొన్ని వేలమంది వేశ్యలను ఆ చట్టం పేరుతో

శిక్షిస్తున్నారు. స్త్రీని వేశ్యగా తయారుచేసి తమ శృంగార తృష్ణకు సాధనంగా వాడుకుంటున్న పురుషుడికి ఏ శిక్షా లేదు. ఆర్థిక భద్రతలేక, సామాజిక రక్షణలేక, వ్యవస్థ కట్టుబాట్లకు తలవంచిన స్త్రీని శిక్షించటం గర్హనీయం. వేశ్యలను వాడుకుంటున్న పురుషులను శిక్షించటం న్యాయం. ఇంకా వారిని సాంఘికంగా బహిష్కరించి బుద్ధిచెప్పాలి. అందుకే స్త్రీల స్టేటస్ కమిటీవారు వేశ్య అయిన స్త్రీని మాత్రమే శిక్షించే ద్వంద్వ నీతి మారాలని సిఫారసు చేశారు.

స్త్రీకి ఆర్థిక స్థిరత్వం ఏర్పడితే తప్ప ఈ వృత్తి నశించదు. సమాజంలో బీదరికం, అజ్ఞానం, అమాయకత్వం, మోసం ఉన్నంతకాలం స్త్రీ అయినా పురుషుడైనా నైతికపతనం అనివార్యం. కాలుజారి పొరపాటు జరగడం వేరు. ఆ పొరపాటుకు శిక్షగా అవినీతికరమైన వృత్తిని చేపట్టం వేరు. వ్యభిచారాన్ని నూటికి నూరుపాళ్ళు వెంటనే నిర్మూలించలేక పోవచ్చుకాని విధిగా స్వీకరించాల్సిన పరిస్థితిలేకుండా మనం చేయగలం. ఆ పని దుస్సాధ్యమైనా అసాధ్యంమాత్రం కాదు. ఆ వృత్తితో జీవించే స్త్రీలకు విద్యా, ఉద్యోగావకాశాలు భారీఎత్తున విస్తరింపజేయాలి. ప్రత్యామ్నాయ జీవిత అవకాశాలు ప్రభుత్వం కలిగించాలి. ఇదొక బృహత్తర ప్రణాళికగా చేపట్టాలి. కలరా, మశూచిలాంటి అంటుజాడ్యాల గురించి తీసుకుంటున్న భయాందోళనలు ఈ స్త్రీల గురించికూడా తీసుకోవాలి. లేకుంటే ఈ విష సంస్కృతి ముందుముందు సమాజాన్నే కబళిస్తుంది. ముందుగా మతస్తుల చేత తరతరాలుగా చెప్పబడిన నీతులకు బలి అయిపోయిన అభాగినులను శిక్షించే హక్కు సమాజానికి లేదని మనం వాదించాలి. స్త్రీని వేశ్యగా తయారుచేసి వాడుకుంటున్న పురుషులలో జ్ఞానోదయం కలిగించటం చాలా అవసరం. ఈ వృత్తి నిర్మూలనకై స్త్రీ జాతిలో జాగృతిని, చైతన్యాన్ని కలిగించటం అవశ్యకర్తవ్యం. బృహత్తర పథకాలతో, సేవా నిరతితో, బాధ్యతతో, నైతిక దృక్పథంతో వేశ్యలకు పునరావాస సౌకర్యాలు కలుగజేయాలి. ఇది ఏ ఒక్కరి సమస్యాకాదు. ప్రపంచ సమస్య; మానవాళి సమస్య. కనుక స్వచ్ఛంద సేవకులు, సామాజిక శాస్త్రజ్ఞులు రంగప్రవేశం కావాలి. ముఖ్యంగా మహిళా కార్యకర్తలు తోటి స్త్రీల భవిష్యత్తుకై నడుంకట్టాలి. అన్ని రంగాలవారు కలిసి కట్టుగా, పట్టుదలతో పనిచేసిననాడే ఈ వృత్తి నిర్మూలనం కాగలదు.

కలువబాల 1-15 సెప్టెంబరు 1985

# స్త్రీ స్వేచ్ఛ = పురుష బానిసత్వమా ?

స్త్రీ స్వేచ్ఛ అంటే పురుష బానిసత్వమనీ, మహిళా హక్కుల పోరాటమంటే మగవారిపై తిరుగుబాటనీ, యువతులు ఉద్యోగాలనీ, సంఘసేవనీ తిరుగుతుంటే పిల్లల భవిష్యత్తు నశిస్తుందని, కుటుంబానికి విచ్ఛిత్తి కలుగుతుందని ఒక వర్గం వాదిస్తోంది. అసలు స్త్రీలు బంధితులు, బాధితులు అయితేనేకదా వారికి విముక్తి! ఈ దేశంలో స్త్రీకి ఇచ్చిన హోదా, గౌరవం అనన్యసామాన్యమనీ, ఆమెను గృహదేవతగా పూజిస్తున్నామనీ, మాతగా గౌరవిస్తున్నామనీ, "బెటర్ హాఫ్"గా ఆరాధిస్తున్నామని మరోవర్గ పోరాడుతోంది. ఆమెకు రక్షణ వుంటేనే మంచిదనీ, బైటికి పోతే అపవాదు లొస్తాయనీ కొందరు వాపోతున్నారు. స్త్రీకి నిజమైన స్వేచ్ఛ సమానత్వాలు ఇస్తే మళ్ళీ మాతృస్వామ్యం వస్తుందని భయపడేవారి సంఖ్య అనంతం. ఇన్నాళ్ళుగా స్త్రీ బానిసత్వంలో ఉన్నదనీ ఆమెకు విముక్తి కావాలనీ, స్త్రీలకు ప్రత్యేక సమస్యలు లేవనుకోవడం భ్రమ అనీ ఆధునికులు అలజడి చేస్తున్నారు. కనుక స్త్రీ స్వేచ్ఛ చర్చనీయాంశ మయింది.

హాయిగా ఆడేహక్కు నెమలికి, పాడేహక్కు కోయిలకూ, ఎగిరేహక్కు పక్షికీ, గంతులేసే హక్కు జింకకూ వున్నాయి. కాని సర్వలక్షణాలు, వ్యక్తిత్వం, విద్వత్తు, మేధస్సూ గలిగిన మహిళకు ఏ హక్కూ లేకపోవడం ఆశ్చర్యమే కాదు; అశనిఘాతం కూడాను. స్వేచ్ఛగా ఆలోచించడం ఆచరణలో పెట్టడం స్త్రీకి జన్మహక్కు. దాన్ని కాలరాయడం మహా ఘోరం. సాంఘిక న్యాయం ప్రాథమిక సూత్రంగా భావించే మన రాజ్యాంగంలో సగంమంది అణగద్రొక్కబడి వుండటం సాంఘికద్రోహమే కాదు "రాజ్యాంగ విఘాతం" అని నిర్వచించవచ్చు. భారత స్త్రీ చట్టపరంగా చాలా అదృష్టవంతురాలు. కాని ఆచారపరంగా, మతపరంగా, చారిత్రికంగా ఆమె చాలా దురదృష్టవంతురాలు. "అంగట్లో అన్నీ వున్నాయి అల్లుడి నోట్లో శని వుంది" అన్నట్లు ఆడవారికి హక్కులన్నీ చట్టాల్లో వున్నాయి కాని, అవి అనుభవంలో శూన్యమయినాయి. కారణం— స్త్రీని పురుషుడు అణగద్రొక్కటమే కాక పురుషాధిక్య భావాలు జీర్ణించుకున్న స్త్రీ సైతం తన్ను తాను లోబడివుండ

మని రాసించుకుంటోంది. స్త్రీ బానిసత్వం ప్రకృతి సిద్ధమనీ, అది భగవత్ నిర్ణయమనీ ధర్మశాస్త్రాలు, పురుషులు స్త్రీలకు ఉగ్గుపాలతో నేర్పిన విద్యా బీజం మహావృక్షమై, శాఖోపశాఖలై విస్తరించి ఈనాడు చట్టం, సమాజం వారికి స్వేచ్ఛాసమానత్వా లిస్తామన్నా ఆ సంకెళ్ళు త్రెంచుకోలేని ఖైదీ వలె భయపడుతున్నారు మన మహిళలు. వారు కుటుంబ పరిధిని దాటలేకపోతున్నారు. కుటుంబ సంరక్షణ, పిల్లల పోషణ, భర్తకు పరిచర్యలూ చేస్తూ గృహిణిగా గౌరవ మర్యాదలు పొందాలనేదే ఆమె ప్రగాఢ వాంఛ. "భరించేవాడు భర్త" కనుక అతని అదుపు ఆజ్ఞలను తాను అధిగమించరాదనే భావం స్త్రీల నరనరాన నాటుకుపోయింది. స్త్రీల ఆర్థిక అసమానతలకు కారణాలు భౌతికమైనవి కాగా సాంఘిక అసమానతలకు మూలం మానసికమైనవి. అందువల్లే మానసిక దాస్య విముక్తి చాలా కఠినమైనది. దాన్ని త్రుంచి వేయాలంటే ఒక దశాబ్దం కాదు కదా కొన్ని శతాబ్దాలు పట్టవచ్చు. కరుడుగట్టి, ఘనీభవించిన పురాతన ఆచారాలు, సంప్రదాయాలు, మూఢ నమ్మకాలు మనల్ని ఒకపట్టాన విడిచిపోలేవు. మనం ఊహించే ప్రాచీనకాల స్త్రీల స్థితి నిజమో కాదో కానీ ఈనాటి పరిస్థితినిబట్టి ఇంకా ఆమె రెండోతరగతిని అధిగమించలేకపోతోంది. చట్టాలెన్ని వచ్చినా సంస్కరణ లెన్ని జరిగినా స్త్రీ జీవితంలో మౌలికమైన మార్పురాలేదు. పితృస్వామ్య వ్యవస్థలోని కట్టుబాట్లు, ఆచారాలు, ఆమెను బానిస మనస్తత్వంనుండి మరలించలేక పోతున్నాయి. ఏ ఒకరో ఇద్దరో మారితే చాలదు. మిగతా 99 మందిని గురించి మనం ఆలోచించాలి.

ఇటీవలి పురుషులలో విరుద్ధ మనస్తత్వాలు గోచరిస్తున్నాయి. తన ఇల్లాలు తనకు దాసిగా వుండాలని కొందరు వాంఛిస్తుంటే, ఆమె గొప్పదై ఆమెవల్ల తనకు పేరుప్రతిష్టలు రావాలని మరికొందరు ఆశిస్తున్నారు. ఆమె చక్కనిదై, విద్యాబుద్ధులు కలిగినదై, గొప్ప ఉద్యోగార్హత గలదై, ఇన్ని వుండి తనకు లోబడి వుండాలని అనేకమంది కోరుకుంటున్నారు. అసలు జాగృతి, వికాసం కల స్త్రీని తమ అదుపు ఆజ్ఞలలో వుంచాలనుకోవటం అమానుషం, అక్రమంకాదా? అనే ప్రశ్నకు సమాధానం దొరకదు.

స్త్రీకి స్వేచ్ఛా, సమానత్వాలు లేవనేదానికి నిదర్శనాలు కోకొల్లలుగా వున్నాయి. ఆడా మగా తేడాలు "ప్లెస్సా, మైనస్సా" అంటూ పుట్టుకతోనే ప్రారంభమవుతాయి. విద్యలో ఆడదానికి చదువెందుకు అనేవారు ఇంకా లేకపోలేదు. పెళ్ళికాని స్త్రీకి భవిష్యత్తే లేనట్లు, అదేదో సాంఘిక ద్రోహంగా కుటుంబ పతనంగా, నెత్తిమీద కుంపటిగా బాధపడతారు. "ఉద్యోగం పురుష లక్షణ"మంటూ వెంటనే చదువుకు తిలోదకా లిప్పిస్తారు. ఇక వరాన్వేషణ సాగిస్తారు. అప్పోసప్పో తెచ్చి ఆ కన్యను దానంచేస్తారు. అసలు కట్నం ఇవ్వటంలోను పుచ్చుకోవటంలోను పురుషుడెక్కువా, స్త్రీ తక్కువా అనే భావం వున్నదా లేదా ? అత్తగారే కట్నం అడుగుతున్నారని ఆక్షేపించడం అర్ధరహితం కారణం–పురుషుడుగా పుట్టిన తన కొడుకు గొప్ప అనే భావం అత్తగారిలో మూర్తీభవించడంవల్లే కట్నం పుచ్చుకోవటం, తన కుమార్తెకు కట్నం ఇవ్వడం జరుగుతోంది. అలాగే ఏకన్యకు కడుపుఅయినా, ఏ కోడలు విడాకులు కోరినా, ఏ విధవరాలు మళ్ళీ పెళ్ళాడినా తోటి స్త్రీ ఈసడిస్తోంది. పురుషాధిక్య భావాలు తమవిగా (Internatise) చేసుకొని ఆ హద్దు దాటిన స్త్రీని మరో స్త్రీ దూషిస్తుంది. ఈ భావం అర్ధంకాక "స్త్రీకి స్త్రీయే శత్రు" వనుకుంటున్నారు. మనం ప్రతి సమస్యను మౌలికంగా ఆలోచించాలి. అలాగే రాజకీయ హక్కులుగాని, ఆస్థి హక్కుగాని అనుభవించటానికి స్త్రీకి తగిన చొరవ, విద్యావిజ్ఞానాల లేమియే కారణమని మనం గ్రహించాలి.

వెయ్యేండ్లనాటి చట్టాలు, ఆచారాలు ఈనాటి సాంఘిక పరిస్థితికి అనుగుణమా, కాదా ? అని ఆలోచించాలి. నేటి మానవుడు విశ్వమానవుడు అయినాడు. విజ్ఞానం విశ్వకవాటాలను బ్రద్దలు చేస్తుంది. రోజు కొక క్రొత్త మార్గం చూపబడుతోంది. సాంఘిక, రాజకీయ, ఆర్థిక వ్యవస్థలు రోజురోజుకూ మార్పు చెందుతున్నాయి. కాని పాతకాలపు మూఢాచారాలు, అలవాట్లూ మారకపోగా అజ్ఞానం, అవిద్యలతోపాటు అవీ పెరుగుతున్నాయి. సమాజంకూడా కాలంతోపాటు పునర్వికాసం చెందడం లేదు. మనం 20వ శతాబ్దంలో వున్నాం, కాని మన భావాలు 16వ శతాబ్దాన్ని అధిగమించలేక పోతున్నాయి. అందువల్లే ఆధునిక స్త్రీకి ఏ స్థానం ఇవ్వాలన్నది గడ్డు

సమస్య అయికూర్చుంది. ఇటు పూర్తిగా స్వేచ్ఛాసమానత్వాలు ఇస్తే ఏం కొంప మునుగుతుంతో, అటు ఇవ్వకపోతే తిరుగుబాటు చేస్తే ఆప గలమా! అనే సందిగ్ధావస్థలో పడ్డారు పురుషులు. ఇదొక రకంగా సంధి యుగ మయింది.

పనికిమాలిన సిద్ధాంతాలను, పురాతన సంప్రదాయాలను పార ద్రోలటం ఎంత కష్టమో, ఆధునికతను ప్రవేశపెట్టటం అంతకన్నా కష్టం. కాని ఎప్పుడో అప్పుడు, ఎక్కడో అక్కడ ప్రవేశపెట్టాలికదా! ఎంత ఖరీదు పెట్టి కొన్న చీరె అయినా పాతబడితే దానితోనే ఇల్లు తుడుస్తాం. అలాగే కాలంతోపాటు సంస్కృతి, దానితోపాటు నాగరికతా కూడా మారాలి. ఈనాడు నాగరికత ఆధునికమైన రూపురేఖలు దిద్దుకుంటోంది. కాని మన భావాలకు మూలమైన మన సంస్కృతిలో చెప్పుకోదగ్గ మార్పురాలేదనేది నగ్నసత్యం.

వ్యక్తియొక్క హుందాను గుర్తించడం ప్రజాస్వామ్య ప్రాతిపదిక సూత్రం. ఈ సూత్రం ప్రకారం సామాజిక, రాజకీయ, ఆర్థిక విషయా లన్నింటిలో స్త్రీలు పురుషులతో సమానమైన హక్కులు కలిగి వుండాలి. అలాకాక నేటి స్త్రీలు రెండురకాల బాధలకు గురి అవుతున్నారు. అవిద్యా, అజ్ఞానాలు వారిలో పురుషులకన్నా హెచ్చుగావుండి ప్రగతిని సాధించలేక పోతున్నారు. దేశంలో విద్య ఈనాడు 42% కాగా స్త్రీ విద్య 19% మాత్రమే వుంది. ఈ పరిస్థితిలో వారి ప్రతిభకు శక్తియుక్తుల వికాసానికి అవకాశం శూన్యమవుతోంది. వికాసం పొందని స్త్రీలు పెంచిన పిల్లలు సాంస్కృతికాభివృద్ధి లేనివారవుతారు. అందువల్ల స్త్రీ విమోచన కేవలం స్త్రీలకు మాత్రమేకాక యువతీ సమాజానికి అత్యవసరమని గ్రహించిననాడే మనకు భవిష్యత్తు వుంటుంది.

స్త్రీకి సంపూర్ణ స్వాతంత్ర్యం వచ్చినా మానవత్వానికి ప్రధానమైన సహజ కర్తవ్యాలను విస్మరిస్తుందనుకోవటం శుద్ధతప్పు. ఆ అపోహవల్లనే పురుషులు భయంతో తల్లడిల్లిపోతున్నారు. సంసార సారథ్యంలోను, మాతృత్వ బాధ్యతలోను, దాంపత్య జీవితంలోనూ మహిళలు కర్తవ్యతా

విమూఢులు కానేకారు. పరిపూర్ణత్వం గల స్త్రీ స్వయం శిక్షణద్వారా తన జీవితాన్ని సరిదిద్దుకోగలదు.

స్వేచ్ఛా సమానత్వం పరస్పరాశ్రయాలు. బానిస-యజమానుల మధ్య స్వేచ్ఛగాని, స్నేహభావం కాని వుండవు; వుండలేవు. కనుక మహిళలు సమానత్వం పొందాలంటే పరాధీన స్థితినుండి బయటపడాలి. తమ న్యాయమైన స్థానాన్ని దయాదాక్షిణ్యాలుగాకాక హక్కుగా పొందగలగాలి; దానికి ముందుగా మానసిక దాస్య విముక్తి కలగాలి. దానికి నాంది భావవిప్లవమే-అంటే పాత వ్యవస్థను మార్చటమే.

స్త్రీ పురుష సమానత్వమన్నా, స్త్రీ విమోచన అన్నా హక్కులూ, బాధ్యతలూ రెండూ స్త్రీలు కూడా పురుషులతో సమానంగా అనుభవించడమే. వ్యక్తిత్వ పరిగణన, ఆర్థిక భద్రత స్త్రీలు ముందుగా పొందగలిగితే రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక రంగాలలో సమానత్వం లభించడం తేలిక. అసలు సమానత్వాన్ని అంగీకరిస్తే ఎలా సాధించగలమో వివరించుకోవచ్చు. సమానత్వాల్ని రెండు రకాలుగా ఉదహరించుకోవచ్చు.

ఉన్నంతలో సమానత్వం - అంటే వున్న అవకాశాలను ఇద్దరూ సమానంగా అనుభవించడం మొదటిది. అలాకాక పురుషులు అనుభవిస్తున్న ఉన్నత స్థానాన్ని కదిలించకుండా స్త్రీకి ఇతోధికంగా అవకాశాలు కూర్చడం రెండవది. సమాజం మొత్తంలో వనరులు పెరిగి ఉత్పత్తి పెరిగి ఉద్యోగాలు పెరిగినప్పుడే అది సాధ్యమవుతుంది. అంటే ఒక రకంగా స్త్రీ కోరే స్వేచ్ఛను వాయిదా వేయడమన్నమాట. ఇది తగని పని. వనరులు, అవకాశాలు తక్కువగా వున్న సమాజంలో సమానత్వం రావాలంటే వనర్లు తగ్గక తప్పదు. ఉ॥ పురుషులకే చేజిక్కుతున్న ఉద్యోగాలు స్త్రీల కివ్వక తప్పదు. అప్పుడు తాము నష్టపడుతున్నట్లు స్త్రీలను ఘోష పెడతారు. కుటుంబాన్ని పోషించే తాము నిరుద్యోగులవడం ఘోరమని రభస చేస్తారు. సమసమాజంలో న్యాయంగా నిరుద్యోగం వుండరాదు. కాని అలాంటి సమాజం యిప్పుడు అమలులో లేదు.

అచిరకాలంలో వస్తుందనే ఆశలేదు. ఈ మార్పు కొద్ది సం॥రాలలో రావచ్చు. లేక అర్ధశతాబ్దం వరకూ రాకపోవచ్చు. సమసమాజం ఏర్పడే వరకు నిరుద్యోగం తప్పకపోతే స్త్రీలే ఎందుకు నిరుద్యోగులుగా వుండాలో అర్థంకాదు. వేల సం॥రాలుగా అనుభవిస్తున్న వనరులు పోతాయని, పదవులు చేయిజారిపోతే హోదా పడిపోతుందనే బాధ భర్తలకు వుండటం సహజమే. కాని ఏదయినా న్యాయ విధానాలకు, ధర్మసూత్రాలకు కట్టుబడి వుండాలి కదా!

నిజానికి శ్రామిక కుటుంబాల్లో స్త్రీలు పనులు చేస్తూనే వున్నారు. కాస్తో కూస్తో సంపాదిస్తూనే వున్నారు. ఇన్నాళ్ళూ గృహిణులుగా పరాధీనంగా వున్న మధ్యతరగతి స్త్రీలదే ఉద్యోగాల సమస్య. ఒకవేళ అందరికీ పని దొరకని సమాజాన్ని కొనసాగనివ్వవలసిన దౌర్భాగ్యదశ సంభవించినప్పుడు దానివలన స్త్రీ పురుషు లిరువురూ బాధపడవలసిందే గాని స్త్రీలను మాత్రమే కష్టాలనుభవించమనడం న్యాయంకాదు. మరి కొంతమంది స్త్రీలకు ఉద్యోగం, భద్రత సంభవించాక పురుష సమాజం బానిసత్వంలోకి పోతుందని భావించనక్కరలేదు. స్త్రీ పురుషు లిద్దరూ ఒక్క కుటుంబమనీ, కుటుంబశ్రేయస్సుకోసం ఇరువురూ కృషిచెయ్యాలనే నీతులు వల్లించేవారు ముఖ్యంగా పురుష పుంగవులు పురుషుల ఉద్యోగావకాశాలు సన్నగిల్లితే ఎందుకు తల్లడిల్లిపోవాలో అర్థంకాదు. ప్రస్తుతం నిరుద్యోగి అయిన స్త్రీ, ఉద్యోగి అయిన పురుషునిపై ఆధారపడినట్లే నిరుద్యోగి అయిన పురుషుడు ఉద్యోగిని అయిన స్త్రీపై ఆధారపడతాడు. ఇద్దరూ కుటుంబంకోసమేకదా తపనపడేది. స్వాతంత్ర్య పోరాటాల్లో స్త్రీ పురుషు లిద్దరూ పోరాడుతున్నప్పుడు సమాన హక్కులుగల సాంఘిక జీవులుగా వారిని గమనించడంలో తప్పులేదు.

అసలుబాధ అది కాదు. తాను గొప్ప అనే భావం, దాన్ని అనుసరించి వచ్చిన పదవులు, అధికారం, ఉన్నత స్థానం పోతుంటే అతనికి గంగవెర్రు లెత్తుతున్నాయి. ఆఫీసరయిన భర్త భార్యమీద అధికారం చెలాయిస్తాడేమోకాని, ఆఫీసరయిన భార్య మాత్రం భర్తను అవమానించదు. ఎందుకంటే ఆమె కోరేది సమానత్వమే

కాని అతనిపై ఆధిపత్యం కానేకాదు. పాపం ! పురుషుడికి ఆధిపత్యమూ, బానిసత్వమూ రెండు భావాలేతప్ప సమానత్వ భావన అర్థంకాదు. అందు వల్ల స్త్రీలు స్వేచ్ఛ కావాలన్నా సమానత్వాన్ని డిమాండు చేసినా భయ భ్రాంతుడై తనను బానిసత్వంలోకి నెట్టాలని చూస్తున్నదని ఆమెపై అభాండాలు వేస్తాడు. ఆమె ఆ అపనింద భరించలేక స్వేచ్ఛ కోరదని అతని ఆశ. ఇది ఒక మానసిక వైపరీత్యం. ఇది ఆధిక్యతా భావాన్ని జీర్ణింపచేసుకున్న స్త్రీ పురుషులందరికీ వుండే మన స్తత్వమే. ఇది పాల కులలో ఎక్కువగా కొట్టవచ్చినట్లు కనపడుతోంది. సమాజంలో పురుషులు యజమాని స్థానంలో, పరిపాలనాధికారంలో వున్నారు కనుక వారు ఈ మన స్తత్వాన్ని (సమానత్వభావాన్ని) తమదిగా చేసుకోవడం లేదు. కనుక వారే గగ్గోలు పెట్టటం జరుగుతోంది.

ముందుగా వృత్తిలో, విద్యలో, కుటుంబంలో సమానత్వ భావం కలిగితే సాంఘిక, ఆర్థిక, రాజకీయాలలో తేలికగా జయించవచ్చు. ఏది ఏమయినా ప్రతి కుటుంబంలో ఒక స్త్రీ ఈ భావాలను అవగాహన చేసుకొని మనతో చేతులు కలుపుతుందని ఆశిద్దాం. పురుషులు సైతం స్త్రీకి స్వేచ్ఛా, సమానత్వాలిస్తే తమకు సంకెళ్ళు పడతాయి అనే భ్రమను, దురభిమానాన్ని విస్మరించగలరని వేచివుందాం.

(కలువబాల - నవంబరు 1985)

---

# రూపంలో మాత్రమే స్త్రీకి ఆస్తిహక్కు

"సొమ్మొకడిదీ సోకొకడిదీ" అన్నట్లు ఒక వంతు సంపదను అనుభవిస్తూ పది వంతుల ఆదాయాన్ని సమాజానికిస్తూ పరాధీనులై బ్రతుకుతున్న వారెవరంటే స్త్రీలు. ఒక సమాజంలో స్త్రీ అనుభవిస్తున్న ఆస్తిహక్కును బట్టి ఆమె హోదాను, స్థానాన్ని నిర్వచించవచ్చు. భూమి, ఇల్లు, అన్నిరకాల స్థిరాస్తి, తనపేర అప్పు పొందగల హక్కులాంటి వాటిమీద ఆమె స్టేటస్ ఆధారపడివుంటాయి. అభివృద్ధి అనే దానియొక్క మౌలిక సమస్యగాకూడా ఇది వుంటుంది. స్త్రీ ఆస్తిహక్కునుబట్టి ఆమెకు కొంత స్వేచ్ఛ వుంటుంది. స్త్రీకి ఆస్తిహక్కు, ఆమెకు సమానత్వం మున్ముందుగా జరగాల్సినవిగా మహిళా దశాబ్దం నిర్వచించింది. స్త్రీ యొక్క స్వావలంబానానికి (తనపై తను ఆధారపడటం) పరిష్కార మార్గంగా ఆమె ఆదాయాన్ని పెంచే మార్గాలను, కార్యక్రమాలను ఈ మహిళా దశాబ్దంలో గుర్తించటం జరిగింది. కాని ఆస్తిహక్కుల్ని గురించి చాలా కొద్దిగా శ్రద్ధవహించడం జరిగింది. ప్రపంచం అంతటా ఆస్తి సంబంధమైన శాసనాలు పురుషులే తయారుచేయుటంవల్ల స్త్రీకి ఆర్థిక స్వేచ్ఛ నశించింది. వివిధ దేశాల సంస్కృతి, సాంప్రదాయాలు కూడ ఆర్థికాధిపత్యాన్ని పురుషుడికే కట్టబెట్టాయి. కాకపోతే ఆస్తిపై ఆమెకున్న యాజమాన్యం ఎంత అనే విషయంలో తేడాలుండవచ్చు. కాని మౌలికమైన మార్పుమాత్రం లేదు.

ఈ శతాబ్దారంభంవరకు అమెరికా, యూరప్‌లలో కూడా ఆస్తిని కలిగివుండే హక్కు స్త్రీకి లేదు. తత్ఫలితంగా ఆమె పురుషుని ఆస్తిగా పరిగణింపబడింది. ఆమెనూ, ఆమె ఆస్తిని తమ ఇష్టంవచ్చినట్లు భర్తలు వాడుకొనేవారు. స్త్రీ పుట్టుకతో తన తండ్రికి, తను దత్తం చేయుబడిన భర్తకూ; చివరికి తను కన్న బిడ్డలకుకూడా లొంగి వుండవలసిన పరిస్థితి ఏర్పడింది. ఆమె ధనవంతుల బిడ్డ అయినా మార్పులేదు. కారణం – ఆమె ఆస్తిపై ఆమె ఏనాడూ యాజమాన్యాన్ని చెలాయించనే లేదు.

ఆఫ్రికా ఖండంలో హెచ్చు భూభాగంలో సేద్యం చేసి ఆహార ధాన్యాలను పండించేది స్త్రీలే అయినా, వారు భూమి కలిగివుండే హక్కుకు నోచుకో లేదు. ముస్లిం శాసనం ప్రకారం సోదరునికొచ్చే వాటాలో సోదరికి సగం మాత్రమే వస్తుంది. సంప్రదాయపరమైన భారతదేశంలో స్త్రీల సంరక్ష కులుగా వారి ఆస్తులను పరివర్తన చేయుటానికి భర్తలు హక్కు కలిగి వున్నారు. ఇంగ్లండులో 1854 చట్టరీత్యా భార్య సంపాదనంతా భర్తకే చెందేది. అన్నివిధాలా ఆమె అతనికి లోబడి వుండాల్సిందే. ఆమె ఉద్యోగం చేసే చోటుకెళ్ళి భార్య జీతం భర్త తెచ్చుకొనేహక్కు భర్త కుండేది. కాని భార్య పోషణభారం మాత్రం భర్తకు వుందని చెప్పే అధికారం ఆఖరికి కోర్టుకుకూడా లేదని, స్త్రీకి సమాన హక్కులు కావాలని బార్బరాలేస్మిన్ తన పుస్తకంలో రాసింది. భార్యజీతంతో భర్త తప్పత్రాగినా భార్యకు అడిగేహక్కు లేదు అనాడు. స్త్రీలకు ఆస్తిహక్కు కావా లని, తమ ఆస్తిని వీలునామా రాసే హక్కు తమకు కావాలని 26 వేల దస్కతులతో బార్బరా ఒక సంఘంపెట్టి దానిద్వారా ఒక పిటిషన్ దాఖలు చేసింది. 1857 లో దీనిపై ఒక బిల్లు పెట్టారు? కాని, అది వీగిపోయి తిరిగి 1882, 1893 లో శాసనాలవల్ల ఇంగ్లండులో స్త్రీకి ఆస్తిహక్కు వచ్చింది. అలాగే స్వీడన్‌లో వివాహిత స్త్రీకి 1874లో ఆమె ఆస్తి, ఆమె సంపాదన మీద హక్కులు ఇచ్చారు. ఇలా దేశదేశాల స్త్రీలు ఆస్తి హక్కుకై పోరా టాలు జరిపినట్లు అనేక ఆధారా లున్నాయి.

19వ శతాబ్దారంభం వరకు వివాహం కాగానే స్త్రీలు శాసనరీత్యా మైనర్లయినారు. భర్తలు రక్షకులైనారు. యూరప్, అమెరికా ఖండా లకు, ఫ్రాన్స్, బ్రిటీష్ శాసన వ్యవస్థలకు లోనైన దేశాలలో ఈ విధానం అమల్లో వుండేది. 1976లో కెనడాలో (U.N.O.) ఆధ్వర్యంలో జరిగిన ఒక మహాసభలో స్త్రీల ఆస్తిహక్కు సమస్యపై గొప్ప సంచలనం రేగింది. కెనడాలో ఒక ధనిక రైతు 30 సం॥ కాపురం చేశాక ఏమాత్రం ఆస్తి ఇవ్వ కుండా భార్యను వదిలేశాడు. ఆ సంఘటన గొప్ప సమస్య అయి కోర్టు దాకా వెళ్ళింది. అలా ఎంతోమంది స్త్రీలు డైవోర్సు అయ్యేదాకా తమ ఆస్తిపై తమకు హక్కులేదని కూడా తెలుసుకోలేకపోయ్యేవారు. పోష

లిస్టు దేశాల్లో సమిష్టి వ్యవసాయక్షేత్రాలలో సభ్యులుగా వున్నవారికి కొద్ది పాటి సొంత కమతాలు కలిగివుండే అవకాశం మాత్రం వుంది. అయితే అవి భర్తలవా, భార్యలవా అనేది పరిశోధించాల్సి వుంటుంది. అంతేకాక, ఆశియాలోని రిపబ్లిక్కులలో స్థానిక సంప్రదాయాలవల్ల స్త్రీలకు నష్టం జరుగుతున్నట్లు పరిశోధనలవల్ల తేలింది. ఆఫ్రికాలో స్త్రీలు ఆహారధాన్యాలను పండిస్తారు. పురుషులు వాణిజ్యపంటలమీద మొగ్గు చూపుతున్నారు. దాంతో ఆహారధాన్యాలమీద మొగ్గు తగ్గుతోంది. వాణిజ్యపంటలు వేయడం పెరిగింది. అందువల్ల ఆఫ్రికాదేశాల్లో వాణిజ్యపంటలు పండించేవారికి ఎరువులు, అప్పులు, సాంకేతిక సహాయాలు అందుతున్నాయి. స్త్రీలకు అలాంటి వెసులుబాట్లు లేవు. వారు వ్యవసాయ కూలీలుగా పనిచేయవలసి వస్తుంది. స్త్రీలు ఆహారధాన్యాలు పండించే తమ పొలాలపై శ్రద్ధ చూపలేకపోతున్నారు. అందువల్ల పంట తక్కువ అవుతోంది. పనికోసం పురుషులు పట్టణాలకు పోతున్నారు. ఉన్న తిండిలో ముందుగా పురుషులకు పెట్టటంవల్ల పిల్లలకు, స్త్రీలకు ఆహారం తగ్గుతోంది. స్త్రీలలో రక్తహీనత వచ్చి బలహీనులవుతున్నారు. శిశు మరణాల సంఖ్య పెరిగిపోతోంది. ఆశియాలో, మధ్యప్రాచ్యంలో పురుషుల ఆహారానికి ప్రాధాన్యత వుంటుంది. ఆఫ్రికాలో బరుండి, బాట్స్వాన్, కీన్యా, నైజీరియా మొదలగు దేశాలలో స్త్రీకి ఏమాత్రం ఆస్తిహక్కు లేదు. కిన్యాలో స్త్రీకి అసలు అప్పుకూడా పుట్టదు. ఉ॥ ఒక ఎం.పి. గా వున్న మహిళాధ్యక్షురాలికి బాలబాలికల పాఠశాల పెడతానని అప్పు అడిగితే, కేవలం నీవు "స్త్రీవి" అని అప్పు ఇవ్వలేదని ప్రాన్. పి. హాస్నెన్ (Pran. P. Hosnen) "లిన్ న్యూస్" అనే పత్రికలో వ్రాసింది.

భూ సంస్కరణలవల్ల స్త్రీకి న్యాయం జరగటం లేదని మనకు తెలియని విషయం కాదు. ఇళ్ళస్థలాలు ఇచ్చే సందర్భంగా పురుషులకే ప్రాధాన్యత ఇస్తున్నారు. ఆఫ్రికాలో బహు భార్యాత్వం వుంది. అయినా భూమి పురుషులకే ఇవ్వబడుతోంది. స్త్రీలకు, పిల్లలకు ఏమీ వుండవు. సహారాకు దక్షిణానవున్న ఆఫ్రికాలో పురుషులు భార్యలను పోషించవలసిన బాధ్యత లేనేలేదు. కాని, కుటుంబాన్ని పోషిస్తున్నాడనే మిషతో భూమి అతనికే ఇస్తున్నారు. ఫ్రాన్స్‌లో 1800 సం॥ వరకు వివాహిత స్త్రీకి ఆస్తి

మీద, ఆమె సంపాదనమీద, ఆమెకు వారసత్వంగా వచ్చిన ఆస్తిమీద ఆమె కేమాత్రం హక్కులేదు. హక్కులన్నీ భర్తలకే వుండేవి. 1882 వరకు ఫ్రెంచి స్త్రీలకు బ్యాంకు అకౌంట్సు పెట్టుకొనే హక్కులేదు. 1886 లో ఆమె జీతంపై హక్కు భర్తదేనంటూ ఆమె పింఛను మాత్రం ఆమెకిచ్చే ఏర్పాట్లు చేశారు. వారికి 1907 లోనే వేతనాలమీద హక్కు వచ్చింది.

అన్ని దేశాలలో, అన్ని ప్రాంతాలలో స్త్రీలు బీదవారు; అంతేకాదు బీదవారిలో హెచ్చుమంది స్త్రీలే. కారణం సర్వులకూ విదితమే. స్త్రీలు తమ సెక్సు కారణంగా తమపేర ఆస్తికలిగి వుండటానికి వీలులేకుండా చేయబడ్డారు. ఆస్తి మానవ స్వేచ్ఛకు, మానవ విజయానికి కొలమానంగా ఎంచబడే సమాజాలలోకూడా ఇది సంభవించింది. స్త్రీలు పురుషులమీద ఆధారపడవలసి వస్తోంది. బాలబాలికలకు, బానిసలకు శాసనదృష్టిలో వుండే హోదా మాత్రమే స్త్రీలకు ఇవ్వబడింది. ఇంత ముఖ్యమైన సమస్యను స్త్రీల పరిశోధనా విషయమై జరిగే పరిశోధనా కార్యక్రమాలలో పట్టించుకోక పోవడం శోచనీయం. ఇల్లు కొనడానికి ఆమె డబ్బువాడినా, దస్తావేజు మాత్రం మగనిపేరనే వుడుతుంది. ఇదంతా ఆర్థిక విజయాన్ని, అప్పు పుట్టే తాహతునుబట్టి హోదాను కొలమానంవేసే సమాజంలో జరుగుతున్న వచ్చినిజం.

పురుషుల అధీనంలో వుండే కీలుబొమ్మలుగా స్త్రీలను తయారు చేయడ మనేది సర్వేసర్వత్రా జరుగుతోంది. స్త్రీల ఆర్థికాభివృద్ధిని గురించి మనం తరచుగా మాట్లాడుతాం. ఏ సూత్రాలయితే స్త్రీల ఆర్థిక స్వాతం త్ర్యాన్ని హరిస్తున్నాయో, వాటిని ముఖ్యమైన సాంస్కృతిక సంప్ర దాయాలుగా మనం పేర్కొంటున్నాం. అవి స్త్రీలను, వారి సంతానాన్ని రక్షిస్తాయని చెప్పడం జరుగుతోంది. నిజానికి అది అవాస్తవికం. ఆ మేడిపండులాంటి సంప్రదాయాలు వారిని నిరాధారుల్ని చేస్తున్నాయి. కాని అర్థికాభివృద్ధికి ఆ సంప్రదాయాలే మంచివని పొగడటం జరుగుతోంది.

స్త్రీ అధిపతిగా వుండే కుటుంబాల సంఖ్య పెరుగుతున్న ఈ కాలంలో, బీదవారు వారిలో అధిక సంఖ్యాకులుగా వున్న అన్ని ప్రాంతాలలో ఇలా

జరుగుతోందని మనం గమనించాలి. ఎందువల్ల ఇలా జరుగుతోంది అంటే ఆస్తి సంబంధమైన శాసనాలు పురుషులకు అనుకూలంగాను, స్త్రీల యెడ వివక్ష చూపడంవల్లనే ఈ పరిస్థితి కలిగింది. బహుశ అప్పును పొందటానికి గల అవకాశాలకోసం స్త్రీలు చేసిన పోరాటాలను అందరూ మరచిపోయి వుండవచ్చు. ఆనాడు స్త్రీలు తాకట్టుపెట్టి అప్పు తీసుకోవటానికి బ్యాంకులుకూడా స్త్రీలకు అవకాశమివ్వని తరుణంలో అమెరికాలో ప్రత్యేక శాసనం పుట్టవలసి వచ్చింది.

శాసనం ప్రకారం ఆస్తి కలిగివుండటానికి స్త్రీలకు అవకాశం లేనప్పుడు స్త్రీ పురుష సమానత్వం అనేది మిథ్య. ఇద్దరి అసమానుల మధ్య సమానత్వం ఎలా వుంటుంది. 99% ఆస్తి పురుషుల అధీనంలో వుందని కోపెన్ హెగెన్ ప్రపంచ మహిళాసభలో తేల్చారు. న్యాయం ప్రకారం మానవ హక్కుల్ని అనుసరించి ఆస్తి విషయంగా సమానత్వాన్ని ప్రసాదించే శాసన వ్యవస్థ కావాలని ఆ సభలో తేల్చారు. పురుషుల హక్కులు వేరు, స్త్రీల హక్కులు వేరు అనే భావనకు తావులేకుండా నూతన ప్రాతిపదికను నిర్మించుకోవాలి. లింగ భేదంతో నిమిత్తం లేకుండా ఆస్తి హక్కులు కలిగివుండడానికి అవకాశముండే సమాజాన్ని నిర్మించుకోవాలి. ఆనాడే స్త్రీలు తమ కుటుంబాలలో, సమాజాలలో, ప్రపంచాభివృద్ధిలో పూర్తి భాగస్వాములు కాగలరు.

వేదకాలంలో భర్త మరణానంతరం కొంత ఆస్తి భార్యకు వచ్చేదని ఋగ్వేదం (1-124- )లో వుంది. కాని స్మృతుల కాలంలో భార్యకు భర్త ఆస్తిలో భాగంలేదని, పతివ్రతలైన స్త్రీలను రాజు పోషించవలెనని (3-10-21) గౌతమ సూత్రంలో వుంది. తండ్రి ఆస్తికి జ్యేష్టపుత్రుడే అర్హుడని (9-106) మనుస్మృతి నిర్వచించింది. కౌటిల్యుని ధర్మశాస్త్రం (9-162) ప్రకారం మృతిపొందిన స్త్రీ ధనం పుత్రులు, పుత్రికలు పంచుకోవాలని వుంది. తల్లిదండ్రులు, తోబుట్టువులు, భర్త వివాహ సమయమందు ఇచ్చిన కానుకలు స్త్రీధనంగా గుర్తించారు. వేదకాలంలో పుత్రుడు లేనప్పుడు తండ్రి ఆస్తి పుత్రికలకు సంక్రమించేదల్లా కూతురి కొడుక్కి చెందాలని, ఆ బిడ్డ తన కర్మకాండకు అర్హుడని అల్లునిచేత ప్రమాణం

చేయించుకొని కన్యాదానం చేసేవారని మనుస్మృతి (9-127) లో, గౌతమ సూత్రం (3-10-18) లోను వుంది. ఏదయినా వేదకాలంనాడు ఆడపిల్లకు ఆస్తిహక్కు, పితృకర్మల అధికారం వుండేదల్లా స్మృతులకాలంలో పుత్రుణ్ణే ఆస్తికి సర్వాధికారిని చేశారు. దరిమిలా స్త్రీకి ఆస్తిహక్కు పూర్తిగా నశించి స్త్రీలే పురుషుల ఆస్తిగా మారిపోయారు. కేవలం Parasites (పరాన్న భుక్కులు)గా మాత్రమే మిగిలిపోయారు.

జనాభాలో సగంమంది స్త్రీలున్నారు. అందులో 1/3 స్త్రీ కార్మికులున్నారు. వారిలో ?/3 స్త్రీలు. వారి చాకిరివల్ల 1/3 ఆదాయం వస్తోందని, వారికి చెందుతున్న వేతనాలు వగైరాలు ఆదాయంలో ./10 మాత్రమే స్త్రీలకు చెందుతోందని ఒక సర్వేలో తేలింది. సంప్రదాయ సమాజంలో, ఆధునిక సమాజాల్లోకూడా పిల్లలను పోషించే బాధ్యతను స్త్రీలే వహిస్తున్నారు. అలాంటప్పుడు స్త్రీలు ఆస్తి కలిగివుండటంలో తప్పు లేదు వారిపై ఆంక్షలు పెట్టటం న్యాయంకాదు. ఈ స్థితి సమాజాభివృద్ధికి, దేశాభివృద్ధికి హాని. స్త్రీకి దేశ ఆర్థిక జీవితంలో సముచిత పాత్ర వుండాలి. ఉత్పత్తిలో ఆమెకు అవకాశం ఇవ్వకుండా కేవలం వంట ఇంటికి, పిల్లల పెంపకానికే స్త్రీని వినియోగిస్తే, అది దేశ ఆర్థిక అభ్యున్నతికే గొడ్డలిపెట్టు. స్త్రీలు ప్రతి రంగంలో అణచివేయబడ్డారని, వారిని అలా వుంచినందువల్లనే ఆర్థికంగా వారు వొంగిపోవాల్సిన పరిస్థితి ఏర్పడిందని, తద్వారా వారిని దోపిడీ చేస్తున్నారని, అసలు విలువలలో మార్పురానిదే ఆర్థిక రంగంలో మార్పురాదని, అంతవరకు స్త్రీలు ఉన్న ఆస్తిహక్కులనుకూడా అనుభవించలేరని స్టేటస్ కమిటీవారు సిఫారసు చేశారు. మరి మనమూ అదే కోరుకుంటున్నాం కదా!!

—"రాడికల్ హ్యూమనిష్టు"–మార్చి 1985

# అయ్యో పాపం పురుష బాధితులు!

"మహిళోద్యమ కార్యకర్తలమంటూ మగవారిపై విరుచుకుపడటం, వారిని దూషించడం; సంఘాలద్వారా, సభలద్వారా విమర్శించడం ఇటీవల ఒక "ఫాషన్" అయిందనే వాదన ప్రబలంగా వింటున్నాం. ముఖ్యంగా మహిళా దశాబ్ద ప్రకటన తరువాత ఈ వాదన వెర్రితలలు వేస్తుంది. సమాజంలో సగభాగమైన స్త్రీలు అష్టకష్టాలు పడుతున్నామని ఘోషిస్తుంటే, మూడువేల సంవత్సరాలనుండి సర్వాధికారాలు చలాయిస్తున్న పురుష పుంగవులు అసలైన సిసలైన బాధితులం మేమంటూ పత్రికలకు ఎగబ్రాకుతున్నారు. పురుషులంతా స్త్రీల వల్ల చిత్రహింసల పాలవుతున్నారట; వారి కష్టాల నెవరూ గుర్తించడం లేదట; వారిపై ఎవ్వరూ సానుభూతి చూపడం లేదట; వారి కష్టాలను గురించి 1985 జులై 12న హిందూస్తాన్ టైమ్సులో ఒక వ్యాసం పడ్డది. బాధితులైన పురుషులకు నమూనాగా కొన్ని కేసులుకూడా ఉటంకించాడు రచయిత. వీటిని గురించి చర్చించే ముందు ఒక విషయం గుర్తించాలి.

హింసాప్రవృత్తి గల స్త్రీలు, గయ్యాళులైన స్త్రీలు లేరని ఏ మహిళాప్రగతి కార్యకర్తా వాదించడం లేదు. మహిళల్లోనూ దుర్మార్గ ప్రవృత్తి గలవారున్నారు. అయితే వారి సంఖ్య అత్యల్పం అనక తప్పదు. అదీకాక, ఈనాడు పురుషాధిక్య సమాజంలో ఆ సమాజ సంస్కృతికి లోనైన పురుషులు వ్యక్తిగతంగా ఎంత మంచివారైనా తమకు తెలియకుండానే స్త్రీలను చిన్నచూపు చూడటం, "నీకేం తెలియదు పో అనడం", ముఖ్యమైన నిర్ణయాలలో (బిడ్డల విద్యా, వివాహం) సైతం ఆమెతో సంప్రదించకపోవటం, స్త్రీల హక్కుల్ని గుర్తించకపోవటం, వారికి అవకాశాలు ఇవ్వకపోవడం చేస్తూనేవుంటారు. ఇది పురుషుల వ్యక్తిగత సద్గుణ, దుర్గుణాల ప్రసక్తిలేకుండా జరుగుతుంది. పురుషాధిక్య సమాజానికి స్త్రీలు ఎంతగా తలఒగ్గుతున్నారో, పురుషులుకూడా ఆ సమాజపు విలువలు అంత యథాతథంగా స్వీకరిస్తున్నారు. కనుక, మూకుమ్మడిగా దరహంమీద పురుషులు స్త్రీల హక్కుల్ని కాలరాస్తున్నారని అనడం జరుగుతోంది. ఈ విషయాన్ని మనస్సులో వుంచుకుంటే, పురుషులను స్త్రీలు హింసిస్తున్నా

రంటూ తమ గోడును సమాజానికి చెప్పుకోవలసిన స్థితి పురుషులకు కలుగదు.

నేటి సమాజపు విలువలు మారాలని, ఈ వ్యవస్థలో మార్పులు రావాలని మహిళా కార్యకర్తలు కోరుకుంటున్నారు. అంతేకాని స్త్రీలంతా మంచివారని, పురుషులంతా చెడ్డవారని వాదించడంలేదు. మగవారి పెత్తనాన్ని అంగీకరించే కొందరు అత్తగార్లు కోడళ్ళను హింసిస్తున్నారంటే కారణం విలువల మదింపు, దృక్పథం అని గుర్తించాలి. అజ్ఞానంతో వుండి, కుసంస్కారపరులైన స్త్రీలు పురుషాధిపత్యపు విలువలను స్వంతం (Internalise) చేసుకొని తోటి స్త్రీని బాధిస్తున్నారు. ఇది తెలియక "స్త్రీకి స్త్రీయే ప్రథమ శత్రువు"అని హేళన చేస్తున్నారు. ఆ రకపు స్త్రీలే పురుషుల్ని కూడా బాధిస్తారు. కాకపోతే ఈ బాధలన్నీ ఏ తెగకు సంబంధించిన స్త్రీల వల్ల పురుషులకు కలుగుతోంది అన్నది చర్చనీయాంశం. యథాతథ స్థితిని ఎదిరించే స్త్రీలవల్ల ఉత్పన్నమవుతున్నయా, లేక పాత సమాజాన్ని అభిమానించే వారివల్ల కలుగుతున్నయా అనేదే మీమాంస. ఈ దృక్పథంతో పరిశీలిస్తే "బాధితులైన పురుషులు" చెప్పే అంశాలను జాగ్రత్తగా విశ్లేషణ చెయ్యాల్సి వుంటుంది.

ఒక స్త్రీ తన భర్తకు పరస్త్రీ సాంగత్యం వున్నదని, మద్యపాన లోలుడని తన భర్తను నిందించిందట. ఆమె ఆ విషయాలను కోర్టులో రుజువు చేసుకోలేకపోయిందట. దాన్ని హింసగా భావించి ఢిల్లీ హైకోర్టు వారు భర్తకు విడాకులు మంజూరుచేశారట. ఈ తీర్పును గురించి ఎవ్వరూ బాధపడాల్సిన పనిలేదు. అలాగే ప్రమాదానికి లోనైన తన భర్తను 8 నెలలపాటు అతడు మిలిటరీ హాస్పటల్లో వున్నా, భార్య చూడలేదట. 1980 లో అతనికి కోర్టువారు విడాకు లిచ్చారట. ఈ తీర్పునుకూడా మనం తప్పుపట్టాల్సిన పనిలేదు. మరోకేసులో ఒక భార్య తన 2 నెలల పాపను భర్తను వదలిపోయిందట. భర్త తరపువారు ప్రాధేయపడినా ఆమె శిశు పోషణకు ఇష్టపడలేదట. ఈ భర్తకు 1979 లో విడాకులు ఇచ్చారట. ఈ కేసులను ఉటంకించడంలో వ్యాసకర్త ఉద్దేశ్యం బైటపడింది.

వరకట్నాన్ని అడిగాడని, హింసించాడని అసత్య నిందారోపణలు

చే_స్తే అది స్త్రీ భ_ర్తపట్ల చేసే హింసగా ఎంచుకోవాలని ఆ రచయిత వాదన. ఇది యు_క్తి యు_క్తంగా కనపడుతుంది. కాని అసలు బాధ ఏమంటే వరకట్నాల విషయమై పురుషులమీద అన్యాయంగా నిందారోపణలు జరుగుతున్నాయనే ధ్వని కనిపిస్తోంది. మరో విచిత్రమైన అంశాన్ని గమనించాలి. భార్యకు జీవితంమీద నిస్పృహ కల్గి ఆత్మహత్య చేసుకుంటే ఆ నింద భ_ర్తమీద, భ_ర్త కుటుంబంమీద పడుతోందట. ఆ నిందారోపణ జరుగగానే భ_ర్త గౌరవాన్ని పోలీసులు మంటకలుపుతున్నారట. అందువల్ల ఆసత్యారోపణ చేసిన మనిషికి శిక్ష వుండాలిట. ఇందులో రెండు విచిత్ర విషయాలు బై_టపడుతున్నాయి. భార్య ఆత్మహత్య చేసుకుంటే భ_ర్తను, అతని కుటుంబీకులను అనుమానించ రాదనేది ఒకటి; అసత్యారోపణ చేసిన వారిని శిక్షించాలనేది మరొకటి. సామాన్య గృహిణి సంతోషంగా భ_ర్తతో కాపురం చేసుకోకుండా ప్రాణత్యాగాన్ని ఎందుకు చేసుకుంటోంది అంటే అత్తా ఆడబిడ్డలు పెట్టే బాధలు, భర్త క్రూర ప్రవ_ర్తన కావచ్చు; లేదా భర్త ఉదాసీన ప్రవ_ర్తనకూడా కారణభూతం అవుతున్నది. కనుక వారిని సందేహించడంలో తప్పులేదు. తమ తప్పులేదని వారు నిరూపించుకోవచ్చు గదా! కుమా_ర్తెనిచ్చి సలక్షణంగా పెళ్ళిచేసిన అ_త్తమామలు అల్లుడిమీద-సాధారణంగా-ఎందుకు అసత్యారోపణ చే_స్తారు ? ఒకవేళ అలా జరిగితే తప్పుడు రిపోర్టు ఇచ్చినందుకు సివిలు క్రిమినలు వ్యవహారాలు జరుపుకోవచ్చు. దానికి ప్రస్తుతపు "లా"లో చాలా అవకాశాలు ఉన్నాయికూడా.

అన్నింటికన్నా మిన్న చిట్టచివరకు చెప్పబడిన విషయం: ఈరోజు స్త్రీలు ఎక్కువగా ఉద్యోగాలు చేస్తున్నారట. వారికి తల్లులు కావడం ఇష్టం లేక భ_ర్తలకు తండ్రులయ్యే అవకాశాన్ని నిరాకరించడం ఘోర దురంతరమట. భ_ర్త అనుమతి లేకుండా స్త్రీ గర్భస్రావం చేయించుకోవడానికి ఆమెకు ఈనాడు లా ప్రకారం హక్కు వున్నదట. అలా ఆమె గర్భస్రావం చేసుకోవడం_భ_ర్తకు అయిష్టమైనా_భ_ర్త యెడల హింసయట. అతనికి విడాకులు కావాలట. అంతేకాదు, దంపతులకు ఇద్దరు లేక ముగ్గురు కుమా_ర్తెలు ఉన్నా భ_ర్తకు కుమారుడు కావాలట. భార్య నిరాకరి_స్తే, అది భ_ర్త యెడల హింసయట. అలా ఒక భ_ర్త విడాకులకు పిటీషన్ పెడితే 1982లో పంజాబు హర్యానా హైకోర్టు దానిని మంజూరుచేస్తూ

పురుష సంతానం కావాలనే వాంఛ ప్రగాఢంగా వుంటుందని, ఆ కోరికను ఆ భార్య వమ్ముచేసిందని, అంతకుముందే రెండుసార్లు గర్భస్రావం చేయించుకుందని, ఇది హిందూ ధర్మశాస్త్ర విరుద్ధమని చెప్పారు. ఈ రచయిత ఆ తీర్పును మహదానందంతో ఉటంకించాడు.

ఈ రకపు వాదన వెనుకనున్న మన స్తత్వం ఏమిటి ? కుమా_ర్తెలు ఎందరున్నా కుమారుని కనమని భార్యను నిర్బంధించడం భార్యపట్ల హింసకాదా? ఆమె శారీరక మానసిక స్థితులను నిర్లక్ష్యం చేయుటం కాదా? అలాగే ఆమె ఉద్యోగం చేస్తున్నా, ఆమె తల్లి కావటానికి ఆమె శారీరక మానసిక పరిస్థితులు అనుకూలించకపోయినా ఆమెను సంతానం కనమని బలవంతం చేయడంలో దురుద్దేశ్యం ఏమిటి ? ఇన్నాళ్ళుగా ఇలా జరుగుతున్న ఘోర దురన్యాయాన్ని కిక్కురుమనకుండా ఆమోదించిన ఈ వ్యాస రచయితలాంటి పురుషులు ఈనాడు గగ్గోలు పెట్టడంలో అంతర్యమేమిటి ? స్త్రీ తన హక్కులను గు_ర్తించి, చై_తన్యవంతురాలై తన శరీరాన్ని గురించి, తన మానసిక సమతుల్య స్థితిని గురించి తను తాపత్రయ పడితే నేరమా ? తన శరీరంపై తనకు హక్కులేదా ? ఆమె కేవలం పిల్లలను కనే యంత్రమా ? అంతకన్నా ఆమె మరేమీకాదా ? ఇలా ఈ వ్యాస రచయిత నేర్పుగా మెలకువతో ఎవరూ ఆక్షేపించలేని మూడు కేసులను చెప్పి పాఠకుల సానుభూతిని పొంది తన నిజస్వరూపాన్ని బహిర్గతం చేశాడు. హిందూ శా_స్త్రాలు ధర్మ నిర్వహణ పేరుతో స్త్రీపై చేసిన అత్యాచారాలను సమర్థిస్తూ రెండు కేసులను పేర్కొన్నాడు. భ_ర్త కొరకు, మగబిడ్డకొరకు ఆమె ఎంతమంది సంతానాన్నయినా కనాలనే భావం స్పష్టపరిచాడు. ఇన్ని శతాబ్దాలుగా, తరతరాలుగా స్త్రీపై జరుగుతున్న అత్యాచారం ఇదే. దీనిని ఇంకా కొనసాగించాలని దీని తాత్పర్యం ఈ ప్రయత్నాలను, ఈ కుట్రలను, ఈ దురాలోచనలను చై_తన్యం గల స్త్రీ ఇకముందు సహించదు; సహించబోదు. ఇలాంటి పురుషాధిక్య విలువలను, భావనలను, ఆమె గౌరవించదు; గౌరవించదలచదు. ఈ విషయాన్ని పాతకాలపు స్మృతులను నెమరువేసుకునే పురుషులు ఎంత త్వరగా గమని_స్తే అంత మంచిది.

—కలువబాల 12–9–85

# కట్నం పిశాచిని కడతేర్చాలంటే?

ఇచ్చిన కట్నం చాలలేదని, ఇస్తానన్న స్కూటరు ఇవ్వలేదని, తెస్తానన్న లాంఛనాలు తేలేదని అస్తమానం ఆడిపోసుకునే అత్తమామల, భర్తల పోరు పడలేక వారి చిత్రహింసలు సహించలేక ఆత్మహత్యలి పాల్పడే అబలలు కొందరైతే, ఘోరమైన హత్యాకాండకు బలికాబడే మహిళలు మరికొందరుంటున్నారు. నిస్సహాయురాలైన ఆమె మెడకు ఉరిత్రాడు బిగించడమో, ఊపిరాడకుండా నోట్లో గుడ్డలు కుక్కడమో, కిరోసిన్ పోసి నిప్పంటించటమోలాంటి కిరాతక చర్యలద్వారా అంతంచేసి మళ్ళీ కట్నంతో మరోపెళ్ళికి తయారయ్యే నమ్మకద్రోహులున్న సమాజం మనది. వరకట్న మారణ హోమానికి సమిధలుగా మారిపోతున్న మహిళ లెందరో! నూటికి ఏ పది కేసుతో తప్ప బైటికి రానేరావు. వచ్చినవి కూడా తగిన సాక్ష్యాధారాలు లేవని కేసులు కొట్టేస్తుంటే బిడ్డనూ, డబ్బునూ పోగొట్టుకున్న తల్లిదండ్రులు కడివెడు దుఃఖంతో కళ్ళుమూసుకుంటున్నారు. అందువల్లే ఏ ఒక్కరోతప్ప న్యాయస్థానందాకా పోలేక పోతున్నారు. తగిన కట్నం ఇచ్చుకోలేక ముసలివాళ్ళను, రెండో పెళ్ళివాళ్ళను, పిల్లల తండ్రులను, కుసంస్కారులను, పెళ్ళాడలేక కన్యలుగా మిగిలిపోతున్నారు. ఎంత కట్నం పుచ్చుకుంటే అంత హోదా కలవారుగా శ్లాఘిస్తోంది సమాజం. ఏ బుద్ధిమంతుడైనా కట్నం వొద్దంటే ఏదో లోపం వుందంటున్నారు. అతి దారుణమైన కట్నపిశాచికి భయపడి ఆడపిల్ల పుట్టిందని హడలిపొయ్యేవారు కొందరైతే, మగబిడ్డ పుట్టాలని ప్రార్థించేవారు అనేకమంది వున్నారు. అందువల్లే ఆడపిల్లను కన్న నేరానికి తండ్రికి వేసే జరిమానాయే వరకట్నం అనుకోవచ్చు.

వరకట్నం అంటే పెళ్ళి చేసుకునేందుకు వరుడు పుచ్చుకొనే డబ్బు, ఆస్తి, నిధులు నిర్వచించారు. డబ్బుతో స్త్రీని ఖరీదు చేస్తే వ్యభిచారమంటున్నాం. ఆడది కట్నం పోసి పెళ్ళి పేరుతో మగాడి సాంగత్యం కోరితే దాన్ని పవిత్రమైన వివాహబంధంగా పొగుడుతున్నాం. ఇది ద్వంద్వ నీతి, అనమానత్వం కాదా? ఆడది ఆధారపడి జీవించే ప్రాణి,

కనుక మా భార్యలను మేమే పోషించాలి అందువల్ల మాకు కట్నం కావాలి అని "డిమాండు" చేస్తున్నారు.

వధువు + కట్నం = వరుడు. ఇలాంటి వ్యత్యాసం తేడాలు, హెచ్చు తగ్గులే ఈ దుర్నీతికి ముఖ్యకారణం. కాని వరకట్న దురాచారానికి ఆర్థిక సమస్య మాత్రమే కాదు. ఆస్తివల్ల, ఆర్థిక ప్రతిపత్తివల్ల స్త్రీకి కొంత ఉపయోగ ముండవచ్చు. కాని కట్నం పోదు. ఒక డాక్టరును ఒక లేడీడాక్టరు పెళ్ళాడాలంటే కట్నం ప్రసక్తి ఎందుకు వస్తోంది? ఒక M.D. తన సంపాదన కుదువపెట్టి తన భర్తకు కట్నమిచ్చి పెళ్ళాడింది. ఇది జరిగిన విషయం. మరి దీనికి కారణ మేమంటారు? అంటే వివాహం పూర్తిగా డబ్బు సంబంధమైన వ్యాపారంగా మారింది. ఈ కట్నాలకు కూడా ఫిక్సెడ్ రేట్లు వున్నాయి. ఇంజనీరు, డాక్టరు, I.A.S., గ్రాడ్యుయేట్ లాంటి డిగ్రీలనుబట్టి రేటు వుంటుంది. ఏ డిగ్రీ లేకపోయినా మగాడయితే చాలు ఎంతో అంత విధిగా ముట్టజెప్పాలి. కట్నాల బేరం పూర్తిగా వేలం పాట అయిందినాడు. కులాలవారి, డిగ్రీల తేడాతో, ఉద్యోగ హోదాను బట్టి, సాంఘికస్థాయినిబట్టి, కుటుంబ పరపతినిబట్టి, బేరసారాలు జరగటం వింటున్నాం.

స్త్రీకి ఆస్తిహక్కు ఇస్తే ఈ దురాచారం పోతుందనే భావంతో 18 మార్చి 1983 న 1956 నాటి హిందూ వారసత్వ చట్టాన్ని సవరిస్తూ ఒక బిల్లు పెట్టింది ఆంధ్రప్రభుత్వం. అది చట్టమైతే కట్నం పేరు మారి దాని ఛాయల రూపంలో మరోమార్గాన పయనిస్తుంది. అంటే ఇంతవరకూ కట్నం విలువైతే ఇప్పుడు అమ్మాయికి రాబోయే ఆస్తి విలువ తెల్పి చెప్పమని అడుగుతారు. ఇంకా లాంఛనాల పేరుతో గుంజుతారు. ఆమె ఆస్తిని వెంటనే అమ్మించి ఆ డబ్బుతో వ్యాపారాలు వగైరా చేస్తారు. అంతమాత్రాన ఆమెకు ఆస్తివద్దని కాదు. చట్టాలను అధిగమించి స్వార్థాలకు విలువనిచ్చే ప్రబుద్ధులు లేకపోలేదు. అసలింకా ఆ బిల్లు చట్టరూపం ధరించే పరిస్థితి చూపుమేరలో లేనేలేదు.

వరకట్న నిషేధపు చట్టం 22 మే 1961 న అమల్లోకి వచ్చింది.

1958 లోని నిషేధ చట్టాన్ని రద్దుచేసి ఇది పెట్టారు. కట్నం ఇచ్చినా, పుచ్చుకున్నా, సహాయపడినా 6 నెలలవరకు శిక్ష లేక 5 వేల వరకు జరిమానా లేక రెండూ విధించవచ్చు అని శాశించారు. కాని ఈనాటికి నమోదైన కేసు ఒక్కటి మాత్రమే. నగదు, సొమ్ము, వస్తువులుగా ఇవ్వబడిన అంటే బహుమానాలుగా ఇస్తే వాటికి శిక్షలేదు. కాని పెళ్ళిచేసుకున్నందుకు ప్రతిఫలంగా ఇస్తే అది కట్నమని నిర్వచించారు ఆ చట్టంలో. కట్నం ఇవ్వటానికి పుచ్చుకోవటానికి చేసుకున్న ఒప్పందం చెల్లదని ఆ చట్టంలో వ్రాశారు. కట్నం తీసుకున్న సం॥ లోపల ఆ ఆస్తి భార్యకు చెందజేయాలని, వధువు మైనరుగా వున్నప్పుడు కట్నం పుచ్చుకుంటే ఆమె మేజరైన సం॥ లోపల ఆమెకు చెందజేయాలనికూడా 1961 చట్టంలో వుంది. నేరం జరిగిన సం॥ లోపలే కేసు పెట్టాలని, ఈ కేసు ఎత్తివేసుకోవటానికి కోర్టు అనుమతి వుండాలనికూడా చెప్పారు. ఈ కేసును పోలీసులు పెట్టరాదని ఆ చట్టం నిర్వచించింది. ఏది ఏమైనా ఈ చట్టం పూర్తిగా విఫలమయింది. అసలు ఈ చట్టానికి మానవ సైజానికి అవినాభావ సంబంధం కుదరనేలేదు. అందువల్ల చట్టానికి కట్నం పోదని తేలింది.

కట్నాన్ని నిషేధించేందుకు 1961 నాటి చట్టాన్ని సవరించే ఒక బిల్లును 1984 మేలో పెట్టారు. ఇందులో కనీసం ఆరునెలల శిక్ష వుండాలని, 2 సం॥ వరకు శిక్ష వేయవచ్చని సూచించారు. జరిమానా 10 వేల వరకు, లేక కట్నంగా ఇచ్చిన మొత్తంగాని ఏది ఎక్కువైతే దాన్ని విధించాలని క్రొత్త బిల్లులో రాశారు. వధువుకు ఇచ్చే బహుమతులు, వరునికి ఇచ్చే కొన్ని రకాల బహుమతులు శిక్షార్హం కావని బిల్లు సూచించింది. వధువు తండ్రియొక్క ఆదాయంలో ఇంత శాతానికి మించి పెండ్లి ఖర్చులు, బహుమతులు వుండరాదనే సూచన తుది బిల్లులో లేదు. బహుమతులు విలువైనవి, అనేక రకాల వస్తువులుగా వుండవచ్చు. అంటే బొంబాయిలో ఫ్లాటు కోరడం వరునికి అలవాటు. అలాగే మోటారుకార్లు, స్కూటర్లు, ఫ్రిజ్‌లు, టి.వి.లు, స్టీరియోలాంటి వెన్నో అడగవచ్చు. ఈ మధ్య కొందరికి "మాకు కట్నం వద్దండీ అమెరికాలో గ్రీన్‌కార్డు వున్న అమ్మాయి అయితే చాలు" అనడం ఫ్యాషనయింది. అందువల్ల లాంఛనాలకు, ఖర్చులకు పరిమితి వుండటం చాలా అవసరం. ఆ భావాన్నే

స్టేటస్ కమిటీ" వరునికికాని, తల్లిదండ్రులకుకాని 500 రూపాయలకు మించి ఇవ్వబడిన బహుమానాలు, లేక వారికి ఖర్చు తగ్గింపుకు (వరుని ప్రయాణపు ఖర్చులు వగైరాలు) జరిగే చర్యలు శిక్షార్హులు కావాలని 1973 లో సిఫారసు చేసింది. (వరుని ఖర్చులన్నీ వధువే భరించడం జరుగుతుంది. అది మారాలన్నారు స్టేటస్ కమిటీవారు.)

ఈ సవరణ బిల్లుకు సలహా లివ్వటానికి కేంద్రం ఒక జాయింటు పార్లమెంటరీ కమిటీని నియమించింది. వారు కట్నం ఇచ్చేవానికి శిక్ష ఉండరాదని సూచించారు. కట్నం ఇచ్చేవాడుకూడా శిక్షార్హుడేనని బిల్లు తుదిరూపంలో వుంది. పూర్వపు శాసనం (1961)లో కూడా ఇచ్చినవానికి శిక్ష వున్నది. ఏ తండ్రి కట్నం ఇచ్చి కేసుపెడతాడు? ఏ తండ్రి ఇచ్చానని చెప్పి శిక్షా పాత్రుడవుతాడు ? 1981 జనవరిలో నియామకమయిన జాయింటు కమిటీ 1982 ఆఖరులో సాక్ష్య సేకరణచేసి తమ నివేదికను అందజేసింది. ఆ కమిటీ చట్ట సవరణకు, సమస్యను పరిష్కరించటానికి కొన్ని సిఫారసులు చేసింది. ఏదైనా నేరం స్పష్టతగా నిర్వచించలేదు బిల్లులో. అంటె పెళ్ళికి ముందుగాని, పెళ్ళప్పుడుగాని, తర్వాతగాని ఇచ్చేది కట్నం (పెళ్ళికి ప్రతిఫలంగా) అని ఆ శాసనంలో వుంది. నేరం అంటే ఏ రూపంలో ఇస్తే, ఎప్పుడు ఇస్తే నేరమో బిల్లు చెప్పలేదు. నేరం ఋజువు అయితేనేకదా శిక్ష! నేరం ఏమిటి అనేదానిపై భాష్యాలకు తావుంటే నేరం ఎలా ఋజువవుతుందని కమిటీవారు విమర్శించారు. మొత్తంమీద ఈ సవరణ బిల్లులో కొన్ని లోపాలున్నాయని విమర్శలు వచ్చాయి. ఏదయినా ఎన్ని శాసనాలు పెట్టినా మనలో మార్పులేనిదే అవేమీ చేయలేవు. అలా వరకట్న నిషేధపు చట్టం ప్రగతి శూన్యమయింది. రహస్యంగా ఇచ్చేదానిని పట్టుకోలేము కదా! కాకపోతే పదిమందికి కన్పడే ఆడంబరాలను, ఖర్చును కొంత నిరోధించవచ్చు. మొత్తంమీద చట్టం విఫలమైనట్లే. సవరణల బిల్లు చట్టరూపమైనా తిరిగి అదీ అంతే అవుతుంది. ఏ తండ్రికాని, ముఖ్య బంధువుకాని కట్నం ఇచ్చి అల్లునిపై కేసు పెడతాడు? కూతురి కాపురం నాశనం చేసుకుంటాడు! అనేది మరో ప్రశ్న. కనుక కట్నం చట్టంద్వారా పరిష్కృతం కాదని తెలిపోయింది.

వరకట్నం సాంఘిక దురాచారం కనుక సామాజిక చైతన్యం కావాలి. వరకట్నాన్ని పిశాచమని, మూఢాచారమని, దురాచారమని నిందిస్తే చాలదు. దానికొక నిర్మాణ కార్యక్రమాన్ని చేపట్టాలి. ప్రభుత్వమే కాక సమాజం, మహిళా సంఘాలు, పత్రికలు, యువతీ యువకులు, వారి తల్లిదండ్రులు అంతా ఏకోన్ముఖంగా, విప్లవాత్మక పద్ధతుల్లో ఒక మిషనరీ జీల్‌తో కార్యరంగంలోకి దూకాలి. త్యాగాలు చెయ్యాలి; కష్టాలు పడాలి, దాని పుట్టుపూర్వోత్తరాలు త్రవ్వి సమూల మార్పు చెయ్యాలి. అందుకు నివారణోపాయాలు అన్వేషించాలి.

వరకట్నంలాంటి పాశవిక చర్యలద్వారా స్త్రీలను అవమానపర్చటం మానవ విలువలకే గొడ్డలిపెట్టని ప్రచారం సాగించాలి. కట్నాలు కోరే ఛాందసులకు బుద్ధిచెప్పాలంటే స్త్రీకి ఆర్థికస్తోమత, వ్యక్తిత్వం, ఉద్యోగార్హత కావాలి. కట్నంక్రింద సమర్పించే డబ్బును కుమార్తెల విద్యక్రింద ముఖ్యంగా వృత్తివిద్యల కొరకు వెచ్చించాలి. అందువల్ల స్త్రీకి ఇటు వ్యక్తిత్వం, అటు భద్రతా, హుందా లభిస్తాయి. ప్రయివేటు సంస్థలలోను, ప్రభుత్వ ఆఫీసుల్లోను 40% ఉద్యోగాలు స్త్రీలకు కేటాయించాలి. మరొకరిపై ఆధారపడి బ్రతికే విధానానికి భరతవాక్యం పలకాలి.

ఈ సామాజిక దుర్నీతకు సంఘంలోని వ్యక్తులే పోరాడాలి; ప్రచారం చెయ్యాలి; తిరుగుబాటు చెయ్యాలి; త్యాగాలు చెయ్యాలి; కష్టాలు భరించాలి. ప్రభుత్వంకూడా పటిష్టంగా, చిత్తశుద్ధితో పనిచెయ్యాలి. మహిళా సంఘాలు కట్నం పుచ్చుకొన్న భర్తను, అత్తమామలను అల్లరిపెట్టాలి. వారిని సాంఘికంగా బహిష్కరించే విధానం చేపట్టాలి — ప్లేకార్డులతో వారి ఇంటిముందు ప్రదర్శనలు చేయాలి. కట్నం పుచ్చుకునే వివాహాలకు మనం హాజరు కారాదు. పుచ్చుకోని ఆదర్శ వివాహాలకు పిలువకపోయినా పెళ్ళి వధూవరుల్ని అభినందించి రావాలి. ఆ దంపతుల్ని సభలు పెట్టి సన్మానించాలి. స్కూళ్ళ సిలబస్‌లో వరకట్న దురాచారాన్ని విమర్శించే పాఠ్యాంశాలు చేర్పించాలి. స్త్రీకి మాత్రమే పెళ్ళి అవసరమనే అపోహ నశించాలి. తగిన భర్త స్త్రీకి ఎంత అవసరమో తగిన భార్య పురుషునికి అంతే అవసరమనే జ్ఞానోదయం యువకుల్లో కలిగించాలి. మా జీవిత

భాగస్వామిని డబ్బుతో ఖరీదు చేయమని యువతులు, తుచ్ఛమైన ధనానికి అమ్ముడుపోమని విద్యార్థిసంఘాలు, యువజనసంస్థలూ ప్రతిజ్ఞలు పూనాలి. ఈ విషయంలో తల్లిదండ్రులను వ్యతిరేకించి అయినా వ్యక్తిత్వాన్ని నిలుపుకోవాలి. బ్యాంకులు, L.I.C. ల వారు "పెండ్లి ఖర్చుల నిమిత్తం ముందుగా ఆదాచేసుకోండి;" అని వివాహ ప్రకటనల పేరుతో, వ్యాపార ప్రకటనల పేరుతో వరకట్నాన్ని పొగుడుతున్నారు. "ఘనంగా గొప్పగా పెండ్లి చేయబడును:" అని వివాహ ప్రకటనల్లో రాస్తున్నారంటే బాగా కట్నం ఇస్తామని అర్థం. ఆ ప్రకటనలను నిరశించాలి. ఈ కేసులను పోలీసులు పెట్టి వీలుండాలని, అయితే ఈ కేసుల దర్యాప్తు, నిర్వహణ దాఖలు, స్వచ్ఛంద సంస్థలే నిర్వహించాలని స్టేటస్ కమిటీవారు సిఫారసు చేశారు. అలాగే స్వచ్ఛంద సంస్థలూ, ప్రభుత్వమూ, రాజకీయ పక్షాలు, భారీ ఎత్తున ప్రబోధ కార్యక్రమాలు చేపట్టాలి. పత్రికలవారు ఈ వరకట్న సైచ్యాన్ని ఘాటుగా విమర్శించాలి. వరకట్న మరణాలను వెలికి తేవాలి. న్యాయవాదులు, న్యాయాధికారులు తమ బిడ్డలకు ఘాత జరిగినట్లు భావించి తీర్పు ఇవ్వాలి. ఇలా అన్ని రంగాలు విప్లవాత్మక పద్ధతుల్లో నిజాయితీగా పనిచేస్తే పురుష పుంగవులు పై మెట్టునుండి క్రిందికి దిగివస్తారు. ఈ విషయంలో తల్లులు ముఖ్యపాత్ర వహించాలి. తమ కూతుళ్ళకు ఇవ్వమని, కోడళ్ళకు పుచ్చుకోమని భీషణ ప్రతిజ్ఞలు చేయాలి. బిడ్డకు తల్లి ఖర్చుచేసి విద్య చెప్పిస్తే అవసరాన్నిబట్టి కుమారుని నుండి ఆ డబ్బు తీసుకోవచ్చుగాని ఇతరత్రా కోరరాదు. దానికి తగిన విద్య, విజ్ఞానం, ఐక్యత సామాజిక స్పృహ స్త్రీలలో రావాలి. తమ కుమార్తెకు పెద్ద డిగ్రీలు, హోదాలు, ఆస్తులు అంతస్తులున్న భర్తలే కావాలని ఎగబడితే వరుల "డిమాండ్" పెరుగుతోంది. చదువు, సంస్కారం, శీలము కల వరుణ్ణి ఎన్నుకోవాలి.

ప్రేమ వివాహాలవల్ల వరకట్నం పోతుంది. కనుక యువతీ యువకులు కలిసి చర్చించుకొనే అవకాశం కలుగజేయాలి. అబ్బాయితో మాట్లాడితేనే పిల్ల శీలం పోతుందనుకొనుట భ్రమ. ప్రేమ వివాహాలవల్ల కులమతాలు, హెచ్చుతగ్గులు, అందచందాలపై మోజుపోతాయి. ఇలా నిర్మాణాత్మకమైన కార్యక్రమాలు చేపట్టాలి. ఏ మార్పు రావాలన్నా

బాధితులు త్యాగాలు చెయ్యక తప్పటంలేదు. అందువల్ల ఆడపిల్లలు ధైర్యంతో, విజ్ఞతతో నిలబడాలి. ఎన్ని విమర్శలు ఎదురైనా సరే ఈ సమాజంలో తమకు జరుగుతున్న అన్యాయాన్ని, అసమానతను వారే వ్యతిరేకించాలి-అంటే ఇక్కడ త్యాగం, ధైర్యం రెండూ వారు కలిగి వుండాలి. అంతగా అవసరమొస్తే వరవిక్రయాన్ని నిరోధించేందుకు కన్యలగా జీవించటానికైనా స్త్రీలు సిద్ధపడాలి. ఇందుకోసం ఒక మహోద్యమం నిర్మిస్తేనే అది సాధ్యమవుతుంది. అంతకుముందుగా భారీ ఎత్తున స్త్రీలలో జాగృతి కలిగించాలి. ఇలా అన్ని రంగాలలో కలిసి పని చేసిననాడే వరకట్న పిశాచి అంతరించిపోతుంది.

—"తెలుగు విద్యార్థి"-ఫిబ్రవరి 1985

---

# ఉద్యోగినులు : సంక్షేమం

"ఆడది తిరిగి చెడింది, మగవాడు తిరక్క చెడ్డాడు" అనే దొక సామెత వుంది. అలాగే "ఉద్యోగం పురుష లక్షణం" అనే దొక సూక్తి కూడా వుంది. అంతే కాదు. ఆడది చదివి ఉద్యోగం చేస్తుందా, ఊళ్ళేలు తుందా, దానికి చాకలి పద్దు చదువు చాలదా! అనే నానుడికూడా లేకపోలేదు. అయితే ఈ దశాబ్దంలో ఈ భావాలు తల్లక్రిందులవుతున్నాయని నమ్మక తప్పదు. పరిస్థితుల ప్రాబల్యంవల్లకాని ఆర్థిక ఇబ్బందులవల్లకాని, అధిక ధరలవల్లకాని, ఆలస్యపు వివాహాలవల్లకాని అనేకమంది ఆడవారు ఏదో ఒక ఉద్యోగం చెయ్యక తప్పడంలేదు. ఆఖరికి పార్టుటైము పనికైనా ఎగబడుతున్నారు. అంతేకాదు పౌల్ట్రీఫారం, పాల ఉత్పత్తి, మిషన్ కుట్టి, అప్పడాలుచేసి, ఇళ్ళంబడి తిరిగి సబ్బులు వగైరాలమ్మి జీవనోపాధి గడిపేవారు మిక్కుటంగా వున్నారు. ఏదో పనిచేసి పొట్టపోసుకోటాన్నికి నానాపాట్లు పడుతున్నారు. పోటీలుపడి చదువుతున్నారు. ఎంప్లాయిమెంటు ఎక్స్చేంజీలచుట్టూ తెగ తిరుగుతున్నారు. నాటి స్త్రీలకు నేటి మహిళలకు

హస్తిమ శకాంతరం తేడా లున్నాయి. అందువల్ల పూర్వం నిరుద్యోగ సమస్య పురుషులకే పరిమితంగా వుండేది. ఈనాడది స్త్రీలకుకూడా వర్తిస్తోందంటే హాస్యాస్పదం కాదు. ప్రతి ఉద్యోగానికి, ప్రతి డిగ్రీకోర్సుకు, ప్రతి ట్రయినింగు కోర్సుకు మహిళలు ఎగబడుతున్నారనేది నగ్నసత్యం. అంతేకాదు మెరిట్‌లోకూడా యువకులకంటె యువతులే మిన్నగా వుంటున్నారని వింటున్నాం. ఎంట్రెన్సు పరీక్షలలో బాలికలే అత్యధికంగా పురోగమిస్తున్నారని అధ్యాపకులు ఒప్పుకుంటున్నారు. మేధస్సులో, విజ్ఞానంలో, విద్యార్థతలో లింగభేధం లేదనేదానికి ఇదొక తార్కాణం. వృత్తులలో నైపుణ్యం, చొరవ, ఆసక్తి దరహంమీద స్త్రీలకే వున్నప్పుడు, వృత్తి విద్యలలో తేడాలు కల్పించడం అసమంజసం కాదా?

ఉద్యోగిని అనగానే కార్యాలయాలలో పనిచేసే స్త్రీ స్ఫురణకు వస్తుంది. కాని నిజానికి ఉద్యోగంచేసే ప్రతి స్త్రీ ఉద్యోగిని కిందనే లెక్క. ఒక స్త్రీ పొలంలో పనిచేసినా, లేక ఫ్యాక్టరీలో, కార్యాలయంలో పనిచేసినా ఆమె ఉద్యోగినియే.

ఉద్యోగినుల సంక్షేమాన్ని గురించి పరిశీలన చేసేటప్పుడు వారి ఇబ్బందులను, కష్టనష్టాలను గమనించటం అవసరం. అపుడే వారి సంక్షేమానికై ఏమిచేయాలో స్ఫురిస్తుంది.

ఉద్యోగినుల ఇబ్బందులు అనేకరకాలుగా ఉంటాయి. కుటుంబపరంగా, ఆర్థికంగా, సామాజికంగా భిన్న పరిస్థితులతో కూడుకుని ఉంటాయి. ఒక్కొక్కపుడు ఇవి అన్ని పరస్పరాధారాలుగా ఉండటం కూడా కద్దు. ముందుగా వీటిని ఆలోచిద్దాం.

కుటుంబపరంగా-చాలమంది విద్యావంతులు సంస్కారులు అయిన పురుషులుకూడా తమ కుటుంబ స్త్రీలు ఉద్యోగం చేయటాన్ని హర్షించరు, ఆమోదించరు; అసలు ప్రోత్సహించరు. తమ పురుషాధిక్యతా భావానికి స్త్రీయొక్క ఉద్యోగం గొడ్డలిపెట్టని వారి భావం. ఈ భావం తరతరాల నుండి వారి మనస్సులలో తిష్టవేసుకుని కూర్చున్నది. వారికి తెలియ

కుండానే ఆ భావం ప్రబలమై వారి మనస్సులపై పెత్తనం చలాయిస్తోంది. స్త్రీ సంపాదనపై ఆధారపడటం, స్త్రీ సంపాదనను వాడుకోవటం వారికి న్యూనత, మరో అభిప్రాయంకూడ ఈ సందర్భంగా గమనార్హం. ఉద్యోగం స్త్రీ వ్యక్తిత్వ వికాసానికి అత్యంత అవసరమని చాలమంది పురుషులు విశ్వసించరు. గతిలేకపోతేనో లేక ఆర్థిక ఇబ్బందులకు లోనయితేనో మాత్రమే స్త్రీ ఉద్యోగం చేయాలట. అలాకాక ఆమెకు జరుగుబాటు ఉంటే ఆమెకు ఉద్యోగం అక్కరలేదట! ఇలాంటి ఆలోచనలు స్త్రీలలోకూడ ప్రస్ఫుటంగా కన్పించటం శోచనీయం. అంటే స్త్రీకి వ్యక్తిత్వ వికాసం అక్కరలేదనే అభిప్రాయం చాలా కుటుంబాలలో పాతుకుపోయింది. ఇలాంటి పరిస్థితులలో అవివాహిత ఉద్యోగిని అనేక కష్టాలను ఎదుర్కొనక తప్పడంలేదు. పైగా జీతపుడబ్బు తల్లిదండ్రులకే చెందాలి. ఉద్యోగంచేస్తూ గృహనిర్వహణ, శిశుపోషణ, భర్తసేవ అన్నీ చెయ్యాలి వివాహిత ఉద్యోగిని, ఇంకా సంపాదన ఆమె తన భర్త చేతి కందివ్వాలి. కార్మిక స్త్రీలు కూలిడబ్బులపైనకూడా పెత్తనం భర్తదే. ఇలా శ్రమపడే స్త్రీలకుకూడా ఫలితం దక్కటంలేదు.

సామాజికపరంగా—మధ్యతరగతి ఉద్యోగినులను ఇంకాగౌరవించడం లేదు సభ్యసమాజం. సమానత్వం కోరుతున్నారనే కార్పణ్యంతో వారికి భద్రతలేకుండా చేస్తోంది సమాజం. హోదాగల పెద్ద ఉద్యోగినులపట్ల వైఖరి వేరు మామూలు స్త్రీల పరిస్థితి వేరు. ఉద్యోగినులవల్లనే నిరుద్యోగ సమస్య వచ్చిందనే సాకుతో వారిని చులకనగా చూడటం, ఉద్యోగినులైన స్త్రీలు స్వైరవిహారాన్ని ఆశిస్తారనే అపప్రథ వ్యాప్తిచేసి వారిని భౌతికంగా, మానసికంగా హింసించాలని తాపత్రయపడేవారు లేకపోలేదు. కాస్త శుభ్రంగా, నీటుగా దుస్తులు వేసుకున్నా, అలంకరించుకున్నా ఈర్ష్యతో చూస్తారు. వారిని అపనిందలపాలు చేయాలని నానాపాట్లు పడతారు. బస్సుస్టాండుల్లో, పార్కులలో, ఇతర బహిరంగ ప్రదేశాల్లో వారిని వేధించడం, దుర్భాషలాడటం పెరిగిపోతోంది. ఆమెపై అత్యాచారాలకు పాల్పడే పరిస్థితికూడా వస్తోంది. ఇక ఒంటరిగా కాపురముండే ఉద్యోగిని అవస్థ వర్ణనాతీతం. భార్య తనకన్నా పెద్ద ఉద్యోగిని అయితే భర్త

సహించలేడు. భార్య వేరేవూర్లో ఉద్యోగిని అయితే ఆమె బదిలీ అయి తనవద్దకు రావాలి. కాని తాను వెళ్ళడు. లేదా వుద్యోగం మానిపిస్తాడు. అంతేకాని ఏ వ్యాపారమో చేస్తూ ఆమె ఉన్న చోటికి వెళ్ళి సెటిల్ కాలేడు.

ఆర్థికంగా–శాలాలలో పనిచేసే స్త్రీలకు తక్కువ వేతనం ముడుతోంది. కుటుంబానికి ఒక ఉద్యోగమనే పేరుతో ఉపాధి కల్పన సాగేటప్పుడు ఆ ఉద్యోగావకాశం సమర్థులైనవారికి, అవసరమైనవారికి ఇవ్వకుండా కేవలం పురుషుడే కుటుంబ యజమాని అనే భావనతో పురుషుడికే ఇవ్వటం ఆర్థికంగా స్త్రీని అణగద్రొక్కట మవుతుంది.

రాజకీయంగా – ఆలోచిస్తే స్త్రీలకు ఉద్యోగాలు ఇవ్వడంలోకాని, ప్రమోషన్లలోకాని, ఇంటర్వ్యూలలోగాని, శిక్షణా తరగతులు, సెలెక్షన్లలో స్త్రీపట్ల ద్వంద్వనీతి వుంటోంది. పరపతిలేని మహిళలపట్ల పక్షపాత వైఖరి గోచరిస్తోంది. అలాగే కుల రాజకీయాలు స్త్రీలను శాశ్వతంగా నూరామడల్ల దూరంగా వుంచుతోంది. ఇలా ఎన్నో ఒత్తిడులకు స్త్రీలు లోనుకాక తప్పటం లేదు. అలా వారి ప్రతిభా, విద్వత్తులు రాణించటంలేదనేది చేదునిజం. కారణం వారు స్త్రీలుగా పుట్టటమే వారి తప్పు.

శాలాలలో పనిచేసే స్త్రీలకు తక్కువ వేతనం ముడుతున్నది. ఎనిమిది గంటల పైగా నడుంవిరిగే పనిచేస్తున్నా పురుషుడి శ్రమతో సమానంగా స్త్రీ శ్రమకు విలువ ఇవ్వటంలేదు. ప్రభుత్వోద్యోగినులకు పురుషులతో పాటు సమాన వేతనం ముడుతున్నా, ప్రయివేటు రంగంలో తక్కువ జీతాలు ఇస్తున్నారు స్త్రీలకు.

పురుషులకు ఇచ్చినంత తేలికగా స్త్రీలకు ఉద్యోగాలు ఇవ్వరు. ఒకే ఉద్యోగానికి స్త్రీ పురుషులు వస్తే బండచాకిరీ, విసుగుపుట్టించే పని ఉన్న నర్సు, ప్రాథమిక పాఠశాల టీచరు, స్టెనో, టైపిస్టులాంటివి తప్ప మిగతా వాటికి పురుషుడినే ఎంపిక చేసుకొంటారు. ఇది సర్వసాధారణంగా జరిగే చర్య.

పై ఉద్యోగానికి ప్రమోషను విషయంలోగాని యింతే. వృత్తి

నైపుణ్యాన్ని పెంచే శిక్షణ ఇప్పించవలసి వచ్చినపుడు పురుషులనే ఎన్నుకుంటారు యజమానులు. ఇది సర్వే సర్వత్రా కనిపించే విషయం. ఇది కార్మిక స్త్రీలకు, మధ్యతరగతి స్త్రీలకూ ఇరువరికీ వర్తిస్తుంది. ఉదాహరణకు: ఇటుకలు మోసే పురుషుడిని ఆరునెలల్లో తాపీ మేస్త్రిగా తయారు చేస్తారు. కాని అదే కూలిచేసే స్త్రీకి పనినేర్పరు. ఇరవై ఏండ్లయినా ఆమె కూలీగా జీవితం సాగించాల్సిందే. అలాగే బాధ్యత వహించవలసిన ఉద్యోగాలకు-డైరెక్టరు, బ్యాంకు మేనేజరు, విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు, హైకోర్టు జడ్జీ, పరిశ్రమాధిపతి, ప్రధానమంత్రి లేక ముఖ్యమంత్రి-సర్వసామాన్యంగా (కొన్ని మినహాయింపులు అపుడపుడు వుంటాయి) స్త్రీలను ఎంపిక చేయరు; నియమించరు.

ఉద్యోగిని ప్రసూతి సెలవు కోరితే-కొన్ని సందర్భాలలో జీతం లేకుండా అడిగినా-ఇవ్వక ఉద్యోగంనుండి తొలగిస్తున్నారు. మీకు పురిటి సెలవులు, బాలింత సెలవులు విధిగా ఇవ్వాలి కనుకనే మిమ్మల్ని రిక్రూట్ చేసుకోవాలంటే మాకు గండం అంటూ సాధిస్తారు ప్రయివేటు కంపెనీలలో.

పైకి విద్యావంతులుగా, సంస్కారులుగా కనపడే తోటి పురుష వుద్యోగులు వుద్యోగినులను గురించి అవమానకరమూ, అశ్లీలమూ, అసహ్యము అయిన భాషలో మాట్లాడుకుంటారు. అది తెలిసిన వుద్యోగినులు మానసికంగా కృంగిపోతారు.

ఉద్యోగినులకు అవసరమయిన క్రెషేలు, ఫలహారశాలలు, విశ్రాంతి సౌకర్యాలు, పారిశుద్ధ్యపరమైన వెసులుబాట్లు వగైరా విషయాలలో అధికారులు, ఉద్యోగుల సంఘాలు శ్రద్ధ చూపరు.

సెలవులు కావాలని కోరినపుడు వేధింపు ప్రశ్నలు వేసి ఉద్యోగినులను బాధ పెట్టడం తరుచు జరుగుతూ వుంటుంది.

ట్రేడ్ యూనియన్లలో ఉద్యోగినుల భాగస్వామ్యం అత్యల్పం, దాదాపు శూన్యం. రాజకీయంగా ఆలోచిస్తే స్త్రీలకు ఉద్యోగాలు ఇవ్వటంలో కాని, ప్రమోషన్లలోకాని, ఇంటర్వ్యూలలోగాని, శిక్షణా తరగతులలో సెల

క్షన్లకుగాని స్త్రీ పట్ల ద్వంద్వ నీతి వుంటోంది. పరపతిలేని మహిళలపట్ల పక్షపాత వైఖరి కనిపిస్తుంది. ఇక కుటిల రాజకీయాలు స్త్రీలను శాశ్వతంగా నూరామడల దూరంలో వుంచుతున్నాయి. ఇలా రాజకీయ ఒత్తిడులకు స్త్రీలు లోనుకాక తప్పడంలేదు.

## సంక్షేమానికి తీసుకోవలసిన చర్యలు

1) ఒంటరిగా ఉన్న ఉద్యోగినులకు నివాసం నిమిత్తం వర్కింగ్ ఉమెన్స్ హాస్టల్సు విరివిగా నడుపుట.

2) ప్రతి ఫ్యాక్టరీలోను, ఆఫీసులోను, పరిశ్రమలోను స్త్రీ సంక్షేమ కార్య క్రమాలను నిర్వహించేందుకు, పర్యవేక్షణ చేసేందుకు ఒక విభాగాన్ని లేక ఒక "సెల్"ను ఏర్పరచుట.

3) రిక్రూట్‌మెంట్, ప్రమోషన్, ట్రెయినింగ్ మొదలైన అంశాలలో వివక్ష లేకుండా ఉండగలందులకు తగు చర్యలు తీసుకొనుట.

4) ఉద్యోగినుల శారీరక మానసిక ఆరోగ్యాన్ని పెంపొందింప జేయుటకు అవసరమైన వసతులు కల్పించుట. క్లబ్బులు, వ్యాయామశాలలు స్త్రీలకు ప్రత్యేకంగా నెలకొల్పుట.

5) ఫ్యాక్టరీలలో, పరిశ్రమలలో, వ్యాపార కేంద్రాలలో స్త్రీలకు అవసర మైన ప్రత్యేక సదుపాయాలను, సౌకర్యాలను, వెసులుబాట్లను కల్పించుట.

6) ప్రసూతి సెలవుల మంజూరు విషయమై గట్టి చర్యలు తీసుకొనుట.

7) వేతనాలలో ఉండే వ్యత్యాసాన్ని, ఇతరత్రా పని విషయంలో వివక్ష రూపుమాపుట.

8) ప్రతి ఫ్యాక్టరీలో, వ్యాపారకేంద్రంలో, కార్యాలయంలో ప్రభుత్వం చేతగాని, యాజమాన్యం చేతగాని గుర్తింపబడిన ఉద్యోగినుల సంఘాలను నెలకొల్పి వాటిద్వారా వారి కష్ట నిష్ఠురాలను తెలిసికొని ఇబ్బందులను తొలగించుట.

9) ఉద్యోగినుల సమస్యలను చేపట్టటానికి, పరిష్కరించ ప్రయత్నించ

టానికి కార్మిక సంఘాలు, ఉద్యోగుల సంఘాలు సమాయత్తం కావాలి.

10) స్త్రీ పురుషులు కలసి కూర్చుని నడుపుకునే చర్చలలో, కార్యక్రమాలలో, ఆందోళనలలో ఉద్యోగినుల యెడ సముచితరీతిగా మర్యాదగా ప్రవర్తించవలసిన అవసరాన్ని ఉద్యోగుల సంఘాలు, కార్మిక సంఘాలు గుర్తించుట అత్యవసరంగా భావించాలి.

11) స్త్రీలు ఉద్యోగాలు చేయటం సంపాదనకోసం మాత్రమేగాక వారి వ్యక్తిత్వ వికాసానికి దోహదం చేసేదని కార్మిక సంఘాలు, వుద్యోగస్థుల సంఘాలు, యాజమాన్యాలు, ప్రభుత్వాలు గుర్తించేలా ప్రచారం, ప్రబోధం సాగించటం అత్యవసరం.

12) తాహతును బట్టి, డిగ్రీలనుబట్టి స్త్రీలకు కొంతకాలం 40% వుద్యోగాలు రిజర్వు చేయాలి. ఇది చాలా ముఖ్యం. ఆ అవకాశం లేనిదే సమానత్వం రాదు.

13) వర్కింగు వుమెన్సు హాస్టల్సు కేవలం ఒంటరిగా వుండే స్త్రీలకు మాత్రమే పరిమితం కాకుండా బాల్యదశలో సంతానం కలిగిన స్త్రీలకు కూడా ప్రవేశార్హత కల్గించాలి. వారికి వేరే ఒక హాలును కేటాయించాలి.

14) ప్రతి స్త్రీ స్వయం వుపాధినో, వుద్యోగాన్నో చేపట్టవలసి వున్నదని, అది వ్యక్తి వికాసానికి సంబంధించిన విషయమని, సామాజికాభివృద్ధికి దోహదకరమని మహిళా సంఘాలు గుర్తించి ప్రచారం చేయాలి.

15) అన్నింటికన్న మిన్న స్త్రీలు అందులో ముఖ్యంగా వుద్యోగినులు ఆత్మవిశ్వాసాన్ని, ఆత్మ స్థైర్యాన్ని పెంపొందించుకోవాలి. ఐక్యతవల్ల వుద్భవించే బలాన్ని సంతరించుకోవాలి. తమ న్యాయమైన హక్కుల కొరకు పోరాడడానికి సమాయత్తం కావాలి.

ఇలా సర్వతోముఖంగా నలుదిశలా అందరూ కృషిచేస్తేనేగాని వుద్యోగినుల సంక్షేమం ఒనగూడదు.

(వర్కింగు వుమన్స్ హాస్టలు సిల్వర్ జూబిలీ సెమినార్ 3-12-1984)

---

# సాంఘిక ఆర్థిక పురోభివృద్ధిలో స్త్రీ పాత్ర

ఇంతవరకు తమ్ము తాము వుద్ధరించుకోలేని స్త్రీలు దేశ సాంఘిక ఆర్థిక పురోభివృద్ధికి ఎలా తోడ్పడగలరు? అది సాధ్యమా? ఎలా? ఏం చెయ్యాలి? ఆర్థికంగా ఆధారపడి జీవించే మహిళలవల్లా సాంఘికంగా నిస్సహాయులైన యువతులవల్లా సమాజ సౌభాగ్యాన్ని కోరటం న్యాయమా? మరి స్త్రీల పాత్ర కేవలం కుటుంబసేవ, పిల్లల పోషణలకే పరిమితమా? ఇంటిచాకిరివల్ల స్త్రీలు గౌరవాదరాలు పొందగల్గుతున్నారా? అనే విషయాలు చర్చనీయాంశాలు అయినాయి.

మానవహక్కుల్ని అమెరికన్, ఫ్రెంచి, రష్యన్ విప్లవాలు వుద్ఘాటన చేసినప్పుడు స్త్రీలను మానవులుగా పరిగణించటం జరిగింది. సమాజం అంటే ప్రజలు అన్నప్పుడు అందులో సగభాగం స్త్రీలున్నప్పుడు సమాజ సమస్యలను పరిష్కరించటానికి స్త్రీలు సైతం భాగస్వాములుకాక తప్పదు. కనుక మహిళలు తమ సమస్యలను తరిదిద్దుకుంటూనే దేశప్రగతికి తోడ్పడాల్సిన సమయం ఆసన్నమయింది. అంటే నేటి స్త్రీలకు ఏకకాలంలోనే రెండు బాధ్యతలు నెత్తిన వడ్డాయని గమనించాలి. ఈ ప్రయత్నం కొంత కష్టతరమైనా అసాధ్యం మాత్రం కాదు.

నేటి మహిళలు సమాన హక్కులకై పోరాడుతున్నారు. ప్రగతి కోసం తిరుగుబాటులాంటి వుద్యమాలు నడుపుతున్నారు. స్వేచ్ఛా సమానత్వాలకై ఆరాటపడుతున్నారు. విద్యా, వుద్యోగాలకై తపన పడుతున్నారు. చట్టాల సవరణలకై ఆందోళనలు సాగిస్తున్నారు. సాంఘిక, ఆర్థిక రాజకీయ, సాంస్కృతిక హక్కులకై స్త్రీలు పోరాటాలు సాగిస్తున్నప్పుడు దేశ సమస్యలను కేవలం పురుషులకే వదలివేయడం సమానతాభావానికే గొడ్డలిపెట్టు. సామాజిక సమస్యలను గురించి స్త్రీలు ప్రేక్షకులు కారాదు. దేశ సమస్యలను పురుషులు సరిదిద్దే వరకు తాము మిన్నకుండుట క్షంతవ్యం కాదు. సరికదా, అది దేశద్రోహమన్నా తప్పులేదు. నేటి స్త్రీ పురోగమన లక్ష్యం కేవలం తమ హక్కులను అనుభవించుటకొరకే ఆరాటపడటంతో సరిపోదు. దేశ కష్టనష్టాలే కాక

యావత్ ప్రపంచ సమస్యలను సరిదిద్దుటలో భాగస్వామ్యం వహించాలి. ఇది చాలా బాధ్యత, కర్తవ్యాలతో కూడిన సంక్లిష్టమైన కార్యభారం. అనుక ముందుగా ఈనాటి స్త్రీల స్థాయి, హోదా, ఆర్థికాధిపత్యం, సాంఘిక విలువలు పరిశీలించాలి. తదుపరి సమాజ అభివృద్ధికై అన్వేషించాలి.

ఇది విలువల విప్లవమా అన్నట్లు నేటి స్త్రీ పరమాణు యుగంలో పయనిస్తోంది. ఆధునిక యుగంలో జీవిస్తోంది. శాసనరీత్యా, ఆమెకు సమాన హక్కులు లభించాయి. అక్కడకూడా మంత్రులుగా, జడ్జీలుగా, వైస్ ఛాన్సలర్లగా స్త్రీలు నియమింపబడుతున్నారు. ఆటలలో, విద్యా, ఉద్యోగాలలో పురోగమిస్తున్నారు. నేడు స్త్రీలకు అవకాశంలేని రంగమే లేదని చెప్పుకోవచ్చు. ఇదంతా అభ్యుదయమా అంటే ఔనని అనలేము. కాదనీ చెప్పుకోలేము. అంటే రూపంలో స్త్రీ స్థితి మారింది కాని మౌలికంగా మారలేదు. నాగరికతగా స్త్రీలలో మార్పు వుంది. భావాలలోనూ, సంస్కృతిలోనూ మార్పు లేదనేది నగ్నసత్యం. ఈనాటి స్త్రీ స్థానం బానిసత్వంనుండి షోకేసులోని బొమ్మ స్థితికి మారింటని దాని అర్థం. రుజువు కావాలంటే సవాలక్ష ఉదాహరణ లున్నాయి.

బిడ్డ పుట్టగానే ఆడా మగా అనే తేడాలు మొదలవుతాయి. పెంపకంలోకాని విద్యాబుద్ధుల్లోకాని ద్వంద్వ విధానా లుంటాయి. అబ్బాయికి విద్య ముఖ్యం అయితే అమ్మాయికి పెళ్ళి ముఖ్యం. అలాగే వుద్యోగం "ఆడపి చదివి వుద్యోగం చేస్తుందా ఊళ్ళేలుతుందా" అంటూ చదువు మాన్పిస్తారు. వివాహ ఎన్నిక స్త్రీ ఇష్టాఇష్టాలపై ఆధారపడి వుండదు. దాంపత్య జీవితంలో హక్కులు, అధికారాలూ అన్నీ భర్తకే చెంది వుంటాయి. ఎంతో అంత కట్నం ఇచ్చుకోకపోతే అమ్మాయి అందగత్తె అయినా, విద్యా, విజ్ఞానాలున్నా ఆమెకు వివాహం జరగదు. ఆస్తులు కొనాలన్నా, అమ్మాలన్నా అన్నీ భర్త ఇష్టం ప్రకారమే జరగాలి. భర్త కొట్టినా, తిట్టినా పడివుండాలేకాని విడాకులు పుచ్చుకోరాదు. పుచ్చుకున్న స్త్రీని హీనంగా చూస్తారు. అలాగె విధవరాలైన స్త్రీకి ఎన్నో కష్టాలు, బాధలూ వుంటాయి. ఆమె మళ్ళీ పెళ్ళాడితే నీతిమాలినదాన్నిగా చూస్తారు. తన బిడ్డలకు తండ్రి మాత్రమే గార్డియన్‌గా వుండాలి. పెళ్ళి

కాగానే విధిగా భర్త ఇంటిపేరును తాను పెట్టుకోవాలి. అలాగే ఎన్నో విధాలైన తేడాలుండటం మనం గమనిస్తూనే వున్నాం. వాటిని అనుసరించడం మనం నైతిక ధర్మంగా, మన సంప్రదాయంగా భావిస్తున్నాం. ఇదంతా స్త్రీ పురుషుల అసమానత్వానికి చిహ్నంగా పేర్కొనాలి. ఈ లక్షణాలను మార్చుకోవాలని, గాని అవి తమ వ్యక్తిత్వాలకే గొడ్డలిపెట్టని గాని స్త్రీలు నమ్మటంలేదు. కారణం ఇది తరతరాల మానసిక దాస్య లక్షణం. వ్యాధిని గుర్తిస్తేనే తప్ప నివారణోపాయం గూర్చి ఆలోచించం.

స్త్రీ పురుష సాంఘిక హెచ్చుతగ్గులు, తేడాలు ఎలా నిర్మూలించాలనేది నేటి ముఖ్య సమస్య. దేశ పురోభివృద్ధికి ఆటంకమైన అసమానత్వం ముందుగా తొలగిపోతే స్త్రీల హోదా పెరుగుతుంది. దానికి ముందుగా స్త్రీలలో పాతుకుపోయిన అవిద్యా, అజ్ఞానం, మూఢాచారాల నిర్మూలనం కావాలి, కుల, మత, భాషా, ప్రాంతీయాభిమానాలను విస్మరించాలి. రాజ్యాంగం స్త్రీలకు ప్రసాదించిన హక్కులను అనుభవించాలి. ముఖ్యమైన విద్య, ఉద్యోగం, వివాహం, హోదాలాంటి విషయాలలో స్త్రీల దృక్పథం మారాలి. ఇంతవరకు పురుషాధిక్యతా భావాలను జీర్ణించుకొని నేను ఆడదాన్ని, నా ఇంటిపని నా భర్తసేవ నేను చేస్తే తప్పేముంది అని నచ్చచెప్పుకునే (ఇంటర్నలైజేషన్) ప్రవృత్తి మారాలి. 1981 లెక్కల ప్రకారం స్త్రీ విద్య 20% వుంది. ఇందులో ఉద్యోగార్హత కలవారు 5% కన్నా లేరు. కనుక వివిధరకాల వృత్తి విద్యలు జనాభా నిష్పత్తిలో స్త్రీలు పొందగలగాలి. సాంస్కృతిపరమైన సాహిత్యంతో, సినిమాలతో స్త్రీని కించపరిచే సన్నివేశాలపై ధ్వజమెత్తి పోరాడాలి.

ఎప్పుడైతే స్త్రీలు అన్ని రంగాలలో కర్తవ్యతా నిమగ్నులై వుంటారో సాంఘిక పురోభివృద్ధి ప్రజ్వరిల్లుతుంది; భావి పౌరులను తీర్చిదిద్దగలుగుతారు. అజ్ఞానులైన భర్తలను సైతం విజ్ఞానుల్ని చేస్తారు. ఈనాడు సమాజానికి చీడపురుగులైన లంచగొండులను, కల్తీదారులను, దొంగ వ్యాపారస్తులను పట్టి బంధించగలరు. అన్యాయాలను, అక్రమాలను రూపుమాపగలరు. మానభంగాలను, స్త్రీలపై జరుగుతున్న అత్యాచారాలను అణచివేయగలరు. స్వార్థాన్ని చంపుకొని పరహితార్థానికై ప్రాకులాడ

గలరు. తరతమ భేధాలను, హెచ్చుతగ్గులున్న నిచ్చెనమెట్ల సమాజాన్ని ధ్వంసంచేసి, సమ సమాజానికి నాందిపలుకగలరు. అలా సమాజాభి వృద్ధినేకాక దేశాభివృద్ధికికూడా స్త్రీలు పాటుపడగలరు. అంటే ప్రభుత్వాధి నేతలను, విద్యాలయాధికార్లను, పెట్టుబడిదారి వర్గాన్ని ఒకటేమిటి వ్యవస్థనే సమూలంగా మార్చగలరు. అంతటి శక్తిసంపన్నతలున్న వర్గమే స్త్రీ జాతి. వారిలో అలసత్వము, నిరాశ, నిస్పృహలు పోయి ధైర్యము, చొరవ, నేర్పు, ఓర్పు, ఔదార్యమూ కలిగిననాడే కుటుం బము, సమాజమూ పురోగమిస్తుంది. అలా స్త్రీలు తమ పాత్రను నిర్వర్తించ గలరని విశ్వసించాలి.

మానవ మనుగడకు కీలకమైనది ఆర్థికం. ఆర్థికరంగం స్త్రీలవల్ల అభివృద్ధి జరగటం లేదనే వాదన ప్రబలంగా వుంది. స్త్రీలు- ముఖ్యంగా మధ్యతరగతి, ధనవంతుల భార్యలవల్ల సామాజిక ఉత్పత్తి జరగటం లేదు. స్త్రీల శ్రమ రెండురకాలు. ఉత్పత్తిచేసే శ్రమ (ప్రొడక్టివ్ లేబరు), ఉత్పత్తిచేయని శ్రమ (అన్‌ప్రొడక్టివ్ లేబరు). గృహిణిగా ఆమె చేసే పనికి గుర్తింపులేదు; పైగా ఆర్థికంగా ఆదాయం వుండదు. కాకపోతే వర్కింగు క్లాసు-వ్యవసాయ కూలీలు, ఫ్యాక్టరీలలో పనిచేసే స్త్రీలవల్ల కొంత లాభం వుండవచ్చు. కాని గృహిణిగా మాత్రమే జీవించే స్త్రీలు తమ కాలాన్ని, శక్తిసామర్థ్యాలను కేవలం ఇంటిపనులకే వినియోగిస్తు న్నారు. తమ ఆలోచనాశక్తిని, సృజనాత్మకతను, విజ్ఞానాన్ని చంపుకొని కేవలం ఆటబొమ్మల్లా బ్రతుకు భారాన్ని ఈడుస్తున్నారు. పైగా వారి చాకిరికి విలువలేదు. వ్యక్తిత్వానికి గౌరవం లేదు; ఆమె హోదాను భర్త కించపరుస్తూ నీవు "పేరాసైట్"లాగా ఆధారపడి జీవిస్తున్నావంటాడు. కనుక స్త్రీ తాను గృహిణిగా గుర్తింపు పొందాలనే మానసిక దాస్యంనుండి విముక్తిపొందాలి. ఇంటా బైటా శ్రమిస్తే నీవు అలసిపోతావనే కల్లబొల్లి కబుర్లను నమ్మరాదు.

స్త్రీ ఆజన్మాంతం బండచాకిరి చేస్తూనే వుంటుంది. అయినా అవ మానాలు తప్పటంలేదు. ఆర్థికంగా రాబడి లేదు. సామాజికంగా గుర్తింపు లేదు. నిజంగా స్త్రీకి విముక్తి కావాలన్నా, ఉత్పత్తి పెరగాలన్నా, ఆమెకు

గౌరవమర్యాదలు పెరగాలన్నా ఆమె ఉద్యోగినిగా ఉండి ఉత్పత్తిలో భాగస్వామ్యం వహించిననాడే ఆమెకు భవిష్యత్తు వుంటుంది. ఇంటిచాకిరి అనే బానిస శృంఖలాలనుండి బైటపడి సమాజాభివృద్ధికై పాటుపడుతుంది. అప్పుడు ఇంటిపని ఎవరు చేస్తారు? భార్యాభర్తల మధ్య కలహాలు పెరిగి కుటుంబ విచ్ఛిత్తి రాదా? అనే ప్రశ్న రావచ్చు. దానికి మార్గాంతరం లేకపోలేదు.

భార్యా భర్త లిద్దరూ సంపాదించే కుటుంబాల్లో ముందుగా సదవగాహన కావాలి. సహకారం (కోపరేషన్) వుండాలి. "ఈ పని నీది, ఆ పని నాది" అనే భేదం వుండరాదు. హెచ్చుతగ్గులు ఏ పరిధిలోనూ పనికిరావు. అయితే బిడ్డల్ని కూడా పురుషులే కవాలా అనే మరో అపహాస్యం వస్తుంది. అలాంటి అవహేళనవల్ల సమస్యలు చక్కబడవు. పిల్లల్ని కనే లక్షణం స్త్రీ దేహ ధర్మం; అది ప్రకృతి లక్షణం. అందులో అన్య భావానికి ఆస్కారం లేదు. కాని ఆమె కన్నది కనుక ఆమే వారి చాకిరీ చెయ్యాలనటం మాత్రం సహించరానిది. పని విభజన లేకుండా ప్రతిపని ఎవరికి అవకాశముంటే వారు నిర్వర్తించాలి. అప్పుడే స్త్రీకి బండచాకిరీ పోతుంది. బైట పనిచేసి తాను సంపాదించగల్గుతుంది. ఉత్పత్తి విషయంలో తన పాత్రను నిర్వర్తించుకుంటుంది. స్త్రీలు బైట పనిచేస్తే నిరుద్యోగం ప్రబలిపోతుందనే భావం శుద్ధతప్పు. అది అసమానత్వ భావానికి నిదర్శనం. కొన్ని కుటుంబాల్లో స్త్రీ ఉద్యోగం చేయవచ్చు; కొన్ని సమయాల్లో పురుషులు చేయవచ్చు. ఇద్దరూ ఇంటా, బైటా చేస్తూ గౌరవ మర్యాదలను ఇచ్చిపుచ్చుకోవచ్చు. తమ మనస్సులలో బూజుపట్టిన పాత భావాలు, సనాతన పద్ధతులూ మారితేగాని పరిస్థితులు మారవు. కనుక ముందుగా స్త్రీలు తమ పరిస్థితుల్ని అర్థంచేసుకొని తమ వ్యక్తిత్వ వికాసానికై ఆరాటపడాలి. అవసరమొస్తే తిరగబడాలి. ఏ కదలికా లేకుండా, భావాలలో మార్పు లేకుండా, ఏమాత్రం కష్టనష్టాలను ఆలోచించకుండా కూర్చుని ఎవరో తమకు పెద్దపీట వెయ్యాలనుకోవటం తమ అజ్ఞానానికి నిదర్శనం.

స్త్రీ తాను గృహిణిగా గుర్తింపు పొందాలనుకోవటం శుద్ధతప్పు. ఇంటి

చాకిరి ఇద్దరం చేద్దాం; బైట పనికికూడా భాగస్వామ్యం అని వహిద్దాం ఆదేశించే ధైర్యం, చొరవ స్త్రీలలో కలిగిననాడే ఆమెకు నిజమైన విముక్తి కలుగుతుంది. ఆమె ఉద్యోగినిగా వుంటేనే అవమానాలకు, నిరాదరణకు లోనుకాదు. అదికాక ఈ రోజుల్లో అనేక నూతన పరికరాలు వొచ్చి ఇంటిపనిలోని శ్రమను తగ్గిస్తాయి. తను కన్న ఏ ఒక్కరిద్దరి పిల్లలనో చూచిపెట్టే సంస్థలూ, బాల్వాడీలు, కిండర్ గార్టెన్ స్కూళ్ళు వున్నాయి. ఈ సదవకాశాల్ని స్త్రీలు వినియోగించుకొని ఇంటిచాకిరి అనే వెట్టిచాకిరి (బాండెడ్ లేబర్) నుండి బైటపడి తన భవిష్యత్తుకు బాటలు వేసుకోవాలి. ఆనాడే స్త్రీల శ్రమశక్తివల్ల ఆర్థిక పురోభివృద్ధి వుంటుంది. సామాజికంగా గుర్తింపు వుంటుంది. సంసార రథానికి రెండుచక్రాలు సమానస్థాయిలో నడుస్తాయి. పురుష దురహంకారం నశించిపోతుంది. ఆడా మగా తేడాలు అణగారిపోతాయి. ఆడపిల్లగా పుట్టటం నేరంకాదని గుర్తింపు వస్తుంది. మన కాలాన్ని, శక్తిని సద్వినియోగం చేసుకోవటం మనచేతుల్లో వుంది. కాని చీకటికి తిట్టుకుంటూ కూర్చుంటే లాభంలేకపోగా నష్టం కలుగుతుంది. ముందుగా మనలో ఆలోచనాశక్తి రావాలి. పరిస్థితుల్ని మార్చటానికి ప్రయత్నించాలి. దానికి ధీశక్తి తోడ్పడాలి. అలా అన్ని దృక్కోణాల నుండి కష్టపడితేనే సమస్య సుకరం అవుతుంది. పాత వ్యవస్థను మార్చటం ఎంత కష్టమో దాని స్థానంలో ఆధునికతను ప్రవేశపెట్టటం అంతకన్నా కష్టం. అయినా ఎప్పుడో అప్పుడు ఆ పనిచెయ్యక తప్పదు కదా! మరి మనం సాంఘిక, ఆర్థిక, రంగాల్లో అభివృద్ధి వాంఛిస్తున్నప్పుడు కొన్ని కష్టాలు, కొంత త్యాగం తప్పదు. ఏ చిన్నపనికైనా ఎంతో కొంత శ్రమ, కాలం వెచ్చించాలి. మరి మనం సమాజాభివృద్ధి కోరేటప్పుడు దాన్ని సమూలమైన మార్పుద్వారానే సాధించగలం. ఆ మార్పుకై ముందుగా మన ఆలోచనలలో మార్పు (భావవిప్లవం) రావాలి. తద్వారా సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక రంగాల్లో పురోగమనం తప్పక సాధించగలం. మరి దానికై త్వరపడటం మన విద్యుక్త ధర్మం. ఆరోజు అతిత్వరలో వస్తుందని అనుకుందాం.

("సౌజన్య" మాసపత్రిక, అక్టోబరు 1985)

---

# కులతత్వపు కోరల్లో ఎన్ని దారుణాలో !!

ప్రేమించిన ప్రియుని వెళ్ళాడనీయని కులతత్వం ముద్దుముచ్చటలు తీరని ముద్దుగుమ్మ నిండు ప్రాణాలనే బలిగొన్నది. ఒక యువతి తన తల్లి నిర్బంధంవల్లా, ఆంక్షలవల్లా, ఒత్తిడివల్లా ఆత్మహత్యకు పాల్పడింది. తన ప్రియునితో వివాహానికి తన తల్లిదండ్రుల సమ్మతికై ఆశించింది. అర్రులు చాచింది. పోరాడింది. గతిలేక, ధైర్యంలేక, కడకు ఆత్మాహుతి చేసుకొన్నది. కులతత్వపు విషకోరల్లో ప్రాణాన్ని సైతం పోగొట్టుకున్న ఈ అబల కథ సభ్య ప్రపంచాన్నే కలవర పరిచింది.

ఇటీవల ఇంగ్లండులో ఒక దారుణ సంఘటన జరిగింది. ప్రక్క ప్రక్కగా నివసిస్తున్న చిన్న, పెద్ద కులాల అబ్బాయి అమ్మాయిల స్నేహం పెరిగి అది ప్రేమగా మారింది. అది ఆత్మీయతను ఆశించింది; సాన్నిహిత్యాన్ని కోరింది. అయితే అది పెద్దల అనుమతి పొందలేకపోయింది. పెద్దకులపు అమ్మాయి తల్లి తక్కువ కులం అబ్బాయితో తగదని వారించింది. దారుణంగా హింసించింది. ఆ అమ్మాయి తిరగబడింది. పర్యవసానమే అమ్మాయి ఆత్మహత్య. ఒకదశలో ఆ అబ్బాయిని కూడా అవమానపర్చటం, నిందించటం, కొట్టడం కూడా జరిగింది. అది చాలక తన పిల్ల పేర 50 వేల ఆస్తి పెట్టమని, ఆమె భవిష్యత్తుకు హామీ ఇవ్వమని బెదిరించింది. అలాగైనా సంబంధం చెడిపోతుందని ఆమె భావం. వరకట్నాలతో అల్లాడిపోతున్న ఈ రోజుల్లో ఈ వింత కోరిక అంతరార్థం అదే. అదే తన కులంలో అయితే తల తాకట్టు పెట్టిఅయినా ఒక లక్ష కట్నం ఇచ్చి ఏ అనామతుడికైనా కట్టబెట్టేదే. కేవలం కులాభిమానంతో కన్నబిడ్డను కూడా హతమార్చుకున్న ఆ తల్లిదండ్రుల నేమని పిలవాలి ! వారి ఈ ఈ కర్కశత్వానికి మూలకారణ మేమిటి ? దాన్ని ఎలా ప్రతిఘటించాలి? అనేవి నేడు మనముందున్న ముఖ్య ప్రశ్నలు.

కులతత్వం సామాజిక సమస్యలతో ముఖ్య భూమిక వహిస్తోంది. ఇది రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక రంగాలన్నింటిని ఆవరించింది. విద్యాలయాలకు ప్రాకింది. ఎన్నికలను కలుషితం చేసింది. అస్పృశ్యతకు

దారితీసింది. మనిషికి మనిషికి మధ్య అడ్డుగోడలను నిర్మించింది. స్వేచ్ఛకు సంకెళ్ళు వేసింది. మానవత్వాన్ని మంటగలిపి రాక్షసత్వానికి బాటలు నిర్మించింది. మూఢవిశ్వాసాలకు నాంది పలికింది. "అగ్ర" "అధమ" అనే బేధాలతో నిచ్చెనమెట్ల సమాజాన్ని స్థాపించింది. ఈ దేశంలో 5600 కులాలున్నాయని అంచనా. వేలసంఖ్యలో వున్న ఈ కులాలవారి భాషలు వేరు; ఆచార వ్యవహారాలు వేరు; వివాహ పద్ధతులు వేరు. ఏ రెంటికీ పొత్తు కుదరదు. కులానికి ముఖ్యమైనవి మూడు. సహ పంక్తి భోజన నిషేధం. కర్మకాండలకు (బ్రాహ్మణుడు తప్ప) అన్య కులస్థుడు నిషేధం. ముఖ్యమైనది అంతర్వర్ణ వివాహ నిషేధం. దీనికి అంటరానితనమనే మరో జాడ్యంకూడా వుంది. కుల వ్యవస్థలో పూర్తి విశ్వాసముండి, ఆ వ్యవస్థను శాశ్వతం చేయాలనేవారు కొందరైతే విశ్వాసంలేకుండా తమ స్వార్థ, ప్రయోజనాల కోసం వాడుకునేవారు మరి కొందరున్నారు. దీన్ని ప్రత్యక్షంగా, పరోక్షంగా ఉపయోగించుకొనేవారు లేకపోలేదు. మొండిధైర్యం, అహంకారం కలవారు ప్రత్యక్షంగా బలపరు స్తుంటే అవినీతిపరులు, పిరికివారు పరోక్ష పంథాను పాటిస్తున్నారు.

హిందూ సంస్కృతికి పునాది వర్ణవ్యవస్థ. వర్ణవ్యవస్థ కులవ్యవస్థకు, అంటరానితనానికి దారితీసింది. కులతత్వానికి సిద్ధాంత ప్రాతిపదిక తాత్విక మైనది. కర్మసిద్ధాంతం, పునర్జన్మ ఈ రెంటిపై ఆధారపడి వుంటుంది కులం. పూర్వజన్మ కర్మవల్ల ఈ జన్మలో ఫలాని కుటుంబంలో జన్మిస్తా రనేది దానికి ముఖ్యసూత్రం. నీ పాపంవల్లనే నీవు నీచకులంలో పుట్టావు-కనుక అనుభవించమంటుంది కర్మసూత్రం. అందిరిలో ప్రవహించే రక్త కణాలు ఒకటేననే డాక్టర్లు, విద్యావంతులు, శాస్త్రజ్ఞులుకూడా కులతత్వాన్ని బలపరుస్తున్నారు. ఏ కులంవాడు ఎలెక్షన్‌లో పోటీచేస్తున్నాడనే చూపు తప్ప వ్యక్తి నీతీ నిజాయితీ, గుణగణాలు, పరిపాలనాదక్షతలు పరికించే పరిస్థితి అంతరించిపోయింది. తమ కులప్పవారికే ఉద్యోగాలు, ఇంక్రి మెంట్లు, ప్రమోషన్లు, కాలేజీ సీట్లు ఇచ్చుకోవటం అనివార్యమయి పోయింది. అందువల్లే రాజకీయాలు, అధికార పదవులు భ్రష్టుపట్టాయి. పరిపాలనా వ్యవస్థ అస్తవ్యస్థమైపోయింది. అవినీతి పెరిగిపోయింది.

అరాజకం విలయతాండవం చేస్తోంది. తమకులపు వారైతే ఏ తప్పుచేసినా రక్షించడం, కానిచో రొంపిలో దింపటం సర్వత్రా జరుగుతోంది. కులాల మధ్య తగాదాలు, దోపిడీలు, దొమ్మీలు, హత్యలూ నిత్యం జరుగుతున్న నిత్యసత్యాలు.

స్త్రీలే ఈ కులతత్వాన్ని ప్రబలంగా పోషిస్తున్నారనే వాదం ప్రబలంగా వుంది. ఇంకా అర్ధధర్మ స్త్రీలలో జిజ్ఞాస వుండబట్టి భారతీయ సంస్కృతి, ప్రాచీన సంప్రదాయం మనగల్గుతున్నాయని స్త్రీల అజ్ఞానాన్ని శ్లాఘించే సనాతనులూ వున్నారు. ఇది నిజమని నమ్మిన స్త్రీలు కులవ్యవస్థకు కుదురుచేసి కాపాడుతున్నారు. ఎంతగా అజ్ఞానం, అవిద్యా వుంటాయో అంత హెచ్చుస్థాయిలో సాంఘిక దురాచారాలు ఘనీభవించి వుంటాయి. అందువల్లనే మూఢాచారాలు, కుల మతాభిమానాలు స్త్రీలలో మిక్కుటమనేది నగ్నసత్యం. వారి అవివేకంవల్ల అభ్యుదయవాదులైన భర్తలను సైతం వెంటాడి వేధిస్తారు. వారిని అదిలించి, బెదరించి లొంగదీసుకొని తమ మౌఢ్యానికి పట్టాభిషేకం చేసుకుంటున్నారు. అదే రీతిలో బిడ్డల స్వేచ్ఛను అరికట్టి వారి భవిష్యత్తును బ్రద్దలు కొడుతున్నారు. వరకట్న రహిత, కులాంతర వివాహాలకు సిద్ధపడే పిల్లలను వ్యతిరేకిస్తున్నారు. ప్రేమ వివాహాలకై తపించే కన్నబిడ్డలను గంగ్రదగొడ్డలికి ఆహుతి చెయ్యటానికికూడా వెనుకాడరు కొందరు. ఆఖరికి అంతగా అవసరమొస్తే తమ ప్రాణాలను సైతం విడిచి కులధర్మాన్ని నిలబెడతారు. ఇదంతా ధర్మ సంస్థాపన అని, అది నిలబెట్టటానికి ఎంతటి త్యాగమైనా తప్పదని వారి నమ్మిక, ధ్యేయం. అందువల్ల కుటుంబంలో శాంతికొరకు, భార్యను సంతోష పెట్టటానికి, తల్లికి మనఃక్లేశము తగ్గించటానికి ప్రగతి కాముకులైన పురుషులు సైతం వెనుకంజ వేస్తున్నారు. కులతత్వమున్న తల్లులు తమ సంకుచిత భావాలకు విషబీజాలలాగా పిల్లల చేతమనస్సులలో నాటుతారు. ఈ భావాలు బిడ్డల జీవితాంతం వెంటాడుతాయి. అలా స్త్రీల అజ్ఞానంవల్ల వారేకాక కుటుంబం, సమాజం, దేశం కులతత్వానికి బలి అయ్యే ప్రమాదం చాలావుంది. విదేశాల్లో ఏళ్ళతరబడి వుంటున్నవారు సైతం పెళ్ళి అనగానే తమ దేశంలో, తమ రాష్ట్రంలో, తమ భాషాజ్ఞానం,

తమ సాంప్రదాయాలు కలిగివున్న వారినే పెళ్ళి చేసుకుంటారు. అంతే కాదు వారి కులం, శాఖ, గోత్రం, జాతకం అన్నీ సరిపోవాలి. కారణం-కుటుంబ ఆచారాలవల్లనే.

ఇన్ని రకాల విధ్వంసానికి మూలమైన ఈ కులతత్వ పిశాచిని కనీసం మార్పుకైనా ప్రయత్నించని వారు సమ సమాజాన్ని గూర్చి ప్రసంగించటం, నీతులు వల్లె వేయడం హాస్యాస్పదం. ఆధునికత, అభ్యుదయం కోరే వ్యక్తులు సాంస్కృతిక పరమైన విప్లవభావాలు సామాన్య ప్రజానీకానికి అందజేయాలి. మూఢ విశ్వాసాలకు, కులాభిమానానికి వ్యతిరేకంగా పోరాటం సాగించాలి. సామాజికంగా కులతత్వాన్ని రూపుమాపటానికి అంతర్వర్ణ వివాహాలను ప్రోత్సహించాలి.

మున్ముందుగా స్త్రీలలో కులాభిమానాన్ని రూపుమాపే ప్రయత్నం భారీ ఎత్తున జరగాలి. స్త్రీలలో సామాజిక స్పృహతోనిదే ఈ కులతత్వ పిశాచాన్ని పారద్రోలలేము కనుక దాని కనువగు మార్గాన్వేషణ, కార్యక్రమాలు చేపట్టాలి. అంటే ఈ సందర్భమైన ప్రచారం, ముందుగా మహిళాలోకంలో ప్రారంభం కావాలి. మానవులంతా సమానులే, వారిలో హెచ్చుతగ్గులు లేవు, నిచ్చెనమెట్ల సమాజం పనికిరాదు, అందరికీ హేతుత్వ శక్తి వుంది అని మహిళా లకానికి ప్రత్యేకంగా పాఠాలు చెప్పాలి. గూడు కట్టిన సనాతన ఛాందసాలకు స్వస్తిచెప్పాలి. శాస్త్రీయ అవగాహన, శాస్త్రీయ దృక్పథం స్త్రీలలో రేకెత్తించాలి. సగభాగమైన స్త్రీలు అంటరానితనాన్ని కులతత్వాన్ని విస్మరించనిచో ఈ దేశానికి ప్రగతిలేదు. సాంఘిక కార్యక్రమాలు సమాజం మొత్తంమీద సాగించడం ఒక ఎత్తు, మహిళాలోకంలో ప్రబోధించడం మరొక ఎత్తు.

పటిష్ఠమైన కార్యక్రమాలకు కొన్ని సూచనలు గమనించాలి. "మీ కులమేది" అని అడిగితే "మా కులం లేదని" చెప్పాలి. దరఖాస్తు ఫారం నింపేటప్పుడు కులం అన్నచోట "లేదు" అని వ్రాయాలి. కులవ్యవస్థ ఎలా పుట్టిందో, ఎలా పెరిగిందో, స్వప్రయోజనపరులు ఎలా వాడుకుంటున్నారో విద్యార్థులకు వివరించి చెప్పాలి. కులాన్ని సూచించే పేర్లను

రెడ్డి, శాస్త్రి, శర్మ, రాజు, గుప్త, చౌదరి, నాయుడులాంటి వాటిని తొలగించుకోవాలి. ఒక మతం, లేక కులం ఎక్కువనే భావాన్ని స్ఫురింపజేసే పాఠ్యభాగాలను తొలగించాలి. శాస్త్రీయ దృక్పథాన్ని పెంచే అన్ని చర్యలను చేపట్టాలి; ప్రోత్సహించాలి. కులంతో నిమిత్తంలేని విధానంలో వెనుకబడినవారికి రిజర్వేషన్లు సమకూర్చాలి.

ప్రపంచం శాస్త్ర సాంకేతిక రంగాల్లో విశ్వ కవాటాలను ఛేదిస్తోంది. ఈనాటి మానవుడు విశ్వమానవుడైనాడు. విజ్ఞానం, సైన్సు పెరిగింది కాని శాస్త్రీయ దృక్పథం లోపించడం మన అజ్ఞానానికి నిదర్శనం. కుల తత్వం క్రమేపి తగ్గుతున్నదనుకొనుట కేవలం భ్రమ మాత్రమే. సామాజిక పరంగా అంతర్వర్ణ వివాహాలు చేయించుట, ప్రోత్సహించుట, ముఖ్యం. చేసుకున్న దంపతులకు అండదండలుగా నిల్చి వారిని సమాజిక విషవలయంనుండి, తల్లిదండ్రుల వ్యతిరేకతనుండి రక్షించుట ముఖ్యమైనది.

ఈ సమస్య పరిష్కారానికి ప్రభుత్వం, స్వచ్ఛంద సంస్థలు, పౌరులు, కలిసికట్టుగా పనిచేయాలి. రాజకీయపరంగా, తాత్వికపరంగా, సాంఘికపరంగా అన్నిరంగాలలో బహుముఖ కృషి జరగాలి. ఇలా తాత్విక, సామాజిక, రాజకీయ, స్త్రీలపరంగా ప్రత్యేక శ్రద్ధతో ఏకకాలంలో పనిచేస్తే అనతికాలంలో కులం పేరూ, పూరూ లేకుండాపోతుంది. దాని వునికి నశిస్తుంది. సంస్కరణవాదులు, మేధావులు, ప్రజా సంఘాల కార్యకర్తలు ఈ కృషికి పూనుకుంటె బలవంతపు మరణాలను, విధ్వంసక చర్యలను అరికట్టగలం.'వ్యక్తి కేవలం ఆహార, నిద్రా, మైధునాలకొరకే జీవించడు. అతి ముఖ్యమైనది ఆత్మగౌరవం. అది లేనిదే వ్యక్తిత్వం వికసించదు. దానికై ఆరాటపడటం అనుచితం కాదు. అది కులతత్వం నశిస్తేనే సిద్ధిస్తుంది.

("కలువబాల"–అక్టోబరు 1985)

---

# గొడ్రాలయితే చంపాలా ?

"పిల్లలు పుట్టనిదానివి బ్రతకటం ఎందుకు ? ఏ బావిలోనైనా పడి చస్తే నలభై వేలు ఖర్చుచేసి అయినా ఇంకోదాన్ని తెచ్చుకుంటాం" అంటూ అత్తమామలు, భర్త ప్రతినెలా బహిష్టు కాగానే తిట్టటం, కొట్టడం చిత్ర హింసలు పెట్టడం జరిగేదట. ఆమెకు పెళ్ళయి పది ఏళ్ళు అయినా సంతానవతి కాలేదు. అలాగే ఆరోజు మళ్ళీ బహిష్టు అయిందనే కోపంతో భర్త చెప్పుతో కొట్టగా, అత్తమామలు బైటికి గెంటగా పుట్టింటికెళ్ళింది. వారు నచ్చచెప్పి భర్తవద్దకు తిప్పి పంపారు. ఆవేశం పట్టలేని భర్త, అత్త ఆమెను లాక్కెళ్ళి బావిలోకి త్రోసి చంపినట్లు వార్త వచ్చింది. ఇలాంటి దుస్సంఘటన లెందుకు జరుగుతున్నాయి ? దీనికి మౌలికమైన కారణా లేమిటి? సభ్యసమాజం చూస్తూ హర్షించడం న్యాయమేనా?

ఉదయాన్నే లేచి ఏ గొడ్రాలు మొహం చూచానో! ఏ విధవరాలు ఎదురయిందో! ఈరోజు నా పాలిట యమపాశమయింది అంటూ దూషిస్తారు. పిల్లి, విధవరాలు, గొడ్డుమోతు ఎదురుపడితే అశుభం అనే మూఢ విశ్వాసం ఈనాటిది కాదు. అంటే విధవలు, సంతాన విహీనులు అయిన స్త్రీలు జంతువుకన్నా హీనజాతివారన్న మాట. శుభకార్యాలలో వారు ముందుండరాదు. హారతి పట్టడం, పసుపు కుంకుమ లందివ్వడం, ఉయ్యాలల్లో బిడ్డని పెట్టడం, మొలత్రాడు కట్టడం లాంటివి వారిపట్ల నిషేధం. బిడ్డల్ని కనలేని స్త్రీకి విడాకు లివ్వడం సర్వసాధారణం. బిడ్డల్ని కనిపెంచే శక్తిలేనివాణ్ణి భార్య మాత్రం విడనాడుట సాంఘిక ద్రోహం. పుట్టినిల్లు, మెట్టినిల్లు) రెండు కుటుంబాలకు అగౌరవం ఈ ద్వంద్వనీతి ఈనాటిది కాదు. నాగరిక సమాజ ఆవిర్భావం నాటినుండి నడుస్తున్న చరిత్ర. పిల్లల్ని కనలేని స్త్రీకి విడాకులిచ్చేవారు. కొందరైతే, పూర్తిగా విడిచేసే వారు మరికొందరు. ఆమెను చంపి మళ్ళీ కట్నకానుకలతో వైభవంగా పెళ్ళాడే పెద్దమనుష్యులున్న సమాజం మనది. అంటే స్త్రీ విధిగా బిడ్డల్ని కనటానికే సృష్టింపబడ్డదనే విష సంస్కృతి మన్నింకా వెంటాడుతూనే వుంది. కనగల తల్లికూడా మగబిడ్డల్ని విధిగా కనాలి. లేకుంటే ఆమె

గతి అధోగతిగా మారుతుంది. గౌడ్రాలయిన స్త్రీ తనకు తానే తన భర్తకు మళ్ళీ పెళ్ళికి ఇష్టపడిన కేసులెన్నో వున్నాయి. మరి భర్త నపుంసకుడైతే, శక్తివిహీనుడైతే దత్తతకు భార్య అంగీకరిస్తున్నప్పుడు, భార్య పట్ల భర్త అలా ఎందుకు వర్తించడం లేదు? ఇదెక్కడి న్యాయం?

అసలు అలా ప్రవర్తించటానికి ఆ భర్త మనస్తత్వాన్ని విశ్లేషణ చేద్దాం. అతను స్వతంత్రాలోచనా పరుడుకాడు. తరతరాల భావజాలానికి వారసుడు. అందువల్ల తన జీవిత ధ్యేయం కేవలం సంతానప్రాప్తి మాత్రమేనని భావిస్తున్నాడు. బిడ్డను కనటానికే కుటుంబ వ్యవస్థ ఏర్పడిందని విశ్వసిస్తున్నాడు. ఇది కేవలం సనాతన సంప్రదాయ భావన. సంతానంలోకూడా పురుష సంతానాన్ని వాంఛించడం దాని మౌలిక స్వరూపం పున్నామనరకంనుండి బైటపడటానికి పుత్రుడు కావాలి. పుత్రుడు పుట్టాలనే ప్రార్థనలు ఋగ్వేదంలోనూ, గర్భస్థపిండం స్త్రీ రూపంలో వుంటే పురుష రూపంలోకి మార్చమనే అభ్యర్థనలు అధర్వణ వేదంలోనూ వున్నాయి. ఈనాటి ఆలోచనా ధోరణులు వేరు. వివాహంయొక్క ఉద్దేశ్యంలో మార్పు వస్తోంది. ధర్మార్థ, కామ, మోక్షాలకు అని చెప్పినపుడు ధర్మ నిర్వహణ పేర పుత్రుణ్ణి ఆశించటం జరిగింది. ధర్మ స్వరూపం మారింది. ఈనాటి వివాహంలో అర్థకామాలకు ప్రాముఖ్యత పెరిగింది. దంపతుల సాహచర్యానికి విలువ యిస్తున్నాం. ఒక పురుషుడు ఒక స్త్రీని సతిగా స్వీకరించినా లేక ఒక స్త్రీ పురుషుణ్ణి పతిగా బడసినా ఒకరు మరిఒకరి సాంగత్యాన్ని, సాహచర్యాన్ని ఆశిస్తున్నారు. కనుక ఒకరు మరిఒకర్ని వ్యక్తిగా గుర్తించి, గౌరవించి, అభిమానించి, ప్రేమించి జీవితం గడపడం జరుగులోంది. అంతేకాని ఒకరు మరొకర్ని తమ సంకుచిత స్వార్థప్రయోజనాలకు వాడుకోరాదు. అంటే ఆమెకు అతడు, అతనికి ఆమె సాధనాలు కాదు. వారు నిండు మనుష్యులు, అలా అనుకొని ఇరువురూ జీవితం కొనసాగించుకోవాలి. అప్పుడు దాంపత్య ఫలితంగా వుద్భవించే సంతానం ద్వితీయ శ్రేణికి చెందుతుంది. కనుక రెండవ మెట్టుకు చెందిన పిల్లలకోసం మొదటి స్థానానికి చెందిన భార్యను విడనాడటం, లేక విడిచిపెట్టడానికి ఆలోచించడం అనుచితం. దానికి

నాందిగా ఆమెను చిత్రహింసలపాలు చేయడం, శారీరక మానసిక హింస అకు లోనుచేయడం దుర్మార్గం. అలా చేసే వ్యక్తి మనస్సులో స్వార్థ చింతన కరుడు కట్టుకొనిపోయిందని తేలుతుంది. పరస్పర సానుభూతితో నిండిన సహకారయుతమైన అనురాగపూరిత జీవితాలలో ఇలాంటి దురూహలు, దుర్మార్గపు ఆలోచనలు తలయెత్తవు.

సమాజం కుటుంబాన్ని ఏ భావనతో చూస్తున్నది. స్త్రీని ఏ దృష్టితో పరిగణిస్తూంది అనే వాటిపైద ప్రధానంగా పురుషుల మనస్తత్వం- ఆ మాటకొస్తే స్త్రీల మనస్తత్వం కూడా ఆధారపడివుంటుంది. ఈ పరిస్థితి మారాలంటే అనేక ప్రాతిపదిక చర్యలు, కృషి అవసరమవుతాయి. మున్ముందుగా సనాతన సంప్రదాయ భావాలు ఈనాడు చెల్లవని గ్రహించాలి. సమాజంలో స్త్రీ పురుషుల సంఖ్య ఇంచుమించుగా సమానంగా వుంటేతప్ప సామాజిక జీవితం అయోమయ మవుతోందని గ్రహించక తప్పదు. పురుష సంతానం కావాలనే ప్రతిజంటా కోరుకుంటే స్త్రీల సంఖ్య తక్కువై సమాజం అస్తవ్యస్తమై పోతుంది. స్త్రీ పురుషు లిద్దరూ శ్రమించి సంపాదిస్తున్న ఈ రోజుల్లో హెచ్చుతగ్గులకు తావులేదు. సంతానాన్ని విధిగా పొందాలనే సూత్రం ఈ రోజుల్లో అర్థరహితమవుతోంది. పూర్వం వృద్ధాప్యంలో కనిపెట్టి వుండటానికి, పోషించడానికి – అంటే సామాజిక భద్రతా సౌకర్యాలలో భాగంగా సంతానాన్ని ఆశించేవారు. ఈనాడు పరిస్థితులు మారాయి. సమిష్టి హిందూ కుటుంబం బద్దలయింది. పొట్టచేతపట్టుకొని కొడుకులు దూర ప్రదేశాలకు వలస పోతున్నారు. వృద్ధులైన తల్లిదండ్రులు తమ బిడ్డలకై పరితపించడంకంటె ఒకరికి రెండోవారు అండదండలై నిలిస్తే ప్రశాంతత లభిస్తుంది. శక్తి వున్నంతకాలం ఏదో ఒక సేవాకార్యక్రమంలో వుంటె శాంతి, తృప్తి కలుగుతాయి. పూర్తిగా పిల్లలమీద ఆధారపడటం అంత మంచిది కాదు. చివరి క్షణంలో ఏదీ ఆగదు. అలా తమ వైఖరులను మార్చుకోకపోతే వృద్ధులూ, బిడ్డలూ హతాశులవుతారు. అలా ఆత్మ విమర్శ చేసుకోవాలి అప్పుడు ప్రేమా, అనురాగాలకు దాంపత్య జీవితం మనకు పూర్తిగా దోహదం చేస్తుంది. బిడ్డల్ని కనడం రెండవ స్థానానికి దిగజారి అన్యోన్య దాంపత్యం మొదటి స్థానాన్ని ఆక్రమిస్తుంది.

అసలు బిడ్డలు కలుగకపోవటానికి కేవలం స్త్రీ అవయవాల లోపమే కాదు. పురుషుడి ఇంద్రియంలోకూడా జీవకణాలు లేకపోవచ్చు. వున్న వాటికి కదిలే శక్తిలేకపోవచ్చు. ఇంకా అనేక లోపాలుండవచ్చు. కొన్నింటిని శస్త్రచికిత్సద్వారా కూడా సరిదిద్దలేరు. అలాగే స్త్రీకి "ఓవమ్" లో ప్రాణం లేకపోవచ్చు. ఓవమ్ తయారుకాకపోవచ్చు. గర్భసంచి తిరగబడి వుండవచ్చు. ఫెలోపియన్ ట్యూబులలో అడ్డుగోడలుండవచ్చు. ఎన్నో హార్మోన్సుల లోప ముండవచ్చు. దానికి ఒకర్ని ఒకరు నిందించి ప్రయోజనం లేదు. డాక్టర్లను సంప్రదించాలి. లాభంలేదంటే మనస్సును ఏదో విధంగా (దత్తత వగైరా) తృప్తిపరచుకోవాలి. వివాహానంతరం అంగ వైకల్యం వచ్చిన భర్తను భార్య గౌరవించటం లేదా! అలాగే అర్థంచేసుకోవాలి. బిడ్డల కొరతను సరిదిద్దుకోగలం కాని దాంపత్యంలో అఘాతాన్ని, ఎడబాటును, కలహాలను భాగస్వామి మరణాన్ని ఆశించడం అతి దారుణం. కనుక ఉన్నంతలో సంతృప్తి చెందటం మానవధర్మం. అది మనచేతిలో పని. కనుక సంసారాలను దుఃఖ భాజనం చేసుకోవటం అవివేకం. అలాంటి అవగాహన మనలో ఉన్ననాడు ఇలాంటి దుర్మరణాలు సంభవించవు. కుటుంబాల్లో శాంతి సౌభాగ్యాలు వుంటాయి.

("కలువబాల" 15-10-85)

---

# అణ్వాయుధ ఉన్మాదం : అబలల ఆర్తనాదం

ఈ విశ్వం మాది. ఈ మానవజాతికి రక్షించుకోవాల్సిన బాధ్యత మాది. మా బిడ్డల ప్రాణాలను కాపాడుకోవలసిన వాళ్ళం మేము. సంతానం కనాలనే కోర్కె ఎంత సహజమో, వారిని రక్షించుకోవడం అంతకన్నా ముఖ్యమని మాకు తెలుసు. జనాభాను పెంచి యుద్ధాలను ప్రోత్సహిస్తుంటే మేమిక ప్రేక్షకులంగా వుండలేము. అసలు మేము బిడ్డల్ని

కనేది, పెంచేది చంపుకోటానికేనా ? ఇకనుండి మేము సంతానాన్ని కనే ఫ్యాక్టరీలుగా జీవించలేము. మాకు మాతృహృదయముంది. మమ్మల్ని అర్ధంచేసుకుంటే సరి. లేకుంటే శాంతియుత సమాజం ఏర్పడేవరకు మేము బిడ్డలనే కనము. మా గర్భశోకం మీకు అర్ధంకాదు. శాంతి స్థాపన కొరకు మేము తిరగబడాలా? లేక మా ప్రాణాలొడ్డి పోరాడాలా ? అంటూ వీరో చితంగా ఎలుగెత్తి అరుస్తోంది ఈనాటి మహిళాలోకం.

ఈనాటి ప్రపంచం విశ్వకవాటాలను ఛేధించింది; సాంకేతికాభివృద్ధిని సాధించింది. ఈ అభివృద్ధిని ప్రపంచశాంతికి బదులు విధ్వంసానికి, మారణాయుధాల ఉత్పత్తికి ఉపయోగించడం అమానుషం. జాతి వెనుకబాటుతనానికి ఇది నిదర్శనం. 960 లో 22 వేల కోట్ల డాలర్ల ఖర్చుతో అణ్వాయుధాలను ప్రపంచం మొత్తం తయారుచేసింది. అదే 1980 నాటికి 45 వేల కోట్లు వెచ్చించారు. ఈనాడు 35 దేశాలు అణ్వాయుధాలు తయారుచేస్తున్నాయి. ప్రపంచం అంతా అణ్వాయుధాలపై నిమిషానికి పదిలక్షల డాలర్లు వెచ్చిస్తున్నట్లు కామన్ వెల్తు ప్రధాన కార్యదర్శి శ్రీదత్ రాంఫాల్ చెప్పాడు. ఈ దశాబ్దాంతానికి ఇది రెండింతలవుతుందని ఆయన అన్నాడు. మొత్తం మిలిటరీ వ్యయంలో మూడువంతులు అభివృద్ధి చెందిన దేశాలు ఖర్చు చేస్తున్నాయని, ఇటీవల బడుగుదేశాలుకూడా అపరిమితంగా ఖర్చు చేస్తున్నాయని, ఇలా అయితే రెండువేల సంవత్సరం నాటికి నూరుదేశాలు ఆ స్థాయికి చేరుకోగలవని, ఆనాటికి 60% ప్రజలు మాత్రమే జీవించగలరని అంచనాలు వచ్చాయి. అనేక దేశాలు తిండికి, బట్టకు, వసతికి నోచుకోని ఈ తరుణంలో, ఆయుధాల ఖర్చు క్రింద తల కొక 110 డాలర్లు వెచ్చించడం అమానుషం కాదంటారా? నిరాయుధీకరణకు చేసిన రెండు పెద్ద ప్రయత్నాలు విఫలమయినాయంటే ఇందులో ఏదో లోపం వుండాలి. ఇప్పుడైనా ఆ ఆశ ఫలిస్తుందా అని వేయికళ్ళతో ఎదురు చూస్తోంది ప్రపంచం.

అమెరికా అధ్యక్షుడు రీగన్, రష్యా కమ్యూనిష్టు పార్టీ అధినేత గోర్బచోవ్ అణ్వస్త్ర నిరాయుధీకరణ విషయమై శిఖరాగ్ర సమావేశం జెనీవాలో జరుపమన్నారు. ఈ చర్చలపై ప్రపంచశాంతి ఆధారపడి వుంటుంది.

ఈ అగ్రరాజ్యాలు రెండూ అణ్వాయుధీకరణలో తమ పోటీని ఉపసంహరించుకుంటారా? లేక కనీసం తగ్గించుకుంటారా? ఇకముందు అణ్వస్త్రాలను తయారుచేయడం మాని ఒప్పందం కుదుర్చుకుంటారా? తయారైన అణ్వస్త్రాలలో (మీటనొక్కితే దేశాలే దగ్ధమయ్యే మారణాస్త్రాలలో) కొన్నింటినైనా పనికిరాకుండా చేస్తారా ? ఈ ప్రశ్నలకు వొచ్చే సమాధానాలపై ప్రపంచశాంతి, మా బిడ్డల ప్రాణరక్షణ ఆధారపడి వుంటుంది. అందుకు మా పాత్ర ఏమిటి? అని మహిళలు తల్లడిల్లిపోతున్నారు.

తమ తమ దేశాలలోని ఆర్థిక వ్యవస్థల లేక రాజకీయ వ్యవస్థల లేక మిలిటరీ విభాగాల అవసరాలు, వొత్తిడులు రాజ్యాధినేతల అభిప్రాయాలను, నిర్ణయాలను మలుస్తాయి. ఈ నాయకులు సరి అయిన నిర్ణయాలు చేయాలంటే ప్రజాభిప్రాయం, ముఖ్యంగా సగభాగమైన స్త్రీల హెచ్చరికలు వారిపై ఒత్తిడి తేవాలి. ప్రజాభిప్రాయాన్ని మలచడంలో స్త్రీల పాత్ర కీలకమయింది. అంతేకాక యుద్ధాలు వస్తే స్త్రీలు భార్యలుగా నష్టపోతారు; తమ భర్తలను కోల్పోతారు; తల్లులుగా చెప్పనలవికాని కష్టాలకు, వ్యధలకు గురి అవుతారు. తమ ఎదుటనే తమ బిడ్డలు విగత జీవులవుతారు; లేక అవిటివారుగా, వికలాంగులుగా, నడయాడే పరిస్థితి వస్తుంది. ఇదంతా ఊహించుకొంటే ఏ స్త్రీ హృదయమైనా ద్రవ్యలు కాకపోదు; కనుక శాంతి సాధన స్త్రీలకు చాలా ముఖ్యం. అది వారికి జీవన్మరణ సమస్య. అందువల్ల ప్రపంచ స్త్రీలు కేవలం తమ వైవాహిక, మాతృత్వ హక్కుల కోసమే కాక ప్రపంచ శాంతి కొరకు కృషి చేయాల్సిన అవసరం వుంది. దీనిని మహిళా కార్యకర్తలు, చైతన్యవంతులైన స్త్రీలు గుర్తిస్తున్నారు. అందువల్లనే అభివృద్ధికి, శాంతికి వుండే సంబంధాన్ని గుర్తెరిగి శాంతిని గురించికూడా నైరోబిలో జరిగిన ప్రపంచ మహిళా దశాబ్ది సభలో తీవ్రంగా హెచ్చరించారు. అనేకమంది డెలిగేట్లు శాంతి స్థాపనకై తమ తమ నివేదికలను సమర్పించారు.

శాంతి, సమానత్వం, అభివృద్ధి అనే మూలసూత్రాలపై ప్రపంచ మహిళల స్థాయిని పెంచి, ప్రపంచశాంతి పరిరక్షణ జరపాలనేదే ప్రపంచ

మహిళా దశాబ్ది వుత్సవాల లక్ష్యం. ఆ సందర్భంగా 76 లో మెక్సికోలో, 80లో కోపెన్‌హాగన్‌లోను జరిగిన సభలు స్త్రీలలో సంచలనాన్ని కలిగించినై. 150 దేశాలనుండి 1500 ప్రతినిధులు హాజరై 206 అంశాలతో విద్య, ఉద్యోగం, ఆరోగ్యం, గృహవసతి, ప్రసార సాధనాలు, కుటుంబం, పోషకాహారం, రాజకీయ విముక్తిలాంటి ప్రణాళిక తయారుచేసి ప్రపంచ స్థాయిలో చర్చలు జరిపారు. ఇవి స్త్రీలలో కొంత జాగృతిని కలిగించింది. శాంతిస్థాపనకై నేటి స్త్రీల ఆరాటం దానికి తార్కాణం. అసలు శాంతి కోసం స్త్రీలు పనిచెయ్యటం ఈనాటికి కాదు. 1981 సెప్టెంబరులో హెలెన్ కాల్డికాట్ ప్రపంచ శాంతి ఉద్యమాన్ని నడిపింది. రష్యా వెళ్ళి అధికార్లను, అనధికార్లను కలిసి అణ్వాయుధ పోటీని ఆపమని అర్థించింది. ఆమెను ఉత్తమ హ్యూమనిష్టుగా అమెరికన్ హ్యూమనిష్టువారు పేర్కొని గౌరవించారు. 1982 జూన్ 12న న్యూయార్కు నగరంలో అనేక వృత్తులవారు, మతాలవారు, కార్మిక, విద్యా, రాజకీయ సంఘాలవారు మూడు మైళ్ళ పొడవున లక్ష జనం శాంతికోసం శాంతి యాత్ర జరిపినట్లు న్యూయార్కు టైమ్సు ప్రచురించింది.

శాంతి స్థాపనకై స్త్రీ లెంత ఆరాటపడుతున్నారో మహిళాదబ్ది సభలు (జులై 1985) జరిపిన చర్చలే మనకు తార్కాణాలు. 160 దేశాలనుండి 1300 డెలిగేట్లు పాల్గొన్న ఈ మహాసభలో న్యూజిలాండ్‌లో స్త్రీల వ్యవహారాల మంత్రి అనిహెర్‌కుస్ ప్రపంచంలోని స్త్రీ లందరినీ శాంతికోసం జరిగే పోరాటంలో చేరమని విజ్ఞప్తి చేసింది. తమ దేశం అణ్వస్త్ర రహిత ప్రాంతంగా చేసినందుకు తన ప్రభుత్వాన్ని ప్రశంసించింది; అందుకు తమ దేశ స్త్రీలంతా సంతోషిస్తున్నారని గర్వంగా చెప్పుకున్నది. అణ్వాయుధాలను పారద్రోలటానికి మన సహజ నైజానికి అనుగుణంగా మన శక్తి మేరకు కృషిచేయాలి అది ఎంత చిన్న చర్య అయినా సరే, అన్ని ప్రయత్నాలూ మనలను లక్ష్యానికి చేరువగా చేరుస్తాయి. పసిఫిక్ మహా సముద్ర ప్రాంతాన్ని అణ్వస్త్ర రహితం చేసే ప్రయత్నంలో భాగమే మా దేశ అణ్వస్త్ర రహిత సిద్ధాంతం. మా ప్రజల అభీష్టానికి వ్యతిరేకంగా పసిఫిక్ ప్రాంతంలో అణ్వాయుధ పరీక్షలు సాగుతున్నాయి.

అణ్వాయుధాల చెత్తాచెదారం ఆ ప్రాంత సముద్రంలో కుప్పవేయబడుతున్నాయి. అని హెర్కుస్ శాంతిపై మహాసభలోని స్త్రీలను ఉత్తేజపరిచింది.

సోవియట్ యూనియన్‌కు చెందిన వాలెంటీనా టెరిష్కోవా, చైనాకు చెందిన ముహువాచెన్ కూడా శాంతియొక్క ప్రాముఖ్యతను, శాంతికీ, అభివృద్ధికిమధ్య వుండే సంబంధాన్ని విశదీకరించారు. శాంతికి అనేక అవరోధాలు కల్పించడంద్వారా మహిళా దశాబ్దపు లక్ష్యాల సాధనకు ఆటంకాలు కల్పింపబడుతున్నాయని టెరిష్కోవా వివరించింది. శాంతికి, నిరాయుధీకరణకు, నిర్మాణానికి సమాలోచనలు సాగించమని అగ్రరాజ్యాలను కోరడానికి అన్ని దేశాల స్త్రీలకు తగిన కారణాలు ఉన్నాయని ముహువాచెన్ వివరించింది.

మహాసభ ఆమోదించిన "భవిషన్ వ్యూహాలు" అనే డాక్యుమెంటులో స్త్రీలకు ప్రత్యేక శ్రద్ధవున్న అంశాలను పేర్కొని యుద్ధాలలో, సాయుధ సంఘర్షణలలో విదేశీ జోక్యంవల్ల ఉత్పన్నమైన పరిస్థితులలో శాంతికి ప్రమాదాలు సంభవించే సమయాలలో స్త్రీల సమస్యలకు, వారు ప్రత్యేకంగా అనుభవించే బాధలకు, కష్టాలకు పరిష్కార మార్గాలను ఉటంకించడం జరిగింది. మార్గరీటా సైప్రెస్, లాటిన్ అమెరికా, పాలస్తీనా శరణాగత స్త్రీల స్థితిగతులపై తమ ఆదుర్దాను వెల్లడించింది. సైప్రెస్‌లోని 37% ప్రాంతంనుండి టర్కీదేశపు దండయాత్ర ద్వారా తమ ఇళ్ళనుండి పారిపోయిన జనం రెండు లక్షలమంది వున్నారు. ఇది 1974 లో జరిగింది. తమ దేశంలోనే తాము శరణార్థులవడం విడ్డూరంకాదా! పది ఏళ్ళు దాటినా నేటికీ వారు తమ తమ పూర్వీకుల ఇళ్ళకు పోవాలనే ఆతురత చూపుతున్నారు. పాలస్తీనా ప్రజలకు తమ జన్మభూమిపై కల హక్కును మేము సమర్థిస్తున్నాం. 1967 లో తాము ఆక్రమించిన ప్రాంతాలనుండి ఇజ్రాయల్ ప్రభుత్వం వైదొలగాలని మేము ఆదుర్దా పడుతున్నాం. మధ్య అమెరికా స్త్రీల గురించి ఆదుర్దాగా వుంది. ఆ ప్రాంత స్త్రీల సమస్యలను తీర్చకలిగింది. మిలిటరీ మార్గం మాత్రం కాదు; రాజకీయ పరిష్కారం కావాలి. దక్షిణాఫ్రికా స్త్రీలను తమ కుటుంబాలనుండి దూరంచేసిన రాజ

కీయ వ్యవస్థను ఖండించారు మహాసభతో జాతి విబేధం అశాంతిని తెస్తుంది. అశాంతి యుద్ధాన్ని తెస్తుంది. యుద్ధం మారణహోమాన్ని కోరుతుంది. ఇలాంటి చర్చలు మహాసభలో ప్రత్యేకంగా ఉన్నతస్థాయితో జరగటం హర్షదాయకం.

ఇంతవరకూ సమాజంలో స్త్రీ పురుషులకు వేర్వేరు సామాజిక పాత్రలు నిర్ణయింపబడ్డాయి. స్త్రీలు ప్రేమకు, శాంత స్వభావానికి, సహనానికి ప్రతిరూపాలు కావాలని, పురుషులు కత్తులు, తుపాకులలాంటి ఆటవస్తువులతో ఆడుకుంటూ చంపటం నేర్చుకోవాలని ఈ వ్యవస్థ నిర్దేశించింది ప్రపంచశాంతి కోరేవారు ముందుగా ఈ వ్యవస్థలో మార్పుతేవాలి. సంతానప్రాప్తి విషయంలో, విద్యా, ఉద్యోగావకాశాలలో స్త్రీకి విధిగా స్వేచ్ఛ వుండాలి. స్త్రీ పురుషుల మధ్య సమానత్వం ప్రపంచశాంతికి అవసరమని గ్రహించాలి. జనాభాని పెంచి తద్వారా యుద్ధాన్ని ప్రకోపింప జేసే ఫాసిష్టు (హిట్లరు) మనస్తత్వాన్ని ఈనాటి స్త్రీలు సహించరు. ఈనాటి సమాజంలో స్త్రీలకు తల్లులుగా కంటే ముఖ్యంగా కుమార్తెల తల్లిగా మాత్రమే విలువ వుంది. అలాగే ఇంతవరకూ పురుషులే సామాజిక నాయకత్వాన్ని ఆక్రమించుకున్నారు. అలాకాక స్త్రీలు ప్రముఖ పాత్ర వహించి నాయకత్వ స్థానాల్లోకి వస్తేనే ప్రపంచశాంతికి దోహదం కలుగుతుంది. అంటే ఏ ఒక్క స్త్రీ మాత్రం నాయకత్వం వహిస్తే చాలదు. స్త్రీలంతా ముకుమ్మడిగా వచ్చి ప్రేమ, శాంతి దయ, సానుభూతిలాంటి సూత్రాలను సమాజంలో ప్రవేశపెట్టాలి. మృదువైన స్త్రీ తత్వపు విలువలు పరిపాలనా రంగంలోకి రావాల్సిన తరుణం ఆసన్నమైంది. అంటె పురుషాధిక్యత సమాజపు యుద్ధ తత్వానికి, సమ సమాజ భావన ప్రత్యామ్నాయం కావాలి.

ఈనాడు ప్రపంచశాంతికి కావాల్సిన స్త్రీతత్వ స్వభావపు విలువలు అంటె ఉత్పత్తి చెయ్యటం, పోషించటం, శాంతిస్థాపన నెలకొల్పటం, జీవ సృష్టి చెయ్యటం. ఈ విలువలను నెలకొల్పటానికి స్త్రీలకు శక్తి వుంది. శాంతిని పోషించే స్వభావం, ప్రేమించే తత్వం, అహింసాభావం స్త్రీలకు కొత్తకాదు. ఆ భావాలతోనే రేపు జరుగబోయే శిఖరాగ్ర సమావేశంలో

అణ్వస్త్రాలను నిరోధిస్తూ, శాంతిని ప్రతిపాదిస్తూ దేశాలన్నీ శాంతితో మన గల్గె విధానాల నిర్ణయాలు తీసుకోవాలని స్త్రీ లోకమంతా అభ్యర్థిస్తోంది. లేదా మరో మార్గాంతరాన్ని ప్రతిపాదిస్తుంది.

("ఉదయం" 11 నవంబరు 1985)

---

# రచయితల కర్తవ్యం

ఈనాటి రచయితలలో ఎందరో పండితులు సాహిత్య నిష్ణాతులు, జిజ్ఞాసువులు వున్నారు. కనుక కొన్ని ముఖ్యమైన సందేహాలను, మౌలికమైన ప్రశ్నలను లేవనెత్తడం అవసరమనిపించింది. అసలు రచయిత అంటే ఎవరు ? అతని లేక ఆమె లక్షణాలు ఎలాంటివి ? అతనికి లేక ఆమెకు కావలసిన అర్హతలు ఏమిటి ? కలంపట్టి రాయగల ప్రతి వ్యక్తినీ రచయిత అనగలమా ? మరి రచయితలలో అనేక రకాల వారున్నారు. కథలు రాసేవారు, నవలలు రాసేవారు, గేయకవులు, పద్యకవులు, వచన కవులు, వ్యాసకర్తలు ఇలా ఎన్నో రకాలవారు, వ్యాసంగంలో ఎంతో వైవిధ్యం కలవారూ వున్నారు. కాని వీరందరికీ సామాన్యమైన లక్షణాలు ఉంటాయా? ఉంటే అవి ఏవి? వాటి స్వరూప స్వభావాలు ఏమిటి ? అని ప్రశ్నించినప్పుడు ఒక కొత్త భావాన్ని, లేక ఒక భావాన్ని కొత్తరీతిలో, లేక నూత్న అలంకారాలతో లేక క్రొంగ్రొత్త శైలితో, లేక వినూత్న కథా సంవిధానంలో జోడించి చెప్పగల ప్రజ్ఞా పాటవాలు కల వ్యక్తి రచయిత అని నిర్వచనం చేయువచ్చును.

రచయితకు సునిశిత దృష్టి అవసరం. ఒక సంఘటనను చూచినా, ఒక ఘట్టాన్ని ఊహించినా, ఒక పాత్రకు రూపకల్పన చేసినా, ఒక కథను నడిపినా, ఒక్కొక్క సన్నివేశంలో చమత్కృతిని గమనించినా రచయిత పరిశీలనా శక్తిని ప్రదర్శించటం విధిగా జరుగుతుంది. ఈ పరిశీలన రెండు రకాలుగా సాగుతుంది. ఒకటి విశ్లేషణ, మరోకటి సమ్యక్ దర్శనం.

రచయితకు తను వాడే భాషపై, లేక తను రాసే పదాలపై లేక తను ప్రయోగించే అలంకారాలపై, తను చెప్పే తీరుపై అధికారం ఉండ వలసి ఉంటుంది. ప్రతి రచయితకూ పైచెప్పిన అన్ని శక్తులూ ఉండవు. కాకపోతే అందులో ఏ ఒక్కటియైనా లేకపోతే ఆ వ్యక్తిని రచయితగా పేర్కొనలేము. అందరూ సర్వలక్షణ లక్షణోపేతులు కాలేరు. అలాంటివారు బహు అరుదుగా కన్పిస్తారు. యుగానికి ఒకరో ఇద్దరో దర్శనమిస్తారు. అంతమాత్రాన తదితరుల నందరిని తిరస్కరించలేము; విస్మరించలేము. ఒక్కొక్కరు ఒక్కొక్క అంశంలో ప్రతిభా వ్యుత్పత్తులను ప్రదర్శించ గలరు. వారి గొప్పతనాన్ని, ఆధిక్యతను గుర్తించటం మనకు అవశ్య కర్తవ్యం.

పాండిత్యం, నేర్పు, వైదగ్ధ్యం, బుద్ధికుశలత, చమత్కృతి, సమయ స్ఫూర్తి, ఔచిత్య భావన ఉన్నంతమాత్రాన సరిపోదు. రచయితకు నిబద్ధత (Commitment) ఉండాలి. ఈ మాట అనగానే చాలమంది ఉలిక్కిపడతారు. తమరిని ఏదో సోషలిస్టు ఊబిలోకో, కమ్యూనిస్టు సుడి గుండంలోకో లాగుకొని వెళ్ళే ప్రయత్నం జరుగుతున్నదని వణికిపోతారు - ఈ భయానికి తావులేదు; ఈ సందేహాలకు ఆస్కారంలేదు. నిబద్ధత అనే పదాన్ని తరుచుగా తీవ్రవాదులు వాడుతున్నందువల్ల ఈ గందరగోళం ఉత్పన్నమవుతోంది.

రచయిత దేనికి నిబద్ధుడై యుండాలి? ఒక రాజకీయ పార్టీ కార్య క్రమ ప్రచారానికా? కాదు, ముమ్మాటికీ కాదు. ఆ రాజకీయ పార్టీ వారి సిద్ధాంతానికా? అసలేకాదు. మరి దేనికి కట్టుపడి వుండాలి అన్నప్పుడు విశ్వశ్రేయః కావ్యం అని ప్రాచీనులు ప్రకటించిన సూక్తికి, సామాజిక శ్రేయస్సుకు దోహదంచేసేదే సత్కృతియని అర్వాచీనులు పదేపదే చెప్పే దానికి తేడా లేనేలేదు. ఇద్దరి భావం ఒకటేకాగా ఆనాటి సమాజం వేరు. ఈనాటి సమాజం వేరు. ఆనాటి ఆదర్శ సమాజ భావనకు ఒక ప్రత్యేకత; ఈనాడు కలలుకనే సమాజ భావనకు మరోక ప్రత్యేకత. ఆనాడున్నది నిచ్చెనమెట్ల సమాజం, ఈనాడు మనం కోరేది సమసమాజం.

ఈ సందర్భంలోనే మరో విషయాన్ని ప్రస్తావించవలసి వుంటుంది.

అదే ధర్మపోషణ. ఏది ధర్మం? ఏది అధర్మం? ఏది సత్యం? ఏది అసత్యం? మహాత్మాగాంధీ చనిపోయినప్పుడు తను వ్రాసిన గేయంలో ఈ ప్రశ్నను లేవనెత్తాడు మహాకవి శ్రీశ్రీ. ఒక అంశాన్ని మనందరం గుర్తుంచుకోవాలి. ధర్మరూపం మారింది కాని ధర్మ స్వభావం మారలేదు. ఆనాటినుండి ఈనాటివరకూ ప్రేమ, అనురాగం, వాత్సల్యం, కరుణ, దయ, పరస్పర విశ్వాసం. పెద్దలయెడ గౌరవం, సత్యనిరతి, సహనం, ఇవి మానవ విలువలు; మానవత్వానికి ప్రతీకలు. వీటికి శాశ్వత తత్వం ఉంది. కాగా మానవ సమాజ పరిణామంలో వివిధ దశలలో వీటి బహిర్గత రూపాలు విభిన్నంగా ఉంటాయి. అంతేకాని ఈ విలువలు మారవు. ఏ రాజకీయ వ్యవస్థ ఉన్న సమాజంలోనైనా, ఏ ఆర్థిక విధానం అమలులో ఉన్న దేశంలోనైనా ఇవి ప్రజాజీవితాన్ని నియంత్రణ చేస్తూనే ఉంటాయి; ప్రభావితం చేస్తాయి. కనుక ప్రాచీనులంతా ధర్మపరాయణులని ఆధునికు లంతా అధర్మ ప్రవర్తకులని భావించడం సబబు కాదు. ఇంతకు చెప్పే దేమంటే రచయితకు ధర్మాధర్మ విచక్షణా జ్ఞానము, శక్తి ఉండాలని. అయితే ఇక్కడొక ప్రశ్న తల ఎత్తవచ్చు ప్రతి రచయితా ఆలోచించి, వివేచనతో ధర్మాన్ని ఎన్నుకొని, అధర్మాన్ని విసర్జించాలా? ఆవ్యక్తి అలా చేయటం జరుగుతున్నదా? అసలు అది అసంభవమా? రచయితకు నీతి శాస్త్రకోవిదుని చేయాలనే అవసర ప్రయాస మనకెందుకు అనే అభ్యంతరం రావచ్చును. రచనచేసే వ్యక్తి ఒక భావావేశంలో మునిగి ఉంటాడు. అతడు లేక ఆమె తర్క వితర్కాలు చేసి ధర్మాధర్మాలు నిర్ణయించటానికి అవకాశం ఉండదు. కాగా అజ్ఞాతంగా రచయితయొక్క పూర్వ సంస్కారం అతనిని లేక ఆమెకు వెన్నాడుతూనే వుంటుంది.

రచయత పుట్టిన వంశపు మర్యాదలు, కుల సాంప్రదాయాలు, మత ధోరణులు, సమాజ పద్ధతులు, దేశ పరిస్థితి, ప్రాపంచిక స్థితి ఇవన్నీ ఆ వ్యక్తి మనఃఫలకంపై చెరగని ముద్రవేస్తాయి. ఇవన్నీ రచయిత మస్తిష్కంలో చోటుచేసుకుంటాయి. ఇది ఒకరకంగా అతని ప్రారబ్ధం. అంటే పూర్వజన్మ సంచితమని అర్థంకాదు. అతని నిర్ణయం యిష్టా యిష్టాలతో నిమిత్తంలేని అంశాల వారసత్వమన్నమాట. అతడు లేక

ఆమె తన విద్యవల్ల, తన ప్రతిభవల్ల తెలుసుకున్న విషయాలు, తద్వారా నేర్చుకున్న గుణపాఠాలుకూడా రచయిత వ్యక్తిత్వంతో భాగమవుతాయి. ఇది రచయితయొక్క సంచితమనవచ్చు. ఇలా రచయిత వ్యక్తిత్వం అతనికి తెలియకుండానే, అజ్ఞాతంగా పనిచేయవచ్చును. రచయిత జిజ్ఞాసతో నిమిత్తం లేకుండా ఒకవిధంగా చెప్పాలంటే వాసనా ప్రేరితంగా రచన సాగుతుంది. అంటే కొన్ని పుట్టుకతో వచ్చేవి. కొన్ని పరిసరాల ప్రభావంవల్ల, విద్య నేర్పించే గురువుల్ల కొన్ని భావాలు వ్యక్తి మనః ఫలకంపై ముద్రవేస్తాయి. అలా రచనలలో అతనికి సంస్కారపు లక్షణాలు బహిర్గతమవుతాయి; అతని ధర్మభావనకు రూపం ఏర్పడుతుంది. మానవ విలువలయెడ శ్రద్ధాశక్తులు, గౌరవములేని రచయిత ఎంత ప్రజ్ఞను ప్రదర్శించినా, నేర్పుచూపినా, కల్పనాపై చిత్రిని, చమత్కృతిని వెలార్చినా సామాజిక శ్రేయస్సుకు దోహదం చేయటం జరగదు. తాత్కాలిక భావో ద్రేకం కలగవచ్చు అట్టిరచనలవల్ల; శరీరం గగుర్పొడవచ్చు, ఒక్కక్షణం విస్మయభావన ఉదయించవచ్చు. అయితే ఆ ఆనందానుభూతి అసంభ మవుతుంది. విషయాన్ని ఇంకా కొంత తరచిచూచేముందు మరోక అంశాన్ని పరిశీలిద్దాం. "సామాజిక స్పృహ" అనే పదజాలం తరుచు విన బడుతూ ఉంది. దీనిని ఏ ఒక్క రాజకీయ సిద్ధాంతానికో, పార్టీకో ముడి పెట్టడం అనుచితం. ఉత్పత్తి అర్థాన్ని తీసుకుంటే ప్రతి రచయిత తెలిసో తెలియకో సామాజిక స్పృహతోనే రాస్తాడు. కొంతమందిలో అది ప్రస్ఫుట మవుతుంది. మరికొంతమందిలో అది గుప్తమై ఉంటుంది. ప్రతి వ్యక్తి సమాజంలో భాగం. అలాగే సామాజికాంశం ప్రతి వ్యక్తి లోనూ ఉంటుంది. మానవుడు సామాజిక జీవి. సమాజాన్ని వదలి మనిషి బ్రతకటం జర గదు. రాబిన్సను క్రూసో కనపడరు కథలోతప్ప. అయితే రూఢ్యర్థంలో- వాడుకలో బహుళ ప్రచారం పొందిన అర్థంలో ఈ పదజాలాన్ని విశ్లే షిద్దాం. సమాజంయొక్క స్థితిగతులు, సమాజంలోని అవాంఛనీయాలు, అన్యాయాలు, అక్రమాలు, వ్యత్యాసాలు, ఎగుడుదిగుడులు వీటి పరిగణన, అంతేగాక సమసమాజ ఆవిర్భావానికి అవసరమైన దరహమైన మార్పులు, అవగాహన ఇవి సామాజిక స్పృహ కలిగిన వ్యక్తి లక్షణాలు. కనుక సామా జిక స్పృహ కల్గిన రచయిత కులతత్వంవల్ల ఏర్పడిన ఉచ్చనీచాలను,

మతతత్వంవల్ల ఉత్పన్నమయ్యే ద్వేషాసూయాల సంకుచిత జాతీయ భావనవల్ల పుట్టే జాతీయ దురహంకారాన్ని, ఆర్థిక అవ్యవస్థవల్ల విలయ తాండవం చేసే బీదరికాన్ని, లేమిని, రాజకీయ నీతివల్ల సంభవించే ప్రజల నిస్సహాయతను, నిష్క్రియాతత్వాన్ని, నైతిక అయోమయందా్వరా వచ్చిన సంకుచిత స్వార్థ దృష్టిని, పితృస్వామ్య సమాజపు పురుష దురహంకారాన్ని! ఈసడిస్తాడు; అసహ్యించుకుంటాడు. తెగనాడుతాడు; చీల్చి చెండాడుతాడు. నాశనం చేయటానికి దీక్షవూనుతాడు. తనవంతు శక్తిని, శ్రమను తనకు చేతనైన విధంగా-రచయితగా-వినియోగిస్తాడు. ధర్మాధర్మ విచక్షణం చేయగల వివేచన, మానవ విలువలకు కట్టుబడి ఉండడం ఆధునికతకు లక్షణాలు.

రచయితలు పెక్కుమంది ఉన్నా ఆధునికతను అలవరచుకున్న రచయితల సంఖ్య స్వల్పంగా ఉంది. ఆ సంఖ్య ఇతోధికంగా పెరగడం అవసరం. కొందరు రచయితలు భావంలో ఆధునికతను ప్రదర్శించి భాషలో, శైలిలో, పదజాలంలో సంవిధానంలో "టెక్నిక్"లో సంప్రదాయాన్ని పోషిస్తున్నారు. దీనిని బలహీనతగా పరిగణింపవచ్చును. మరి కొందరు భావంలో సంప్రదాయాన్ని బలపరుస్తూ తతిమ్మావాటిలో న్యూనతను చూపిస్తున్నారు. ఇది ప్రమాద భరితమని గ్రహించడం అవశ్య కర్తవ్యం.

రచనలను కొందరు వినోదాత్మకం, విజ్ఞానాత్మకం, అవి రెండు రకాలుగా విభజిస్తారు. నిజానికి పూర్తిగా వినోదాత్మకం అని, సంపూర్ణ విజ్ఞానాత్మకం అని రచనలు విడదీయడం కష్టం ఒకే రచనలో రెండు లక్షణాలు ఉంటాయి సాధారణంగా, లేదా దానికి విలువ ఇస్తున్నారనేది ముఖ్యాంశం; దానినిబట్టి వర్గీకరణ చేయటం సమంజసం.

వినోదాత్మక రచనలు అక్కరలేదా అని అడగవచ్చు వాటి ప్రాముఖ్యతను అవసరాన్ని ఎవరూ కాదనజాలరు. మనస్సుకు అలసట కలిగినప్పుడు ఆహ్లాదం కలగడానికి అట్టి రచనలు తప్పక కావల్సిందే. కాగా వాటి ప్రయోజనం పరిమితం. అవే జీవిత పరమావధి కారాదు. తాత్కాలిక

ఉపశమనానికి పనికివచ్చే మందును మనం ఎల్లకాలం వాడలేము కదా!

వినోదాత్మక రచనలద్వారాకూడా ప్రబోధం చేయవచ్చు. కేవలం వినోదంకోసం మాత్రమే తయారయ్యే రచనలు ఎల్లకాలం నిలిచేవి, పనికి వచ్చేవి కావని స్పష్టంగా చెప్పక తప్పదు.

ఇక ప్రభోదాత్మక రచన అనగానే చాలామంది రచయితలకు కంటగింపుగా ఉంటుంది ప్రభోధం పాఠం చెప్పేరీతిలో ఉంచబట్టి. బళ్ళో పిల్లవాణ్ణి నిలబెట్టి సందేశం ఇచ్చినట్లు చేస్తే ఎవరికైనా ఒళ్ళుమండుతుంది. అవునన్నా, కాదన్నా ప్రతిరచనలో సందేశం ఉంటుంది. కొన్నింటిలో కొట్టవచ్చినట్లు కన్పడుతుంది. కొన్నింటిలో నర్మగర్భితంగా ఉంటుంది. రెండవమార్గం అనుసరణీయం అనేది నిర్వివాదాంశం. ఇటీవల రచయిత్రుల సమావేశాలు జరుగుతున్నాయి. మహిళల సమస్యలు, లేక రచయిత్రుల ప్రత్యేక సమస్యలు వీటిని గురించి చర్చించడానికి ఇవి ఉపకరిస్తున్నాయి. అంతవరకు వాటిని ఆహ్వానించవలసిందే; గౌరవించవలసిందే. కాగా ఇటీవల తిరకాసు వాదాన్ని కొందరు ప్రచారం చేస్తున్నారు. రచయిత్రులు వేరే సమావేశాలను ఏర్పాటు చేసుకుంటున్నారు కనుక వారు మహిళల సమస్యలపైననే రాయాలి అనేది ఆ వాదపు సారాంశం. మహిళల సమస్యలు స్త్రీలు అర్థంచేసుకున్నంతగా పురుషులు అర్థంచేసుకోలేరనేది నిజమే. చెప్పు ఎక్కడ కరిచేది దాన్ని వేసుకున్న వ్యక్తికి తెలుస్తుందికదా! ఇది సర్వసాధారణమైన విషయం కాగా అసాధారణ ప్రతిభ, అసామాన్య సానుభూతి కల పురుషోత్తములు, ఉత్తమ పురుషులు-స్త్రీల కష్టాలను చూచి హృదయం ద్రవించి, రచనలు సాగించారనేది నిర్వివాదాంశం. గురుజాడవారి "పుత్తడిబొమ్మ పూర్ణమ్మ" దీనికి నిదర్శనం. ఇంతకూ దుర్మార్గం అనేది ఎక్కడ ఉన్నదంటే రచయిత్రులు స్త్రీల సమస్యలను వదలి ఇతర ఇతివృత్తాలపై రాయరాదనే భావాన్ని ప్రసిద్ధులు కొందరు ప్రచారంచేయటం శోచనీయం.

ఏది ఏమైనా సమాజ గతిని వెనుకకు మళ్ళించపూనటం అవివేకం; అర్థరహితం; అసంభవం. ఎవరు ఎంతగా కావాలనుకున్నా, కృషిచేసినా

వేదకాలాన్ని పురాణాల కాలాన్నీ ఈ దేశంలో పునః ప్రతిష్ట చేయలేరు. కనుక సమాజాన్ని వెనుకకు తీసుకొని వెళ్ళే ధోరణి, వర్ణవ్యవస్థను, కుల విభజనను, స్త్రీ పురుష అసమానత్వాన్ని బలపరిచే ప్రయత్నం, సనాతన సంప్రదాయ సామాజిక రీతులను ప్రవేశపెట్టదలిచే కృషి ప్రజలకు మంత్ర తంత్రాలతో నమ్మకం కలిగించి వారికి మానవ ప్రయత్నంలో నమ్మకం సడలింపచేసి వారిని నిర్వీర్యులుగా, నిస్సహాయులుగా చేసే ఉద్యమం నిరర్థకం, నిష్ఫలంకాక మానవు తెలిసో, తెలియకో ఇలాంటి పనులు చేసే రచయితలు సమాజానికి పనికిరాని రచనలు చేస్తున్నారు. మనుష్యులను ఉదాత్త వ్యక్తులనుగా తయారుచేయడానికి ఉపకరించే బదులు వారిని ఏవో శక్తులకు పనిముట్లుగా, సాధనాలుగా రూపొందిస్తున్నారు. మానవ వ్యక్తిత్వాన్ని కించపరుస్తున్నారు. ఇలాంటి రచనలను నిరసించడం పాఠకుల ప్రథమ కర్తవ్యం.

(14–9–85 న ప్రకాశంజిల్లా రచయితల మహాసభ ప్రారంభోపన్యాసం)

---

# నైరోబి సదస్సు : భవిష్యత్తు ఊహలు

మహిళా దశాబ్ది ముగింపు సభలు నైరోబిలో U.N.O. వారి ఆధ్వర్యంలో జులై 85 లో జరిగాయి. 13 వేలమంది ప్రతినిధులు 160 దేశాలనుండి వచ్చారు. అదే సమయం (.0–19 జులై)లో ప్రభుత్వేతర సంఘాల ప్రతినిధుల మహాసభకూడా జరిగింది. ఈ దశాబ్దంలో జరిగిన లాభాలు, చెప్పుకోతగ్గ ఫలితాలు, ప్రభుత్వాలు ఏమిచేశాయి, ప్రజలు ముఖ్యంగా స్త్రీలు ఏఏ పరిధులను అధిగమించారు అనే విషయాలన్నీ సమీక్షించారు. వివిధ రకాలైన స్త్రీల సమస్యలను చర్చించారు. దేశదేశాల ప్రభుత్వ ప్రతినిధులు తమ దేశాల ఆర్థిక, సాంఘిక, రాజకీయ దృక్పథాలను సమర్థించారు. అలా గౌరవించక తప్పలేదు. అసలు మున్నెన్నడూ

జరుగని రీతిలో ప్రపంచ మహిళలు తమ సమస్యలపై పోరాటము, హక్కులకై ఆరాటము, మిత్రదేశాల స్త్రీల ఇక్కట్లను గురించి నిర్భయంగా వాదించటం ప్రపంచ చరిత్రలోనే ఇది తొలిసారి జరిగింది. స్త్రీకి సంబంధించిన విద్య, ఉద్యోగం, వృత్తులు, వ్యవసాయం, మాతృత్వం, గృహిణిత్వం, వెట్టిచాకిరి, నిరాదరణలాంటి విషయాలన్నీ చర్చకు వచ్చాయి.

దశాబ్దపు ఫలితాలు, అభివృద్ధి గురించి పునరాలోచనకు, లేక సింహావలోకనకు ఏర్పడ్డాయి. అందువల్ల ఏమి సాధించాం ? ఏమి చెయ్యలేక పోయాం? దానికి అడ్డంకు లేమిటి? అందుకు ఎవరు కారణం? ఎందుకు అపజయం కలిగింది? ఏమి ఆశించాం? అనే విషయాలన్నీ సభలో తరిచిచూస్తే లోతుగా ఆలోచిస్తే కొన్ని బైటపడ్డాయి. అయితే వ్యక్తుల దృక్కోణాల తేడాలవల్ల తర్జన భర్జనలు బాగా జరిగాయి. అయినా అనేక ఉపయోగాంశాలుకూడా లేవనెత్తారు. "భవిష్యత్తు వ్యూహాలకు" బాటలు వేశారు. మార్గాంతరాలను అన్వేషించారు. పదిరోజుల సభల్లో స్త్రీల పురోభివృద్ధికి (1986–2000 వేల వరకు) ఎలాంటి వ్యూహాలు తయారుచెయ్యాలి? అడ్డంకులను అధిగమించటానికి ఏఏ నూతన చర్యలు తీసుకోవాలి ? దశాబ్దపు లక్ష్యాలను సాధించటానికి ఏంచెయ్యాలి ? అనే అంశం మహాసభ చివర్లో చర్చకు వచ్చింది. అదే 'భవిష్యత్ వ్యూహాలు" పేరిట ఆమోదించిన డాక్యుమెంటు. ఈ డాక్యుమెంటులో గృహిణుల ఇంటిపనికి, వంటపనికి ఆర్థిక విలువ తేల్చమని ఒక డిమాండును లేవనెత్తారు. ఇంతవరకు ఇంటిపనికి విలువలేదని, స్త్రీ ఇతరులపై ఆధారపడి జీవించే "పేరాసైట్" అని హీనాతిహీనంగా చూచేవారు. ఈ సదస్సువల్ల ఆమె పనికి ఒక విలువ, ఆ పనికి ఒక అవసరం వున్నదనే విషయం ప్రజలముందు కొచ్చింది. అంతవరకు ఈ సదస్సునూ, ఈ దశాబ్దాన్ని ప్రతిపాదించిన U N.O. వారిని స్త్రీజాతి అభినందించక తప్పదు. ఇంటిపని, పిల్లల పెంపకం సామాజికపరం కానంతవరకు స్త్రీ చేస్తున్న ఇంటిచాకిరి, పిల్లల పెంపకం, ఆ పనికి విలువ, మదింపు వుండాలి. అలా కానప్పుడు స్త్రీలు ఇక సహించరని మహాసభ హెచ్చరించింది. రాజకీయ సమస్యల విషయమై నైరోబి సదస్సు చివర్లో అంగీకారం కుదిరింది. అది అందరినీ ఆశ్చర్యంలో ముంచింది. స్త్రీలు

తమ విషయాలను తాము సరిదిద్దుకోగలమనే ధైర్యం తెచ్చింది.

సమానత్వం, అభివృద్ధి, శాంతి మానవాళికి చెందాలనేదే దశాబ్దపు "లక్ష్యం, విద్యా, ఉద్యోగం, ఆరోగ్యంకూడా వాటిలో ఇమిడి వున్నాయి. సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక, వ్యవసాయిక, పారిశ్రామిక, విజ్ఞానం, సాంకేతిక న్యాయ సంబంధమైన సౌకర్యాలు, హక్కులూ స్త్రీలకు చెందే విధానాలమీద వారు అభివృద్ధి చెందాలనే ధ్యేయంతో U.N.O. వారు 19-5 ను మహిళా సంవత్సరమని 1976-85 వరకు మహిళా దశాబ్దంగాను వెల్లడించారు. 76 లో మెక్సికోలోను 80 లో కోపెన్ హోగన్‌లోను సభలు పెట్టి పర్యవేక్షించారు. ఈ సభలవల్ల, ఈ దశాబ్దంవల్ల ఏమి సాధించాం? అన్నప్పుడు ఎంతోకొంత ఉపయోగించలేదనడం అశనిఘాత మవుతుంది' అనేక సెమినార్లు, సభలు, సమావేశాలు చర్చలు జరిగాయి గొప్ప సాహిత్యం వెలువడింది. విద్యా, ఉద్యోగాల్లో కొంత ముందడుగువుంది. హక్కుల అనుభవానికి అర్రులుచాస్తున్నారు. కొన్ని రంగాల్లో స్వేచ్ఛ, సమానత్వాల్లో కొంత ముందడుగు వుంది. కాని తరతరాల భావదాస్యం, వెనుకచూపు, లొంగుబాటు, హెచ్చుతగ్గుల మనస్తత్వం మారటానికి ఒక దశాబ్దంకాదు. కొన్ని శతాబ్దాలు పట్టినా చాలదు. అనే భావం ప్రపంచ సభల్లో వెల్లడయింది.

నైరోబిలో ఐక్యరాజ్యసమితి మహిళా దశాబ్దపు పురోగతిని సమీక్షచేసి మదింపు వేయడానికి ఆయా దేశాల ప్రతినిధులతో మహాసభ జరిపినప్పుడు అందులో చర్చకు వచ్చిన ముఖ్యమైన పత్రం "రెండువేల సంవత్సరాల నాటికి స్త్రీల అభ్యుదయానికి సంబంధించిన పురోగామి వ్యూహాలు (భవిష్యత్ వ్యూహాల డాక్యుమెంటు) అనేది. ఇది ప్రపంచ దేశాల ప్రభుత్వాలకు మార్గదర్శక సూత్రాలను రూపొందించింది. ఈ పత్రం మహాసభలో సర్వజన అంగీకారం పొందింది. అందులో అనేక సమస్యలు చర్చించబడ్డాయి. శాంతిని పెంపొందించుట, ఆర్థిక, సామాజికాభివృద్ధికి దోహదం చేయుట, మానవ హక్కులను అమలుపరుచుట అనేవి ఆ డాక్యుమెంటులోని కొన్ని ముఖ్యమైన చర్చనీయాంశాలు. ప్రతినిధుల అభిప్రాయాలలో కొన్ని కెనడాలో స్త్రీల హోదా మంత్రి వాల్టర్ మెక్‌లీస్ తమ ప్రసంగంలో "అభి

వృద్ధికి శాంతికి సంబంధం వుంది. సంఘర్షణ వచ్చినప్పుడు స్త్రీలూ, పురుషులూ ఇద్దరూ బాధలకు గురి అవుతారు; నష్టపడతారు. అయితే అందులో స్త్రీలు హెచ్చు కష్టనష్టాలకు గురి అవుతారు. శరణాగతులలో ఇది ముఖ్యంగా కనపడుతుంది. త్యాగాలకయితే స్త్రీలు కావాలి కాని సమాజంలో నిర్ణయాలు చేసే స్థానాలలో వారు కనిపించరు. ఈనాడు ఆ పరిస్థితి క్రమేపి మారుతోంది. నూతన దృక్పధాన్ని ఈ సదస్సులో స్త్రీలు ప్రవేశపెట్టగలగరనే ఆశాభావం, మాకు వుంది. శాంతి, సమానత్వం రెండూ అభివృద్ధితో సంబంధం కలిగివుంటాయి. అభివృద్ధి రంగంలో స్త్రీల పాత్రను గురించి, కొన్ని విధానాలను రూపొందించమని U.N.O సంఘాలను వాటి విభాగాలను మేము కోరడం జరిగింది. దాని ఫలితాలను సాధించమనే ఒత్తిడి ఇకముందు ఎక్కువ అవుతుంది. U.N.O. సమితి ఇందుకు స్పందిస్తున్నట్లు మేము గమనించాము. మరో ముఖ్య విషయం, ప్రపంచ రాజకీయ వాస్తవ పరిస్థితులవల్ల, దేశాల మధ్య వుండే ఆర్థిక సంబంధాలవల్ల స్త్రీ జనాభ్యుదయానికి సంబంధించిన విధానాలు తప్పనిసరిగా ప్రభావిత మవుతాయి. స్థానిక, ప్రాంతీయ పరిస్థితులు స్త్రీల జీవితాలపై విపరీతంగా పెత్తనం చేస్తున్నాయని, అందువల్ల వాటిని గురించి ఆయా ప్రభుత్వాలు పట్టించుకోకపోవడం అనూహ్యమనికూడా మేము గుర్తిస్తున్నాం. ఈ విధమైన ప్రేరణ లేకపోతే ఈ దశాబ్దంలో వచ్చిన వేగపు ఉధృతం చల్లారిపోతుంది. ఈ దశాబ్దపు కృషి ఫలితంగా ప్రబోధ కార్యక్రమాలనుండి ఫలితాలు సాధించటానికి U.N.O సమాజం పూనుకోవాలి; అలా ఇప్పటికే కొంత చేస్తున్నదికూడాను. అన్ని రంగాలలోను అభివృద్ధికి స్త్రీల దోహదాన్ని గుర్తించటానికి, బలపరచటానికి, పర్యవేక్షించటానికి, మదింపు వేయటానికి తగిన ఆలోచనలతో కూడిన విశ్లేషణ, పరిగణన చేయటానికి వీలయిన లక్ష్యసాధన అవసరం. అప్పుడే వాస్తవమైన ఫలితాలు వస్తాయి." ఆ ధోరణిలో సాగింది ఆమె ఉపన్యాసం.

మార్గరీటా పాపన్‌డ్రె ఈ గ్రీకు ప్రతినిధి, మాట్లాడుతూ పురుషాధిపత్య సమాజపు భావనలు, అధికారం యుద్ధరంగంలో ముందుండే సైనికులవలె బాధలకు లోనవడానికి స్త్రీలను ముందుకు నెట్టాయని, స్త్రీలు ఆ పరిస్థితినుండి వెలికిరావాలని ఉద్బోధించింది. శాంతి సాధనకై జరిగే

ఉద్యమంలో మనం చేరాలి. నిర్ణయాలు చేయటానికి వున్న అధికార స్థానాలలోకి మనం చొచ్చుకుపోవాలి. ప్రాణాన్ని రక్షించటంలో మన కున్న సహజ వాసనలు, మానవ హక్కులపై మనకున్న ఆసక్తి అప్పుడే వినియోగానికి వస్తాయి. అనాడే మానవ భవిష్యత్తును, ప్రపంచ పరి స్థితిని రూపొందించడంలో మనం కృషిచేసి విజయం సాధించగలం" అని తన ప్రసంగంలో విశదీకరించింది మార్గరీటా.

న్యూజిలాండ్‌లో స్త్రీల వ్యవహారాల మంత్రి "అని హెర్ కుస్" ప్రపంచంలోని స్త్రీలందరిని శాంతికోసం జరిగే పోరాటంలో చేరమని విజ్ఞప్తి చేసింది. తమ దేశం అణ్వస్త్ర రహిత ప్రాంతంగా చేసినందుకు తన ప్రభుత్వాన్ని ప్రశంసించింది. శాంతి సమస్యపై స్త్రీలు కీలక నాయకత్వ పాత్రను నిర్వహిస్తున్నారు. మా దేశాన్ని అణ్వస్త్ర రహిత ప్రాంతంగా చేసినందుకు మా దేశ స్త్రీలు సంతోషిస్తున్నారు. శాంతిసాధన ప్రయ త్నంలో న్యూజీలాండులో పార్లమెంటు సభ్యులైన స్త్రీలు ఇతర దేశాల లోని పార్లమెంటు సభ్యులతో చేతులు కలిపారు. అణ్వాయుధాలను పోత్రోలటానికి స్త్రీలం మన సహజ నైజానికి అనుగుణంగా మన శక్తి మేరకు కృషిచేయాలి. ఎంత చిన్న చర్యలైనా సరే, అన్ని ప్రయ త్నాలూ మనలను లక్ష్యానికి చేర్చువగా చేరుస్తాయి. పసిఫిక్ మహా సముద్ర ప్రాంతాన్ని అణ్వస్త్ర రహితం చేసే ప్రయత్నంలో భాగమే మా దేశాన్ని అణ్వస్త్ర రహితంగా ఉంచాలనే మా ప్రభుత్వ నిర్ణయం. ఈ ప్రాంతాన్ని అణ్వస్త్రరహితం చేయాలనే పసిఫిక్ మహాసముద్ర ప్రాంత దేశాల ప్రజల వాంఛ వెనుక చారిత్రక ప్రేరణలు ఉన్నాయి. ఈ ప్రాంతం లోని దేశ ప్రజల అభీష్టానికి వ్యతిరేకంగా, న్యూజీలాండు ప్రజల అభి ప్రాయానికి భిన్నంగా ఈ ప్రాంతంలో అణ్వాయుధ పరీక్షలు సాగు తున్నాయి; అణ్వాయుధాల చెత్తచెదారం ఆ ప్రాంత సముద్రంలో కుప్ప వేయబడుతున్నాయి" అంటూ గంభీరోపన్యాసం చేసింది అని హెర్‌కుస్.

సోవియటు యూనియనుకు చెందిన వాలెంటీనా టెరిష్కోవా, చైనాకు చెందిన ముహూవా చెన్‌కూడా శాంతియొక్క ప్రాముఖ్యతను, శాంతికీ, అభివృద్ధికీ మధ్య ఉండే సంబంధాన్ని విశదీకరించారు. శాంతికి

అవరోధాలు కల్పించడంద్వారా మహిళా దశాబ్దపు లక్ష్యాల సాధనకు ఆటంకాలు కల్పింపబడుతున్నాయని జెరిష్కోవా వివరించింది. చైనా ప్రతినిధి తమ దేశప్రజల, స్త్రీల లక్ష్యాలను తెలియచెప్పి గ్రామ ప్రాంతాలను, పట్టణాలలోను, ఆధునికీకరణకు, సమాజ నిర్మాణంలో మార్పుకు జరిగే జాతీయ ప్రయత్నంలో చైనా స్త్రీలు తదితరులతో గత శతాబ్దంలో కృషిచేసిన విధానాన్ని వివరించింది. శాంతికి, నిరాయుధీకరణకు, నిర్మాణానికి సమాలోచనలు సాగించమని అగ్రరాజ్యాలను కోరటానికి అన్నిదేశాల స్త్రీలకు తగిన కారణాలు వున్నాయని ఆమె అన్నారు.

మహాసభ ఆమోదించిన "భవిష్యత్ వ్యూహాలు" అనే పత్రంలో స్త్రీలకు ప్రత్యేక ఆసక్తి శ్రద్ధ వున్న అంశాలను పేర్కొని, యుద్ధాలలో, సాయుధ సంఘర్షణలలో విదేశీ జోక్యంవల్ల ఉత్పన్నమయిన పరిస్థితులలో శాంతికి ప్రమాదాలు సంభవించే సమయాలలో స్త్రీల సమస్యలులాంటి స్త్రీలు అనుభవించే ప్రత్యేక బాధలకు, కష్టాలకు పరిష్కార మార్గాలను సూచించడం జరిగింది. మార్గరీటా సైప్రెస్, లాటిను అమెరికా, పాలెస్తీనా శరణాగత స్త్రీల స్థితిగతులపై తమ ఆదుర్దాను వెల్లడించింది.

సైప్రెస్‌లోని 37 వ శాతం ప్రాంతంనుండి టర్కీదేశపు దండయాత్రద్వారా తమ ఇళ్ళనుండి పారిపోయిన జనం 2 లక్షలమంది ఉన్నారు. ఇది 1974 లో జరిగింది. తమ దేశంలోనే తాము శరణార్థులవటం విడ్డూరం. పది ఏండ్లు గడిచినా ఇప్పటికీ తమ పూర్వీకుల ఇళ్ళకు పోవాలని వారు ఆతురత చూపుతున్నారు. పాలస్తీనా ప్రజలకు తమ జన్మభూమిపై కల హక్కును మేము సమర్థిస్తున్నాం. పాలస్తీనా స్త్రీల కోర్కెలను మేము బలపరుస్తున్నాం. 1967 లో తాము ఆక్రమించిన ప్రాంతాలనుండి ఇజ్రాయిల్ ప్రభుత్వం వైదొలగాలి. మధ్య అమెరికా స్త్రీల గురించి మేము ఆదుర్దా వెలిబుచ్చున్నాం. ఆ ప్రాంతానికి సంబంధించిన రాజకీయ పరిష్కారము మాత్రమే-మిలటరీ మార్గంకాదు-ఆ ప్రాంత సమస్యలను తీర్చకలిగింది.

జాతి వేర్పాటుకు లోనయిన ప్రాంతపు స్త్రీలు, శిశువులు "స్త్రీల విష

యంగా ప్రత్యేక శ్రద్ధ ఆసక్తి ఉన్న" ప్రాంతాల వారుగానే పరిగణింప బడుతారు. న్యూజిలాండ్ ప్రతినిధి జాతి ఏర్పాటును నిరసించి తమ దేశ ఫుట్‌బాల్ సంఘంవారు దక్షిణాఫ్రికా పర్యటనను ఎలా మానుకున్నదీ తెలియజేశారు. ఇలా అన్నారు. "తమ కుటుంబాలనుండి తమను దూరంచేసిన రాజకీయ వ్యవస్థ దక్షిణాఫ్రికా స్త్రీలపట్ల చేసిన అపచారాన్ని, బలవంతంగా తమ కుటుంబాలనుండి వారు వేరుకావలసి వచ్చిన పరిస్థితిని న్యూజీలాండ్ ప్రజలు ఖండిస్తున్నారు. జాతి విబేధం అశాంతిని తెస్తుంది· అశాంతి యుద్ధానికి దారితీస్తుందని మా స్త్రీలు నిరసన తెలిపారు. అచ్ఛంగా నల్లవారితో నిండిన ఫుట్‌బాల్ టీమును దక్షిణాఫ్రికాకు పోకుండా హైకోర్టు నిషేధపు టుత్తరువును ఇచ్చింది. ఇది మా దేశ స్త్రీలు సాధించిన విజయం.

ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెసు గెర్ట్రూడ్ షోప్ దక్షిణాఫ్రికాలోని జాతి ఏర్పాటు బానిసత్వాన్ని, వలస విధానాన్ని గుర్తుకు తెస్తున్నదన్నారు. ప్రభుత్వము ఎంతగా దమన నీతిని వాడినా స్వేచ్ఛకోసం జరిగే పోరాటంలో స్త్రీలు బలపడ్డారని ఆమె చెప్పారు.

"మా దేశాభివృద్ధికి మా స్త్రీలు చేసిన దోహదం, మా స్త్రీలకు మా దేశం ఒనగూర్చిన సదుపాయాలను మా దేశ స్త్రీలు కష్టించి సాధించుకున్నారు. అంతర్జాతీయ రాజకీయ, ఆర్థిక వ్యవస్థవల్ల మేము నిల దొక్కుకోగలిగాం! ఆ వ్యవస్థ మమ్మల్ని అణచివేస్తున్నది. దానిని ప్రతిఘటించటంలో మా శక్తియుక్తులు పెరిగాయి. ఈ వ్యవస్థ మమ్మల్ని బందీలను చేసింది. మా మానసిక వికాసానికి అవరోధాలు కల్పిస్తున్న "సంస్కృతి"ని మాపై రుద్దింది. మాలో న్యూనతా భావాన్ని పెంపొందించ జూస్తున్నది. వ్యాపారం విషయంలో అసమానత్వాన్ని నెలకొల్పింది. మా ఎగుమతులకు తక్కువ ధరలు, దిగుమతులకు ఎక్కువ ధరలు నిర్దేశించింది.

అఖిల ఆఫ్రికన్ కాంగ్రేసు ప్రతినిధి ఎలిజబెత్ సిబెకో ప్రసంగిస్తూ దక్షిణాఫ్రికాలోని మైనారిటీగా ఉన్న శ్వేతజాతివారి వైఖరిని నిందించారు.

1975 నుండి తమ దేశాలలో అభ్యుదయం సాధించామని ఇతర ప్రతినిధి వర్గాలు చెప్తుంటే, ఏనాడూ దక్షిణాఫ్రికా స్త్రీలు సమానత్వాన్ని, అభివృద్ధిని, శాంతిని అనుభవించలేదని ఆమె ప్రకటించారు. మరో ప్రతినిధి టీనా జోంగెక్సన్ మాట్లాడుతూ అజెనియన్ స్త్రీల రాజకీయ పోరాటానికి సహాయాన్ని అర్థించారు.

("కలువబాల"–డిశంబరు 1985)

---

# మహిళలు కుటుంబ సంక్షేమం-ప్రగతి

మానవుడు కోరేది ఆనందం. అది ఏ రూపంలో వుండాలి? ఎలా సాధించాలి? ఎందుకు కోరుకుంటున్నాడు? అన్నప్పుడు వ్యక్తి తాను ఒంటరిగా మాత్రమే సుఖ సంతోషాలను పొందలేడు. తన పరిసరాలు, తన కుటుంబం, సమాజం, దేశం అన్ని రంగాలు సుభిక్షంగా వుంటేనే తృప్తి పొందగలడు. తనప్రక్క అంటు జాడ్యాలున్నా, ఆకలి బాధలున్నా, నిరుద్యోగం పీడిస్తున్నా, అనారోగ్యం బాధిస్తున్నా, పోరాటాలూ, యుద్ధాలూ జరుగుతున్నా తానూ మానసిక క్లేశాన్ని పొందుతాడు. అందువల్ల సర్వవిధాలైన సంక్షేమాన్ని కాంక్షిస్తాడు. అసలు సంక్షేమం అంటే ఏమిటి? అని ప్రశ్నిస్తే సర్వతోముఖమైన శ్రేయస్సు లేక సుఖం అని నిర్వచించవచ్చు. కనుక కుటుంబంలోని సభ్యులైన భార్యా, భర్త, పిల్లలూ అంతా సుఖ సంతోషాలతో ఉండడమే కుటుంబ సంక్షేమం అని పేర్కొనవచ్చు. అలాంటి కుటుంబాలున్న సమాజంలోనే శాంతి భద్రతలు వుంటాయి. అప్పుడే పౌరులకు, ప్రభుత్వాలకు మధ్య సహకారం, సామరస్యం ఏర్పడతాయి. తద్వారా దేశ ప్రగతిని సాధించగలం. కనుక దేశ భవిష్యత్తుకు పునాది మానవుడు కుటుంబ సంక్షేమం అని చెప్పక తప్పదు.

మానవ సమాజంలో సగంమంది మహిళలు కనుక మహిళల పురోగతి లేనిదే మానవ సమాజం ప్రగతిపథాన పయనించడం కష్టం. అందువల్ల కుటుంబ సంక్షేమానికి మూలం మహిళ; దానికి చాలా చరిత్ర వుంది. అది చాలా విస్తృతమైనది. దాని పరిధి సువిశాలం. మహిళల సంక్షేమానికి కావాల్సిన అన్ని కార్యక్రమాలుకూడా కుటుంబ సంక్షేమం క్రిందికే వస్తాయి. విద్య, అందులోనూ వృత్తి విద్య, ఉద్యోగం, లేక పని (మేన్యువల్ వర్క్), చేయడానికి అవకాశాలు, సమానమైన పనికి సమానమైన వేతనం ఇవ్వడం, స్వచ్ఛంద వృత్తులు చేపట్టటానికి సహాయం, వ్యాపార పరిశ్రమాదులు పెట్టటానికి వనరులు, ధన సహాయం, సాంకేతిక జ్ఞానం అందించడం, ప్రసూతి శలవలు, మాతగా తగిన రక్షణ సదుపాయాలు, మాతా శిశు శరణాలయాలు. ఇలా ఎన్నో మరెన్నో మహిళా సంక్షేమం క్రిందికి వస్తాయి. అన్నింటికన్నా ముఖ్యమైనది ఆమె ఆరోగ్యం. ఆమె ఆరోగ్యంగా, సుఖంగా, సంతోషంగా వుంటేనే కుటుంబ రథం కుంటుపడకుండా ముందుకు సాగుతుంది. బిడ్డల పురోగమనం సాఫీగా సాగిపోతుంది. ఇతర కుటుంబ సభ్యులకు శ్రమ సన్నగిల్లి పోతుంది. ఇదంతా ఒక ఎత్తు గృహిణికి ముఖ్యంగా కావాల్సింది ఆమె శారీరక మానసిక విశ్రాంతి. అధిక సంతానాన్ని కన్న స్త్రీకి అవి రెండూ దూరమైపోతాయి. కనుక కుటుంబ సంక్షేమంలో కుటుంబ నియంత్రణ ముఖ్యమైనదని గ్రహించాలి.

ఈనాటి మహిళా సంక్షేమంలో కుటుంబ సంక్షేమం ఒక భాగమయింది. స్త్రీ సంక్షేమంతో, ఆమె ఆరోగ్యంతో కుటుంబ నియంత్రణను ముడిపెట్టడం సముచితం; సమంజసంకూడాను. కుటుంబంలోని స్త్రీ ఆరోగ్యం, శిశుపోషణ, మాతపట్ల శ్రద్ధ, కుటుంబ నియంత్రణ, ఇవన్నీ మహిళా సంక్షేమం క్రిందికి వస్తాయి. అప్పటికీ పరిధి విస్తృత మవుతుంది కనుక కుటుంబ నియంత్రణను గురించే వ్రాయడం, పరిశీలించడం సంభవిస్తోంది.

అసలు కుటుంబ నియంత్రణ ఎవరికొరకు? ఎందుకొరకు? అనేదొక ప్రశ్న అయితే అధిక జనాభావల్ల నష్టపడేది ఎవరు? స్త్రీయా, పురుషుడా,

కుటుంబమా, దేశమా, ప్రపంచమా? అనేవి మరికొన్ని ప్రశ్నలు, ఒక్క మాటలో చెప్పాలంటే వ్యక్తులూ, దేశం అందరూ ఊబిలోపడి నశించి పొయ్యే ప్రమాదం వుందని చెప్పక తప్పదు. ఆహార, విద్యా, వైద్య, ఉద్యోగ, గృహవసతులు వ్యక్తికి ప్రాథమికావసరాలు. ఇవి ప్రజలందరికీ కల్పించగల అవకాశాలు వున్నాయా? బంజర్లు దున్నుతున్నాం. ప్రాజక్టులు నిర్మిస్తున్నాం. భారీ పరిశ్రమలు ప్రారంభించాం. అప్పులు తెచ్చుకుంటున్నాం. కోట్ల రూపాయల్లో విదేశమారక ద్రవ్యంతో ఆహారధాన్యాలు దిగుమతి చేసుకుంటున్నాం. తద్వారా జాతీయాదాయం పెరుగుతోంది. ఇంతచేసినా మన అభివృద్ధి గొఱ్ఱెతోకలా వుంది. కారణం? ఏటా 2.5% చొప్పున మన జనాభా పెరుగుదలవల్ల వ్యక్తి జీవన ప్రమాణం సన్నగిల్లుతోంది. దేశ విభజననాటికి 30 కోట్లున్న మన జనం ఈనాడు 70 కోట్లు దాటింది. ఏటా కోటి 20 లక్షల జనం (ఆస్ట్రేలియా ఖండమంత) పెరిగి మాకు ఆహారం, విద్యా, వైద్యం ఎక్కడా అని అరుస్తోంది అంటే ప్రపంచ భూభాగంలో 2.4% భూమి కలిగిన మనం 14% ప్రపంచ జనాభాని పోషించాల్సిన భారం మన నెత్తిన పడుతోంది. ప్రభుత్వ మేదయినా ఈ పరిస్థితిని తట్టుకోవడం దుస్సాధ్యం. మానవ జీవన ప్రమాణానికి ఆహారం మాత్రమే చాలదు. విద్య, ఉద్యోగం, గృహవసతి, వైద్యం ఇవి అన్ని మన సాంఘిక స్థాయికి గీటురాళ్ళు. 38 సం॥ స్వపరిపాలనలో 38% మాత్రమే అక్షరాస్యులైనారు. "విద్యలేనివాడు వింతపశువు" అన్నట్లు అవిద్యవల్ల సామాజిక వికాసం, దేశ భద్రతలకే ముప్పురావచ్చు. కనుక ప్రతి పౌరుడికి విద్యావకాశం వుండాలి.

సకాలంలో తగిన వైద్య సదుపాయ లేమిచే అనేకులు దుర్మరణం పాలౌతున్నారు. ప్రాణాపాయ స్థితితో సైతం హాస్పటల్లో పడక దొరకటం దుర్లభమవుతోంది. గృహవసతి లేక చెట్లనీడల్లో, పేవుమెంట్లమీద ఎండా, వానా, చలిగాలివల్ల ప్రాణాలు పోగొట్టుకుంటున్న వారి సంఖ్య పెరిగిపోతోంది. ఇక నిరుద్యోగ సమస్య విలయతాండవం చేస్తోంది. బ్రతుకు తెరువు లేక, కుటుంబాన్ని పోషించలేక, జీవచ్ఛవాల్లా బ్రతుకలేక, అతి హీనావస్థలో ఆత్మాహుతి పాలౌతున్నారు అనేకమంది. మొదటి పంచవర్ష ప్రణాళిక నాటికి 80 లక్షల నిరుద్యోగులుంటే అది .20 లక్షలకు పెరిగింది

రెండవ ప్రణాళిక నాటికి, 3వ ప్లానుకల్లా 150 లక్షలయిందల్లా 2 కోట్లయింది 4వ ప్లానునాటికి. నిరుద్యోగ నిచ్చెనకు మెట్లు పెరగటమే కాని దానికి అంతం అగుపించటం లేదు. ఈనాటి జీవన ప్రమాణాన్నైనా నిల్పుకోగల్గుతామని ఒక్క ఆశావాది మాత్రమే కలలు కంటున్నాడు. భావి తరాల వారి భవిష్యత్తు అంధకార బంధురమవుతుందనే ఆందోళన రోజు రోజుకూ పెరిగిపోతోంది. బహు సంతానంవల్ల కుటుంబాలే కూలిపోతు న్నాయి. ఈ ఒత్తిడికి సమాజం అల్లకల్లోలమైపోతోంది. దేశ భవిష్యత్తు కిది గొడ్డలిపెట్టులా తయారయింది. అన్నింటికంటె స్త్రీ తన యవ్వన దశంతా బందీలా తయారై ఆత్మగౌరవాన్ని కోల్పోతోంది. కనుక స్త్రీ జాతి శ్రేయస్సుకు కుటుంబ పరిమితి అత్యవసరం.

ఇది స్త్రీల విముక్తి ఉద్యమంగా భావించాలి. అధిక సంతానంవల్ల స్త్రీ శారీరక, మానసిక రుగ్మతలకు లోను అవుతుంది. విశ్రాంతి లేమిచే తన సాంఘిక, రాజకీయ, విధులపై ఆసక్తి చూపలేదు. బహు సంతాన భారంతో పిల్లలపై శ్రద్ధాశక్తులు చూపలేదు. తగిన శిక్షణ, విద్యాబుద్ధులు నేర్వని పిల్లలు సామాజిక వ్యతిరేకులుగాను, మూర్ఖులుగాను తయారై అవిశ్వాస పాత్రులౌతున్నారు. బాలబాలికలు పాఠశాలలలో చేరకపూర్వం తల్లి దగ్గరే గడుపుతారు. తదుపరికూడా వారు ఇంట్లో గడిపేకాలం అమూల్య మైనది. ఆ సందర్భంగా బిడ్డలు తల్లిదండ్రులను అనుకరించడం ప్రకృతి ధర్మం. అటువంటి పరిస్థితుల్లో భావిపౌరుల జీవితం తల్లుల విద్యాబుద్ధుల పై ఆధారపడి వుంటుందని చెప్పడం నేరంకాదు. కనుక తల్లి ఇందుకు ముందుగా విద్యా, విజ్ఞానం కలిగినదై వుండాలి. బిడ్డల పెంపకం చాలా బాధ్యతగా స్వీకరించాలి. దేశ సౌభాగ్యానికి, సంక్షేమానికి సుశిక్షిత పౌరులుగా పిల్లలను తీర్చిదిద్దగలిగిన స్తోమత తల్లికి వుండాలి. అలా పెంచ లేని తల్లులు బిడ్డల్ని కనడం మానెయ్యాలి. పిల్లలు సాంఘిక ద్రోహులుగా, దొంగలు, హంతకులు, గూండాలుగా తయారు అయ్యారంటే అందులో ఎంతో కొంత తల్లిదండ్రుల లోపమని చెప్పక తప్పదు. చిన్ననాటి మెదడులో మనం నాటిన విత్తులే పెరిగి శాఖోపశాఖలుగా విస్తరించే అవ కాశం 80% వుంటుంది. అందువల్ల పదిమందిని కని పనికిమాలిన వారినిగా చేసేకంటే ఒక్క బిడ్డను కనడం శ్రేయస్కరం. ఇటు తల్లికి, అటు దేశానికి ప్రగతి వుంటుంది.

ఈనాటి స్త్రీ కేవలం బిడ్డల్ని కనే యంత్రంకాదు. ఆమెకు అనేక హక్కులు, బాధ్యతలూ వున్నాయి. మనది ప్రజాస్వామిక రాజ్యం. ఇందులో లైంగిక విభేధాలు లేవు. సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక రంగాల్లో స్త్రీ పురుష విభేధాలు పాటించడం నేరం. మానవ సంక్షేమానికి, విశ్వమానవ కల్యాణానికి, ప్రజాస్వామ్య పద్ధతి ప్రశస్తమైనదని మనం విశ్వసిస్తున్నాం. దాని కనుగుణమైన రాజ్యాంగం నిర్మించుకున్నాం. ఇందులో పౌరులు బాధ్యతాయుతంగా ప్రవర్తించాల్సి వుంటుంది. తమ హక్కులను, బాధ్యతలను, గుర్తెరిగితేనే అలాంటి ప్రవర్తన సాధ్యమవుతుంది. ప్రజలలో సగంమంది స్త్రీలున్నారు. కనుక ఆమెకు పరిపాలనాధి కీలక స్థానాలలో భాగస్వామ్యం వుండాలి. ప్రజా ప్రాతినిధ్యంలో పాల్గొనే చొరవ వుండాలి. చట్టాలను తయారుచెయ్యటంలోగాని, వాటిని అమల్లోకి తేవటంలోకాని స్త్రీకి విశిష్టపాత్ర వుండాలి. ఉన్నతోద్యోగాలలో, వృత్తి విద్యలలో ట్రయినింగులలో నేటి స్త్రీలు పురుషులతో సమంగా పయనిస్తున్నారు. కనుక స్త్రీని కేవలం కుటుంబిని, గృహలక్ష్మి, గృహిణి, మాత అంటూ ఆమెను కుటుంబానికి పరిమితం చెయ్యటంవల్ల ఆమె శక్తి సామర్థ్యాలు, మేధస్సు వ్యర్థమైపోతున్నాయి. స్త్రీకి పౌరసత్వ హక్కులిచ్చినప్పుడు ఆమె వికాసానికి, సమాజ కార్యకలాపాలలో పాల్గొనే అవకాశంకూడా ఇవ్వాలి. పాల్గొనాలి అంటె ఆమెకు విశ్రాంతి చాలా అవసరం, విశ్రాంతి పొందాలంటె పూర్వం ఇద్దరని చెప్పేవాళ్ళం ఈనాడు ఒక్కబిడ్డ చాలని అంటున్నాం.

బిడ్డలు ఇద్దరా, ముగ్గురా, ఒక్కరా అనే విషయంలో ఈమధ్య తర్జన భర్జనలు జరుగుతున్నాయి. ఈనాడు సైన్సు బాగా అభివృద్ధి చెందింది. అనేక అంటు జాడ్యాలకు, విష జాడ్యాలకు ఔషధాలు వచ్చాయి. వ్యాధి నిరోధక మార్గాలు పెరిగాయి. పసిపిల్లల మరణాలు సగానికి తగ్గాయి. బాలింత మరణాలు చాలావరకు తగ్గిపోయాయి. మానవుడి జీవిత సగటు పరిమాణం (Average Life) పెరిగింది. అందువల్ల ఈనాటి పరిస్థితిని బట్టి ఒక్కబిడ్డతోనే సరిపెట్టుకోమని ఆపరేషన్ చేయించుకోమని ప్రజలకు నచ్చచెప్పాలి. అంతగా అన్యాయం జరిగితే మళ్ళీ పిల్లపుట్టే పద్ధతి (రీకేనలైజేషన్) కూడా చేస్తున్నారు. ఇంతవరకు ఇది ప్రజాస్వామ్యమనిక

ప్రజలే స్వేచ్ఛగా ఆలోచించి ఆచరించాలని ప్రచారం చేశాం. కాని జనాభా పెరుగుదల అదుపు తప్పుతోంది. (Population Explosions) ఈ పెరుగుదల ఆటంబాంబుకంటే ప్రమాదమని గ్రహించాలి. సమస్య తీవ్రతను అర్థం చేసుకోవాలి. అధిక జనాభా విషజాడ్యంకంటె భయంకరమని నమ్మాలి. ఇలా పెరుగుతూపోతే 6 వేల సం॥ నాటికి ఈ ప్రపంచమే ఒక పుట్టకురుపుగా మారుతుందని, అందులోని "సెల్" మానవుడవుతాడని "రాక్‌ఫెల్లర్ ఫెండేషన్" వారు హెచ్చరించారు

వెనుకటికి రోమ్‌నగరం తగలబడిపోతుంటే నీరో చక్రవర్తి వాయులీనం వాయిస్తున్నాడట. అలాగే ఇప్పటికి బర్తు కంట్రోల్ అక్కర్లేదనే వారు అధికంగానే వున్నారు. అజ్ఞానం, దరిద్రం, మత ప్రభావం, ఉదాసీనత, వర్గదృష్టి, స్త్రీల అవివేకం, వ్యతిరేకతకు ముఖ్య కారణాలు. కొన్ని అపోహలు కొందరి నరనరాన జీర్ణించిపోయాయి. ముఖ్యంగా ఆడా మగా తేడా ఒక కారణం అంటె మగబిడ్డ పుట్టేదాకా తల్లి బిడ్డల్ని కంటూనే వుండాలి. గర్భస్రావానికి వ్యతిరేకత మరొకటి. భ్రూణహత్య, జీవహత్య పాపములాంటి భయాలు వుంటాయి. ఇది సృష్టి ధర్మానికి వ్యతిరేకమని, దైవ విధి అని, ప్రకృతి సహజ రీతులకు విరుద్ధమని, దీనివల్ల అవినీతి పెరుగుతుందని కొందరి వాదన. పుట్టుకలను నియంత్రించుటవల్ల పుట్టబోయే మహా గొప్ప మేధావులను పుట్టకుండా అడ్డుపడుతున్నామని, దేశ రక్షణకు జనాభా పెరుగుదల అవసరమని వాదించేవారు లేకపోలేదు. సమాజంలో క్రొత్త మార్పు జరిగేటప్పుడు వాదోపవాదాలు రావడం మనకు క్రొత్తకాదు. మన తాతముత్తాతలనాడు సహగమనం ఆచారం, విధవా వివాహాలు నిషేధం కాదు. బాల్య వివాహాలు అనాచారం కాదు. కన్యాశుల్కం, వరకట్నం, బహు భర్తృత్వం ఆచరణ యోగ్యాలు, కాలము, పరిస్థితులూ మారినై; ఈనాటి మానవుడు చంద్రుణ్ణి చూచివచ్చాడు. విజ్ఞానం విశ్వకవాటాలను బ్రద్దలు కొడుతోంది. నేటి మానవుడు విశ్వమానవుడయినాడు. ఒకనాటి అసాధ్యాలు ఈనాడు సాధ్యాలవుతున్నాయి. ఇది పరమాణుయుగం. అందువల్ల మనం మన మూఢాచారాలను విసర్జించక తప్పదు. భవిష్యత్తును ఊహించాలి. అది ఈనాటి అవసరం.

ఇంకా కుటుంబ నియంత్రణ గురించి ప్రబోధం అవసరమా? పారితోషికమిస్తే చాలదా? అని ప్రశ్నించేవారు లేకపోలేదు. లేదని వాదించేవారూ వున్నారు. 70% నిరక్షరాస్యత వున్న మన దేశంలో ప్రచారం విరివిగా జరగాల్సిందే. పారితోషికమిస్తూ ప్రబోధ చేస్తూ, రెండూ ఏక కాలంలో జరుపుతూ వుండాలి. ముఖ్యంగా స్త్రీలకు అందులో యువతులకు, అవివాహితులకు మోటివేషన్ (Motivation), (Education) భారీఎత్తున ప్రచారం కావాలి. పెళ్ళికిముందే యువతీ యువకులకు జనాభా అదుపు గురించి తెలిసివుంటే తమ జీవితంలో వారు ప్లాను ప్రకారం ఆచరించగలుగుతారు. స్త్రీ తన ఆరోగ్యాన్ని గురించి ఆలోచించి ముందుజాగ్రత్త తీసుకుంటుంది. తను కేవలం సంతానాన్ని ఉత్పత్తి చేయటానికే పుట్టలేదని గ్రహించి తన ఇష్టప్రకారం ఆచరిస్తుంది. కొన్ని సమయాల్లో గొప్ప సైంటిస్టో, గొప్ప దేశాధినేతో మరో ఉజ్వల భవిష్యత్తుకై బిడ్డని కననని స్త్రీ పట్టుపట్టినా తప్పులేదు. విశ్రాంతిద్వారా విద్య, లేక సామాజిక సేవ ఆశించటంలో తప్పులేదు. విద్యవల్ల సంస్కారవతి కావచ్చు. అలాంటి సంస్కారి భార్యగా, తల్లిగా తన కుటుంబాన్ని ఎంతో అభివృద్ధికి తెస్తుంది. సంస్కారియైన భార్యవల్ల భర్తకు సాహచర్యం, సామరస్యం, స్నేహం, ప్రేమాభిమానాలు లభిస్తాయి. కుటుంబం మొత్తం ఆనందంతో వెల్లివిరుస్తుంది. అందువల్ల శ్రామిక స్త్రీలకు, మధ్యతరగతి మహిళలకు, ధనవంతులకు, విద్యావంతులైన వారికి సైతం ఈ ప్రబోధం చాలా అవసరం.

ప్రభుత్వం చేస్తున్న ఖర్చు సద్వినియోగం కావాలంటే ప్రభుత్వ యంత్రాంగం చిత్తశుద్ధితో, పట్టుదలతో కార్యక్రమాన్ని సాగించినా ప్రజలు సహకరించకపోతే వైఫల్యం తప్పదు. కనుక వారికి ప్రోత్సాహం, ప్రేరణ కలిగించే సదుపాయాలు (Incentives) ను కల్పించాలి. ఈ పద్ధతి ప్రభుత్వం అమలుపరుస్తోంది. ఆపరేషన్ చేయించుకున్న స్త్రీకి, పురుషుడికి ధనము, ఇళ్ళస్థలాలు, ఉద్యోగావకాశాలు, ఇంక్రిమెంట్లు, స్టయిపెండ్లు, పెన్షన్లు, అప్పులు ఆఖరికి L.I.C. పాలసీలుకూడా రాబోతున్నాయి. ఇవి చాలా వుపయోగకరాలు. అయితే ఒక బిడ్డతో సరిపెట్టుకొనివారికి పోనుపోను పెరిగే ఇంక్రిమెంట్లు వగైరాలలో కోతలు ఏర్పడాలి. ఇప్పటికి పుట్టిన

వారికి సరేసరి. ఇకముందు రెండోపిల్లకు రేషన్ ఇవ్వమని, తల్లికి పురిటి శెలవులు దొరకవని, తండ్రికి ప్రభుత్వం ఇచ్చే వసరులేకాక జీతంలో కోత పెడతామని నిబంధనలు అమలుచెయ్యాలి. అవసరంవొస్తే రాజ్యాంగాన్నే మార్చి ఒక బిడ్డ కలగగానే కంపల్సరీ స్టెరిలైజేషన్ చేయించుకోమని ఒత్తిడి తేవాలి. ప్రజాస్వామిక మంటూ కూర్చుంటే కొంప అంటుకుంటాయి. కలరా, మసూచి వస్తే ఇష్టమున్నా లేకున్నా పట్టి బంధించి ఇంజక్షన్లూ, టీకాలు ఎందు కేస్తున్నాము. అలాగే ఇదీనూ. క్రొత్తగా ప్రభుత్వోద్యోగంలో చేరే వారికి ఒకరికన్నా ఎక్కువ కనమని హామీ తీసుకోవాలి. బదిలీలు (Transfer) అయినప్పుడు ఇకముందువారికి ఒక పిల్లకన్నా ఉచిత రవాణా సౌకర్యాన్ని తగ్గించాలి. గృహవసతికూడా ఒక్క పిల్లకే ఇవ్వాలి. వైద్య సౌకర్యం ఒక్క పిల్లకే ఇస్తామని చెప్పాలి.

అసలు ఈ కార్యక్రమాన్ని అమలుపరిచే ఉద్యోగులను నియామకం చేసేటప్పుడు అందులో విశ్వాసమున్నవారినే నియమించాలి. శాసన సభ్యులు, మంత్రులు, ప్రభుత్వోద్యోగులు తప్పనిసరిగా ఆచరించే రూల్సు పాస్ చెయ్యాలి. లేకపోతే ప్రజలు వారిని విశ్వసించరు. అంతే కాదు, ఫ్యాక్టరీలలో వారికి ప్రయివేటు సంస్థలవారికి ఇలాంటి నోటీసులు జారీ చేయాలి. వీరేకాక ప్రజలలో అన్ని వర్గాలవారికి పై నిర్బంధాలు ఏర్పరు స్తామని ఆయా శాఖల మంత్రులు హెచ్చరించాలి. గ్రామ నాయకులు, పార్టీల నాయకులు, స్వచ్ఛంద సంస్థలు, మహిళా కార్యకర్తలూ అందరూ కలిసి ఈ ఉద్యమం మనదేనని, మనకొరకే ననే భావాన్ని నాటిచెప్పాలి. ఉపాధ్యాయులు, ఎం.ఎల్.ఏ.లు, ఎం.పి.లు, గ్రామ పెద్దలు, రాజకీయ వేత్తలు ఎలెక్షన్లలో ఎలా పాటుపడతారో ఈ ప్రచారానికి అలా పాటు పడాలి. మత ప్రవక్తలు దేవాలయాల్లో మత ప్రచారం చేసినట్లు, మనం ఈ వుద్యమాన్ని మన నెత్తిన వేసుకుని ప్రచారం చేస్తేనే ఫలితం వుంటుంది.

కుటుంబ నియంత్రణ చాలా సున్నితమైన విషయం. దాన్ని ఆచరించటానికి, ప్రచారం చేయటానికి అందరూ అర్హులే. ఒక మిషనరీ జీల్తో

పనిచేస్తేనే అది అమలుపర్చగలం. ఆనాడే మనమూ, మన కుటుంబమూ, మన దేశం సుఖప్రదంగా వుంటాయి. అదే మహిళా ప్రగతి, కుటుంబ ప్రగతి, సామాజిక ప్రగతి, దేశదేశాల ప్రగతి. అందుకై అందరూ ముందు కొస్తారని మనం ఆశిద్దాం!

("యోజన" మాసపత్రిక (1-1-86) సౌజన్యంతో)

---

## నాటి భారతనారి ఆదర్శం :
## నేటి భావ పునర్వికాసం

విమల విషం త్రాగిందని, ఊర్మిళ ఉరి పోసుకుందని, భారతి బావితో పడ్డదని, కమల కిరసనాయులు కుమ్మరించుకుందని, ఒక మహిళ చెరువులో పడి చచ్చిందని, మరో యువతి మంటల్లో కాలిపోయిందని తెల్లారేసరికి వార్తలొస్తున్నాయి. అది హత్యకానీ, ఆత్మహత్యకానీ నశించి పోతున్నది స్త్రీజాతి మాత్రమే కాదంటారా? కారణాలేమైనా కడుపు శోకం అమ్మాయిలను కన్నవారికే కదా!

భారత రాజ్యాంగంలో లింగ భేదం లేనేలేదు. స్త్రీపురుష లిద్దరికీ సమాన హక్కులు ప్రతిపాదింపబడి 35 సంIIలు నిండాయి. శాసనపరంగా ఇవ్వబడ్డ అనేక హక్కులు స్త్రీలు ఎందుకు ఇంకా వినియోగించుకోలేక పోతున్నారు? అనేది నేడు మనముందున్న శేష ప్రశ్న.

భారతనారి సంస్కృతి చాలా విశిష్టమైనదని, తరుగుతేనిదని, మార్పు కోరనిదనే విశ్వాసం మన మస్తిష్కాల నిండా ప్రబలంగా వుంది. వేదాల్లోనూ, వేదకాలంలోనూ స్త్రీల హోదా చాలా గొప్పగా వుండేదనే వాదన హెచ్చుగా వుంది. అలాగే స్మృతులలో, ఇతిహాసాలలో, పురాణాలలో ప్రతిపాదింపబడ్డ స్త్రీ ధర్మాలు చాలా పవిత్రమైనవని, శాశ్వతమైనవని వాదించే వారిలో స్త్రీలు కూడా హెచ్చు సంఖ్యలోనే వున్నారు. అసలు వారికి వారే

ఇష్టపూర్వకంగా ధర్మశాస్త్రాలలోని పాతివ్రత్యాన్ని పరమ ఉత్కృష్టమని అనుసరిస్తున్నారు; ఆరాధిస్తున్నారు. అందువల్లే మనకున్న హక్కులను విస్మరిస్తున్నారు. అది త్యాగమని, నీతిఅని పరువుప్రతిష్ట అని, కుటుంబగౌరవమని, ఉత్తమ గతులకు సోపానమని నమ్ముతున్నారు. అలా బ్రెయిన్‌వాష్ చేయబడ్డారు మన మహిళలు. ఇది రుగ్వేదకాలంలోనే మొదలయి మను ధర్మశాస్త్రం నాటికి పూర్తయింది.

కాలమాన పరిస్థితులనుబట్టి ఎన్నో మార్పులు వచ్చాయి. ఒకనాడు పంచభర్తృకను గౌరవించాం. ఈనాడు అది నిషిద్ధమైంది. అలాగే మరెన్నో మార్పులు (మాతృస్వామ్యం, సహగమనం లాంటివి) వచ్చాయి. ఇంకా రాబోతున్నాయి. రోజు రోజుకు నూతనత్వాన్ని, శాస్త్రీయ దృక్పథాన్ని గౌరవిస్తున్న ఈనాడు పాత వ్యవస్థను, పసికిమాలిన ధర్మాలకు ఆచరించటం అర్థరహితం కాదా! ఎంత ఖరీదుపెట్టి కొన్న బట్ట అయినా అది పాతబడితే దాన్ని పెట్టెలోపెట్టి భద్రం చెయ్యలేము. దానితో నేల తుడుస్తున్నాం. అలాగే మనమీద విధింపబడ్డ ధర్మసూత్రాలు ఏనాటివో వాటి లక్షణాలు ఎలాంటివో చదివిన తర్వాతనైనా మారనివారికి ఆత్మగౌరవం లేదనడం ఆత్మవంచన కాదుగదా?

కనుక హిందూ శాసనకర్త, స్మృతికర్త, ధర్మశాస్త్ర నిర్ణేతల్లో ముఖ్యుడైన మనువు చేలిఖించబడ్డ మను ధర్మశాస్త్రంలోని స్త్రీ ధర్మాలను తెలిసికోవటం అవశ్య కర్తవ్యం. తర్వాత వాటిని పరిత్యజించటం మన అభ్యుదయం. మనుస్మృతిలో పంచమ అధ్యాయంలో స్త్రీల కట్టుబాట్ల గురించి ఇలా వివరించబడింది.

1. బాల్యముతో నుండినను, యవ్వనములో నుండినను, వార్ధక్యములో నుండినను స్త్రీలు తమ తమ ఇండ్లయందును తమ "మనస్సు పోయినట్లు" ఏ కార్యమును చేయరాదు. (అంటే తమ ఇష్టప్రకారమన్నమాట)
2. బాల్యమందు తండ్రి యాజ్ఞయందును, యవ్వనమునందు పతి యాజ్ఞయందును, పతి గతించిన వెనక బిడ్డల యాజ్ఞయందును

నుండవలయునుగాని స్త్రీలు స్వాధీనముగా, స్వేచ్ఛగా నెప్పుడు నుండరాదు.

3. తండ్రి, పతి, బిడ్డలు, వీరలను వదిలి తానుమాత్రము ఒంటరిగా నుండవలయునని ఎప్పుడు స్త్రీ తలంపగూడదు. అట్లు వారలను వదిలి స్వతంత్రురాలుగా నుండెడి పుట్టిన స్త్రీ కులము, చొచ్చిన కులము రెంటిని నిందలపాలు చేయుచున్నది.

4. ఎల్లప్పుడు తన యింటి కార్యమందు సామర్థ్యము కలదిగాను, సంతోషము కలదిగాను, యింటనున్న వస్తువులను పరిశుద్ధ పరచు నదిగాను, అధిక వ్యయమందును మనస్సు లేనిదిగా నుండ వలయును.

5. తండ్రి లేక తోడబుట్టినవాడు ఆమెను ఎవ్వనికి వివాహమునకై యిచ్చుచున్నాడో వాడు జీవించియుండువరకు, వానికి ఆమె శుశ్రూష చేయవలయును, వాడు చనిపోయిన వెనుకను వ్యభి చారము చేయక వానికి శ్రార్ధము మొదలగువానిని జేసికొని యుండ వలయును.

6. స్త్రీలకు వివాహ కాలమందు శాంతిహోమము, ఇష్టసిద్ధి కొరకు చేయ బడుచున్నది. నిశ్చరార్థమందు చేసెడు వాగ్దానమే పురుషుడిని భూజమాన్యము సూచించుచున్నది.

7. ఋతుకాలమందును, తక్కిన కాలమందును విధిప్రకారం, వివాహం చేసికొని భర్తయైనవాడు స్త్రీలకు ఇహమందు సుఖము నిచ్చు చున్నాడు. విధిప్రకారం అతని ననుసరించినట్లైన పరమందును సుఖము కల్గుచున్నది.

8. భర్త దురాచారవంతుడై యుండినను, అన్య స్త్రీలోలుడై యుండి నను, సద్గుణములేని వాడై యుండినను, పతివ్రతా స్త్రీ వానిని దైవముగా పూజింపవలయును.

9. స్త్రీలకు పంచ మహా యజ్ఞమును, వుపవాసము, వ్రతము, మొద లగు ధర్మములు ప్రత్యేకముగా లేవు. భర్తకు శుశ్రూష చేయుట

చేతనే స్వర్గమందు గౌరవము పొందుచున్నారు.

10. పరలోకమందు అపేక్ష గల స్త్రీ తన భర్త యుండినను, గతించినను భర్తకు అయిష్టమగు కార్యము చేయరాదు.

11. భర్త గతించిన పిదప పరిశుద్ధమైన నీరు, దుంపలు, ఫలములు, లేత చిగుళ్ళులాంటి స్వల్పాహారములచే కాలము గడుపవలయును. కాని కామేచ్ఛచేత మరియొక పురుషుని పేరు చెప్పరాదు.

12. పతి గతించిన వెనుక తాను జీవించియుండువరకు ఓర్పుకలదిగాను, పరిశుద్ధమైనదిగాను, బ్రహ్మధ్యానము గలదిగాను, మధుమాంస భక్షణ చేయనదిగాను పతివ్రతా ధర్మము నపేక్షించునదిగా నుండవలయును.

13. పతి కాలము చేసిన యంతవరకు బ్రహ్మచర్య వ్రతముగల పతివ్రతా స్త్రీ సంతానములేక యుండినను వాలఖిల్య సనకాది బ్రహ్మచారుల వలె స్వర్గమును పొందుచున్నది.

14. ఏ స్త్రీ స్వర్గలోకము నొందుట కొరకు పుత్రుడు కావలయునని పతి గతించిన వెనుక మరియొకనితో సంపర్కము చేయుచున్నదో ఆమె ఈ లోకమందు నిందింపబడుచున్నది. అలాగు పుట్టిన పుత్రునిచే పుణ్యలోకమును చెందనేరదు.

15. పతివ్రతా స్త్రీలకు రెండవ వివాహమును గురించి ఏ శాస్త్రములోనూ, చెప్పబడలేదు.

16. నికృష్టుడైన తన భర్తను విడిచి ఉత్కృష్టుడగు మరియొకని ఏ స్త్రీ పొందుచున్నదో ఆమె నిందలపాలగును.

17. స్త్రీ వ్యభిచారము చేయుటచేత లోకమునందు నిందింపబడుటయే గాక గతించిన పిదప దుంటనక్కగా జన్మించి తెల్ల కుష్ఠు మొదలగు వ్యాధులను భవించును.

18. ఏ స్త్రీ మనోవాక్కాయముల నర్పించికొని వ్యభిచరింపకుండునో యామె పతిలోకమునకు చెందును. మహాత్ములచే పతివ్రత యనియు

చెప్పబడును; పుణ్యలోకప్రాప్తి కలుగును.

19. రాజులు యోచించు చోట స్త్రీ లుండరాదు. పండితుల సమావేశము అలో పాలుపంచుకోరాదు.

20. భార్య గతించినట్లైన విధి ప్రకారం ద్వితీయ వివాహము చేసుకొని తన జీవితకాలముయొక్క రెండవ భాగమును గృహస్థాశ్రమమునందుండి గడపవలయును. (ఇది పురుషునికి మాత్రమే నిర్దేశింపబడినది.)

21. ఎనిమిదవ అధ్యాయం - పురుషుడు తాను సంపాదించి తెచ్చిన ద్రవ్యమును కాపాడుట, వ్యయము చేయుట, పాత్రలు మొదలగు వానిని శుద్ధి చేయుట, దేవిపూజ మొదలగువానికి సహాయమైన కార్యము చేయుట, భక్ష్యభోజ్యములను పక్వపరచుట, మొదలైన అవశ్యములగు కార్యములు భార్యకు నేర్పి, ఆమెయొక్క మనస్సు ఇతర విషయములందు పోకుండునటుల చేయవలయును.

22. స్త్రీలకు చంచల స్వభావము నిలకడలేని మనస్సు పుట్టుకతోనే యున్న ప్రతికి పురుషులయొక్క రక్షణవలన వారు నశించుటలేదు.

23. ఏడుపు, ఆసనము, అలంకారము, కామము, కోపము, అబద్ధము, ద్రోహచింత, వీనిని స్త్రీల నిమిత్తము మనువు కల్పించినాడు.

24. స్త్రీలు పాతివ్రత్యము లేమియు, నిలకడలేని మనస్సును, స్నేహ లేమియు స్వాభావికముగా కలిగినవారు కావున పురుషులచేత పాలింపబడి యుండినను వారలను విరోధించుచున్నారు.

25. కల్లుత్రాగుట, దుష్టులతో స్నేహము, పురుషుని విడిచి వేరు గ్రామమునకు పోవుట, కారణములేకయే యచ్చటచ్చటికి పోవుట, తాము ఇష్టమైనచోట నిద్రించుట, పొరుగిండ్లకు పోయి కూర్చుండి యుండుట స్త్రీలకు నిందాహేతువైన కార్యములు.

26. స్త్రీలు మిక్కిలి వ్యభిచార దోషము గలవారని యనేక శ్రుతులయందును శాస్త్రములయందు చెప్పబడినది.

27. పురుషునిమాట చొప్పున నడవని యాడది లోకులచే నిందింపబడి

నక్కగా పుట్టి పాపబంధముచే కష్టపడును. ఇలాంటి స్మృతులు బోలె డన్ని మనకు దర్శనమిస్తాయి. స్మృతికర్తలు 27 మంది వున్నారు వారంతా రూపాల తేడాలతో వారి వారి రచనా పాట వంతో, చమత్కృతులతో వ్రాశారు. ఇంకా స్త్రీని కించపరిచే భాషతో వైవిధ్యంతో రచించినదే మను ధర్మశాస్త్రం. అలాంటివే ఋషులు రచించినవి మరికొన్ని మచ్చుతునకలు వున్నాయి.

బృహదారణ్యకంలో నాల్గవ అధ్యాయంలో "స్త్రీతో పురుషుడు కూడి నప్పుడు మైమరచి వున్నట్లు గాఢనిద్రలో జీవుడు పరమాత్మతో లీనమై ఉంటాడని చెప్పబడింది. ప్రజాపతి ఒంటరిగా ఉన్నాడని, లోకంలో ఒంటరిగా వుంటే సంతోషం లేదని, తన సంతోషంకోసం రెండవ వస్తువు, స్త్రీని కోరాడని, తాను స్త్రీ పురుషులుగా మారాడని, సృష్టికి అది ప్రారంభ"మని వుంది. అలాగే విష్ణుపురాణంలో "పురుషుడు కుల కన్యను వివాహ మాడవలయును. వధువు అవయవ లోపము లేనిదై యుండవలెను. పొట్టిది, మిక్కిలి పొడవైనది, శరీరమందు రోమములు కలది, చెడుగుణములు కలది, స్థూలశరీరము కలది, బక్కచిక్కి వున్నది, వినయవిధేయతలు లేనిది, తల్లిదండ్రులను మన్నించనిది, పెద్ద నోరు, పిల్లికళ్ళు, నల్లని పెదవులు, ఎత్తైన పళ్ళు గల కన్య వివాహమాడతగినది కాదు. ఏ దుర్గుణము లేమియు లేనిది, రూపవతి, వినయ - వివేకములతో అలరారునది, తల్లిదండ్రి వంశములు ఉన్నతము లైనవి కలిగినది, సంగీత సాహిత్య, లలితకళల రసజ్ఞత కలిగినట్టి కన్య మాత్రమే వివాహ యోగ్యము కలది" అని వ్రాసివుంది కాని పురుషుని లక్షణాలు గురించి మాత్రం చెప్పలేదు.

అలాగే సంస్కర్త అయిన వేమన కూడా "గుణవతి యైన భార్య గృహము చక్కగ నుంచ చీకటింట దివ్వె వెలుగు రీతి, దేవియున్న ఇల్లు దేవాలయంబురా విశ్వదాభిరామ — ఇలా ఎన్నో మరెన్నో మన ధర్మ శాస్త్రాలనిండా నిండివున్నాయి. ఆఖరికి పిల్లలు కూడా పురుషుని వర ప్రసాదాలని చెప్పుకుంటారు. కాని అదేమంత గొప్ప పని కాదు. పదినెలలు మోయటం, పెంచటం ఎవరి బాధ్యత? "పతివ్రత పతి" అని ఎప్పుడైనా

విన్నామా? మొదటినుండి ఒక 'కోడ్ ఆఫ్ కాండక్టు" వుంటుంది స్త్రీకి. అది తయారుచేసింది మనువులాంటి మహాపురుషులే ననేది తథ్యం. భారతనారి అన్నప్పుడు "భారతీయ పురుష" ఎందుకు కారాదు!

ప్రతి పురాణంలో ధర్మశాస్త్రంలో, ప్రాచీన రచనల్లో పాతివ్రత్యానికి ఇంతగా మహత్తులను అంటగట్టడం భార్యలపై భర్తల ఆధిపత్యాన్ని కాపాడటానికే కుంటి, గుడ్డి, జూదరి, త్రాగుబోతైనా భర్తను దాసివలె సేవించాలి. భక్తురాలివలె పూజించాలి. కేవలం ఒక ఛాయవలె అనుసరించాలి. అతడికోసం ఏ కష్టమైనా పడాలి. ఎంతటి త్యాగమైనా చేయాలి. తనను నీచంగా చూచినా, నికృష్టంగా హింసించినా సహించాలి. ఆ సహించడంలో కూడా పతివ్రతగా తన అంతస్తు పెరిగిపోతుందని గర్వపడాలి. అంతేకాదు- ఆ రాక్షసుడే జన్మ జన్మాలకు తన భర్త కావాలి. అందుకొరకు నోములు, వ్రతాలు, ప్రార్థనలు చేయాలి. చనిపోతే సహగమనం చేయాలి. ధర్మంపేరిట, దేవుడిపేరిట, పుణ్యలోకాల పేరిట కోట్ల స్త్రీలకు దారుణమైన అన్యాయం జరిగిపోతోంది.

భారతీయ సంస్కృతి వాస్తవ జీవితంలో స్త్రీని బానిసగా చేస్తూ ఊహాజగత్తులో ఆమెను దేవతగా పూజిస్తుంది. గృహలక్ష్మి, గృహదేవత అంటూ ఇంటికి యజమానురాలుగా చిత్రిస్తుంది ఊహాతీతమైన కాల్పనిక జగత్తు. నిజానికి ఆమె ఇంటికి బానిస. ఆ బానిసత్వాన్ని బలపరిచేదే భారతనారి ఆదర్శం. ఇలా మూడువేల సంవత్సరాలనుండి జరుగుతున్న కథ. నాగరికత మారింది, జీవిత విధానం మారింది. సాంకేతిక విధానాలలో మార్పు వచ్చింది. కాని సాంస్కృతికంగా, భావాలలో మార్పు బహు కొద్దిగా జరిగింది. ఏ మార్పు రావాలన్నా భావాలలో మార్పురానిదే మౌలికమైన మార్పు రాదు. కనుక భావపునర్వికాసం అన్నింటికన్నా విలువైనది, ముఖ్యమైనది. అంటే పాత సంప్రదాయాలలో అవసరమైనవి అనుభవించవచ్చు. పనికిరానివి త్రోసిరాజనాలి.

ఈనాడు స్త్రీల దృక్పథంలో, భావాలలో అనేక మార్పులు వస్తున్నాయి. తమ చుట్టూవున్న పరిస్థితులు మారాలని కోరుకుంటున్నారు.

వాళ్ళ హక్కులు అడుగుతున్నారు. ప్రతి రంగంలో పోటీపడుతున్నారు పురుషులు అర్థంచేసుకోవాల్సిన విషయమేమిటంటే తమ మనస్సులను పై ఖరిని మార్చుకోవాల్సిన దశ వచ్చిందని. ఆమె తమతో సమానమని, చాలామంది స్త్రీలకు సంస్కరణలద్వారా తాము మారాలనివున్నా సమాజానికి భయపడుతున్నారు. సనాతనులైన తల్లిదండ్రుల్ని, అత్తమామలను దాటిపోలేకపోతున్నారు. భర్త కోపాన్ని, వ్యతిరేకతను చూచి భయపడి ఉద్యమాల్లోకి దూకలేని నిస్సహాయతతో అలమటిస్తున్నారు. తమకు రాజకీయాధికారం ప్రస్తుతం అణగి మణిగి వుందని గుర్తించారు. కనుక అది ఏనాటికైనా ప్రజ్వరిల్ల గలదు; లేక వికశించగలదనే విషయాన్ని గుర్తించారు కనుక వారికి నిర్ణయాలను చేసే స్థాయి వచ్చింది. స్త్రీలు తమ అణచివేతను వాస్తవ విషయంగా గ్రహించారు. (అది ఎంత కష్టమైనా) తమమీద తాము ఆధారపడడంపై ఆసక్తి చూపుతున్నారు. మనం పరాధీన జీవులం కాదు. ఒకరిమీద ఆధారపడవలసిన స్థితి ఇన్నాళ్ళు మనకు నూరిపోశారు. కాని వాస్తవానికి మనం సమర్థతతో పరిస్థితులను చక్కదిద్దుకోగలం. దానివల్ల మన నిర్ణయాలమీద మనకు ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. మన శక్తి సామర్థ్యాలమీద విశ్వాసం వుంటుంది. మన అనుభవాన్ని మనం విశ్వసిస్తున్నాం. మనయొక్క దృక్పథాలను, మన భావాలను ఆదరిస్తున్నాం. మనం ఏదైనా చెయ్యగలం. చెయ్యలేనిది లేదు. అనే భావ విప్లవం స్త్రీలలో వర్ధిల్లుతోంది. నూతన ఆర్థికవ్యవస్థ ప్రపంచ వ్యాప్తంగా రావాలని మనం కోరుకుంటున్నాం. అంతేకాదు ఆ వ్యవస్థ పితృస్వామ్యాన్ని మరోరూపంలో పోషిస్తే అది మనకు వుపకరించదు. మనం కోరేది నూతన సామాజిక వ్యవస్థ, స్త్రీల అవసరాలకు, శ్రేయస్సుకు, సంక్షేమానికి ఆవ్యవస్థ ప్రాధాన్యత ఇవ్వగలగాలి. అంతకు ముందు స్త్రీలకు వ్యతిరేకంగా సాగుతున్న వివక్షకు పరిహారంగా ప్రాధాన్యత ఇచ్చే చర్యలు జరగాలి అంటే ఉదార హృదయులైన పురుషుల వైఖరిలో మార్పురావాలి. స్త్రీల భావనా సరళికూడా మార్పురావాలి ఆనాడే భావ పునర్వికాసానికి నాందీప్రస్తావన జరుగుతుంది.

---

# భవిష్యత్తు గురించిన ఊహ

"నీ రచనల్లో ఏది ఉత్తమమైనది" అన్నప్పుడు "నేను భవిష్యత్తులో రాయబోయే రచన" అన్నాడట ప్రముఖ జర్మన్ కవి గెథే. వైద్యుడు రోగికి భవిష్యత్తుపై ఆశ కలిగిస్తాడు. అలాంటి మానసిక తృప్తితో భవిష్యత్తు నూహించుకుంటూ బ్రతుకుతాడు వ్యాధిగ్రస్తుడు. అలాగే మానవుడు ఆశాజీవి. కొన్ని ఉన్నతాశయాల కొరకు జీవిస్తాడు, ప్రగతికై తపిస్తాడు. దానికై ఆరాటపడతాడు. అర్రులు చాస్తాడు. అహరహం శ్రమిస్తాడు. ఆ లక్ష్య సాధనకై ఎప్పటికప్పుడు అడ్డంకులను అధిగమిస్తాడు. తన అపూర్వ మేధాశక్తితో భవిష్యత్తుపై బంగారుకలలు కంటూ వుంటాడు. అయితే కలలన్నీ కల్లలుకావు వాటిని ఫలవంతం చేసుకోగల ధైర్య, స్థయిర్యాలు, సాహసము అతని శక్తి సంపన్నతలమీద ఆధారపడి వుంటుంది. ఆ దృష్టితో ఆలోచిస్తే 2100 సం॥ నాటికి మన దేశ భవిష్యత్తు, మన మహిళల అభ్యున్నతి జాజ్వల్యమానంగా వెలిగిపోగలదని ఊహించటం అనౌచిత్యం కాదుకదా ?

2 వ శతాబ్దంలో స్త్రీ విమోచన సందర్భంగా చాలా ప్రగతి లభిస్తుందని, స్త్రీ పురుష సమానత్వం ఇతోధికంగా ప్రజాదరణ పొందుతుందని నేనాశిస్తున్నాను. స్త్రీలు చాలా హెచ్చు సంఖ్యలో ఉద్యోగాలలోను, పనిలోను చేరతారు, సమానతమీద ఆధారపడిన కుటుంబంకోసం వారు ఆకర్షితులౌతారు. రాబోయే శతాబ్ది మొదట్లో విడాకుల సంఖ్య పెరిగినా తర్వాత తగ్గుముఖం సంతరించుకుంటుంది. వ్యక్తి స్వేచ్ఛకు, సామాజిక శ్రేయస్సుకు వైరుధ్యం ఎక్కువవుతుంది.

ప్రస్తుతం మన దేశం తాత్వికంగా 16 వ శతాబ్దంలోను, పారిశ్రామికంగా 19 వ శతాబ్దిలోనూ కాలమాన రీత్యా 20 వ శతాబ్దిలోనూ ఉన్నది. ఈదేశం పూర్తిగా 21వ శతాబ్దంలో అడుగుపెట్టగలగాలంటే అనేక మార్పులు రావాలి. ఇతర దేశాలలో కొన్ని మార్పులు వచ్చినా ఆ మార్పుకు లోనయిన పరిణామాన్నంతా మనదేశం అనుభవించ నవసరం లేదు. సామాజికాభివృద్ధి

లోని కొన్నిటిని అనుసరించి, మరికొన్నింటిని విస్మరించి మనం ముందుకు దూకగలం. మనది ప్రస్తుతం భారతదేశం మాత్రమే! అది ఇండియా అనే పేరుకు తగివుండాలంటే శాస్త్రీయ అవగాహనను, శాస్త్రీయ భావనను పెంపొందించుకోవాలి. దేశప్రజల మౌలిక హక్కుల జాబితాలో ఈ విషయం పేర్కొనబడివుంది. శాస్త్రీయ దృక్పథాన్ని, శాస్త్రీయ భావనను (**Scientific Spirit**) ప్రజలు పెంపొందించుకోవాలని అభిలషించాం. కాని సైన్సు పనిచేసే తీరు మన మింకా ఒంటపట్టించుకోలేదు. విషయజ్ఞాన సముపార్జన, సత్యం యెడ గౌరవము, ఆలోచన, తర్కం, అనుభవాన్నుండి గుణపాఠం నేర్చుకోవడం, ఇవన్నీ అభిలషణీయగుణాలు. మానవుడు తన హేతుత్వంపై (**Reason**) ఆధారపడవలసి ఉంటుంది. కాగా ఒక్కమాటలో చెప్పాలంటే భారతదేశం శాస్త్రీయ యుగంలో అడుగుపెట్టవలసి వుంది. కనుకనే స్త్రీ పురుష సంబంధాలను, కుటుంబ సంబంధమైన అంశాలను దేశస్తులు శాస్త్రీయ భావనతో పరిశీలించే దశ వస్తుంది. జ్యోతిష్కులను, సాముద్రికులను, కంప్యూటర్లనూ, రాశి ఫలాలను ఆశ్రయించే పద్ధతి మారి పురుషప్రయత్నాన్ని నమ్ముతారు.

ఇండియా తదితర ప్రపంచంతో ఈ సందర్భంగా దీటు కాగలదు. మన దేశానికి సహజ వనరులు, పెద్ద జనాభా, అత్యధిక సంఖ్యలో శాస్త్ర, సాంకేతిక నైపుణ్యం, మేధాశక్తి అన్నీ ఉన్నాయి. కనుక ఈ సందర్భంగా ఇతర దేశాలకు మనదేశం తీసిపోదు. కాగా ఇతర దేశాలు పారిశ్రామిక యుగంలో చేసిన తప్పులు, పొరపాట్లు, ప్రయోగాలు మనం విధిగా చేయనవసరం లేదు. వారి ప్రయత్నాలనుండి మనం ఎంతో తెలుసుకున్నాం. కనుక జాగ్రత్తగా ప్రమాదాలను తప్పుకోగలం. అలాగే కుటుంబ జీవిత విషయంగా స్త్రీ విమోచన సందర్భంగా స్త్రీ పురుష సంబంధమైన అంశాలతో మన దేశం ఈనాడు అభివృద్ధికర జీవనం సాగిస్తున్న దేశాలను అనుకరించకపోగా వాటిని మించిపోతుంది. మౌలిక సమస్యల అవగాహనకు ప్రాధాన్యత ఇచ్చి బాహ్యరూపాల మోజునుండి విడివడి నూతన సంస్థాగ రూపాలను నిర్మించుకుంటుంది. దేశ కాల పరిస్థితుల కనుగుణంగా సామాజిక మార్పును తెచ్చుకుంటుంది.

21 వ శతాబ్దపు లక్ష్యాల సాధనలోవచ్చే సమస్యలు అనేకం. మాన సికమైనవి కొన్ని, సాంఘిక, రాజకీయ, సాంస్కృతికమైనవి మరికొన్ని వుంటాయి. సాముదాయక జీవితపు అవశేషాలతో పోరాటం వస్తుంది. ఉ। సమిష్టి కుటుంబ విచ్ఛిన్నతలో వచ్చే సంఘర్షణలు అవి. తెగకు, సమాజానికి ప్రాధాన్యత ఇచ్చే పద్ధతి పోయి వ్యక్తికి ప్రాధాన్యత ఇచ్చే ప్రయత్నంలో ఎన్నో తగాదాలు వస్తాయి. అభివృద్ధి సాఫీగా సాగదు. ఎగుడుదిగుడుగా సాగుతుంది. మన దేశం సువిశాలం. అనేక భాషా సంస్కృతుల సమ్మేళనం. కనుక మార్పు తేలికగా రాదు. కేవలం శాంతియుతంగా వస్తుందని ఊహించలేము. ఇక సామాజిక జీవితంలో పెనవేసుకుపోయిన భావాలు అంత తేలికగా చావవు. స్త్రీ పురుషునికన్న తక్కువ స్థాయి వ్యక్తి అనే భావం సులభంగా నశించదు. స్త్రీని వస్తువుగా చూచే తెగలు వున్నాయి. ఆమెను సమాన స్థాయి గల వ్యక్తిగా ఊహించలేని ప్రాంతాలు, సమాజాలు మిక్కుటంగా వున్నాయి. ఇంత విశాలమైన భారతదేశంలో స్త్రీకి సమాన హోదాను కల్పించాలంటే ప్రజలలో స్త్రీ పురుషు లిద్దరిలో పాతుకుపోయిన మూఢవిశ్వాసాలను బదాబదలు చేయాలి. పారిశ్రామిక, సాంకేతిక, శాస్త్రీయ విషయాలలో స్త్రీ పురుషుల సమానత్వాన్ని అంగీకరిస్తూ సామాజికంగా ఆచరణలో దానిని వమ్ముచేసే వారి దుశ్చర్యలను అరికట్టాలి.

జాతి సంక్షేమం పేరుతో, దేశ శ్రేయస్సు పేరుతో, లేక సామాజిక భద్రత పేరుతో స్త్రీని సమాజంలో రెండవ స్థానంలోనే వుంచటానికి జరిగే ప్రయత్నాలు సమస్యలను సృష్టిస్తాయి. సమాజ శ్రేయస్సు స్త్రీ పురుషు లందరికీ కావాలి. అది ఇద్దరి చర్యలమీదా ఆధారపడి వుంటుంది. అది ఒక్క స్త్రీల బాధ్యత మాత్రమే కాదు. ఈ భావాలను సమాజం ఆమోదించాలంటే ఎంతో భావ విప్లవం రావాలి.

లక్ష్యసాధనలో మార్గాలు, వైఖరుల విషయంలో మార్పు రావాలా? అని ప్రశ్నిస్తే తప్పక రావాలి. ముమ్మందుగా వైఖరి విషయంలో మార్పు రావాలి. లక్ష్యం విషయంలో చిత్తశుద్ధి ఉండాలి. అంటే స్త్రీ పురుష సమానత్వాన్ని నిర్నిబంధంగా ఆమోదించాలి. శారీరక భేదాలు సమా

నత్వాన్ని కించపరచనీయరాదు. స్త్రీకి స్వేచ్ఛను పురుషుడు ప్రసాదించేది కాదని గుర్తించాలి. ఎవరి కరుణా కటాక్షాలమీద ఆమె ఆధారపడే అవసరం ఉండరాదు. "స్వేచ్ఛ స్త్రీయొక్క జన్మహక్కు" అనే ఈ భావపరిగణన ప్రధానంగా వైఖరిలో మార్పుతెస్తుంది. మరొక ముఖ్య విషయం-స్త్రీ కోరే స్వేచ్ఛా, సమానత్వాలు ప్రజామోదం పొందడం "ఇవి పురుషునికి లాభకరమా, నష్టదాయకమా" అనే ఆలోచనతో ముడిపడరాదు. స్త్రీ శ్రేయస్సును మాత్రమే ముమ్ముందుగా లెక్కలోనికి తీసుకొని తరువాత సమాజం సంక్షేమాన్ని సాధించటం ఎలా అనేదానిని ఆలోచించాలి. ఈనాడు స్త్రీ స్వేచ్ఛపట్ల పురుషుడు ఉదారవైఖరి అవలంభించి "ఏదో పోనీలే పాపం" అన్నట్లు ప్రవర్తిస్తున్నాడు. తండ్రి చిన్నపిల్లలయెడ ఔదార్య భావనతో సంచరించినట్లు పురుషుడు ప్రవర్తిస్తున్నాడు. ఈ "దయ"ను స్త్రీలు భరించలేరు. భరించరాదు. కనుక స్త్రీ స్వేచ్ఛను పెంపొందించే సందర్భంగా పురుషుల వైఖరిలో మౌలికమైన మార్పు రావాలి.

ఈ సందర్భంగా ప్రభుత్వం, ఆర్థిక సంస్థలు, విద్యాసంస్థలు, మేధావులు, యువతరం, సంక్షేమ సంస్థలు, రాజకీయ నాయకులు, ప్రసార సాధనాలు, మౌలికంగా ఎలాంటి మార్పు చెందాలి? ఏ పాత్ర వహించాలి? అన్నప్పుడు మనం బహుముఖాలుగా ప్రయత్నించాలి. భావ ప్రకటనకు ప్రభుత్వం స్త్రీలకు ప్రత్యేక సౌకర్యాలు ఇవ్వగలగాలి. అలాగే తమ సిబ్బంది నియామకం, శిక్షణ, ప్రమోషన్, పరిగణన వీటి విషయాలలో స్త్రీ పురుష సమానత్వ సిద్ధాంతాన్ని పాటించాలి. ఇంకా అదనంగా స్త్రీలకు, వారి సెక్సురీత్యా, ప్రత్యేక సదుపాయాలు కలుగజేయగలగాలి. స్త్రీకి నష్టం కలిగించే స్త్రీ పురుష వివక్షను తన కార్యక్రమాలలో రూపుమాప గలగాలి. కాగా స్త్రీలకు ప్రోత్సాహకరంగా ఉండే వివక్షను పాటించాలి. విద్యారంగంలో, పారిశ్రామికరంగంలో, వ్యాపారరంగంలో, ప్రభుత్వరంగంలో, రాజకీయరంగంలో, ఇతరత్రా రిజర్వేషన్‌లద్వారా ప్రోత్సాహము ఇవ్వాలి. పై విధమైన పాత్రను అన్నిరంగాలు నిర్వహించగలగాలి.

<u>ఆర్థిక సంస్థలు</u> :- స్త్రీలు చేపట్టే స్వయం ఉపాధి పథకాలకు, ఉత్పాదక పథకాలకు, సహకార కార్యక్రమాలకు ఇతోధికంగా సాయం చేయగలవు.

కనుక వెంటనే మామూలు నిబంధనలను కొంతగా కొంత సడలించి అయినా సరే స్త్రీలకు ప్రత్యేక ప్రోత్సాహం ఇవ్వగలవు ; ఇవ్వాలి. ఇది రక్షణకు అవసరమైన వివక్ష (Protective Discrimination) గా గుర్తించి ఆమోదించాలి. ఉదా॥ తక్కువ రేట్ల వడ్డీతో, ఎక్కువ వాయిదాలపై రుణాలు ఇవ్వాలి. ఇలాంటి సంక్షేమ కార్యాలు చేపట్టాలి.

విద్యాసంస్థలు :- స్త్రీ పురుష వివక్షభావం భారతదేశంలో ఉగ్గు పాలతో రంగరించి అందివ్వబడుతున్నది. కనుక కనీసం నర్సరీ స్కూలు దశనుండి స్త్రీలపట్ల న్యూనతాభావాన్ని తొలగించే పద్ధతిలో విద్యాబోధన జరపాలి. బాల బాలికలకు సహవిద్య గరిపే విద్యాలయాల సంఖ్య పెంచాలి. విద్యార్థులు, విద్యార్థినులు కలసి మెలసి చర్చలు సాగించటానికి, క్రీడలలో పాల్గొనటానికి, కళాసేవను కొనసాగించుకోవటానికి అంటే వారి సాంస్కృతిక పరిణతికి దోహదంచేసే మార్గాలను విద్యాలయాలు అన్వేషించి వాటిని అమలుపరచాలి. ఉపాధ్యాయులు, ఉపాధ్యాయినులు, అధ్యాపకులు తమ భావాలలోగాని, తమ ప్రవర్తనలోగాని స్త్రీ పురుష సమానత్వ భావనను వ్యతిరేకించే లక్షణాలను ఏరి పారవేయాలి. అలా వారు ప్రవర్తించేలాగు విద్యాలయాలు అధికారులు తగు చర్యలు తీసుకోవాలి.

మేధావులు, విద్యావంతులు, భావాలను మలిచేవారు :-

సమాజంలో వీరి ప్రభావం హెచ్చుగా ఉంటుంది. అయితే మేధావులకు, విద్యావంతులకు ఉన్న తేడాను మనం గుర్తించాలి. సమాజానికి "ఏది అవసరం" అనే అంశాన్ని నిష్పక్షపాతంగా ఆలోచించి నిర్ణయించగల్గేది మేధావి. తన సంకుచిత స్వలాభాన్ని విసర్జించి సామాజిక సంక్షేమానికి పెద్దపీట వేస్తారు అతనుగాని ఆమెగాని. దూరదృష్టితో ఆలోచిస్తే వ్యక్తియొక్క స్వార్థానికి, సామాజిక శ్రేయస్సుకు వ్యతిరేకత వుండదు. నిర్లిప్తత మేధావి లక్షణం. డిగ్రీలు సంపాదించిన ప్రతివాడు విద్యావంతుడే. ప్రజల భావాలను మలచగల ప్రతి నాయకుడు పరిగణన పొందేవాడే. కాని ఈ చివరి రెండు తెగలవారూ నిస్వార్థంగా, నిర్లిప్తతతో

సంచరిస్తే తప్ప సామాజిక శ్రేయస్సు ఒనగూడదు మేధావి ద్రష్ట. సామాజిక అవసరాలను ముందుచూపుతో గుర్తించి పరిష్కార మార్గాలను, రీతులను అన్వేషించగలడు. అలాంటి మేధావులు ఎంతగా సంఖ్యాపరంగాను, గుణాత్మకంగాను పెరిగితే అంతమంచిది.

యువతరం : యువతరం పాత్ర అద్వితీయమైనది. యువతరం గొప్పతనం ఈ దిగువ లక్షణాలతో అపూర్వంగా వుంటుంది. సాహసించే స్వభావంలో వారికివారే సాటి. త్యాగం చేయగల సమర్థత వారిలో అత్యధికంగా వుంటుంది. ఆదర్శాలపట్ల అపేక్ష కనుక వారు చేపట్టిన వుద్యమాలు సాధారణంగా సఫలీకృత మవుతాయి. కాగా ఒకనాడు కార్మిక వర్గాన్ని విప్లవ శక్తిగా గుర్తించింది సమాజం. తదుపరి యువశక్తిని పరిగణనలోకి తీసుకున్నది. నిజానికి ఏ ఒక వర్గాన్నో, తెగనో, శాఖనో మాత్రమే విప్లవయుతంగా ఆలోచించటం పొరపాటు. పరిస్థితులను బట్టి ఒక్కొకక్క తెగ, వర్గం, శాఖ విప్లవకరపాత్రను నిర్వహిస్తుంది. కాగా కొన్ని వర్గాలకు, శాఖలకు విప్లవ కార్యక్రమాలు చేపట్టటానికి ఎక్కువ అవకాశాలు వుంటాయి. అలాంటి వాటితో యువతరం ప్రాధాన్యత కలదని చెప్పటంలో అతిశయోక్తిగాని పొరపాటుగాని లేదు. యువత తమ పెద్దలనాటి భావాలను విడనాడాలి. మూఢ విశ్వాసాల బరదిఖానానుండి విముక్తి పొందాలి. పాత భావాలు అంత తేలికగా సమసిపోవు. వాటిపై నిరంతరం పోరాటం సాగాలి. ఆ సందర్భంగా సంఘర్షణ తప్పదు. ఆ పనికి యువత పూనుకోవాలి. యువతరం తలుచుకుంటే స్త్రీ పురుష అసమానత్వం పటాపంచలవుతుంది. అది వారికే సాధ్యమవుతుంది.

సామాజిక, సంక్షేమ సంస్థలు :- స్త్రీల పరిస్థితులను ప్రతిభావంతంగా ఎలా మార్చగలమని ఆలోచిస్తే, నేటి సమాజంలో ఏ ఒక్క వ్యక్తియొక్క ప్రాధాన్యతను తగ్గించటం కాదు. సహకార ప్రయత్నపు విలువను నొక్కిచెప్పక తప్పదు. ఈ సందర్భంలో సంఘాల ద్వారా కృషి సామాజికాభ్యుదయానికి ఎంతో అవసరం. చిత్తశుద్ధితో, స్పష్టమైన లక్ష్యంతో, పట్టుదలతో సాగించే సేవా కార్యక్రమాల

ద్వారా స్త్రీ పురుష సమానత్వాన్ని సాధించగలం. సంక్షేమ కార్యక్రమాలలో దయార్ద్ర బుద్ధికి ఆస్కారంలేదు. జాలిపడి రక్షించేదానికన్న, సమాన హోదాలో ఉన్నా వ్యక్తిగా స్త్రీని గుర్తించి కార్యక్రమాలు నడిపించాలి.

సామాన్య మానవుడు, మామూలు స్త్రీ :-

వీరి పరిస్థితి కడు విచిత్రం. కడు శోచనీయం. రోజంతా శ్రమిస్తే తప్ప పొట్టగడవని ప్రజలు అత్యధిక సంఖ్యాకులు. విద్యకు, వినోదానికి నోచుకోనివారు. వారికి ముందుచూపు సామాన్యంగా ఉండదు. ప్రత్యేక పరిస్థితుల్లో, అసాధారణ ఘట్టాలలో చరిత్రగతిని వారు మళ్ళించగలరు. కాని మామూలు సమయంలో వారికి సామాజిక ప్రగతి పట్టదు. పెద్దలు ఏర్పరచిన బాటనే పయనిస్తారు. వారిలో జాగృతి రావటానికి వారికి కను విప్పు అవసరం. అప్పుడు వారు విరాట స్వరూపం తాలుస్తారు. ఈ పని చేయగల్గినవారు మేధావులు. కనుక మేధావుల ఆలోచనకు వీరు కండ బలాన్ని, అండదండలను సమకూరుస్తారు. వీరు ఆ సమయాల్లో ఎంతో మారతారు. మారగల్గుతారు. వారిలో ఉన్న జిజ్ఞాస నివురుగప్పిన నిప్పులాగ ఉంటుంది. మేధావుల ఆలోచనా ధోరణి ప్రచండమారుతంవలె ఆ బూడిదను వెడలగొట్టుంది. దానితో అగ్ని ప్రజ్వరిల్లుతుంది. వారి శ్రేయస్సు వారికి అవగతం అవుతుంది. వారు అనుసరింపవలసిన మార్గం వారికి సులభగ్రాహ్యంగా కన్పట్టుతుంది. తమ కార్యాచరణద్వారా సాధించుకుంటారు. ఆ ప్రయత్నంలో స్త్రీ పురుష వివక్ష నశిస్తుంది. పోరాట ప్రయత్నం వారిలో మానవత్వాన్ని మేల్కొలుపుతుంది. కాగా తరువాత వారు తమ మామూలు స్వభావాన్ని తిరిగి పొందే ప్రమాదం లేకపోలేదు. అప్పుడే ఎంతో జాగ్రత్త అవసరం. ఆ సందర్భంగా స్త్రీల లక్ష్యశుద్ధి, పట్టుదల ఎంతో ఉపకరిస్తాయి. దారి తప్పనీయకుండా.

రాజకీయ నాయకులు :- రాజకీయ నాయకుల పాత్ర ప్రత్యేకమైనది; విలక్షణమైనది. రాజకీయ నాయకులు పలు తెరగులు. సిద్ధాంతాలకోసం తమ తను, మనః, ప్రాణాలను, ధన, ధాన్యాదులను త్యాగంచేసే

వారు కొందరైతే కేవలం తమ అధికార పిపాస తీర్చుకొనే నిమిత్తం రాజకీయరంగంలో ప్రవేశించేవారు మరికొందరు. తాము ఏదో మహత్తర శక్తి సంభూతులమని, అవతార పురుషులమని నమ్మి సమాజ పునర్నిర్మాణానికి పూనుకునేవారు మూడోరకంవారు. రెండు మూడు రకాలవారు నాయకులయినపుడు సమాజానికి చేటు మూడుతుంది. మొదటివారిలో కూడ సత్య సంశోధన, వినమ్రత, స్వేచ్ఛా పిపాస, సహన శక్తి, తోటివారి యెడ గౌరవం, ప్రక్కవారి సంక్షేమం పట్ల శ్రద్ధాసక్తులు ఉన్నపుడే వారి నాయకత్వం ప్రజలకు విముక్తి ప్రదాయిని అవుతుంది. కనుక అలాంటి విశిష్టమైన రాజకీయ నాయకులు ఆవిర్భవించాలి.

ప్రసార సాధనాలు :- రేడియో, టి.వి., సినిమా, పత్రికల లాంటి ప్రసార సాధనాలు అజ్ఞానాంధకారాన్ని పటాపంచలు చేయగలవు. వాస్తవాన్ని చిత్రించి చూపగలవు. చరిత్ర గతిని పసిగట్టకలవు. లక్ష్య నిర్దేశం చేయుగలవు. భావ ప్రసార బాధ్యత స్వీకరించకలవు. కార్యాచరణలో ఉన్న ఇబ్బందులను, చిక్కులను వెలికితీసి పరిష్కార మార్గాలను సూచించ గలవు. అన్నింటికన్న మిన్న ప్రజలలో స్వేచ్ఛా పిపాసను, సత్యాన్వేషణను పెంపొందించ గలవు. అవి చేయలేని పనిలేదు. ప్రజలను ఉద్రేక పూరితులను చేసి ఉద్రూత లూగించి వారిలో జిజ్ఞాసను రేకెత్తించి ఆలోచనను పెంపొందించగలవు. ఆయా రంగాలు అందు కనువైన కొన్ని నిర్దిష్ట కార్యక్రమాలు చేపట్టగలవని ఊహించటం పొరపాటు కాదు, స్త్రీ పురుష సమానత్వం విషయమై మౌలికమైన చర్చలను సాగించడం, స్త్రీ స్వేచ్ఛను గురించి జాగృతి, చైతన్యం పొందిన స్త్రీలచే ప్రసంగాలు, రచనలూ చేయించడం, స్త్రీ విమోచన మార్గాలను అన్వేషించటానికి అధ్యయన శిబిరాలు నిర్వహించడం, స్త్రీ పురుషుల మధ్య సమానత్వాన్ని గురించిన అపోహలను పారద్రోలటం, స్త్రీ విమోచనకోసం జరిగే పోరాటాల వివరాలు తెలియజేయుటం, స్త్రీ విముక్తికోసం కృషిచేసే సంఘాల ప్రయత్నాల ఉదంతాలు, చరిత్ర ప్రజలకు తెలియజేయడం, సకలకళా సాధనాలద్వారా స్త్రీ స్వేచ్ఛకు, స్త్రీ విమోచనకు దోహదం చేయడం, స్త్రీ విమోచన సాధించటానికి ప్రభుత్వమూ తదితరులు చేపట్టిన కార్యక్రమాలను ప్రజలకు పరిచయం చేయటం, స్త్రీ

స్వేచ్ఛకోసం అహరహం శ్రమించే స్త్రీ పురుషుల అనుభవాలను, వారు నేర్చుకున్న గుణపాఠాలను ప్రజలకు ఎరుకపరచటం, ప్రపంచవ్యాప్తంగా కాని, దేశంలోకాని, జరిగే స్త్రీ విమోచన ప్రయత్నాల సమాచారాన్ని ప్రజానీకానికి అందించే బాధ్యతను ప్రచార సాధనాలు చేపట్టిననాడు సమాజ ప్రగతికి, స్త్రీ విమోచనకు అవి సోపానాలవుతాయి.

(హైదరాబాద్ రేడియో – 8–3–85)

---

# మహిళా దశాబ్ది పిలుపు : మహిళల మలుపు

ప్రపంచ మహిళా దశాబ్ది మహాసభలు జులై 10 నుండి 19 వరకు నైరోబిలో జరిగాయి. ఆ సభలకు ప్రభుత్వ సంస్థల ప్రతినిధులు 20 వేలమంది హాజరైనారు. అదే సమయంలో ప్రభుత్వేతర సంఘాల ప్రతినిధుల సభకూడా జరిగింది. దానికి 14 వేలమంది పాల్గొన్నారు. స్త్రీ విమోచన ఉద్యమకారులకు ఇది ఒక విజయం. అనేక సంస్కృతులకు, ఆర్థిక వ్యవస్థలకు, సామాజిక ఉద్యమాలకు చెందినవారు సమావేశమైనారు. భాషలు వేరైనా, దేశాలు వేరైనా, సమస్యల్లో తేడాలు వున్నా, సంస్కృతులు భిన్నమైనవైనా అందరికీ చెందిన విషయాలు చాలా వున్నాయి. అందులో ముఖ్యమైనది స్త్రీ విమోచన. అందువల్లే అన్ని వర్ణాలవాళ్ళూ, వృత్తులవారు ప్రవాహంలా వచ్చి చేరుకున్నారు. అందులో కొందరు స్త్రీలు వారి, వారి దేశాల ముఖ్య పట్టణాలుకూడా చూడని వారున్నారని వార్తలొచ్చాయి.

సమానత్వం, అభివృద్ధి, శాంతి ఈ మూడు స్త్రీల పరంగా అన్వయించి, తద్వారా ప్రపంచ స్త్రీల సమస్యలను వెలికితెచ్చి వాటిని పరిష్కరించి స్త్రీల తోడ్పాటుతో ప్రపంచ శాంతిని, అభివృద్ధిని సాధించాలనేది

యు.ఎన్.ఓ. వారి లక్ష్యం. విద్య, ఉద్యోగం, ఆరోగ్యం ఈ మూడు శాంతికి, అభివృద్ధికి సాధనాలుగా పేర్కొన్నారు. ఆ దృష్టితో గత పది సంవత్సరాలలో అనేక సభలు, చర్చలు, సెమినార్లు జరిగాయి. స్త్రీల పరమైన సాహిత్యం విరివిగా వెలువడింది. అన్ని విధాలైన స్త్రీల సమస్యలు చర్చించబడ్డాయి. ఈ దశాబ్దంలో జరిగిన ముఖ్యంగా చెప్పుకోతగ్గ లాభాలు ఏమిటి? స్త్రీలు ఏమి సాధించారు? ఏ విధంగా అభి వృద్ధి చెందారు? భవిష్యత్తు వ్యూహాలు ఏమిటి? అనే విషయాలన్నీ చర్చించి దానికొక తుది రూపం ఇవ్వటానికి జరిగిన మహాసభ నైరోబి సమావేశం. ఆ సభ సాధించిన విజయాల గురించి వివరించటం తెలిసి కొనడం చాలా అవసరం. అందువల్ల జరిగిన ఫలితాలేకాక జరగాల్సిన కార్యక్రమాల గురించి కూడా మనకు ఒక అవగాహన వుంటుంది. తద్వారా కార్యోన్ముఖులం కాగలుగుతాము.

ఈ మహాసభలో రష్యన్ స్త్రీలకు అమెరికన్ స్త్రీలకు శాంతిని ఎలా సాధించాలి అనే విషయంలో వాగ్వివాదం బాగా జరిగింది. అలాగే ఇజ్రా యిల్, అరబ్ స్త్రీలు శాంతిని గురించి ఘాటుగా విమర్శించుకొన్నారు. అందులో ముఖ్యమైనవి కొన్ని, వివరించుకుందాం. అభ్యున్నతికి చేస్తున్న దానికన్నా, స్త్రీలు మొత్తంమీద చేయగలుగుతున్నది చాలా హెచ్చుగా వున్నది. వారు చేసే అనేక పనులను ఆర్థిక విలువవున్న పనులుగా గుర్తించటంలేదు. వాటికి ఏ విధమైన వేతనాలు ముట్టటం లేదు. స్త్రీలు ఇంటిపని చేస్తున్నారు. పిల్లల బాగోగులు చూస్తున్నారు. వీటికి వరు మానం రాదు. వ్యవసాయ రంగంలో స్త్రీలు వుత్పత్తిదారులుగా వున్నారు. అభ్యున్నతి చెందుతున్న దేశాలలో ఎక్కువగా ఆహారాన్ని పండించేది స్త్రీలే. కాని వారికి దానికి బదులుగా ఏమీ ముట్టదు. చిన్న చిన్న వ్యాపా రాల్లో కొద్దిపాటి దుకాణాల్లో వీధులవెంబడి తిరిగి వస్తువులు విక్రయించే వారిలో స్త్రీలు పెక్కుమంది వున్నారు. ఈ రంగాల్లోని స్త్రీల కృషిని గరిష్ట జాతీయ వుత్పత్తి లెక్కవేసేటప్పుడు పరిగణించడంలేదు. ఇదంతా రాజ కీయాన్నికూడా ప్రభావితం చేస్తుంది. ఈ సమస్య చర్చకొచ్చింది. ఆరోగ్యంపై జరిగిన ప్రత్యేక అధ్యయన (వర్కుషాపు) శిబిరాల్లో హెచ్చ

సంఖ్యలో స్త్రీలు హాజరైనారు. స్త్రీలు ఆరోగ్య విషయమై శ్రద్ధ వహించాలని, ఆ ప్రణాళికలను వారు నడపాలనే అభిప్రాయాలుకూడా చర్చకు వచ్చాయి. స్త్రీలు తమ పిల్లలకు తామే నర్సులుగా, వైద్యులుగా వ్యవహరించాలని ఈ రకమైన పని చేయడానికి తగిన జ్ఞానాన్ని, విజ్ఞానాన్ని తల్లికి కలుగజేయడం అవసరమని నిరూపించారు.

స్త్రీల వ్యక్తిత్వం గురించిన భావన చర్చల్లో కీలకపాత్ర వహించింది. కొలంబియా ప్రతినిధి డిమాంటినో స్త్రీలు శారీరక ధర్మాన్ననుసరించి పిల్లల్ని కనడంవల్ల మాతృత్వ విధిని మాత్రమే గౌరవిస్తున్నారు. కాని మరో విషయం సమాజదృష్టికి రావాల్సి వుంటుంది. స్త్రీలు మాతృత్వ విషయంలోనే కాక ఇతరత్రా కూడా వారు సృష్టికర్తలు. తమ శారీరక ధర్మాన్ని నిర్వర్తిస్తున్నంత మాత్రాన స్త్రీలే ప్రతి పని చెయ్యాలని, ఇంటిపని, బజారుపని, వంటపని, బండచాకిరి చెయ్యాలని సమాజం భావిస్తున్నది. దీనిని స్త్రీలు ఇంక ఎంతమాత్రం అంగీకరించరు. ఈ సమస్య పదేపదే మహాసభలో చర్చకు వచ్చింది. న్యూజిలాండులో స్త్రీల వ్యవహారాల మంత్రి హెర్కుస్ శాంతికోసం జరిగే పోరాటంలో చేరమని ప్రపంచ స్త్రీలకు విజ్ఞప్తి చేసింది. పురుషాధిపత్య సమాజపు భావనలు, అధికారం యుద్ధరంగంలో ముందుండే సైనికులవలే కష్టనష్టాలకు లోనవటానికి స్త్రీలను ముందుకు నెట్టాయని, స్త్రీలు ఆ పరిస్థితినుండి వెలికి రావాలని గ్రీకు ప్రతినిధుల నాయకురాలు మార్గరీటా సభకు పిలుపు ఇచ్చింది. శాంతిసాధనకై జరిగే జనతా ఉద్యమంలో స్త్రీలు చేరాలని, నిర్ణయాలు చేసే అధికార స్థానాలలోకి స్త్రీలు చొచ్చుకుపోవాలని, ప్రాణాన్ని రక్షించడంలో మనకున్న సహజ లక్షణాలు మానవ హక్కులపై మనకున్న ఆసక్తి అనాడే వినియోగానికి వస్తాయి. అప్పుడే మానవ భవిష్యత్తును, ప్రపంచ శాంతిని రూపొందించడంలో మనం కృషి చేయగలమని చర్చలు ఉద్బోధించాయి. సైప్రెస్, లాటిను అమెరికా, పాలెస్తీనా శరణాగత స్త్రీల స్థితిగతులపై తమ ఆదుర్దాను వెల్లడించింది మహాసభ.

నైరోబి మహాసభల చర్చల్లో ముఖ్యమైనది, కీలకమైనది "భవిష్యత్

వ్యూహాల" గురించిన నిర్ణయాలు. 1986 నుండి రెండువేల సంవత్సరం నాటికి జరుగవలసిన కృషిని గురించిన పురోగామి వ్యూహాలు అనేది అది. ఆ డాక్యుమెంటులో స్త్రీలకు ప్రత్యేక ఆసక్తి, శ్రద్ధ వున్న అంశాలను పేర్కొని యుద్ధాలల్లో, సాయుధ సంఘర్షణలలో స్త్రీలు అనుభవించే ప్రత్యేక బాధలకు, కష్టాలకు పరిష్కార మార్గాలను పుటంకించడం జరిగింది. ఇంకా కుటుంబంలో స్త్రీలపై హింస, లైంగిక దౌర్జన్యం, వీటి విషయంలో స్త్రీలు చొరవ చూపాలనే నిర్ణయానికి వచ్చారు. చావుబ్రతుకుల మధ్య ఊగిస లాడుతూ జీవిస్తున్న స్త్రీలను, ఆర్థికంగా దోపిడీకి గురిఅవుతున్న మహిళల సమస్యలను "భవిష్యత్ వ్యూహాలు" అనే డాక్యుమెంటులో 314 పేరాలలో పేర్కొనడం జరిగింది. అందులో 4 పేరాలపై ఓటింగు జరిగి తుదకు జులై 27 తెల్లవారుఝామున ఆ నిర్ణయాలు ఆమోదింపబడ్డాయి. ఇది గొప్ప అపూర్వ సృష్టి; స్త్రీ జనాభ్యుదయ మార్గానికి తొలి మెట్టు.

నైరోబీ మహాసభ మెక్సికో, కోపెన్‌హాగన్ మహాసభలను మించింది. సంఖ్యలో, పరిమాణంలో, గడువులో, చర్చాంశాలల్లో, విస్తృతత్వంలో ఒకటేమిటి అన్నింటా అధిగమించింది. ఇది ప్రపంచ స్త్రీల చరిత్రలో మహోన్నత సంఘటన. ఇది ప్రపంచ స్త్రీల సంఘీభావానికి నిదర్శనం నిర్మాణ దక్షతకు ప్రతీక. భవిష్యత్ దర్శనానికి మచ్చుతునక. పితృ స్వామ్యాన్ని, పురుషాధిపత్యాన్ని స్థిరపరచాలనుకొనే ప్రత్యాఘాతక శక్తులకు హెచ్చరిక. ప్రపంచ మహిళా లోకపు సృజనాశక్తికి సంఘటనా కృషికి సవాలు. ఈ మహాసభ ప్రపంచ స్త్రీలను వెన్నుతట్టి లేపింది. వారి వ్యక్తిత్వాన్ని మేల్కొల్పింది. ప్రపంచ చరిత్రలోనే స్త్రీల హోదాను, గౌరవాన్ని సృష్టించింది. ఇంత గొప్ప సభ ప్రపంచ చరిత్రలోనే మున్నెన్నడూ జరుగలేదు.

ప్రభుత్వేతర ప్రతినిధుల మహాసభ కూడా అదే సమయంలో జులై 15-26 న జరిగింది. ఈ వేదిక (Foram) కు 14 వేలమంది తమ పేర్లను నమోదు చేసుకున్నారు. 6 వేల మంది ప్రేక్షకులుగా వచ్చారు. మొత్తం ఇరవై వేలమంది పాల్గొన్నట్లు లెక్కలొచ్చాయి. ఇతరత్రా స్వచ్ఛందంగా ఏర్పాటు చేసుకున్న శాంతి శిబిరం, సాంకేతిక శిబిరం మ్యూజియం

శిబిరంలాంటివికాక అధికారికంగా జరిగిన చర్చావేదికలు 1198 వున్నాయి.

ఈ వేదికను అరవై అంతర్జాతీయ సంఘాలు కలిసి ఏర్పాటు చేశాయి. ఒక సారథ్య సంఘ అధ్వర్యంలో, అనేక ఉపసంఘాల నియామకంతో అవి పనిచేశాయి. ఒక దినపత్రిక వేదికయొక్క, ప్రపంచ మహాసభయొక్క వార్తలను ప్రతిరోజు ప్రకటించింది ఆ పత్రికను నిర్వహించిన వారందరూ స్త్రీలే.

ప్రపంచ వ్యాప్తంగా స్త్రీలకు సంబంధించిన విషయాలు చర్చకు వచ్చాయి. మహిళా దశాబ్దపు ముఖ్య సమస్యలు-సమానత్వం, అభివృద్ధి మరియు శాంతి, ఆరోగ్యం, విద్య, ఉద్యోగం శీర్షికలక్రింద అనేక సమస్యలను గురించి చర్చించారు. కుటుంబ నియంత్రణ వేదిక, శరణార్థులు, బాలికలు వృద్ధస్త్రీలు, వికలాంగస్త్రీలు, వడుపువృత్తి కుటుంబంలో హింస, దౌర్జన్యం ఇంటిపనికి వేతనాలు, స్త్రీలపై వాతావరణ ప్రభావం, ఆర్థిక సమస్యలు వీటిని చర్చించారు. ప్రతినిధులంతా విభాగాలుగా చేరి, విషయాలు విభజించుకొని చర్చించారు.

అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థ, వర్థమాన దేశాల అనుభవాలు, గ్రామీణస్త్రీలు, గృహవసతి, ఆదాయాల ఉత్పాదన, నూతన సాంకేతిక విధానాలు, రాజకీయాల్లో భాగస్వామ్యం, అభివృద్ధి క్రమంలో ప్రభుత్వేతర సంస్థలపాత్ర ఇవన్నీ అభివృద్ధి అనే అంశంక్రింద 200 చర్చావేదికలలో మాట్లాడారు. కీన్యా గ్రామీణ చేతివృత్తులను గురించి, సంస్కృతులను గురించి ప్రదర్శనలు జరిగాయి. ప్రత్యేకంగా అనేక స్వచ్ఛంద సంస్థలు వేరువేరు నివేదికలు తయారుచేశాయి. అందులో "న్యాయం చెప్పే" ట్రిబ్యూన్, "మహిళా దశాబ్దం" సాంకేతిక నివేదిక అనేవి పేరెన్నికగన్నవి.

వేదికలోని కొన్ని ముఖ్య సంఘటనలు :- శాంతి శిబిరంలో చర్చలు ఘాటుగా సాగాయి. కాకపోతే అవతలవారి అనుభవాన్ని-దృక్పథాన్ని గౌరవించడం, సహకార భావం, బహిరంగంగా చర్చించడం భిన్నాభిప్రాయాలలో కార్యచరణకు అనువైన ఏకాభిప్రాయాన్ని చర్చిం

చడం ఈ మూడు భావాలు ఆ చర్చలను ప్రభావితం చేశాయి. ఉద్రేకాలు వెలిబుచ్చుకోవటానికి ఈ శిబిరమే అవకాశం ఇచ్చింది. చర్చలు, ఫిలిం ప్రదర్శనలు ఇతర ప్రదర్శనలు 10 రోజులపాటు అవిచ్ఛిన్నంగా సాగాయి.

సాంకేతిక శిబిరం దీన్ని ఏర్పాటు చెయ్యటానికి అరవై ప్రపంచ వ్యాప్త సంఘాలు రెండు సంవత్సరాలు పనిచేశాయి. ఆరింటి క్రింద ఈ చర్చనీయాంశాలను వర్గీకరణ చేశారు. వ్యవసాయం, ఆరోగ్యం, ప్రసార సాధనాలు, శక్తి, ఆదాయం, ఉత్పాదన, ఆహార పదార్థాల తయారి లాంటివి అవి. మరికొన్ని ముఖ్యమైన విషయాలు చర్చకు వచ్చాయి. అవి- స్త్రీలకు సాంకేతికతను గురించిన సమాచారం స్త్రీలకు ఎంతవరకు అందుతున్నది అనే అంశాలను గురించి గాఢంగా పరిశీలన చేశారు. ఈ చర్చల ఫలితంగా స్త్రీలకు అనువైన "సాంకేతిక విధానాలు" అనే నివేదిక తయారయింది.

రాజ్యము, శాసనాలు, అభివృద్ధి, ఆచారము, తెగతత్వం, హింస, దోపిడి, మహిళా దశాబ్దపు పోకడ, సమిష్టి కార్యాచరణకు పథకం, అనే విశాల శీర్షికల క్రింద "లా" అభివృద్ధి వీటికి సంబంధించిన విభాగం కృషిచేసింది స్త్రీల హక్కుల ప్రణాళికను తయారుచేయడానికి స్త్రీల మానవహక్కులను పౌరహక్కులను శాసనపరమైన హక్కులను ముఖ్యంగా ఆశియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికా ఖండాలను రక్షించుటకు లేక వాటికై పోరాడుటకు అనువైన ప్రజాభిప్రాయాన్ని సృష్టించటానికి, ప్రాంతీయ మహాసభలను ఏర్పాటు చేయడానికి నిర్ణయాలు చేశారు.

"మీ హక్కులను మీరు గుర్తించండి" అనే ఉద్యమాన్ని తృతీయ ప్రపంచంలో కొనసాగించటానికి నిర్ణయాలు జరిగాయి.

<u>ఫిలిం ఫోరం</u> :- దీని ఆధ్వర్యాన పది వర్కుషాపులు నిర్వహించబడ్డాయి. సినిమాలు, వీడియోల తయారీ, పంపిణీ ప్రదర్శనలాంటి సమస్యలు చర్చకు వచ్చాయి. అచ్చంగా స్త్రీలచేత, స్త్రీలకొరకు, స్త్రీల సమస్యలపై తయారుచేయబడిన 150 మంది స్త్రీల ఫిల్ములు ప్రదర్శితమయినాయి.

తృతీయ ప్రపంచంలో స్త్రీల సినిమాల ప్రదర్శనలపై దృష్టి ఎక్కువగా కేంద్రీకృతమయింది.

సాంకేతిక ప్రదర్శన :- వాద్యసంగీతవేత్తలు, గాయనిలు, కవయిత్రులు, చిత్రకారిణులు, నాట్యకర్తెలు, రచయిత్రులు వందలమంది ఫ్రెంచి సాంస్కృతిక వేదిక "గెథె" సంస్థ ఆధ్వర్యాన సమావేశమయినారు. అధ్యయన తరగతులు, ప్రదర్శనలు, చిత్ర ప్రదర్శనలు, అనే మూడు శీర్షికల క్రింద అధ్యయనం సాగింది. యాభై ప్రదర్శనలు జరిగాయి. "కళోత్సవం" అనే ప్రదర్శన చివరలో సమిష్టి ప్రయత్నంగా సాగింది. వేలమంది ప్రేక్షకులు వచ్చారు. వారి ప్రదర్శనలను మరోసారి చూడాలని కొన్ని గ్రూపుల ప్రేక్షకులు, శ్రోతలు మరీ మరీ కోరారు.

స్త్రీల సృజనాత్మక శక్తిని సమీకరించటానికి, దానికి శిక్షణ ఇవ్వటానికి, దానిని ప్రదర్శించటానికి ప్రపంచ వ్యాప్తంగా స్త్రీలకు అవకాశాలు ఉండాలని నిర్ణయం జరిగింది. కొన్ని నివేదికలను తయారుచేసి ఐక్యరాజ్య సమితి జనరల్ అసెంబ్లీకి సిఫారసులు చేశారు.

డాన్ అభివృద్ధి ప్రత్యామ్నాయ మార్గాలు :- తృతీయ ప్రపంచ స్త్రీల సమస్యలను కూలంకషంగా చర్చించారు. రెండు వేలమంది స్త్రీలు ఈ శిబిరానికి హాజరయినారు. ప్రాంతీయ కార్యాలయాలను ఏర్పర్చాలని తీర్మానాలు చేశారు.

స్త్రీ సమస్యా పరిశోధనా శిబిరం :- దీనిలో 2 వేలమంది పాల్గొన్నారు. 15 దేశాలలోని 26 మంది సంస్థలు 13 అధ్యయన వేదికలను నిర్వహించాయి. జనం కిటకిటలాడి పోయారు. చోటులేక అనేక వందలమంది తిరిగి వెళ్ళాల్సి వచ్చింది. వివిధ దేశాలలో స్త్రీల సమస్యలపై అధ్యయనాలు చేసే సంస్థల పేర్ల జాబితా, దాని ప్రచురణ సంస్థల కృషిని గురించిన సంక్షిప్త నివేదికలు, బోధనా సంస్థల జాబితాలు, ప్రాంతీయ, దేశస్థాయిాల వారిగా తయారుచేయడానికి తీర్మానించాయి.

ప్రాథమిక స్థాయిలో స్త్రీలను సంఘటితం చేసేవారి శిబిరం :-

గ్రామాలలో, పట్టణాలలో, పేటలలో మహిళలను సమీకరించటం ధ్యేయంగా కలవారి సమావేశం ఇక్కడ జరిగింది. అలాటివారు ఎదుర్కొనే సమస్యలు చర్చకు వచ్చాయి. 1990 లో మదరాసులో ఈ సందర్భంగా ప్రపంచ మహాసభ జరుపడానికి నిశ్చయింపబడింది.

ఆధ్యాత్మిక శిబిరం :- ఆధ్యాత్మిక చింతన పెంచడానికి ప్రపంచ చర్చల సమతి, ప్రపంచ కాథలిక్ స్త్రీల సంఘాల సమితి, ప్రపంచ లూథరన్ స్త్రీల సంఘం వారు దీనికి అధ్వర్యం వహించారు. కీన్యా క్రైస్తవ స్త్రీల సంఘం ఆహ్వాన సంఘంగా పనిచేసింది. అప్పటికప్పుడు తయారయిన పిండివంటలు, తినుబండారాలు, టీ, కాఫీలు ఈ శిబిరంలో లభ్యమయ్యాయి. వేలమంది స్త్రీలు దీనికి హాజరయ్యారు.

ఇలా అనేక శిబిరాలతో, అనేక అధ్యయన తరగతులతో అనేక అధికారిక, అనధికారిక కార్యక్రమాలతో సాగింది. ఈ మహోన్నత సమావేశం వేలమంది స్త్రీలు పచ్చిక తివాచీలమీద చుక్కల చాందినీ క్రింద ముఠాలుగా సమావేశమయి స్త్రీల సమస్యలపై తీవ్రంగా, సునిశితంగా, ఆవేశపూరితంగా చర్చించారు.

ఇదంతాగాక అనేక స్వచ్ఛంద సంస్థలు ప్రత్యేకంగా విడిగా అనేక శిబిరాలను నెలకొల్పాయి. సాంకేతిక శిబిరం, శాసనానికి సంబంధించిన శిబిరం, ఫిలింఫోరం, సాంస్కృతిక ప్రదర్శన, అభివృద్ధికి ప్రత్యామ్నాయ మార్గాల శిబిరం, స్త్రీ సమస్యా పరిశోధనా శిబిరం, ఇలాంటివి అవి. వీటిలో ఒక్కొక్కదానిలో వేలమంది పాల్గొన్నారు. తృతీయ ప్రపంచ స్త్రీల సమస్యలు ఎక్కువగా శిబిరాలలో పాల్గొన్నవారి దృష్టిని ఆకర్షించాయి.

స్త్రీల హక్కుల ప్రణాళికలను తయారుచేయటానికి నిర్ణయం, స్త్రీల చేత స్త్రీలకొరకు స్త్రీల సమస్యలపై సినిమాలు వీడియోల తయారీ వినియోగాలకు తగిన సాంకేతికమ అన్వేషించటం ప్రాథమికస్థాయిలో మహిళల

సంఘటనను ఏర్పాటు చేయటానికి 1990లో మరో మహా ప్రపంచ మహాసభ స్త్రీ సమస్యా పరిశోధనా సంస్థలను నెలకొల్పటం లాంటివి చివరిగా జరిగిన చర్చనీయాంశాలు, నిర్ణయాలు కూడాను.

నైరోబి మహాసభలో 1986 నుండి రెండువేల వరకు జరగవలసిన కృషిని గురించి వ్యూహాలను తయారుచేశారు. స్త్రీలు ఏ విషయమై శ్రద్ధ పూనుతున్నారో, ఏమి చేస్తున్నారో, వారు ఏమి కోరుతున్నారో? అనే వాటిపై మనకు పరిజ్ఞానం వున్నది మనకు సమాచారం, లెక్కలు, గణాంకాలు వీటి అన్నింటిని ప్రభుత్వాలు ప్రణాళికలు వేసేవారు మహిళాసంఘాలు, మహిళోద్యమ నాయకులు అందరు వాడుకొని కృషిని ప్రారంభించాలి. కొంతగా కొంత జాగృతి, వికాసం స్త్రీలలో కలిగించిన యు.ఎన్.ఓ. వారికి ప్రపంచ మహిళలు కృతజ్ఞులై వుంటారనేది నిర్వివాదాంశం అనక తప్పదు.

( "ఆంధ్ర ప్రభ" జనవరి 1986 )

---

# ప్రపంచ మహిళల స్థితి : వారి సమస్యలు

ఈ సువిశాల విశ్వంలో స్త్రీలు అణచివేతకు గురి అవుతున్నారు. వెనుకబడిన వర్గానికి చెందుతున్నారు. బీదలలో బీదవారుగా వున్నారు. ప్రపంచ వ్యాప్తంగా వారి పరిస్థితులను పరిశీలిస్తే వారు అనేక సమస్యలను ఎదుర్కొంటున్నట్లు తెలుతున్నది. ఈనాడు ప్రపంచ స్త్రీల సమస్యలు కోకొల్లలుగా వుంటున్నాయి. అయితే అన్ని దేశాల స్త్రీలకు అన్ని సమస్యలు వుండవు. కొన్ని దేశాల స్త్రీలు రాజకీయ అసమానత్వానికి లోనవుతున్నారు. మరి కొన్ని దేశాలలో సాంఘికపరమైన వ్యత్యాసాలు దర్శనమిస్తున్నాయి. ఇంకా కొన్ని దేశాలలో ఆర్థిక అసమానత్వం విలయతాండవం చేస్తోంది. చాలా దేశాలలో అన్నిరకాల అసమానత్వం కనిపిస్తుంది. ఇలా ఎన్నో

రకాల తేడాలు వున్నాయి. ఆరోగ్యం, విద్య, ఉద్యోగం, ఇంటిపని, వేతనాల వ్యత్యాసం, రక్షణ, భద్రత, వేర్పాటు చిన్నచూపు, హీనస్థాయి లాంటి సమస్యలు స్త్రీలను తరతరాలుగా బాధిస్తున్నాయి. మరో విషయం గమనార్హం. ఒకే సమస్య అనేక దేశాల స్త్రీలకు సామాన్యంగా వుంటున్నా వాటి రూపాంతరాలు వేరువేరుగా వుంటున్నాయి. కనుక సమస్యలను గాఢంగా పరిశీలిస్తే ఈ అంశం గోచరిస్తుంది.

ప్రపంచ మహిళల సమస్యలను విశ్లేషణ చేసే సందర్భంగా అనేక మార్గాలను అనుసరించవచ్చు. వేరువేరు ఖండాలను తీసుకొని అచ్చటి పరిస్థితులను విశదీకరించడం ఒక పద్ధతి. అలాకాక వేరువేరు ప్రాంతాలను తీసుకొని అంటే కెనడా, అమెరికా, పశ్చిమ ఐరోపా, మధ్యప్రాంతం, దక్షిణ ఆశియా, ఆగ్నేయ ఆశియా, ఉత్తర ఆఫ్రికా వగైరా ప్రాంతాలను తీసుకొని పరిశీలన చేయడం మరొక విధానం. అలాకాక సమస్యల స్వభావాన్నిబట్టి వర్గీకరణ చేయడం మూడో మార్గం. వీటికి భిన్నంగా ఆయా దేశాల మహిళోద్యమాలు ఇచ్చే ప్రాధాన్యతను గ్రహించి సమస్యాపరంగా వేరువేరు గుంపులుగా దేశాలను ఏర్చికూర్చి సమీక్షించడం ఒక విలక్షణమైన మార్గం. దేశదేశాన్ని పేర్కొని ఆయా దేశపు మహిళల సమస్యలను వివరించడం ఒకరకపు ఆలోచనా ఫలితం. ఇన్ని పద్ధతులు వున్నా వీటిని వదలి ఈ వ్యాసం మరియొక విధమైన ఆలోచనా బాటను ఎన్నుకోవడం జరుగుతోంది.

స్త్రీ పురుష సమానత్వం మూడు పువ్వులూ ఆరు కాయలుగా ఏ దేశంలోను ఈనాడు విలసిల్లడం లేదు. కాకపోతే కొన్నిచోట్ల రాజకీయ సమానత్వం లాంఛనప్రాయంగా వుంటున్నది. మరికొన్నిచోట్ల ఆర్థిక స్వేచ్ఛ నిలకడగా కనిపిస్తున్నది. ఇంకా కొన్ని ప్రాంతాలలో సాంఘిక స్వాతంత్ర్యం ప్రస్ఫుటంగా దర్శనమిస్తుంది. ఇది గుణాత్మకమైన మదింపు. అయినా అనేక దేశాలతో ఒకటి లేక రెండు సామాజిక జీవితరంగాలలో అసమానత్వం మనుగడ సాగించడంలేదు. ఈ సర్వసామాన్యమైన సమస్యలను గురించి ప్రపంచ మహిళలు ఆందోళన వెలిబుచ్చుతున్నారు. అది వారి సభలలో

ప్రతిఫలిస్తున్నది. కనుక ప్రపంచ స్త్రీలకు సంబంధించిన కొన్ని సమస్యలను పరిశీలిద్దాం.

ఈనాటి ప్రపంచ ఆర్థిక ఉత్పత్తిలో మూడోవంతు స్త్రీల శ్రమవల్లనే నని, మూడో ప్రపంచంలో సగం ఆహారాన్ని స్త్రీలే పండిస్తున్నారని ఒక సర్వేలో తేలింది. ఆఫ్రికాలో 80% సేద్యం స్త్రీలే నిర్వహిస్తున్నారు. పరిశ్రమల్లో కార్మిక స్త్రీ జీతం పురుషుని జీతంలో 75% వుంది. బాలికలకన్నా బాలుర విద్య 8 కోట్లు అధికంగా వుంది. ప్రపంచమంతటా ఈ తేడాలు వున్నాయి. చీకాకు కలిగించే ప్రాథమిక పాఠశాలల్లో స్త్రీ ఉపాధ్యాయినులు 50% వున్నారు. హైస్కూళ్ళలో 30% వుంటే కళాశాలల్లో 26%కు తగ్గింది. నిరక్షరాశ్యత పురుషులకన్నా స్త్రీలలో 13 కోట్లు హెచ్చుగా వుంది. ఇంజనీరింగు, మెడిసిన్‌లలో 25 శాతం మాత్రమే స్త్రీ లున్నారు. బిడ్డలను కనగల వయస్సులో వున్న సగం మంది స్త్రీలకు ఎనీమియా వుంది. సగటు జీవితంలో పురుషులకన్నా స్త్రీలకు 15 సంవత్సరాలు తక్కువ. అసలు స్త్రీకి ఓటు హక్కు అనేది 1893 లో న్యూజిలాండులో వస్తే 1971 లో స్విజర్లెండులో ఇచ్చారు. కనుక దేశదేశాల స్త్రీల పరిస్థితిని ఈ సందర్భంగా పరిశీలించడం అవశ్య కర్తవ్యం.

"ఆల్ మెన్ ఆర్ క్రియేటెడ్ ఈక్వల్" అని విప్లవానంతరం 1776లో అమెరికన్ రాజ్యాంగం నిర్వచించినప్పుడు పురుషులంతా సమానం అని మాత్రమే ఆ నిర్వచనాన్ని గురించి భావించడం జరిగింది. నాటినుండి నేటివరకు అమెరికన్ స్త్రీలకు సిసలైన స్వేచ్ఛా సమానత్వాలు లభించనే లేదు. 60 సంవత్సరాల దీర్ఘ పోరాటానంతరమే వారికి ఓటు హక్కు మాత్రం సిద్ధించింది. స్త్రీల సమాన హక్కుల గురించి రాజ్యాంగ సవరణ జరగాలనే పోరాటం గాలిదుమారం లేపింది. చివరికి ఆ సవరణ వీగిపోయింది. అంటే స్త్రీ స్థానం ఏమిటి? అనే విషయంలో ఇంకా అమెరికన్ సెనెట్‌లో అనుమానం వుంది. అమెరికన్ స్త్రీలకు 20వ శతాబ్దంలో పాత సమస్యలు పోయి క్రొత్త సమస్యలు పుట్టుకొచ్చాయి. విశ్వవిద్యాలయాల్లో లైంగిక వేధింపు పెరిగిపోతోందని, విద్యార్థులకు మార్కులు ఇచ్చి గ్రేడులు నిర్ణయించే ఉపాధ్యాయులు విద్యార్థినులయెడ అసభ్యంగా ప్రవర్తించ

డమే లైంగిక వేధింపు అని నిర్వచనం చేశారు. వివాహిత స్త్రీకి కూడా అవివాహిత స్త్రీవలె తన దేహంమీద తను అనుపు కలిగివున్నదని, వివాహం అయినంతమాత్రాన భార్య అయిష్టత ప్రకటించినప్పుడు ఆమెను మాన భంగం చేసే హక్కు భర్తకు లేదని, వివాహిత హక్కుల్ని నిర్ధారించమని న్యాయార్క్ కోర్టులో వ్యాజ్యాలు జరిపారు. భార్య అభీష్టానికి వ్యతి రేకంగా కలిస్తే అది నేరమని న్యూయార్క్ కోర్టు తీర్పు యిచ్చింది. అలాగే గర్భస్రావాలు చేసే ప్రయివేటు హాస్పటళ్ళపై సంప్రదాయవాదులు బాంబులు వేస్తూ దాడులు సల్పుతున్నారని, స్త్రీకి తన దేహంపై తనకు హక్కు వుండాలని ఆ స్త్రీలు ఆందోళనలు సాగిస్తున్నారు. సాంకేతిక నిపుణులుగా, మేనేజర్లుగా, ఉన్నతాధికార్లుగా స్త్రీలకు స్థానాలు లభించడంలేదనే ఆందోళన పెరుగుతోంది. ప్రభుత్వం ఇచ్చే ఇళ్ళు కేవలం దంపతులకే కేటాయిస్తున్నారని ఒంటరి, స్త్రీలకు ఇళ్ళ కేటాయింపులో అన్యాయం జరుగుతున్నదని అలబడి సాగుతోంది.

1973–82 సం॥ మధ్య 50 లక్షలమంది స్త్రీలు మానభంగానికి గురి అయ్యారని, ఏటా 60 లక్షలమందికి పైగా భర్తలచేత దెబ్బలు తినే స్త్రీల సంఖ్య ఈనాడు ఇంకా విపరీతంగా పెరిగిపోతోందని గణాంకశాఖవారు లెక్కలద్వారా తేల్చి చెప్పారు. భర్తల హింసనుండి రక్షణ కోసం అమెరికా 2 వేల శరణాలయాలను స్థాపించింది. విడాకులు ఈనాటి సామాజిక చిహ్నం అయినా పరువుకోసం, వ్యక్తిత్వ వికాసంకోసం వారు పోరాడుతూనే వున్నారు. దేశంలో పారిశ్రామికీకరణ జరిగినా, సంపద పెరిగినా స్త్రీ పురుషుల మధ్య హెచ్చుతగ్గులు సమసిపోలేదనీ, కీలకస్థానాలన్నీ పురుషపరమై పోతున్నాయనే నిరాశతో ఆందోళనలు చేస్తున్నాయి స్త్రీ విమోచనోద్యమాలు. ఈ మార్పులను కోరుతున్నారు వారు. స్త్రీల చరిత్ర పురుషుల చరిత్ర విడివిడిగా వుండాల్సిందేనా అనేవి అమెరికన్ స్త్రీలను వేధిస్తున్న ప్రశ్నలు.

ఈనాడు రష్యను మహిళలకు ఇంటిపని పెద్ద సమస్యగా తయారయింది. రాజకీయంగా ప్రవేశం ఉన్నా, ఆర్థిక సమానత్వం ఉన్నా ఇంటిపనిలో భర్త పాలుపంచుకోకపోవటంవల్ల వారు మూడు నాలుగు

గంటలు అధికంగా ఇంటిపని చేయవలసివస్తోంది. టి.వి. చూడటంలోనో, క్లబ్బుల్లోనో, సాంస్కృతిక కార్యక్రమాలు తిలకిస్తూనో భర్త కాలక్షేపం చేస్తాడు. ఒక వైపు అదనపు పని, మరొకవైపు సాంస్కృతిక వెనుకబడిన తనం వీటితో విసిగి వేసారిపోయిన మాస్కో స్త్రీలు భర్తలనుండి విడిపోవ టానికి సిద్ధపడుతున్నారు. నగరంలో విడాకుల శాతం 50 దాకా పెరిగింది.

రెండు ప్రపంచ యుద్ధాల్లో పోరాడి అశేష త్యాగాలు చేసిన ఫ్రెంచి స్త్రీలకు 1944 దాకా ఓటు హక్కును ఇవ్వలేదు. స్వేచ్ఛా-సమానత్వ-సౌభ్రా తృత్వాలను నినాదాలుగా పలికిన ఫ్రెంచిదేశంలో స్త్రీలు రాజకీయంగా సమాన ప్రవేశం పొందలేకున్నారు. దిగువ సభలో 491 మందిలో వారు 28 మంది. ఎగువ సభలో 307 మంది సభ్యులలోవారు 0 మంది మాత్రమే. పురపాలక సంఘ సభ్యులలో 14 శాతం, పురపాలక సంఘాధ్యక్షులుగా 3 శాతం మాత్రమే స్త్రీ లున్నారు.

స్త్రీల ఆర్థిక స్వేచ్ఛను బాగా సంపాదించి ఇప్పుడు దానిని క్షీణింప చేసుకుంటున్న దేశంగా చైనాను తీసుకోవచ్చును. 1959 లో కమ్యూనులు ప్రవేశపెట్టారు. 1978 వరకు స్త్రీల ఆర్థిక స్వేచ్ఛ సాగింది. ఇపుడు కుటుంబ కమతాలుకూడా వెలుస్తున్నాయి. కాని కుటుంబ యజమాని పురుషుడు. ఎక్కడ పని చెయ్యాలో, ఎంతకాలం చెయ్యాలో, వరుమానం ఎలా ఖర్చు పెట్టాలో నిర్ణయించేది పురుషుడే. పైగా, ఒక బిడ్డకన్నా కనరాదన్న ప్రభుత్వ నిషేధంవల్ల ఆడపిల్లను కన్నతల్లిపై పితృస్వామ్య వ్యవస్థా వారసత్వంగా వచ్చిన ఒత్తిడి అధికమవుతున్నది చైనాదేశంలో.

శిశుమరణాల సూచివల్ల స్త్రీల ఆరోగ్యస్థితి తెలుస్తుంది ఆఫ్రికాలోని కాంగోలో వెయ్యికి 112 శిశుమరణాలుంటే సూడానులో 113 ఉంటున్నాయి.

దక్షిణ అమెరికా దేశాలలో గర్భస్రావం చేయించుకోటానికి స్త్రీకి హక్కులేదు. ఉత్తర, మధ్య ఆఫ్రికా ప్రాంతాలలో అనేక దేశాలలో, అంటే- ఘనా, కీన్యా, లైబీరియా, నైజీరియా, సోమాలియా, టోగో, ఈజిప్టు, ఇథియోపియా, జాంబియా లాంటి దేశాలలో స్త్రీల మర్మావయ విచ్ఛేదన

సాగుతున్నది. దీనివలన అనేకమంది స్త్రీలు చనిపోతున్నారు. ఇతరులు బాధలకు గురి అవుతున్నారు. దీనిని ఆ స్త్రీలపై అత్యాచారంగా ఇప్పు డిప్పుడే గుర్తిస్తున్నారు. కాని ఈ దురాచారానికి సంప్రదాయపు బలం ఇంకా ఉంది. ఈ సమస్యపై ప్రగతిశీల మహిళలు ఆందోళన సాగి స్తున్నారు.

ఆఫ్రికాలో 22 దేశాలలో ఎడారి ప్రాంతం పెరిగిపోతోంది. కుటుం బానికి నీరు తెచ్చేది స్త్రీలు. నీరు తీసుకురావటానికి వారు మూడు నాలుగు మైళ్ళదూరం ప్రయాణం చేయవలసి వస్తున్నది. చెలమలు త్రవ్వి నీరు తెస్తున్నారు. వంటకు కట్టెలు కరువయి వారు పడే యాతన వర్ణనాతీతం. అనావృష్టి వచ్చినపుడు అధికంగా బాధపడేది స్త్రీలు. కుటుంబాలను వదలి భర్తలు సంపాదనకోసం పట్టణాలకు వెళ్ళినపుడు గ్రామాలలో స్త్రీలు శర ణార్థులుగా మారిపోతున్నారు.

అధిక సంతానంవల్ల స్త్రీకి విశ్రాంతి తగ్గుతుందని, తద్వారా ఆమె సామాజిక సాంస్కృతిక జీవితానికి దూరమవుతుందని అందరికి తెలుసు. అయినా, అభివృద్ధి చెందిన దేశాలుగా పేరు ప్రఖ్యాతలు సంపాదించిన రష్యా, చెకోస్లోవేకియా దేశాలు ఎక్కువగా సంతానాన్ని కనమని స్త్రీలను ప్రోత్సహిస్తున్నాయి.

జపానులో, వెనిజులాలో లైంగిక వివక్షను నిషేధించారు. జపాను స్త్రీలు విదేశీయులతో కన్నపిల్లలకు ఇటీవలివరకు జపాను పౌరసత్వం లభించేది కాదు. అతి కష్టంమీద శాసనంద్వారా ఆ హక్కును జపాను స్త్రీలు సాధించుకున్నారు. కుటుంబ ఆర్థికశాస్త్రం స్త్రీలకు మాత్రమే అవసరమని బోధించేవారు. అది స్త్రీలకు మాత్రమే అవసరమయ్యే విషయం కాదని తీర్మానించి పురుషులకుకూడా బోధిస్తున్నారు. ఉద్యోగాల్లో లైంగిక వివక్ష, జీతాల్లో తేడాలు, పదవుల్లో ఏరివేతలాంటివి ఖండించాలని జపాన్ మహిళలు అర్జీలు పెట్టుకుంటే ప్రభుత్వం ఒక కమీషన్ నియమించింది. కాని అందులో ఒక స్త్రీకూడా లేకపోవడం గమనార్హం. జపాన్ స్త్రీలకు విద్యలో సమానత్వ మున్నా సాంఘిక, రాజకీయాల్లో లేదనే వాదన ప్రబలంగా వుంది.

బ్రిటన్‌లో – పదహారు సంవత్సరాలలోపు యువతులకు జన్మనిగ్రహ సమాచారం, సలహాలూ అందజేయవచ్చునా లేదా అనే విషయంపై తర్క వితర్కాలు జరుగుతున్నాయి. చివరకు అలాంటి సలహాలు వైద్యులు ఇవ్వవచ్చని ప్రభుత్వం తీర్మానించింది. కాని దీన్ని మతసంస్థలు వ్యతిరేకిస్తున్నాయి. ఉద్యోగాల విషయంలో పెద్ద పెద్ద ఉద్యోగాలు కీలక పదవులు స్త్రీలకు లభించడం లేదని మహిళోద్యమాలు ఆరోపిస్తున్నాయి. చిన్నదేశమైన బ్రిటన్‌లో షుమారు 300 స్త్రీ సంరక్షణాలయాలున్నాయంటే భర్తల హింస పూర్తిగా తగ్గిపోలేదని తెలుతుంది.

స్వీడన్‌లో-పురుషుడికి భార్య ప్రసూతి సందర్భంగా శలవు ఇచ్చినా, పిల్లను పెంచటానికి శలవులు ఇస్తున్నా ప్రభుత్వం సమానత్వ సిద్ధాంతాన్ని ఎంతగానో పాటించినా, రాజకీయరంగంలో స్త్రీల పాత్ర సమాన స్థాయికి అందుకోలేక పోతున్నది. స్వీడన్‌లో ఇటీవల వ్యాధి నిరోధానికి ప్రాముఖ్యత ఇస్తున్నారు.

ఎంతో ప్రగతిని సాధించిన నెదర్లాండు దేశంలోకూడా భార్యాభర్తా ఇద్దరూ నిరుద్యోగులయితే ఒక్కరికే నిరుద్యోగ భృతి ఇస్తున్నారు.

ఆస్ట్రేలియాలో–వనితలు పురుషాధిక్యతను సూచించే భాషను అంటే Man, Chairman, Policeman లాంటి లైంగిక వివక్ష పదాలను శాసనాల నుండి తొలగించాలని పిటిషన్లు పెట్టి వ్యవహారాలు నడుపుతున్నారు.

థాయ్‌లాండులో–బహు భార్యాత్వం వుండేది. భార్యను కొట్టవచ్చు, కొట్టినా ఆమె ఎదురు తిరుగరాదు. తిరిగిన స్త్రీ భర్త కాళ్ళపై పూలుపెట్టి నమస్కరించి, క్షమార్పణ కోరాలి. అది కొంతగా కొంత మారిపోయిందినాడు. థాయ్‌లాండు స్త్రీలు పోరాటాలవల్ల వారికి కొత్త వివాహ శాసనం వచ్చింది.

మలేషియాలో–వివాహ రథం కుంటుపడితే డైవోర్సు కోరవచ్చు కాని ఇది ముస్లిం స్త్రీలకు మాత్రం వర్తించదు.

బ్రెజిల్‌లో–స్త్రీలు పురుషుల మధ్య వివక్ష నిషేధం వుంది. కాని పరిపాలనా వ్యవస్థలో స్త్రీలు తక్కువ. శిశు మరణాలు వెయ్యికి 60 వుంటున్నాయి. స్త్రీ జీవితకాలం 65 సం॥లు.

జాంబియాలో-స్త్రీలు తమకు కాంట్రాక్టు పుచ్చుకునే హక్కు, ఆస్తి హక్కు, సంరక్షకత్వపు హక్కు కావాలని, ఆజన్మాంతం తాము పురుషుల రక్షణలో వుండమని మహిళోద్యమాల ద్వారా "డిమాండు" చేస్తున్నారు. మొజాంబిక్‌లో–దేశంలో కన్యాత్వ్రతువులు, కన్యాసుంకం, పడుపువృత్తి, బహు భార్యత్వం బాల్య వివాహాలు, స్వైరవిహారం చేస్తున్నాయి. స్త్రీలలో అక్షరాస్యత 18 శాతం మాత్రమే వుంది.

అనేక దేశాలలో వివాహ విషయమైన శాసనాలు మారుతున్నాయి. సయాం దేశంలో భార్యను భర్త త్రాడుతో కొట్టవచ్చు, ఇతరత్రా శిక్షించటానికి భర్తకు అధికారం వుండేది. అతి కష్టంమీద 1976 లో అ అధికారం ఆ స్త్రీలు తొలగించుకొన్నారు.

దక్షిణ అమెరికాలో–స్త్రీ పురుష వివక్ష వుంది. వివాహిత స్త్రీ వస్తువుల సందర్భంగా ఒప్పందం చేసుకోరాదు. గర్భస్రావం నిషేధం. అక్షరాస్యత పురుషుల్లో 89.9 స్త్రీలలో 88 2 వుంది. వున్నత విద్యల్లో అవకాశాలు స్త్రీకి వున్నాయి.

ఇప్పటికీ స్త్రీకి ఓటుహక్కు ఇవ్వని దేశం కువైట్. ఈనాటికీ మున్సిపాలిటీల్లో పోటీచేసే హక్కు, బ్యాంకు అకౌంట్లు పెట్టుకునే హక్కు స్త్రీకి ఇవ్వని దేశాలు ఇంకా కొన్ని వున్నాయి. మధ్యప్రాచ్యం స్త్రీల వెనుకబడినతనానికి మచ్చుతునక. ఎమెన్ దేశంలో బాల్య వివాహాలు సాగుతున్నాయి. సౌదీ అరేబియాలో-భర్త దగ్గర బంధువు అనుమతి లేనిదే స్త్రీ విదేశ ప్రయాణం చేయరాదు. కారు నడుపరాదు. ముసుగు లేనిదే బైటికి రారాదు. టీచరు, డాక్టరు తప్ప మరో వుద్యోగాన్ని చేపట్టరాదు. అన్న, తండ్రి, భర్తలాంటి పురుష తోడులేనిదే వీధిలోకి రావడాన్ని సమాజం నిరసిస్తుంది.

మాలివి దేశాన్ని విద్యా విషయకంగా వెనుకబాటుకు నిదర్శనంగా పేర్కొనవచ్చు బాలికలలో అరవై శాతం పాఠశాల ముఖం చూడనేలేదు. పాకిస్తాన్‌లో స్త్రీల అక్షరాస్యత 12 శాతం మాత్రమే వుంది. కొన్ని అరబ్బు దేశాలలో వ్యభిచార నిరోధం పేరుతో స్త్రీని అనాగరికమైన లక్షణంగా రాళ్ళతో కొట్టి చంపుతారు. కొరడాలతో కొట్టడం, జైళ్ళలో పెట్టడం సర్వ సామాన్యం. కాన్పు కష్టమైనా సంప్రదాయ ప్రసవాలను మంత్రసానులే చేస్తారు.

ఈజిప్టులో–స్త్రీలు మార్కెటింగు పని, పొలాల్లో పని, ఇంటి పని, వారే నిర్వహించాలి. ఆస్తిహక్కు వుంది. కాని దానిపై అధికారం పురుషులదే. ఇది మారాలని ఈజిప్టు మహిళలు అలజడి చేస్తున్నారు.

ప్రపంచంలోనే గొప్ప ప్రజాస్వామిక దేశంగా పేరుపొందిన భారత దేశంలో–స్త్రీలు ఆర్థిక, సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక రంగాలల్లో వెనుకబడి వున్నారనేది నగ్నసత్యం. 594 పార్లమెంటు సీట్లల్లో 49 మాత్రమే స్త్రీలున్నారు. అలాగే రాష్ట్ర శాసనసభల్లో 5 శాతం మాత్రమే వుంటున్నారు. ఉన్నతోద్యోగాల్లో, వృత్తి విద్యల్లో, సాంకేతిక విద్యల్లో స్త్రీల స్థానాలు అత్యల్పం. హక్కులను గురించిగాని, వాటిని అనుభవించే విధానాన్ని ఏమాత్రం తెలియని స్త్రీలు 80 శాతం వున్నారు ఇండియాలో మత ప్రభావం, సామాజిక నీతి స్త్రీలను పూర్తిగా అణచివేస్తోంది.

ఇండొనేషియాలో–నలుగురి భార్యలను చేసుకోవచ్చు ఆ శాసనాన్ని మార్పించారు. అయినా మరో అశనిఘాతమైన మార్పువచ్చింది. 1974 లో వచ్చిన శాసనం ప్రకారం భార్య గొడ్రాలయితే భర్త మరో స్త్రీని వివాహ మాడవచ్చును.

ఫిలిప్పైన్ దీవులలో–భర్త సమ్మతిలేకుండా 1950 కి పూర్వ భార్య తన ఆస్తిని నిర్వహించుకోరాదు. అన్యాక్రాంతం చేయరాదు. ఆమె ఎక్కడ కాపురం వుండాలో నిర్ణయించేది అతను. తనకు తగిన ఆదాయం వుంటే ఆమెను పనిచేయవద్దని భర్త అనవచ్చు. ఆ దేశంలో విడాకులు పొందటం చాలా కష్టం.

కెనడాలో-ప్రభుత్వం కట్టించే ఇళ్ళు ఒంటరిగా వుండే కన్యలకు, విధవలకు, విడాకులు తీసుకొన్న స్త్రీల కేటాయించటం లేదనీ, కాపురాలుండే దంపతులకే ఇస్తున్నారని బాధపడుతున్నారు.

మెజాంబిక్‌లో-కన్యాత్వ క్రతువులు, కన్యాసుంకం పడుపువృత్తి, బహుభార్యాత్వం, బాల్యవివాహాలు, వ్యభిచారం స్వైరవిహారం చేస్తున్నాయి. అక్షరాస్యత 18% వుంది.

కీన్యా దేశ స్త్రీలు బహు దూరంనుండి నీరు తెచ్చుకోవాలి. గొట్టపు బావులున్నా అవి ఏనాడు పనిచెయ్యటం లేదని, ఇది స్త్రీలపాలిట గొడ్డలి పెట్టని ఆరోపిస్తున్నారు.

ఫిలిప్పైన్సులో-కుటుంబ పోషణా భారమంతా స్త్రీదే. రాజకీయాధికారాలన్నీ పురుషపరమై వున్నాయని వారు బాధపడుతున్నారు.

అతి ముఖ్యమైన మరో సమస్య ఏమిటంటే మహిళా దశాబ్దాన్ని ప్రకటించిన U.N O. సంస్థలో 22.6% శాతం మాత్రమే స్త్రీలకు దక్కుతున్నాయి. ఆ ఉద్యోగాలయినా అతి తక్కువ తరగతులకు చెందినవై వున్నాయి. కారణం-ఈ వుద్యోగాలకు ఆయా దేశపు ప్రభుత్వాలు ఎంపిక చేసి పంపుతారు. విశ్వ విద్యాలయాలు కొందర్ని పంపుతారు. వారంతా పురుషులే కదా!

ఇలా చెప్పుకుంటూపోతే వందల సమస్యలు దొరుకుతాయి. ఇందు వల్ల ప్రపంచ అభివృద్ధి, ప్రపంచశాంతి కుంటుపడ్డాయని తేలింది. దేశ దేశాల మధ్య, స్త్రీ పురుషుల మధ్య హెచ్చుతగ్గులు, అసమానత్వం పెరిగిందని ఒక సర్వేలో తేలింది. ఈ సమస్యలను తొలగించాలనే ధ్యేయంతో U.N.O. వారు 1975 ను ప్రపంచ మహిళా సంవత్సరంగా వెల్లడించారు. 1976-85 ను మహిళా దశాబ్దంగా నిర్ణయించారు

---

# నా యూరప్ పర్యటనానుభవాలు

ఏ దేశమేగినా ఎందు కాలిడినా ఆడది ఆడదే! ఇది నా యూరప్ పర్యటనానుభవం వల్ల ఋట్టిపడింది. విదేశాలను మొదటిసారిగా చూసి నప్పుడు ప్రత్యేకానుభూతి కల్గుతుంది. ఒక సంస్కృతికి అలవాటైన వ్యక్తి భిన్న సంస్కృతిని చూచి విస్తుపోవడం సహజం. తర్వాత ఆ నూతన సంస్కృతిని నిశితంగా పరిశీలించి వాటి బాగోగులను, మంచి చెడ్డలను ఆకళింపు చేసుకొని అందులో సవ్యమైన జీవిత రీతులను తన దేశానికి, తన సమాజానికి ఎలా ప్రచారం చేయాలి అని తపనపడడం మానవ సహజం. ఇలాంటి అనుభూతులు కొన్ని పాశ్చాత్య ప్రపంచాన్ని తిలకించినప్పుడు నన్ను స్పృశించి గిలిగింతలు పెట్టాయి.

ఇటీవల ప్రపంచ హ్యూమనిస్టు మహాసభలు లండన్‌లో జరిగాయి. ఆ సభలకు వెళ్ళినప్పుడు కొన్ని పాశ్చాత్య దేశాలు సందర్శించి వాటి వారి సంస్కృతి, నాగరికతలను కొంత సర్వేచేయడం జరిగింది. ముఖ్యంగా పాశ్చాత్య స్త్రీల స్థాయి, వారి హోదాలను గురించి అడిగి తెలుసుకున్నాను. మీ దేశంలో స్త్రీల స్థానం ఎలా వుంది? అని నేను ప్రశ్నించినప్పుడు చైనా మహిళతో సహా చట్టాల్లో వున్న సమానత్వం ఆచరణలో జరగడం లేదని చెప్పారు వారూ సర్దుకొనిపోతూనే వుంటారు. ప్రతి కజ్జాకు, ప్రతి సమస్యకూ విడాకులు పుచ్చుకోరు. విదేశ స్త్రీలు బట్టలు మార్చినట్లు భర్తలను మారుస్తారనే అపప్రధ వుంది. ఇది సత్యదూరం. కాని మన దేశంలో స్త్రీ తన వ్యక్తిత్వాన్ని చంపుకొని సర్వస్వం భర్త కర్పించి నంతగా వారుండరు. దానికి కారణం విద్య. జపాన్‌లో 100%, రష్యాలో 99% అమెరికాలో 98% విద్య వుంటే ఇండియాలో స్వరాజ్యానంతరం 38 ఏళ్ళకుకూడా 21% మాత్రమే స్త్రీ విద్య పెరిగింది. అందువల్ల ఈ దేశంలో స్త్రీలకున్న మూఢాచారాలు, కులమతాల పట్టింపులు, జడసంస్కృతి, సాంఘిక నిమ్నోన్నతాలు విదేశ స్త్రీలలో అంతగా వుండవు. అయితే ఎంత మంది విడాకులు తీసుకుంటున్నారో, మళ్ళీ పెళ్ళిచేసుకున్న వారెందరో, పెళ్ళికాని తల్లుల శాతం, భర్తలచేత దెబ్బలుతినేవారి సంఖ్యల వివరాలు

ఆ దేశాలలో ఖచ్చితంగా లభిస్తాయి; కొన్ని ఆఫీసులు అదే పనిచేస్తాయి.

పాశ్చాత్య స్త్రీలు ప్రేమించి పెళ్ళిచేసుకుంటారు. ఏర్పాటు వివాహాలు (అరేంజ్డ్) ఎలా సాధ్యమని వింత ధోరణిలో తమ విస్మయాన్ని వెలిబుచ్చారు. బాల్యవివాహాలు, వరకట్నాలు అనాగరికమని విమర్శించారు. యాభై ఏళ్ళు పొరపొచ్చాలు లేకుండా, విడిపడిపోకుండా మీ దంపతులు ఎలా వుంటున్నారు అని ఆనందంతో నన్ను అడిగారు. వివాహానికి పూర్వం దాంపత్య జీవితాన్ని గడపడం వారు తప్పుగా భావించరు. పెళ్ళికాని తల్లికి సంఘ బహిష్కారం లేదు; ఆమె తలవంచాల్సిన పనిలేదు. వివాహం జరిగాకమాత్రం పరస్పర విశ్వాసంతో జీవిస్తారు. విడాకులు పొందిన స్త్రీ పురుషులు మళ్ళీ పెళ్ళాడి ప్రేమాభిమానాలతో జీవయాత్ర సాగిస్తారు. యువ జంటలు, మధ్యవయస్కులు, ముసలివారు సైతం జంటలు, జంటలుగా కలిసి తిరుగుతూ కనిపిస్తారు. రోడ్లపై, పార్కుల్లో, స్టేషన్లలో, ఆఖరికి "ఎస్కలేటర్ల"పై కూడా కౌగలించుకున్నా, ముద్దెట్టుకున్నా వింతగా చూడరు. అది వారి సంప్రదాయం. రైళ్ళల్లో, బస్సుల్లో స్త్రీలకు ప్రత్యేకంగా సీట్లు కేటాయింపు వుండదు. అలాగే క్యూల్లోకూడా స్త్రీ పురుషులు వేరువేరుగా నుంచోరు. మద్యపానం, సిగరెట్లు త్రాగటం స్త్రీలలోకూడా అధికమే. అది తప్పుగా భావించరు. "పొగత్రాగరాద"ని వున్నచోట్ల ఏ వ్యక్తి త్రాగని క్రమశిక్షణ వారిలో వుంది. బారులలో, కేఫ్‌లలో పానీయాలు పుచ్చుకుంటూ సమాన సంఖ్యలో స్త్రీలు కనిపిస్తారు. గంటల తరబడి పానీయాన్ని సేవిస్తూ కబుర్లు చెప్పుకుంటూన్న జంటలను పారిస్‌లో వందల సంఖ్యలో చూడగలం. మద్యపానానికి, రుజు ప్రవర్తనానికి, శీలానికి వారు సంబంధం ఏర్పరచుకోలేదు.

మొత్తంమీద స్త్రీలు పురుషులకన్నా తక్కువైనా కుటుంబ జీవితంలో పనిపాటల్లో చెరోపని చేసుకుంటారు అది వారు న్యూనతగా భావించరు. ఇల్లు శుభ్రంచేయటం, గిన్నెలు కడగటం, వంటల్లో సైతం పురుషులు పాల్గొంటారు. కుటుంబమంటే భార్యాభర్త 14 ఏళ్ళలోపు పిల్లలు మాత్రమే వుంటారు. పనిమనిషిని ఆ దేశాలలో భరించలేరు. సొంతంగా చేసుకున్నా కష్టమనిపించని సులువైన యంత్రాలు కోకొల్లలుగా

వుంటాయి. స్త్రీలు తమ సామాన్లు, సరుకులు తామే స్వయంగా చిన్న ట్రాలీపై తెచ్చుకుంటారు. స్త్రీ పురుషు లిద్దరూ కష్టపడి సంపాదిస్తారు; వారాంతానికి విహారయాత్రలకు పోతారు. సాధారణంగా ఇద్దరికన్నా కనరు. స్కాట్లెండు స్త్రీ ఒకామె మాత్రం నాలుగవ పిల్లను కనటానికి ఇష్ట పడుతున్నానని చెప్పింది. ఆయన్ని ఉద్యోగం చేయనిస్తున్నాను; నేను కుటుంబానికి న్యాయంచేస్తున్నా నన్నదొక నార్వే దేశస్తురాలు. ఇప్పటికీ ఇంటి విషయం, పిల్లల రక్షణా చూస్తే చాలదా అనే భావం కలవారు ఆ దేశాల్లోకూడా వున్నారు. మొత్తంమీద స్త్రీలు హెచ్చుసంఖ్యలో ఏదో ఒక వుద్యోగం చేస్తూనే వుంటారు. ఉద్యోగినుల పిల్లలను చూసేందుకు వేరే వసతి గృహా లున్నాయి. ఇళ్ళు, రోడ్లు, స్టేషన్లు, ఆఫీసులు చాలా శుభ్రంగా వుంచుతారు. పిల్లలకు ఈ అలవాట్లు తల్లులు శ్రద్ధతో నేర్పు తారు. నా ముఖంపై బొట్టుచూచిన ఇటలీ స్త్రీలు ప్రశ్నలవర్షం కురిపించారు. వాళ్ళుకూడా బొట్టుపెట్టుకొని నాతో ఫొటోలు తీయించు కున్నారు.

యూరప్ స్త్రీలు సైతం రాజకీయాల్లో విముఖతగా వున్నట్లు తోచింది. వైస్ ఛాన్సలర్లు, జడ్జీలు, మేయర్లు మంత్రులులాంటి వుద్యో గాల్లో పురుషులు వుంటారు. నర్సులు, టీచర్లు, సేల్సుగరల్సు, స్టెనోలు సెక్రెటరీలు వుద్యోగాల్లో స్త్రీలు వుంటారు. ఇది పురుషాధిక్యతకు నిదర్శనం. స్విజర్లెండులో 1971 దాకానూ ఫ్రాన్సులో 1946 వరకు స్త్రీలకు ఓటుహక్కు లేదు. ఇప్పటికీ కొన్ని మునిసిపాలిటీలలో స్త్రీలకు ఓటుహక్కు ఇవ్వలేదు. బ్రిటన్‌లో సోషల్ సెక్యూరిటీ స్కీము వుంది. వృద్ధులను ప్రభుత్వం భరిస్తుంది. వారి ఆరోగ్యం, వసతి, ఆహారాలేకాక అంత్యక్రియలను సైతం మంచి హోదాతో ప్రభుత్వమే నిర్వహిస్తుంది. అలాగే నిరుద్యోగులకు వారానికి 45 పౌన్ల ధనసహాయం లభిస్తుంది. పౌరులకు ఏ జబ్బువచ్చినా (కళ్ళజోడు, పళ్ళుకట్టుట) తప్ప సర్వవిధాలైన వైద్య సహాయం ఉచి తంగా ప్రభుత్వమే భరిస్తుంది. ఈ స్కీము చాలా అభినందనీయమని చెప్పాలి.

లండన్ మ్యూజియం, మార్క్సు చదువుకున్న పెద్ద లైబ్రరీ,

బకింగ్‌హామ్ ప్యాలెస్. నగరం మధ్యలో ప్రవహిస్తున్న థేమ్స్‌నది ప్రపంచ ప్రఖ్యాతిగన్న "బిగ్‌బెన్" చెప్పుకోతగ్గవి. మేడమ్‌టుసా వేక్సువర్క్సు (మైనపు బొమ్మలు) అన్నీ సజీవంతో, సహజ పోలికలతో కళకళలాడుతూ వుంటాయి. అందమూ, చదువూ, సంస్కారాలేకాక వారు భోగపురుషులు కూడాను. అడుక్కోవటం, గుడిశల్లో, పేవుమెంట్లపై నివాసాలు మచ్చుకైనా లేవు. హోటళ్ళల్లో, దుకాణాల్లో, పెట్రోలు బంకులలో సెల్ఫు సర్వీసు వుంటుంది. వారు కాన్‌స్టిట్యూషన్ వ్రాసుకోకపోయినా ఉన్న చట్టాలను అమలు పరుస్తారు. ట్రాఫిక్ రూల్సును విధిగా పాటిస్తారు. 30% ఆదాయపు పన్ను క్రింద కట్టాలి. కుటుంబేతరులకు ఇళ్ళల్లో ఆశ్రయం ఇవ్వరు. మత ప్రచారానికి కోట్లసంఖ్యలో ఖర్చు చేస్తారు. చర్చీలు నడిపే స్కూళ్ళకు ప్రభుత్వం గ్రాంట్సు ఇస్తుంది. కోట్ల వ్యయంతో నిర్మించిన సెంటు పీటర్, సెయింట్ వాటర్ డామ్ చర్చీలు మిరుమిట్లు గొల్పుతూ ప్రకాశిస్తూ వుంటాయి. చర్చీల ఆస్తులను పరిశ్రమల్లో పెట్టుబడిపెట్టి రాబడి పెంచుతారు. వారి మతపరమైనవి మూడు బాప్టిజం, వివాహం, అంత్యక్రియలు. ఈ మూడు ఘట్టాలు ముఖ్యంగా అమలు పరుస్తారు. ఆదివారం చర్చికొచ్చిన వారికి ఉచిత భోజనం వుంటుంది. హోటళ్ళలో బైబిలు గ్రంథాలు గదుల్లో పెడతారు. పాశ్చాత్యులు భౌతికవాదులని, ప్రాచ్యులు ఆధ్యాత్మికులనీ అపప్రథ మనలో వుంది. ఏ దేశంలో, ఏ నాగరికతలో, ఏ సమాజంలో మానవాభ్యున్నతి వుందో దానిని స్వీకరించటంలో ఏహ్యపడరాదు. అన్ని దేశాల్లో, అన్ని కాలాల్లో మంచీ చెడూ వుంటాయి. ఒకరి మంచిని మరొకరు అచరించటంలో తప్పులేదు. అందరం మానవులమే కదా!

పాశ్చాత్య దేశాల్లో స్త్రీ విమోచనోద్యమాలు బాగా పనిచేస్తున్నాయి. సర్వవిషయాల్లో పురుషునితో సమానత్వం వుండాలనేదే వారి ధ్యేయం. గృహిణులకు వేతనాలు వుండాలని, గృహిణిగా స్త్రీ చేసేపనికి పరిగణన వుండాలని ఇటీవల లండన్‌లో వెయ్యిమంది స్త్రీలు ప్రదర్శన జరిపిన విషయం మరువరానిది. జాతీయాదాయంలో వాటా ప్రతి వ్యక్తికీ ముట్టచెప్పాలని, అప్పుడే స్త్రీకికూడా ప్రభుత్వంనుండి ఆదాయం వస్తుందని ఆ స్త్రీలు వాదిస్తున్నారు.

అంతర్జాతీయ హ్యూమనిస్టు సభలకు 18 దేశాలనుండి వచ్చిన 120 మంది ప్రతినిధులలో దాదాపు సగంమంది స్త్రీలున్నారు. మహాసభలో హేతువాద వ్యతిరేక ధోరణులను, మూఢ నమ్మకాలపై, బాబాల బండారం పై, కృషి (Work) ని మానవవాద దృక్పథంతో ఎలా సాగించాలి? మతాలపై పిచ్చినమ్మకం మొదలైన ముఖ్య చర్చనీయాంశాలపై, ఏక గ్రీవ తీర్మానాలు మూడు. టెష్టుట్యూబ్‌బేబీల విషయంలో మతస్తుల వ్యతి రేకతను ఖండించారు. మానవ శరీరానికి వెలుపల టెస్టుట్యూబులో శుక్ల శోణితాల కలయిక అవినీతికి దారితీస్తుందనీ, దానిని బహిష్కరించాలనే రోమన్ కేథలిక్కుల వాదనను త్రోసిపుచ్చి తన వైజ్ఞానిక దృక్పధాన్ని వెల్లడించింది మహాసభ. రెండవ తీర్మానంలో విద్య, వృత్తి, సంతానం, గర్భస్రావం మొదలైన విషయాలలో స్త్రీకి నిర్నిబంధమైన పూర్తి స్వేచ్ఛ వుండాలని పేర్కొన్నారు. ఉద్యోగ స్థాయిలో స్త్రీ పురుషులకు మధ్య సమాన స్థాయి వుండాలన్నారు. అలా కానిచో ప్రజాస్వామిక ప్రక్రియ జయప్రదం కాదని వాదిస్తూ, స్త్రీలు అస్వతంత్రులుగా అజ్ఞానంలో వున్నంత కాలం సమాజం పురోగమించ జాలదంటూ స్త్రీ జాతి విముక్తి కోరింది మహా సభ. జనాభాను అదుపులో పెట్టటం అవశ్య కర్తవ్యమన్నారు. వస్తు సంపదకాక సామాజిక అవసరాలకు, జీవిత విధానపు మెరుగుదలకు ఉపక రించేపని (వృత్తి) అందరికి అందుబాటు కావాలని మరో తీర్మానం నెగ్గింది. లండన్ మహాసభలకు భారతదేశ హ్యూమనిస్టు సంఘంనుండి శ్రీ వి.యం. తార్కుండే, శ్రీ ఎం.వి. రామమూర్తి, నేనూ డెలిగేట్లుగా హాజరై చర్చల్లో పాల్గొన్నాము.

భారతదేశంకూడా పాశ్చాత్య దేశాలతో సరితూగాలనే వాంఛ నా విదేశ పర్యటనవల్ల నాలో ఉధృతమయింది. మరి మన సమాజంలో కూడా మార్పులేకపోలేదు. స్త్రీ విద్యా, ఉద్యోగాల స్థాయి పెరిగింది. కాని ఇది చాలదు. మౌలికమైన మార్పు అన్ని రంగాల్లో రావాలి. ఆనాడే స్త్రీ విముక్తి సిద్ధిస్తుంది, దానికి స్త్రీ పురుషు లిద్దరి సమిష్టి కృషి చాలా అవసరం.

("తెలుగు విద్యార్థి" మాసపత్రిక)

---

# సమస్యలు : సంస్కరణలు

సామాజిక మార్పును కోరేవి సాంఘిక సంస్కరణ. వ్యవస్థలో పాతుకుపోయిన ఆచారాలలో, సంప్రదాయాలలో మార్పును తెస్తుంది సంస్కరణ. కొన్ని సందర్భాలలో సమూల మార్పుకూడా వస్తుంది. అంతే కాదు. ప్రాథమిక విలువలనుకూడా ఛేదిస్తుంది సంస్కరణ. అందువల్ల సంస్కరణ తేవటం అతి కష్టమే కాదు; చాలా క్లిష్ట పరిస్థితులనుకూడా తెస్తుంది. సనాతనులకు సంస్కరణవాదులకు పోరాటాలు జరగటం చరిత్రలో చదివాము; ఈనాటికీ గమనిస్తూనే వున్నాం. కొందరు ప్రాణాలను సైతం త్యాగం చెయ్యక తప్పడంలేదు. సంస్కరణోద్యమాలకు సారథ్యం వహించటం సాహసమని చెప్పుకోవచ్చు. కనుకనే అతి కొద్దిమంది మాత్రమే సంస్కరణా కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు. అలాంటివారికే చరిత్రలో స్థాన ముంటుంది. అందులో స్త్రీలపై ధ్వజమెత్తిన సంప్రదాయాలపై పోరాడిన మహనీయులను విస్మరించలేము.

దేశ జనాభాలో సగంమంది స్త్రీలు. కనుక సామాజిక శ్రేయస్సును గురించి చర్చించేటపుడు విధిగా స్త్రీల శ్రేయస్సును గురించి ఆలోచించవలసి ఉంటుంది. ఏ సమాజంలోనయినా స్త్రీల స్థితిగతులు అనేక అంశాలపై ఆధారపడి ఉంటాయి. ఆ దేశపు శీతోష్ణస్థితి, ప్రకృతి వనరులు, సామాజిక వ్యవస్థ, ఆర్థిక ప్రాతిపదిక, మత, తాత్విక భావనలు, ఆలోచనాధార, సంప్రదాయాలు, ఆచారాలు, పరిపాలనా పద్ధతి, పరిపాలకులకు పాలితులకు ఉన్న సంబంధాలు, సాంస్కృతిక కళారీతులు, నాగరికత ఇలా ఎన్నో స్త్రీల పరిస్థితిపై ప్రభావం చూపుతాయి. కనుక మహిళల స్థానాన్ని గురించి పరిశీలించేటప్పుడు ఈ అంశాలను అధ్యయనం చేయటం అవసరం

సమాజం పరిణామ శీలం. మార్పు చెందుతూ వుంటుంది. మార్పు రెండు విధాలుగా ఉంటుంది. ఒకటి విప్లవాత్మకం, రెండవది సంస్కరణాత్మకం. విప్లవం అంటే హింస, దౌర్జన్యం స్ఫురణకు వస్తాయి. కాని నిజానికి విప్లవ మంటే బ్రహ్మాండమైన, సమూలమైన మార్పు. సంస్కరణ

స్వభావం పేరు. ఏ ఒక్క అంశములోనో లేక రెండు మూడు విషయాల పరంగానో మార్పు వస్తుంది. దానిని సంస్కరణ అంటాము. వాస్తవానికి విప్లవాలు పదేపదే రావు. అప్పుడప్పుడు వస్తాయి. విప్లవానికి ముందు ఎంతోకాలం సంస్కరణ సాగినా విప్లవం హఠాత్తుగా వచ్చినట్లు కన్పడుతుంది. సంస్కరణది నత్తనడక. మెల్లగా, తాపీగా సాగుతుంది చాలకాలం. సంస్కరణోద్యమాలను అధ్యయనం చెయ్యకుండా విప్లవాలను అర్థం చేసుకో ప్రయత్నించడం వృథాప్రయాస.

భారతదేశంలో ముఖ్యంగా మూడు మతాల వారున్నారు. హిందూ, ముసల్మాను, క్రైస్తవ మతాలు అవి. బౌద్ధ, జైన, జొరాస్ట్రియను మతాల వారు చాల స్వల్ప సంఖ్యలో ఉన్నారు. మన దేశం లౌకిక రాజ్యమని పేర్కొంటున్నాము. లౌకికరాజ్య భావనపై అనేక భావ భేదాలున్నాయి. ఏదైనా పరిపాలకుల ఆలోచనారీతి ప్రకారం అన్ని మతాలను సమదృష్టితో చూడటం లౌకికరాజ్య లక్షణం. మతానికి రాజ్యానికి ముడిపెట్టరాదనేది మాబోటివారి ఆలోచన. పరిపాలకుల భావాన్ని కొనసాగిస్తే పైకి చెప్పినా ఇది ఆచరణలో హిందూరాజ్యంగా మిగులుతున్నది. అన్ని మతాలను సమదృష్టితో చూచే ప్రయత్నంలో అధిక సంఖ్యాకుల మతమయిన హిందూ మతానికి అగ్రస్థానం వస్తున్నది. మానవ దృష్టితో స్త్రీల హక్కుల పరిరక్షణ సంగతి మరచిపోయి అల్ప సంఖ్యాకుల మత ధర్మశాస్త్రాలను సవరణ చేయటానికి కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు తటపటాయిస్తున్నాయి.

ఇంకొక్క విషయం మనం గమనించాలి. హిందూమతం భారతదేశంలో ఆవిర్భవించింది. ఇస్లాంమతం మధ్యప్రాచ్యం నుండి, క్రైస్తవం పాశ్చాత్య దేశాలనుండి మనకు దిగుమతి అయినాయి. స్త్రీల జీవితాలను చాలవరకు నిర్దేశించే వివాహం, విడాకులు, వారసత్వం, దత్తత, మనవర్తి, సంరక్షకత్వం, వరకట్నం, స్త్రీ ధనం ఇత్యాది అంశాలను గురించిన మత ధర్మ శాసనాలు హిందువుల పరంగా మారాయి. ముసల్మానులు, క్రైస్తవులకు సంబంధించి చాలకాలంనుండి మార్పులు లేకుండా ఉన్నాయి. ముస్లింలా చివరిసారిగా 1939 లో మారింది. క్రైస్తవుల శాసనాలు 19 వ శతాబ్దం నాటివే ఇంకా అమల్లో వున్నాయి.

భారతీయ సంస్కృతి అంటే వివిధ మతాల, జాతుల సంస్కృతుల సమ్మేళనమనే అభిప్రాయం వెలువరిస్తున్నారు కొందరు. హిందూమత ప్రధానం కలిగిన భారతీయతను అధ్యయనం చెయ్యాలంటే వేదాలవరకు షుమారు 5 వేల ఏండ్ల వరకు వెనుకకు వెళ్ళాలి. ఇస్లాం ప్రభావం ముస్లిం రాజుల దండయాత్రనుండి, క్రైస్తవ ప్రాబల్యం ముఖ్యంగా 19వ శతాబ్దం నుండి పరిశీలిస్తే చాలును.

భారతీయ లేక హిందూ సంస్కృతి చాల గొప్పదని, విశిష్టమైనది; విలక్షణమయినది అని చెప్పడం పరిపాటి, ఇది చాలా పొరపాటు అభిప్రాయం. సమాజంలో జనులు ఎలా జీవనోపాధిని సంపాదించుకుంటున్నారనేది కూడా ప్రధానాంశమే కనుక వేటాడి జీవించేవారు, కాయగూరలను ఏరుకొని ఆహారం సంపాదించుకునే వారు, పశుపోషణపై ఆధారపడేవారు, వ్యవసాయం ప్రధానవృత్తి కలిగినవారు, యంత్రాల సహాయంతో వస్తూత్పత్తి చేసేవారు వీరు ఆయా సమాజాలలో అధిక సంఖ్యలో ఉంటునప్పుడు వారి ఆహార సంపాదనా పద్ధతులు చాలవరకు ఆయా సమాజాలను ప్రభావితం చేస్తాయి. కనుక ఒకే వృత్తి ప్రధానంగా ఆ సమాజాలకు జీవగర్ర అయినపుడు అలాంటి సమాజాలు వివిధ ఖండాలలో, వివిధ దేశాలలో ఉన్నా కూడా ఆ సమాజాలకు పోలిక లుంటాయి. ఉదాహరణకు ప్రాచీన భారతదేశ సామాజిక రీతులకు, గ్రీకు సామాజిక రూపాలకు పోలికలు ఎక్కువగా కనిపిస్తాయి.

హిందూ సంఘంలో పారలౌకిక దృష్టి మెండని పాశ్చాత్య ప్రపంచంలో లౌకిక దృక్పథం అత్యధికమని ఒక ప్రచారం సాగుతున్నది. అది పెద్ద పొరపాటు ధోరణి. హిందూ సంఘంలో ఇహలోకదృష్టి లేకపోలేదు. కౌటిల్యుని అర్థశాస్త్రం (క్రీ. పూ. 400), వాత్స్యాయనుని కామశాస్త్రం (క్రీ.త. 1, 2 శతాబ్దాలు), శూద్రకుని మృచ్ఛకటికం (క్రీ.పూ. 2, 3 శతాబ్దాలు) కేవలం లౌకికపరమైన గ్రంథాలు. అవి ఆనాటి సామాజిక గతిని నిర్దేశించాయి; ప్రతిఫలించాయి. ఇక ముస్లింలకు, క్రైస్తవులకు దేవుని గురించి, పరలోకాన్ని గురించిన ఆలోచనలే హెచ్చుగా కొనసాగుతున్నాయి.

ఒకదేశపు నాగరికతను, సంస్కృతిని మదింపు వేయాలంటే ఆ దేశంలో మహిళల స్థానాన్ని గమనిస్తే చాలునని ప్రాచీన సమాజాలను అధ్యయనం చేసిన హెన్రీ మెయిన్ అన్నాడు. ఇది చాలావరకు సత్యము. కనుక మన దేశ స్థితిగతులను స్త్రీల పరంగా మనం పరిశీలిద్దాం. అదీగాక మహిళోద్యమ కార్యకర్తలకు అది చాల ప్రధాన విషయం.

వేదకాలంలో స్త్రీ సంపూర్ణ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను అనుభవించిందని, స్త్రీ పురుష సమానత్వం వెల్లివిరిసిందని, స్త్రీలపట్ల వివక్ష లేనేలేదని కొందరు బుద్ధిపూర్వకంగా విశ్వసించి, మరికొందరు పొరపాటు అవగాహనతో, ఇంకా కొందరు స్వార్థబుద్ధితో పదేపదే ప్రకటిస్తున్నారు. ఇందలి సత్యాసత్యాలను పరిశీలించటం అవసరం. వేదకాలపు సమాజాన్ని, ఆచారవ్యవహారాలను, నాగరికతను,సాంస్కృతిని మనం మరల ఈదేశంలో సృష్టించలేము. కాలం గడిచింది. జీవనరీతులు మారాయి. ఆలోచనా విధానాలు వేరయినయి. సామాజిక వ్యవస్థ మరోరీతిగా చలామణీ అవుతోంది అందుచేత వైదిక సమాజాన్ని పరిశీలించటం కేవలం పరిశోధన అవుతుంది. అయినా జాత్యహం కారంనుండి, అనవసర అపోహలనుండి బయటపడాలంటే అది చాలా అవసరం. కనుక పూర్వచరిత్ర గమనిద్దాం.

**వేదకాలం :-** ముఖ్యంగా మనం ఋగ్వేదకాలాన్ని (క్రీ.పూ. 4000 సం.) అధర్వణ వేదకాలాన్ని గమనించాలి. అయితే మున్ముందుగా ఒక అంశాన్ని విస్మరించరాదు. మాతృస్వామ్య వ్యవస్థను విడనాడి భారతదేశం పితృస్వామ్య వ్యవస్థలో అడుగిడుతున్న దశలో ఆర్యులు మన దేశానికి వచ్చారు. అంతకుముందు స్త్రీ దేవుళ్ళు పూజలందుకునేవి. ఈనాటి గంగమ్మలు, పోలేరమ్మలు ఆ సంప్రదాయ అవశేషాలు. ఋగ్వేద కాలంలో స్త్రీలపట్ల విద్య, మత ధర్మ కార్యాలు మొదలగు విషయాలలో పెద్దగా వివక్ష, చిన్నచూపులేవు. కాని వివక్ష లేదనడం పొరపాటు. పురుష సంతతి కావలెననీ ప్రార్థనలు కోకొల్లలుగా గోచరిస్తాయి. స్త్రీకి పురుషుని పరంగానే ప్రతిపత్తి ఉండేది. (ఉదా :- ఇంద్రుని భార్య ఇంద్రాణి). పురుషునకు ప్రముఖ స్థానం. స్త్రీకి, అతనిపై ఆధారపడి, అతనికోసం

జీవించే ప్రతిపత్తి ఇచ్చారు ప్రాచీనులు. యువతి యువకుని భర్తగా ఎంపిక చేసుకోవచ్చును. కాని తండ్రి అమోదించి కన్యాదానం చేయాలి అంటే కన్య పురుషుడైన తండ్రి ఆస్తి. అతడు ఆమెను వరునికి దానం చెయ్యాలి అంటేఆమెపై పెత్తనాన్ని వరునికిఇవ్వటం అన్నమాట. ఋగ్వేదపు చివరి రోజులలో పుత్రిక పుట్టడాన్ని గురించి భయపడడం సాగించారు. ఐతరేయ బ్రాహ్మణంలో పుత్రిక "అనర్థం" అనే అర్థంలో ఒక కథ వుంది. అథర్వణ వేదకాలంలో గర్భస్థ పిండం విధిగా పుత్రుడు కావాలని ప్రార్థించారు. అనాడు రెండురకాల భార్య లుండేవారు, ఒకరు గృహిణి, మరొకరు సభలలో సమావేశాలలో పాల్గొనే ఆమె. (డెమోస్తనీసు, రోమను సమాజం). పుత్రుడు ఉంటే పుత్రికకు భాగంలేదు. ఒక రకమైన వరకట్న విధానం అమలులో వుంది. సామాన్యంగా స్త్రీలు గృహిణులుగా ఉండేవారు. చదువు మామూలుగా కొద్దిపాటిదే. భోజనం తయారుచేయటం, వడ్డించటం స్త్రీ బాధ్యతలు. తల్లికి బాగా గౌరవం; భార్యకు కొంత గౌరవం. ఒక కుటుంబానికి వచ్చిన స్త్రీ ఆ కుటుంబపు ఆస్తి. బహుభార్యత్వం, బహుభర్తృత్వం వున్న రోజులవి. దేవదాసీలు వుండేవారు. అథర్వణ వేదకాలంనాటికి ఆడబిడ్డ కలుగరాదని ప్రార్థనలు చేశారు. స్త్రీ ప్రతిపత్తిలో మార్పు వచ్చింది. ఋగ్వేదకాలంలో స్త్రీ జీవిత సహచరి. అథర్వణ వేద కాలానికి భర్తను పొందటం, మంచి పుత్రులను కనటం ఆమెకు జీవిత ధ్యేయాలు అయినాయి. వివాహం ప్రతి స్త్రీకి తప్పనిసరి అయింది. వరదక్షిణ వుండేది. భర్తకు విధేయురాలపై మసులుకోమని చెప్పారు. పురుషుడు స్త్రీని తన దానిని చేసుకోవటానికి ఆమెపై ఆంక్షలు విధించసాగాడు. బహుభార్యాత్వం అమలులో వుంది. పుత్ర సంతానం కలుగకపోతే పురుషుడు మరో వివాహం చేసుకునేవాడు.

## సంహితలు బ్రాహ్మణములు (క్రీ.పూ. 600) :

స్త్రీ కొన్ని సమయాలలో - ప్రసవం, ప్రకృతి సిద్ధంగావచ్చే ఋతుస్రావ సమయాలలో అపవిత్రురాలు. క్రైస్తవ మత ప్రామాణిక గ్రంథమైన పాత నిబంధనలోనూ ఇలాంటిది వుంది. పుత్రిక వద్దని ప్రార

నలు చేశారు. పురుషుడు చేసే కర్మకాండలో స్త్రీకి తావుండేది. కాని కర్మకాండ యావత్తూ పురుషుడే జరిపిస్తాడు. స్త్రీలు నలుగురూ కలుసుకునే సమావేశాలకు పోరాదు. స్త్రీ మానవ సమాజంలోని చెడుగులలో ఒకటి. (మైత్రాయిణి సంహిత). దుర్మార్గుడైన పురుషునికంటే స్త్రీ నీచమైనది (తైత్తిరీయసంహిత, శతపథ బ్రాహ్మణం.) భర్తభుజించిన తరువాతనే భార్య భోజనం చేయాలి (శతపథ బ్రాహ్మణం) భర్త మాటకు బదులు చెప్పని భార్య పొగడ్తకు అర్హురాలు. (ఐతరేయ బ్రాహ్మణం) స్త్రీలు శక్తిలేనివారట. కన్యాశుల్కం ఉన్నది. అంటే, తండ్రి కన్యమ అమ్మేవాడు. "పురుషులకు పుట్టుక నిమ్ము" అని మంత్ర బ్రాహ్మణం స్త్రీని ఆదేశించింది. "నా ఆజ్ఞలను నిండు హృదయంతో నీవు పాటింతువుగాక" అని అదే బ్రాహ్మణంలో చెప్పారు.

## సూత్రాలు, స్మృతులు :

బహుభార్యాత్వం అమల్లో వుండేది. పాణిగ్రహణం ద్వారా తండ్రికి తన కుమార్తెపై గల ఆధిపత్యం భర్తకు బదిలీ అయ్యేది. భర్తకు సామాజికపరంగా ఉన్న ప్రతిపత్తి భార్యకు లభించేది. స్త్రీలు సాంస్కృతిక కార్యకలాపాలలో పాల్గొనేవారట. 12 రకాల పుత్రులను గుర్తించింది సమాజం. అవివాహిత స్త్రీలు ఉండేవారు.

గృహ్య సూత్రాలు (క్రీ. పూ. 6వ శతాబ్ది మొదలు బౌద్ధం వచ్చే వరకు) వచ్చాయి. కుటుంబం సమాజానికి ప్రాతిపదిక అయింది. కుల వ్యవస్థ గట్టిపడింది. ప్రవేశ్ళు తన్నుకొన్నది. అనులోమ వివాహాలు ("ఉన్నత" జాతి పురుషుడు "తక్కువ" జాతి స్త్రీని వివాహమాడటం) ఉండేది. బ్రాహ్మ, దైవ, ప్రాజాపత్య, ఆర్ష, గాంధర్వ, అసురవివాహాలు 6 రకాలు ఉండేవి. పెండ్లికి పూర్వం వధువు వరుని చూడరాదు. (పెండ్లిలో తెర పద్ధతి అధర్వణవేద కాలానికే వచ్చింది.) స్త్రీకి బ్రహ్మచర్యం 10–12 సం॥ వరకు (కాత్యాయన గృహ్య సూత్రం) పుత్రుని కని ఇవ్వగలిగినప్పుడు భార్యను భర్త విడనాడరాదు (ఆపస్తంభ సూత్రం) ఆపస్తంభుడు

స్త్రీలకు కొంత రక్షణ ఇచ్చాడు. వివాహ వ్యవస్థ గట్టిపడింది. బహుసంఖ్యాకులు ఏకపత్నీవ్రతులుగా వుండేవారు. రాజులు, ధనికులు, సామంతులు వారికి ఈ నియమం విధిగా లేదు. బహుభర్తృత్వ ఆచారం నశించింది. భార్గవ ధర్మసూత్రం ప్రకారం విధవరాలు పవిత్రాగ్నికి విధిగా పూజలు చేయాలి. విష్ణు ధర్మసూత్రం ప్రకారం ఆమె సహగమనం చేయాలి. కాలం మారుతున్నకొద్దీ ఈ నియమాలను కొంత మార్పు చేశారు. బోధాయనుడు, వశిష్టుడు వితంతువుకు (కొలది కాలం కాపురంచేసిన యవ్వనవతికి) పునర్వివాహం చేయవచ్చన్నారు. గౌతముడు వితంతువుకు భర్త ఆస్తిలో హక్కు ఇచ్చాడు. నియోగ పద్ధతిని (భర్త చనిపోతే భర్త సోదరుని ద్వారా సంతానం కనడం) గౌతముడు ఆమోదించాడు. ఇలాంటిది పాత నిబంధన కాలంలో యూదులలోకూడా ఉన్నది. మామూలుగా స్త్రీలు ఇళ్ళను అంటిపెట్టుకొని ఉండేవారు. కాగా ఉత్సవాలు, పండుగలు, పబ్బాలలో బయటికి వచ్చేవారు. వివాహం పవిత్ర బంధం అయింది. ఉపనయం స్త్రీకి లేదు. ఇంటిలో స్త్రీకి గౌరవప్రదమైన స్థానం ఉన్నది. "పుంసవనం" పుత్రుడు కావాలనే వ్రతం ప్రచారంలో అధికంగా వుండేది.

స్మృతులు క్రీ.పూ. 2వ శతాబ్దంతో ప్రారంభమయ్యాయి. సూత్రాలు అంతకుపూర్వపువి ఆచరణలో వుండేవి. వివాహం గౌతముని ధర్మశాస్త్రం ప్రకారం సాంఘికమైన ఒడంబడిక (క్రీ.పూ. 7వ శతాబ్దం). కులంలోనే వివాహం కష్టము. నియోగపద్ధతి ద్వారా ఇద్దరు పుత్రులను కనవచ్చును. పుత్రుడు, పుత్రిక లేనప్పుడే భర్త ఆస్తి భార్యకు చెందుతుంది. పుత్రుడు లేకపోతే పుత్రిక వారసురాలు. అనేక రకాల పుత్రులను గుర్తించాడు. వారికి తండ్రి ఆస్తిలో హక్కు వస్తుంది. వర్ణాంతర వివాహాలు ధర్మసమ్మతం. భర్త అనుమతి లేనిదే స్త్రీ పవిత్ర కర్మలుకూడా చేయరాదు. (ఇలాంటి నియమం పాత నిబంధనలో ఉన్నది). భర్తయెడల విశ్వాసం, అతనియెడల కర్తవ్యం, అంతా అతడి తోడిదే లోకం అయింది భార్యకు. బోధాయనుడు తెలుగువాడని నమ్మవచ్చు. 8 రకాల వివాహాలను గుర్తించాడు. "స్త్రీలకు స్వాతంత్ర్యం లేదు. ఎవరో ఒకరు ఆమెను వివిధ దశలలో రక్షించా" లన్నాడు. గొడ్రాలు, కేవలం ఆడపిల్లలను కనే స్త్రీని, జగడాల

మారిని వదిలి పురుషుడు పునర్వివాహం చేసుకోవచ్చునట. భార్య భర్తను వదలివేయటానికి అవకాశం లేదు. స్త్రీలకు తల్లికావటం ముఖ్యం. మత పరమైన కార్యక్రమాలలో ఆమెకు సంబంధం లేదు. పవిత్ర గ్రంథాల జోలికి ఆమె పోరాదు. నియోగ పద్ధతిని ఆమోదించాడు. వర్ణాంతర వివాహాలను ఆమోదించాడు. స్త్రీకి వారసత్వ హక్కు లేదన్నాడు. కుమార్తె కుమారునికి వారసత్వ హక్కు ఇచ్చింది ఇతడే. బహు భార్యాత్వం ఉండేది. స్త్రీకి వ్యక్తిత్వం పోయింది.

## ఆపస్తంభ సూత్రం (క్రీ.త. 510 సం.) :-

మతపరమైన కార్యక్రమాలకు స్త్రీని దూరంచేయలేదు. నియోగ పద్ధతిని నిషేధించాడు. తప్పుచేసిన స్త్రీయెడల దయ చూపించాడు కాని శూద్రుడైన పురుషుడు "ఉన్నత" జాతి స్త్రీతో వ్యభిచరిస్తే అతనికి మరణ దండన ఉండాలన్నాడు. స్త్రీలను వ్యామోహ కారణాలుగా పేర్కొన్నాడు. స్త్రీలకు ఆస్తిహక్కు ఇవ్వలేదు. స్త్రీ పిండప్రదానం చేయటానికి అనర్హురాలు. వర్ణాంతర వివాహాలను నిషేధించాడు. శూద్రులతో కలసి వివాహం కాని, కలసి భుజించటం కాని పనికి రావన్నాడు. శూద్ర స్త్రీ ఎదుట మంత్రాలను ఉచ్చరించరాదట.

## వశిష్టుని ధర్మసూత్రం :-

1. కొన్ని రోజులలో స్త్రీలు అపరిశుద్ధులు. 2. స్త్రీలు స్వతంత్రులు కారు, పురుషులే యజమానులు. స్త్రీకి పునర్వివాహం చేసుకునే హక్కు ఉన్నది. నియోగ పద్ధతిని ఆమోదించాడు. కొన్ని సందర్భాలలో భర్తను కాదని మరొకనిని స్త్రీ వివాహ మాడవచ్చును. (ఉ॥ దేశాంతరం వెళ్ళి చాలకాలం తిరిగిరాకపోతే). భర్తను చంపటం, బ్రాహ్మణుని చంపటం, పిండాన్ని చంపటం ఈ మూడు మహాపాపాలట.

## మనుధర్మశాస్త్రం (క్రీ.పూ. 105 సం॥) :-

12 రకాల పుత్రులను గుర్తించాడు మనువు. స్త్రీకి భర్తచేత పోషింప బడే హక్కు మాత్రమే ఉన్నది. స్త్రీని బాల్యంలో తండ్రి, వయస్సులో ఉన్నపుడు భర్త, వృద్ధాప్యంలో ఉన్నపుడు పుత్రుడు పోషించాలి. ఆమె

ఏనాడూ స్వతంత్రంగా ఉండటానికి అనర్హురాలు. ఆమె తన తండ్రినుంచి, భర్తనుంచి, పుత్రులనుంచి విడిపోరాదు. ఇంటిపనిలో చాకచక్యం చూపాలి. భర్తకు విధేయురాలుగా ఉండాలి. స్త్రీలకు ఈ విధులు చెప్పి స్త్రీలను గౌరవించమని పురుషులకు హితోపదేశం చేశాడు. నిర్బంధింపబడే స్త్రీలు రక్షితరాండ్రు కాడన్నాడు. అంటే స్త్రీని బలవంతంగా విధేయురాలిని చేసుకోలేడు గనుక మంచి మాటలతో, సొమ్ములూ చీరెలూ ఇచ్చి, ఇంట్లో కాస్త స్థానం ఇచ్చి మచ్చిక చేసుకోమని పురుషులకు సలహా చెప్పాడు మనువు. ఇది చాల తెలివైన పని. స్త్రీలకు అలా "బ్రెయిను వాష్" చేశాడు. చెయ్యమని భర్తలకు సలహా చెప్పాడు. మరి మహామేధావి కదా! వివాహం పవిత్ర బంధం అట. పరలోకంలో మోక్షప్రాప్తికి సాధన మట. నియోగాన్ని కొన్ని నిబంధనలకు లోబర్చి ఆమోదించాడు. విధవ తువు భర్త కనిష్ఠ సోదరుని తప్ప మరెవ్వరినీ పెండ్లాడరాదని శాసించాడు. పుత్రిక వారసురాలు కాదు. కాని ప్రేమపాత్రురాలట. "భార్యపట్ల నిర్దయ చూపిన మనువు, పుత్రికపట్ల కొంత ఆప్యాయతను చూపాడు." పురుషునికి ప్రాధాన్యత కల్పించాడు మనువు.

## యాజ్ఞవల్క్యస్మృతి (క్రీ.శ. 101–300) :

యుక్త వయస్సు వచ్చిన పిల్ల భర్తను నిర్ణయించుకోవచ్చును. నియోగ పద్ధతిని అంగీకరించాడు. మగబిడ్డలు లేకుండా చనిపోయిన వారికి భార్య, కుమార్తె వారసులన్నాడు. కూతురుకన్న ముందు స్థానం భార్యకు ఇచ్చాడు. తండ్రి తర్వాత ఆమెకు స్థానం వచ్చింది.

## పరాశరస్మృతి (క్రీ.శ. 800–900) :

స్త్రీలకు అనుచిత సమయాల నిర్ణయం. సహగమనం చేసిన స్త్రీకి స్వర్గలోక నివాసం కొన్ని సందర్భాలలో, పతి దేశాంతం పోయి వార్త తెలియకపోయినా, మృతిచెందినా, సన్యసించినా, నపుంసకుడైనా, పతితుడైనా, ఆ స్త్రీ మరొకరిని వివాహమాడవచ్చును. పెండ్లికాని కన్య రజస్వల అయితే తల్లిదండ్రులకు అన్నకు నరకమట. ఆడపిల్లకు సరి

యైన కాలంలో వివాహం చేయాలన్నాడు మనువు. అంతటితో ఆగక 30 సం॥ పురుషునికి 12 సం॥ పిల్లను, 24 సం। పురుషునికి 8 సం। పిల్లను పెండ్లి చేయమన్నాడు. 12 సం। లోగా పెండ్లి చేయమని యాజ్ఞవల్క్యుడు అన్నాడు.

## నారదస్మృతి (క్రీ.శ. 100-400) :

"స్త్రీలు జానిసలలాగానే స్వాతంత్ర్యానికి అనర్హులు" అన్నాడు. పునర్వివాహం అనుమతించాడు. గాంధర్వ వివాహాన్ని అనుమతించలేదు.

## పురాణాలకాలం (క్రీ.శ. 400 600) :

బాల్య వివాహాలు స్థిరపడినాయి. 5, 6 సంవత్సరాలకే వివాహాలు· వివాహం తప్పనిసరి. కట్నాలు వచ్చాయి. వితంతువుకు వివాహమాడే హక్కు లేదు. సతీసహగమనం హెచ్చు పెరిగింది. ఆడపిల్లలకు చదువు లేదు. దేవదాసీ పద్ధతి పెరిగింది.

## కౌటిల్యుని అర్ధశాస్త్రం (క్రీ.పూ. 4 వ శతాబ్దం) :

కౌటిల్యునికి మరోపేరు చాణక్యుడు. చంద్రగుప్తుని రాజును చేసి మౌర్య సామ్రాజ్యాన్ని నడిపినవాడు. భార్యలకు కొంత స్వతంత్రత ఇచ్చాడు. కొన్ని సందర్భాలలో పునర్వివాహపు హక్కును గుర్తించాడు. మామూలుగా అందరికీ ఏకపత్నీవ్రతం. కొన్ని సందర్భాలలో బహుభార్యాత్వం. కొన్ని సందర్భాలలో విడాకులకు (రాజద్రోహం చేసినవానిని, పరదేశం వెళ్ళినవానిని, తన ప్రాణానికి ప్రమాదం కల్గించినవానిని, పతితుని, నపుంసకుని వదలివేయవచ్చు). వీలు కల్గించాడు. భార్యను శిక్షించటానికి (బెత్తంతో, తాడుతో, చేతితో 3 దెబ్బలు) భర్తకు అధికారం ఉన్నది. భర్త పరదేశం వెళ్ళి తిరిగి రాకపోతే భర్త సోదరుని వివాహమాడవచ్చుట. పదిరకాల పుత్రులను గుర్తించాడు. పుత్రులు లేకపోతే చనిపోయిన పురుషుని ఆస్తిని సోదరులు, కుమార్తెలు పంచుకోవాలన్నాడు. వర్ణాంతర స్త్రీలను భార్యలుగా పొందితే వారికి కల్గే సంతానానికి భాగనిర్దేశం చేశాడు. స్త్రీలకు కొన్ని ఉద్యోగాలను పనులను

(గూఢచారి) కేటాయించాడు.

## వాత్స్యాయన కామసూత్రం (క్రీ.శ. 1, 2) :

గుప్తరాజుల కాలంనాటి వాడు వాత్స్యాయనుడు. అతడు నాగరికుని వర్ణించాడు. నాగరికుని భార్య ఏమిచేసినా భర్త ఆజ్ఞకు కట్టువడి ఉండాలి. అతని ఆనందంకోసం ఆమె బ్రతకాలి. నాగరికునికి ఆనందాన్ని కూర్చే స్త్రీ అతని భార్యకాదు, మరొక స్త్రీ. ఆమె విలాసవతి. స్త్రీ తనకుగా పురుషుని భర్తగా ఎంపిక చేసుకోవచ్చు. బహు భార్యాత్వం చలామణీ అయ్యేది. వితంతు వివాహాలు జరుగుతూ ఉండేవి. సతీ సహగమనం అమలులో ఉన్నది. భర్త భార్యకు దైవస్వరూపం. అన్నింటా భార్య భర్తకు అనుకూలంగా ప్రవర్తించాలి. స్త్రీలు చతుష్షష్టి కళలను అభ్యసించేవారు. మోక్షాన్ని మానవ జీవిత లక్ష్యాల జాబితానుంచి తీసివేశారు ఆ కాలంలో.

శూద్రకుడు (క్రీ పూ. 273 శతాబ్దాలవాడు). కులీనుడయిన బ్రాహ్మణుడు వేశ్యను వివాహమాడిన కథను వ్రాశాడు.

బౌద్ధమతాన్ని క్షత్రియ కులానికి చెందిన సిద్ధార్థుడు ప్రారంభించాడు. అనేకమంది వ్యాపారస్థులు (వైశ్యులు) బలపరిచారు. స్త్రీలుకూడా సన్యాసం స్వీకరించి భిక్షుణీ లవటానికి బుద్ధుడు మొదట్లో అంగీకరించకపోయినా పెంపుడు తల్లి మహా ప్రజాపతి అభ్యర్థనమీద ఆమోదించాడు. "పరిశుద్ధ ఆలోచన, పరిశుద్ధ వాక్కు, పరిశుద్ధాచరణలకు ప్రాధాన్యత నిచ్చింది బౌద్ధం". అష్టాంగ మార్గాలద్వారా స్త్రీపురుషులు తమ నిర్మాణానికి పాటు పడవచ్చు. పవిత్రమైన మతం, భావం, కార్యం, వాక్యం, జీవితం, చేష్ట, చింతనం, స్మృతులకు పట్టం కట్టింది బౌద్ధం. స్త్రీల ప్రతిపత్తి పెరిగింది. "వివాహం కేవలం ఒక ఒడంబడిక". విడాకులకు వెసులుబాటు కలిగింది. ఇరువురి సమ్మతిమీద విడాకులు ఇవ్వటం పరిపాటి. వివాహం అయిన తరువాత భార్యాభర్తల ఆస్థిలో ఇద్దరికీ హక్కులుండేవి. దత్తు చేసుకోడానికి స్త్రీకి హక్కుండేది. (ఈ హక్కు హిందూ స్త్రీకి మరల శాసనంద్వారా

1956 లో లభించింది). స్త్రీలు మత ప్రచారకులుగా వాసికెక్కారు. "నాగార్జునకొండ, జగ్గయ్యపేట, శ్రీకాకుళం, భట్టిప్రోలు, ఘంటసాలలలో బౌద్ధ సంఘ ఆరామాలు, స్తూపాలు వెలిశాయి." పురుషులు తమ తల్లుల పేర్లను తమ పేర్లతో కలుపుకున్నారు. (ఉ॥ గౌతమీపుత్రశాతకర్ణి). అమరావతీ శిల్పాలు ఆకాలంనాటివి. (క్రీ.పూ. 200). ఇక్ష్వాకువంశరాజులు బౌద్ధమతాన్ని అభిమానించి పోషించారు. నాగార్జునకొండ కట్టడాలు వారి ప్రోత్సాహ ఫలితాలు. అజంతా గుహలలో శిల్పాలు ప్రధానంగా బౌద్ధ మతానికి చెందినవి. బౌద్ధం బుద్ధికి పట్టం కట్టింది. స్త్రీలయెడ ఉదారంగా ప్రవర్తించింది చాలవరకు. వేద ప్రామాణ్యాన్ని నిరసించింది. జ్ఞానానికి పెద్దపీట వేసింది. తాత్విక ఆలోచనకు ప్రాధాన్యతను ఇచ్చింది. ప్రకృతిని, ప్రపంచాన్ని అవగాహన చేసుకోవటానికి సాయపడింది. ప్రస్తుతం మన దేశంలో ఈ మతాన్ని అనుసరించేవారు కొద్దిమందే.

జైనమతాన్ని మహావీరుడనే క్షత్రియుడు వ్యాప్తిచేశాడు. క్షత్రియులనేకులు బలపరిచారు. ఈ మతం వేదాన్ని కాదన్నది. క్రతువులను ఈసడించింది. అహింసను ఆమోదించింది. నీతికి అగ్రస్థానం ఇచ్చింది. స్త్రీల విషయంలో బౌద్ధమతమంత ఉదారంగా ప్రవర్తించకపోయినా హిందూ మత ధర్మశాసనంకన్నా మెరుగుగానే ఉంది జైన న్యాయశాస్త్రం. స్త్రీ ధనం, ఆస్థిహక్కు, వితంతువులకు పూర్తి ఆస్తిహక్కు (హిందువులకు ఇది 1955 లో లభించింది) ఇలాంటి విషయాలలో స్త్రీకి సౌకర్యాలను కలుగజేసింది. స్త్రీలు పరివ్రాజకులవచ్చును. సన్యాసినులు బహుసంఖ్యలో ఉండేవారు. బుద్ధుని సమకాలికుడయిన మహావీరుని వెంట జైన సన్యాసినులు పర్యటన చేసేవారు. స్త్రీని తల్లిగా గౌరవించారు జైనులు. ఈనాటికీ మనదేశంలో జైనులున్నారు.

హిందూ మత పునరుద్ధరణ : బౌద్ధమత ప్రాబల్యం క్షీణించింది. జైనం సన్నగిలింది. ఆ సమయంలో శంకరాచార్యులు ఉద్భవిల్లి హిందూ మతానికి ప్రాణం పోశాడు. వేద ప్రామాణాన్ని నెలకొల్పాడు. భగవద్గీతకు స్థానం కల్పించాడు. ఉపనిషత్తులకు గౌరవం చేకూర్చాడు.

అద్వైత శాఖను నెలకొల్పాడు. బౌద్ధ నాగార్జునుని "శూన్య" వాద సిద్ధాంతం నుండి ఉత్తేజితుడై మాయావాదాన్ని సృష్టించాడు. భావ వాదం అత్యున్నత శిఖరాన్ని అందుకుంది. కాని ఫలితం శోచనీయం. వర్ణాశ్రమ ధర్మాలు బలంపుంజుకున్నాయి. సమన్వయం పేరుతో మూఢా చారాలకు, ఉదాత్త తాత్విక ఆలోచనకు సంబంధం ఏర్పడింది. హిందూ సమాజం వెనుకడుగు వేసింది. ఏకకాలంలో భక్తి, కర్మ, జ్ఞానమార్గాలు ప్రబలమయినాయి. జ్ఞానమార్గం అందరికీ అందుబాటులో లేక భక్తి, కర్మ మార్గాలు ప్రజలను ఆకర్షించాయి.

రామానుజులవారి వైష్ణవం, మధ్వాచార్యులవారి మధ్వశాఖ హిందూ మత పునరుద్ధరణలో భాగాలే.

కాకపోతే వీరి వైష్ణవంలో వర్ణ వ్యవస్థయొక్క బిగువు తగ్గింది. సమిష్టి భోజనాలు వెలిశాయి. పల్నాటి చరిత్రలోని బ్రహ్మన్న నెల కొల్పిన "చాపకూడు" అలాంటిదే. కన్నమదాసును కుమారునిగా స్వీక రించిన బ్రాహ్మనాయుడు భావగాంభీర్యం దాని లక్షణమే.

ముసల్మాను సంస్కృతి భారతదేశంలో 1200 స॥ నాటికి వారి రాజ్యస్థాపనతో ప్రవేశ్పూనుకున్నది. 18 వ శతాబ్దంవరకు ముస్లింరాజ్యాలు స్వతంత్రంగా మనగల్గాయి. ఇస్లాంమతం ఖుర్ ఆన్‌పై ఆధారపడింది. అది వారి పవిత్ర గ్రంథం. మహమ్మద్‌వారి ప్రవక్త ముస్లింలు ఈ దిగువ వాటిని పాటించాలి. (*i*) దేవుడు ఒక్కడే. (*ii*) మహమ్మద్ చివరి ప్రవక్త. (*iii*) ప్రతి ముస్లిం దేవుని 5 సార్లు ప్రార్థించాలి. (*iv*) ఒకనెల పగలు భుజించరాదు. ఉపవాస ముండాలి (రంజాన్ నెల). (*v*) తన సంపదలో, ఆదాయంలో కొంతవంతు ఇతరులకు దానంచేయాలి. (*vi*) వీలయితే మక్కాను దర్శించాలి. ఇస్లాం అరేబియాలో పుట్టినపుడు అభ్యుదయకరమైనా, ఈనాడు అలాలేదు. ముఖ్యంగా స్త్రీలపట్ల వివక్ష చూపుతోంది. బహు భార్యాత్వం, పర్దాలాంటివి స్త్రీలపట్ల ఘోరాలు.

భక్తి ఉద్యమాలు :- స్త్రీల జీవితం దుర్భరమైన సమయంలో భక్తి ఉద్యమాలు స్త్రీలకు ఒకరకంగా సాయంచేసినై. మరొక రకంగా

వారి మనస్సులను అజ్ఞానంలో ముంచివేసినయి. స్త్రీ పురుషు లిరువురూ దైవసన్నిధిలో సమానులు. భక్తిమార్గాన తరించగలరు. ఇది స్త్రీలకు బాధామయ జీవితంనుండి వెలువడటానికి వీలుకల్గించింది. పండరిపురం లోని విఠల్ భక్తులు, మధుర శ్రీకృష్ణ భక్తులు వీరిలో అనేకమంది స్త్రీలు ఉన్నారు. తమిళదేశంలో విష్ణుభక్తులు ఆండాళులు వెలిశారు. అయితే ఇహలోక సుఖాలను త్యజించారు. తమ ప్రాపంచిక అభ్యుదయాన్ని కాల దన్నారు. భక్తి ఉద్యమాలు దేశమంతటా విస్తరించి అత్యున్నత స్థానాన్ని పొందాయి.

బసవేశ్వరుని లింగాయత్ మతం : హిందూ సమాజంలో స్త్రీల స్థితిగతులు క్షీణించాయి. ఆమె బానిసగా మారింది. ఆమెపట్ల వివక్ష విలయతాండవం చేసింది. కర్నాటక దేశంలో బసవేశ్వరుడు హిందూ మతం పోషిస్తున్న మూఢ నమ్మకాలను ఖండించాడు. విగ్రహారాధనను నిరశించాడు. వర్ణవ్యవస్థను తుత్తునియలు చేశాడు. స్త్రీ పురుషుల సమానత్వాన్ని చాటాడు. బాల్య వివాహాలను నిషేధించాడు. సహగమ నాన్ని గర్హించాడు. వివాహ విషయంలో నిర్బంధాన్ని వ్యతిరేకించాడు. వితంతు పునర్వివాహాన్ని ఆమోదించాడు. కొన్ని సందర్భాలలో విడాకు లకు వెసులుబాటు కల్పించాడు.

ఆంగ్లేయుల పరిపాలనా కాలంనాటి స్థితి :- కన్యాశుల్కం, బహు భార్యాత్వం, బాల్య వివాహాలు, వ్యభిచారం, స్త్రీలకు విద్యలేదు, వితంతు వుల సంఖ్య పెరగటం, శిశుమరణాలు, ప్రసవకాలంలో స్త్రీల మరణాలు, సతీసహగమనం, శిశుహత్యలు హెచ్చు పెరిగాయి.

ఆదివాసుల జీవిత విధానాలు : కోరాపుట్, దండకారణ్యం, బస్తర్, తూర్పు గోదావరి, శ్రీకాకుళం, ఆదిలాబాద్‌లో విస్తారంగా ఆదివాసు లున్నారు. గోండులు, లంబాడీలు, కోయలు, సవరలు, జాట్‌లు వగైరాలు అనేక తెగలుగా వున్నారు. దక్షిణాది రాష్ట్రాలలో 60 తెగల వారున్నారు. అందరిదీ ఒకే సామాజిక వ్యవస్థకాదు. తరతమ భేదా

లున్నాయి. మాతృస్వామ్య వ్యవస్థను ఆదరించేవారున్నారు. అలాగే పితృస్వామ్య వ్యవస్థను ఆమోదించేవారూ వున్నారు. వారి వృత్తులు ప్రధానంగా వేట, "పోడు" వ్యవసాయం, అటవీసంపదను సేకరించటం. స్త్రీ పురుషులు కలసి ఈ వృత్తులను చేపట్టటంతో వారి సమాజాలలో స్త్రీలకు స్థిరనివాసంవున్న జనులలోకన్న స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ఇతోధికంగా వుంటున్నాయి. అంతమాత్రాన స్త్రీకి సంపూర్ణంగా సమానత్వం వున్నదని అంగీకరించలేము. వారిలో 'ఓలి' పద్ధతి ప్రబలంగావుంది. వరుడు వధువు తండ్రికి చెల్లించేది "ఓలి". ఆదివాసులలో విడాకులకు అవకాశం ఉంది. కాని "ఓలి"ని మొదటి భర్తకు తిరిగి ఇచ్చివేయాలి లంజాడీలలో. ఆమెను వివాహమాడదలచిన పురుషుడు చెల్లించవచ్చును లేదా ఆమె చెల్లించవచ్చును. ఆమె ఓలిని తిరిగి ఇచ్చివెయ్యటానికి ఆర్థిక స్తోమతులేకుండా ఉంటే ఆమె విధిగా మరొకరిని వివాహమాడాలి. నూతనవరుడు చెల్లిస్తాడు. ఆమె అతనితో విధిగా కాపురం చేయాలి. మొదటి భర్తను తప్పించుకోవటానికి ఆమె వివాహమాడక- (పెద్దగా ఇష్టంలేని పురుషుని అయినా) తప్పటంలేదు. ఇది శోచనీయం. కొండజాతులలో స్త్రీకి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలున్నవని కలలుకనటం మంచిది కాదు. పరిశోధనల ఫలితాలను అధ్యయనం చేయాలి. ఇంటా, బైటా చాకిరిచేస్తున్నా కూడా సమానస్థాయి వారికి లేదు.

మాతృస్వామ్య వ్యవస్థనుండి పితృస్వామ్య వ్యవస్థలోకి సమాజం మారిన తరువాత స్త్రీ స్థితి క్షీణించినదనేది పచ్చినిజం.

<u>పాశ్చాత్య సంస్కృతితో పరిచయం :-</u> పాశ్చాత్యులు మన దేశంలో రాజ్యస్థాపన చేసిన తరువాత, ముఖ్యంగా ఆంగ్లేయులు వచ్చిన తరువాత భారతదేశ మేధావులకు పాశ్చాత్య సంస్కృతితో పరిచయం కలిగింది. ఫ్రెంచి విప్లవ నినాదాలైన స్వేచ్ఛా సమానత్వ సౌభ్రాతృత్వ సూత్రాలు వారిని ఆకర్షించినయి. వారి లౌకికదృష్టి వారిని ఆకట్టుకున్నది. విద్య అందరికీ అందుబాటులోకి రావాలనే భావన ప్రబలింది. ఆధునికతపై మోజు పెరిగింది. సామాజిక సంస్కరణోద్యమాలు తలయెత్తినయి. బ్రహ్మ

సమాజ్, ప్రార్థనా సమాజ్, ఆర్యసమాజ్ ఉద్యమాలు అలాంటివి.

బ్రహ్మసమాజం :- రాజా రామమోహన్‌రాయ్ (1774-1833) భారతదేశ భావవిప్లవ వైతాళికుడు. ఏకేశ్వరోపాసన, నైతిక ప్రవర్తన, సత్యాన్వేషణ ఆధారంగా కల మతాన్ని స్థాపించాడు. వర్ణ వ్యవస్థను నిరశించాడు. బ్రహ్మసమాజ్‌ను 1828 లో ప్రారంభించాడు. ఆంగ్ల విద్యాభ్యాసంకోసం ఆంగ్ల విద్యాలయాన్ని 1822 లో స్థాపించాడు. స్త్రీ పురుష సమానత్వంకోసం, స్త్రీల వారసత్వ హక్కుకోసం పాటుపడ్డాడు. 1829 లో సతీసహగమన చట్టాన్ని ప్రభుత్వం ప్రవేశపెట్టటానికి దోహదం చేశాడు. బహుభార్యాత్వాన్ని ఖండించాడు. ప్రాచీన విద్యా విధానాన్ని కాదని భౌతిక విజ్ఞానాది శాస్త్రాభ్యాసనం అవసరమన్నాడు. పత్రికా స్వాతంత్ర్యం కోసం కృషిచేశాడు. న్యాయ శాసనాల సవరణలను సూచించాడు. భారతదేశ స్త్రీలు ఈ మహనీయునికి ఎంతో రుణపడివున్నారు.

బ్రహ్మసమాజ్ సూత్రాలు 1. వేదాలు ప్రామాణిక గ్రంథాలు కాదు. 2. భగవంతుడు ఒక్కడే. 3. దైవప్రార్థన అవసరం. 4. విగ్రహారాధన, శ్రాద్ధకర్మలు, యజ్ఞయాగాదులు పనికిరావు. 5. పునర్జన్మ లేదు. 6. విశ్వమానవ భావన, వర్ణ, కులవివక్ష, మత విభేదాలు కూడవు.

దేవేంద్రనాథ టాగోర్ (1817 జననం) శ్రాద్ధకర్మలను నిరసించాడు. బ్రహ్మసమాజ్ హిందువులకే పరిమితమన్నాడు. ఆయనకు గాయత్రి మంత్రంపై మక్కువ.

కేశవచంద్రసేన్ (1838-1884) బ్రహ్మసమాజ్ ప్రచారకుడూ, ఆచార్యుడూను. సమాజాన్ని పెంపొందించాడు. ఇతడు సంస్కర్త. బాల్య వివాహాలు పోవాలని ప్రచారం చేశాడు. అంతర్వర్ణ వివాహాలు ప్రోత్సహించాడు. ఆచార్యులు యజ్ఞోపవీతాన్ని తీసివేయాలన్నాడు. స్త్రీల అభివృద్ధికి కృషిచేశాడు. స్త్రీలు ఉన్నత విద్యను అభ్యసించాలని ఆయన ఉద్దేశ్యం. తర్వాతి కాలంలో బ్రహ్మసమాజంలో రెండు చీలికలు వచ్చాయి. సాధారణ సమాజం పుట్టింది. రానురాను దాని ప్రభావం తగ్గి

పోయింది. కాగా ఆంధ్రలో కందుకూరి వీరేశలింగం, రఘుపతి వెంకట రత్నం నాయుడు ఆ మతావలంబులే.

ఈశ్వరచంద్ర విద్యాసాగర్ (1820–1891) "విద్యాసాగర్" అతనికి సంస్కృత కళాశాల ఇచ్చిన బిరుదు. వివాహ వయస్సు పెంచడానికి కృషిచేశాడు. వితంతు పునర్వివాహాన్ని సమర్థించాడు. 1856 డిసెంబరులో ప్రథమ వితంతు వివాహం జరిపించాడు. హిందూ వితంతు పునర్వివాహ శాసనం 1856 లో వచ్చింది. దానికై విద్యాసాగర్ శ్రమించాడు. బెంగాలులో బ్రాహ్మణులలో ఒక శాఖవారిని కులీనులు అనేవారు వారికి పిల్లనివ్వటానికి ప్రతివారు ప్రయత్నించేవారు. వరకట్నంకోసం ఆ కులీన బ్రాహ్మణులు అనేకమంది స్త్రీలను వివాహమాడేవారు. ఈశ్వరచంద్ర విద్యాసాగర్ ఈ పద్ధతిని ఖండించాడు. స్త్రీ విద్యకోసం తపించాడు. ఇంగ్లీషు, బెంగాలీ భాషలను అందరూ చదువుకోవాలని అభిలషించాడు.

దయానంద సరస్వతి :- (1824–1883) వర్ణాశ్రమ ధర్మాలు ఉండాలి కాని కులాలు పోవాలన్నాడు. వేదాల ప్రామాణ్యాన్ని అంగీకరించాడు. హైందవోద్ధరణకు పాటుపడ్డాడు. ముస్లింల ప్రాబల్యాన్ని అరికట్టాడు. కనుక అతడు స్థాపించిన "ఆర్యసమాజ్" ముస్లిం ప్రాబల్యం ఉన్న ప్రాంతాలలో బలపడింది. అతడు ఏకేశ్వరోపాసి. అంటరానితనాన్ని తెగనాడాడు. నైతిక శీలంపై నొక్కిపెట్టాడు. బాల్యవివాహాలను, బహుభార్యాత్వాన్ని ఖండించాడు. వేదాలు అందరికీ అందుబాటులోకి రావాలన్నారు. విద్యాభివృద్ధి పథకాలు చేపట్టాడు.

ఆర్యసమాజ్ :- దీనిని 1875 లో దయానంద సరస్వతి స్థాపించాడు. ఆర్యసమాజ్ ముఖ్య సూత్రాలు :-

1) భగవంతుడు సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు, సర్వాంతర్యామి.
2) జ్ఞానానికి మూలం వేదం.
3) సత్యాన్ని స్వీకరించాలి, అసత్యాన్ని విడనాడాలి.
4) ధర్మానుసారంగా సమస్త కార్యాలు నిర్వహించాలి.

5) భౌతిక సామాజిక ఆధ్యాత్మిక రంగాలలో మంచిని పెంచటమే లక్ష్యం.

6) ప్రేమైక దృష్టి న్యాయ దృక్పథమూ కావాలి.

7) అజ్ఞానాన్ని వదలి జ్ఞానాన్ని చేపట్టాలి.

8) స్వార్ధంతో కాక సామాజిక సంక్షేమ దృష్టితో జీవితాన్ని నడుపుకోవాలి.

9) వ్యక్తిగత స్వేచ్ఛ ఉండాలి.

10) భగవంతుని జ్ఞానమార్గాన చేరగలం.

ఆర్యసమాజ్ అద్వైతాన్ని నమ్మదు. అవతారాలను విశ్వసించదు. శ్రాద్ధాదులను విడనాడింది. స్త్రీ పురుష భేదం కూడదంది. గుణకర్మ స్వభావాలను బట్టి వర్ణవ్యవస్థ ఉండాలంటుంది. ఇతరులను మతాంతరీకరణ చేయటానికి "శుద్ధి" కార్యక్రమాన్ని నిర్ణయించింది. స్త్రీ పురుషులు తమకుఇష్టము వచ్చిన ఆశ్రమాన్ని స్వీకరించవచ్చునట. హిందూ మతాన్ని సంస్కరించుటద్వారా స్త్రీ జనోద్ధరణ చేయటానికి కొంతగా కొంత దోహదం చేసింది.

<u>మహాత్మపూలే</u> :– హిందూమతం చేత అణగద్రొక్కబడ్డ ఆడవారికి నుద్ధరించటానికి చుక్కానివలె నిలబడ్డ ముఖ్యులలో మహాత్మాపూలే ఒకరు. స్త్రీ విద్య కొరకై బ్రతికినన్నాళ్ళూ తపనపడ్డాడు, తోడ్పడ్డాడు కూడా. 1851 లోనే ఒక బాలికా పాఠశాలను స్థాపించాడు. భార్యకూడా పూలేకు అన్ని విధాలా సహకరించింది. అందువల్ల ఆ దంపతులిద్దరూ కుటుంబం నుండి బహిష్కరింపబడ్డారు. ఆనాడు స్త్రీ విద్యను ప్రోత్సహించినవారిలో పూలే ముఖ్యులు. పూలే సంస్కరణవాది. వితంతువులకు పునర్వివాహాలను చేయుటకు చాలా సహాయపడ్డారు.

<u>మహదేవ్ గోవింద రెనడే</u> (1842–) రాజకీయ సంస్కరణకన్నా సామాజిక సంస్కరణకు ప్రధమస్థానం ఇచ్చిన వ్యక్తి రెనడే. బొంబాయి హైకోర్టు న్యాయమూర్తి. బాల్యవివాహాలు పోవాలని, విధవా వివాహాలు జరగాలని ప్రబోధంచేశాడు. స్త్రీలకు సమాన హక్కులు స్వేచ్ఛ కావాలని ప్రచారం చేసాడు. అంటరానితనాన్ని దుయ్యబట్టాడు. కులవ్యవస్థను

ఖండించాడు. ఆంగ్లేయుల పాలనవల్ల మేలు జరిగిందని అయన విశ్వసించాడు. భక్తి ఉద్యమ ప్రభావితుడు. కాని పరమత సహనం అతని సొమ్ము.

మహర్షి కార్వే – (1858–1962) జననం మహారాష్ట్రలో. చేపట్టింది ఉపాధ్యాయ వృత్తి. వ్యావృత్తిగా స్వీకరించింది స్త్రీ జనోద్ధరణ. ప్రథమ భార్య చనిపోతే పండిత రమాబాయి స్థాపించిన శారదాసదన్‌లో విద్య నభ్యసించిన బాలవితంతువును 1893 లో వివాహమాడాడు. 1893 లోనే విధవా వివాహ సంఘాన్ని స్థాపించాడు. 1896 హిందూ విధవల ఆశ్రమం స్థాపించాడు. మొదట్లో తన ఇంట్లో కొలదిమంది విధవలు ఉండి చదువుకునే వారు. అవివాహిత బాలికల విద్యకొరకు శ్రమించాడు. "అనాథ బాలి కాశ్రమం" అనే పేరుతో అది పుట్టింది. 1915 లో మహిళా విశ్వవిద్యాలయాన్ని నెలకొల్పాడు. మాతృభాషలో విద్య గరిపేవారు. తల్లులుగా, భార్యలుగా తమ భవిష్యత్తును దిద్దుకోవటానికి అవసరమైన విద్యను నేర్పేవారు. ఇంగ్లీషు భాషను విధిగా చదవాలి. గాంధీజీ ఏకీభవించకపోయినా మద్దతు ఇచ్చాడు. భావప్రచారం నిమిత్తం, నిధుల కోసం భారీ ఎత్తున పర్యటనలు చేశాడు. కార్వే ప్రారంభించిన విశ్వవిద్యాలయం ఇపుడు ఎస్. ఎన్. డి. టి. మహిళా విశ్వవిద్యాలయంగా చలామణీ అవుతున్నది. రిటైరైన తర్వాత పూర్తికాలాన్ని మహిళా విద్యావ్యాప్తికి వినియోగించాడు. ఎన్నో విశ్వవిద్యాలయాలు ఆయనకు గౌరవ డాక్టరేటులు ఇచ్చాయి. "భారతరత్న" బిరుదును ఇచ్చి భారత ప్రభుత్వం తనను తాను సన్మానించుకుంది. 104 సంవత్సరాలు జీవించి 1962 లో చనిపోయాడు. స్త్రీ జాతి ఆయనకు సర్వదా జోహారు లర్పించవలసి ఉంటుంది.

పండిత రమాబాయ్ (1858–1922) : "గత రెండువేల సంవత్సరాలలో పుట్టిన గొప్ప వనిత" అని ఒక ప్రముఖ విద్యావేత్త, మేధావి ఎ. బి. షా ఆమెను అభివర్ణించాడు. బ్రాహ్మణ కుటుంబంలో పుట్టింది. బెంగాలీ శూద్రుని పరిణయమాడింది. 2 సంవత్సరాలలోనే భర్తను

కోల్పోయింది. మహిళల విద్యావిషయక, సామాజిక, ఆర్థిక పురోగతికి కృషిచేసింది. హిందూ సమాజం స్త్రీని ఎంతగా న్యూనత పరిచిందో చూచిన ఆమె క్రైస్తవం చేపట్టింది. కాని ఏ ఒక్క మతశాఖకు ఆమె కట్టుబడి ఉండలేదు. "ఉన్నత కులానికి చెందిన స్త్రీ" అనే పేరు గల పుస్తకాన్ని వ్రాసి 1888 లో అమెరికాలో ప్రచురించింది. స్త్రీల హక్కుల విషయంగా ఆమె ఏనాడూ రాజీపడలేదు. మనుస్మృతిని ఆమె ఘాటుగా విమర్శించింది. సత్యనిరతి, నిగ్రహం, ధైర్యస్థైర్యాలు, మనోవాక్కాయ కర్మలలో పవిత్రత స్త్రీ పురుష అందరికీ సమానంగా ఉంటాయని, ఉండాలని ఆమె చెప్పింది. చిన్నతనంలోనే వివాహమయిన రక్మాబాయ్‌ను కాపురానికి రమ్మని దావా వేసిన పురుషుని కేసులో రక్మాబాయ్ వైఖరిని ఆమె బలపరిచింది.

గాంధీజీ :- కొన్ని అంశాలలో తప్ప ఎక్కువగా గాంధీజీ మహిళల వికాసానికి దోహదం చేశాడు. కన్యాదానాన్ని నిరశించాడు. బలవంతంగా కన్యకు వివాహం చేయడాన్ని ఎదిరించమన్నాడు. విడాకులకు అనుకూలంగా అభిప్రాయం వెలిబుచ్చాడు. బాలవితంతువులను పెండ్లాడమని సంస్కరణాభిలాషులను కోరాడు. నిర్బంధ వైధవ్యం అపవిత్రమన్నాడు. రాజకీయ వుద్యమంలో స్త్రీలకు చోటుపెట్టాడు. ఆయన ప్రారంభించిన ఉద్యమాలవల్ల ఉత్తేజితులై అనేకమంది మహిళలు ముందుకు ఉరికి, త్యాగాలుచేసి, బాధలుపడి తరువాత తమ ప్రజ్ఞా విశేషాలను ప్రదర్శించారు. గాంధీజీది సంక్లిష్ట వ్యక్తిత్వం. స్త్రీలపట్ల ఆయన వైఖరి మొత్తంమీద చూస్తే అభినందనీయమే.

ఎం.ఎన్.రాయ్. : మొదట్లో హింసావాది, తరువాత జాతీయవాది, ఆ పైన మార్క్సిస్టుగా ఉన్న ఎం. ఎన్. రాయ్. మానవవాదిగా మారాడు. స్త్రీ పురుషుల సమానత్వాన్ని - అన్ని రంగాలలో - చాటిన మార్క్స్ అనుయాయుడుగా మహిళా వికాసానికి కృషిచేశాడు. భారతీయ సంస్కృతి పేరుతో హిందూ స్త్రీలపై విధించబడిన ఘోర దురన్యాయ ఆంక్షలను తీవ్రంగా విమర్శించాడు. "భారతనారి ఆదర్శం" అనే పుస్త

కంలో స్త్రీల యెడ సమాజం చూపవలసిన వైఖరిని వివరించాడు. 1940 లోనే ప్రచురితమయిన ఆ పుస్తకంలో కుటుంబ నియంత్రణయొక్క ఆవశ్యకతను నిరూపించాడు. సమాజాన్ని, అందులో ముఖ్యంగా స్త్రీలను పట్టిపీడిస్తున్న విశ్వాసాలను తూర్పారబట్టాడు తన గ్రంథంలో. భావ వికాసానికి దోహదం చేసిన వ్యక్తి అతడు.

<u>ఆంధ్రప్రదేశ్‌లో సాంఘిక సంపస్కరణోద్యమం :</u> (1848 - 1919) కందుకూరి వీరేశలింగం, ఆయన పత్ని రాజ్యలక్ష్మి ధన్యచరితులు. వీరేశలింగం సర్వతోముఖ ప్రజ్ఞాశాలి. నవయుగ వైతాళికుడు. సాహితీక్షేత్రంలో ఆయన ధృవతార. మూఢాచారాలను త్రోసి రాజన్నాడు. స్త్రీ విద్యకోసం, బాలలను వయోవృద్ధులకు ఇచ్చి వివాహంచేసే ఆచారాన్ని ఖండించడానికి శ్రమించాడు. ఆయన బాలవితంతువుల పునర్వివాహానికి చేసిన అనన్యకృషి, నిస్సహాయ స్త్రీలకు రక్షణ, అజ్ఞానంపై, మూఢ విశ్వాసాలపై ఎడతెగని అంతులేని, దాడి తెలుగు స్త్రీల హృదయాలలో ఆయనకు గౌరవస్థానాన్ని నెలకొల్పాయి. స్త్రీ జనోద్ధరణే ఆయన జీవిత కృషి సారం. బాల వితంతువులకు వివాహాలు చేయటానికి సంఘాలు పెట్టాడు. ఆశ్రమాలు నెలకొల్పాడు. విధవావివాహ దంపతులకు నివాసాలు ఏర్పరచటానికి పనిచేశాడు. ఆ వివాహితలకు ఆ దంపతులు పురుళ్ళు పోశారు; వారి బాగోగులు చూచారు. స్త్రీ విద్యకోసం పాఠశాలలు స్థాపించాడు. మహదేవ రెనడే ఆయనను 'దక్షిణాది ఈశ్వరచంద్ర విద్యాసాగర్' అని అభివర్ణించాడు. మొదటి వితంతు వివాహం 1881 లో జరిపించాడు. ఉత్తమ స్త్రీ చరిత్రలు 6 వ్రాశాడు. ప్రహసనాలను వ్రాసి సనాతన చాంధస ఆచారాలను ఎగతాళిచేశాడు. సత్యవతీ చరిత్రంలాంటివి 13 స్త్రీల కథలు వ్రాశాడు. స్త్రీ పురుషుల ప్రబోధంకోసం శరీరశాస్త్రంపై గ్రంథం రాశాడు. సమాజంలో పేరుకొనిపోయిన అవినీతిని బట్టబయలు చేశాడు. ఇంతగా సమాజానికి, స్త్రీలకు తెలుగునాట సేవచేసిన మరో మహనీయ వ్యక్తి మరి ఇకలేడేమో! బ్రహ్మసమాజ తాత్విక ధోరణి ఆయనకు ఉపకరించినట్లున్నది.

<u>రఘుపతి వేంకటరత్నం నాయుడు :-</u> (1862-1939) దేవదాసీ

వృత్తిని చేపట్టిన కళావంతులను సంస్కరించటానికి పూనుకున్నాడు. అనాథలు, అస్పృశ్యులు వీరి ఉద్ధరణకై శ్రమించాడు. భోగం మేళాలకు వ్యతిరేకంగా ప్రచారం చేశాడు.

గురజాడ అప్పారావు (1862-1915) : "కన్యాశుల్కం" నాటక రచయిత. వయోవృద్ధులైన పురుషులకు బాలికలను వివాహంచేసే ఆచారానికి అది గొడ్డలిపెట్టు. ఆయన "పుత్తడిబొమ్మ పూర్ణమ్మ" (గేయనాటిక) హృదయాలను కదిలిస్తుంది. "పురుషుల అధికారానికి లోబడి పురుషుల పెత్తందారీ తనానికి బలియై స్త్రీలు బానిసలుగా ఎలా బాధపడుతున్నారో నేను ఊహించగలను" అని 1897 లో ఆయన చెప్పినమాట ఎంత విప్లవాత్మకమైనదో! తిరుగుబాటు చెయ్యమని స్త్రీలకు పిలుపు ఇచ్చాడు. "స్త్రీ అబలకాదు. పురుషునికన్నా స్త్రీకి మానవతా భావాలు మెండు........స్త్రీ పురుషునికన్నా ఏ విధంగా తక్కువ?" అని నిలదీసి ప్రశ్నించాడు. స్త్రీకి జరిగే అన్యాయాన్ని ఆయన సహించలేడు. ఆయన దేశభక్తి గేయం చిరస్మరణీయం. తెలుగు స్త్రీలు ఎన్నడూ ఆయనను మరచిపోజాలరు.

త్రిపురనేని రామస్వామి (1887-1943) : త్రిపురనేని రామస్వామి చౌదరి బ్రాహ్మణ మతాన్ని నిరశించి ఆర్య అనార్య సంస్కృతుల విశ్లేషణం చేసి పాత పురాణాలను తెగనాడి, మొదట్లో ఆస్తికుడయి, తరువాత హేతువాదిగా, నాస్తికుడుగా రూపొందాడు. త్రిపురనేని రామస్వామి అయ్యాడు. కవిరాజుగా గణతికెక్కాడు. "వివాహ విధి"ని రచించాడు. తెలుగులో పెండ్లి పద్ధతిని నిర్దేశించాడు,

గుడిపాటి వెంకటచలం (1894-1979) : ఈయన పేరు వింటే సనాతనులు మండిపోతారు. కొంతమంది ఆయనను తెగపొగుడుతారు. మరికొందరు ఆయన బూర్జువా దృక్పథమని విమర్శిస్తారు. ఆయన 1920 నుండి 1950 వరకూ సాంఘిక విషయాలపై రచనలు చేశారు. నవలలు, కథలు, నాటికలు వ్రాశారు. ఇంకా వ్యాసాలు, ఆలోచనలను వెలికితీసే "మ్యూజింగ్స్", లేఖలు ఉన్నాయి. స్త్రీల జీవితాలను అనేక కోణాల

నుంచి దర్శించాడు చలం. స్త్రీని బానిసనుగా చేసిన పురుషాధిక్యతను చలం ప్రశ్నించాడు. స్త్రీ పురుషుల మధ్య సమానత్వమూ, సంపూర్ణ స్వేచ్ఛా ఆశించాడు. స్త్రీలయెడ చూపే వివక్షను ప్రతిఘటించాడు. ద్వంద్వ నీతిని తెగనాడాడు. చలం ఎక్కువగా మధ్యతరగతి స్త్రీలను గురించి వ్రాశాడు.

"స్త్రీని సంఘం మనుష్యుల్లోకాక, జంతువుల్లోకాక వస్తువులలో జమకట్టింది. స్త్రీ వస్తువు లాగ పురుషుడి ఆస్తి అయింది."

"తనంతట తాను, తన కోసమే జీవించే అధికారం స్త్రీకి లేదు."

"స్త్రీ జీతంలేని సంఘ బానిస"

"స్త్రీకి సంఘంలో ప్రత్యేక స్థానం లేదు. భర్తవల్లే ఆమె స్థానం నిర్ణయింపబడుతోంది."

"ఇంట్లో అధికారాన్ని (స్త్రీకి) ఇచ్చింది పురుషుడేగా! ఏ నిముషాన్నయినా ఆ అధికారాన్ని లాక్కోగలడు"

"భర్త బానిసత్వం నుంచి తప్పించుకోవడానికి ఒక్కటే మార్గం స్త్రీకి-ఆర్థిక స్వాతంత్ర్యం."

"పురుషుడు-ఆర్థికంగా, రాజకీయంగా వుద్యోగరీత్యా బానిసకూడా అంటారు. ఆ బానిసకు బానిసకదా స్త్రీ."

ఇలాంటి మాటలు చెప్పాడు చలం. సెక్సు జీవితం విషయంలో పురుషాధిక్యతను దుష్టమైనదిగా చిత్రించాడు.

"స్త్రీకికూడా శరీరం ఉంది-దానికి వ్యాయామం ఇవ్వాలి. మెదడు ఉంది-దానికి జ్ఞానం ఇవ్వాలి. ఆమెకి హృదయం ఉంది - దానికి అనుభవం ఇవ్వాలి అనే సంగతి గుర్తించని ఈ దేశానికి నేను రాసే ఈ సంగతులు అర్థమవుతాయా?" ఇది చలంఆవేదన. అందరు మహానుభావులలాగానే చలం సంక్లిష్ట వ్యక్తిత్వం కలవాడు. అతని భావాలు మౌలికంగా సరి అయినవే. కాగా అన్ని భావాలతో అందరమూ ఏకీభవించలేకపోవచ్చు.

మహిళా దశాబ్దం :- (1975-85) ఎన్నో భావాల ప్రచారానికి, స్త్రీ పురుష సమానత్వ సాధనకు, స్త్రీ స్వేచ్ఛా సముపార్జనకు ఆలోచనలకు, పథకాలకు ప్రయత్నాలకు దారితీసింది. సామాజిక ఆర్థిక రాజకీయ సాంస్కృతిక రంగాలలో సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడుతున్నది ఈ పదేళ్ళ కృషి. మహిళలలో జాగృతిని రేకెత్తించింది. వారిని కార్యోన్ముఖులను చేసింది. సమకాలీన సమాజంలోని మహిళా వికాసానికి తోడ్పడిన మహనీయులను గురించి వ్రాయటం అంత సమంజసం కాదు. కాగా మహిళోద్యమం రూపురేఖలు దిద్దుకుంటున్నది. పురుషద్వేషంపై కాక, పురుషాధిపత్య ఖండనపై ఆధారపడుతున్నది. పురుష దురంహంకారాన్ని ఖండిస్తున్నది. స్త్రీని బానిసగా, వస్తువుగా, ఒక్కొక్కపుడు ద్వితీయశ్రేణి పౌర ప్రతిపత్తిలో ఉంచే సామాజిక వ్యవస్థపై ఆమె తిరుగుబాటు చేస్తున్నది. అన్ని రంగాలలో సమానత్వాన్ని అభిలషిస్తున్నది. స్వేచ్ఛకోసం ఆరాటపడుతున్నది. కొంత వరకు విజయం సాధించింది ఆ ప్రయత్నంలో. ఇతోధికంగా విజయ పరంపరలను అందుకోగలదు ఆమె.

---

# నాటి జ్యోతి నేటికి వెలుగు నిచ్చింది

మానవుడు చంద్రుడి నెత్తిన కాలు పెట్టాడు. విజ్ఞానం విశ్వకవాటాలను ఛేధిస్తోంది. ఎన్నో అసాధ్యాలు సాధ్యాలవుతున్నాయి. అయినా ఈ 20 వ శతాబ్దంలో సైతం స్త్రీలు తమ బానిసత్వానికి తామే మురిసిపోతున్నారనేది నగ్నసత్యం. ఈ పరిస్థితిలో 50 సం॥ క్రిందటే నవ్యమానవవాద తత్వవేత్త ఎం.ఎన్. రాయ్ భారత స్త్రీల స్థాయిని, హోదాను ఘాటుగా విమర్శించాడు. సంప్రదాయాలను ఛేదించాడు. పురుషాధిపత్యాన్ని, స్త్రీలపై దోపిడిని చీల్చి చెండాడాడు. అద్వితీయ దూరదృష్టి గల రాయ్ ఆనాటి భావాలు ఈనాటికీ చెరగని ముద్రలంటే అతిశయోక్తి కాదేమో!

ఇంతవరకు స్త్రీ పురుషులు కలిసి జీవించినా వారిది వాస్తవ సహ

చర్యం కాదు. వారి సంబంధాలలో వున్న శాంతి స్త్రీకి వ్యక్తిత్వంలేని శాంతి. అంటే అది స్మశానశాంతి" అని భారతనారీ ఆదర్శం అనే గ్రంధంలో రాశాడు. స్త్రీ గృహదేవత, త్యాగమూర్తి, ఆధ్యాత్మిక జీవితంలో సమాన భాగస్వామి అంటూ ఆమెకు మహోన్నత స్థానం ఇచ్చారట! ఇదంతా ఆమె దాస్యానికి బంగారుపూత అని అధిక్షేపించాడు. కన్యాదానాన్ని నిరసిస్తూ కన్యపై తండ్రికున్న యాజమాన్యపు హక్కును భర్తకు సంక్రమింప జేయడమే నంటూ అధిక్షేపించాడు.

స్త్రీ బానిసత్వం, ఉంపుడుగత్తెలాంటి స్థాయి, పురుషాధిపత్యానికి తలఒగ్గి వుండడం లాంటివి పత్నీధర్మాలుగా మతంద్వారా, పురాణాలద్వారా ప్రచారం చేయడంవల్ల ఇవన్నీ నిజమని నమ్మిన స్త్రీలు తమ బంగారు సంకెళ్ళకు తామే మురిసిపోతున్నారనే బాధను వ్యక్తపరిచాడు. సీతా, సావిత్రుల కథలు ఆదర్శంగా నమ్ముతూ భర్తల కోరికలపై పిల్లల్ని కనటం సాగిస్తున్నారు. వారిని కేవలం సెక్సు సింబల్సుగా వాడుకునే హక్కు ఎవరికీ లేదు. పురుషులతో పాటు సమాన భాగస్తులుగా, సహ చరులుగా సంచరించే హక్కు వుండాలని వాదించాడు. వివాహ సంద ర్భంగా, ఉద్యోగరీత్యా, కుటుంబ నిర్వహణలో స్త్రీకి స్వేచ్ఛ కావాలన్నాడు. సామరస్యం లేనప్పుడు విడిపోయే హక్కు స్త్రీకి వుండాలని 1935 లోనే హెచ్చరించాడు. ఆర్థిక స్వేచ్ఛ, భర్తను ఎన్నుకునే హక్కు స్త్రీకి ప్రాథ మిక హక్కులుగావుండాలని వాదించాడు. "అర్ధాంగి" అని పిలుస్తూ ఆమెకు సమానత్వ హోదాను ఇవ్వని కాపురుషులను దుయ్యబట్టాడు. సంప్రదాయ సమాజంలో భార్యను పోషించడం యజమాని ఉత్పత్తి సాధనాలను జాగ్రత్త పరుచుకోవటంలాంటి దన్నాడు. సమానత్వం ఆశిస్తున్న మహి ళలకు పురుష ద్వేషం పనికిరాదనే నంగనాచులకు బుద్ధిచెప్పాడు. ఉద్యో గాలలో పురుషులతోపాటు పోటీకి దిగవద్దని హితవుపలే్క పెద్దమనుషుల వాదనను ఎండగట్టాడు. శ్రామిక స్త్రీలు, మధ్యతరగతి స్త్రీలలో కొందరు సంపాదిస్తే కాని జరగనిరోజుల్లో పురుషులు తాము పెత్తనం వహించడం హాస్యాస్పదమన్నాడు. సంతానోత్పాదక శక్తి స్త్రీల ప్రత్యేకత. కనుక వారిని తమ ఉదాత్త వృత్తితో తృప్తిపడమని మోసపుచ్చే మాయదారి

"ప్రభోధకులకు" ప్రహారాలు ప్రసాదించాడు. ఇవన్నీ ఈనాటికీ అనుసరణీయులుగా, ఆమోదయోగ్యాలుగా అమల్లో వున్నాయి. కాని స్త్రీలలో కొంత స్పందన, ఆలోచనా కలగటానికికారణం అలా ఆనాడు రాయ్ స్త్రీలలో వెలిగించిన జ్యోతి ఈనాటికీ ప్రజ్వరిల్లుతూనే వుంది. అందుకు స్త్రీజాతి రాయ్‌కి రుణపడి వుంటుంది.

---

# మహిళా సినిమాలు : మహిళా దర్శకులు

ఫిల్మోత్సవ్-86 సందర్భంగా వర్ధమాన దేశాల మహిళా చిత్రాలను జనవరి 13-21 వరకు 20 ఫీచర్ ఫిలిమ్స్, 20 చిన్న చిత్రాలు ప్రదర్శించారు. ఈ విధంగానైనా వర్ధమాన దేశాల స్త్రీల సమస్యలు అనేకం వెలికితెచ్చి ప్రేక్షకుల హృదయాలు ఝల్లుమనేలా చూపించడం ముదావహం. ఈ చిత్రాలకు అంతర్జాతీయ స్థాయిలో ఒక విలువ, గుర్తింపు ఇవ్వటానికి కారణం నైరోబి సభల నిర్ణయమే. ఈ సినిమాలన్నీ మహిళా దర్శకులచేత చిత్రీకరింపబడటం మరో గొప్ప విశేషం. ఇందులో ఇండియా, బ్రెజిల్, లెబనాన్, అర్జంటైనా, కొలంబియా, నైజీరియా, శ్రీలంక, చిలీ, చైనా దేశాల చిత్రాలు వున్నాయి. వాటిలో కుటుంబపరమైన స్త్రీల సమస్యలు-నిరాదరణ, నిరసన, ఇంటా బైటా వెట్టిచాకిరీ, స్త్రీలపై అత్యాచారాలు లాంటివి కొన్ని వున్నాయి. మహిళాభ్యుదయానికి సంబంధించిన అనేక అంశాలను, వారి జీవిత సమస్యలను నిశిత పరిశీలనా దృష్టితో చిత్రీకరించిన సినిమాలు ఈ వుత్సవంలో హెచ్చుసంఖ్యలో వున్నా, వ్యతిరేకాభిప్రాయాలు లేకపోలేదు. ప్రజలనుండి విభిన్నాభిప్రాయాలు కొన్ని వెలువడ్డాయి. వర్క్‌షాపుల్లో, చర్చల్లో అనేక భేధాభిప్రాయాలు వినడం జరిగింది. చిత్రనిర్మాణంలో, మార్కెటింగులో మహిళలకు ప్రోత్సాహం లేదని దర్శకులు ఆరోపించారు. మహిళా దృక్పథం వుంటుంది కాని, మహిళా చిత్రాలుండవని పెద్ద వాగ్వివాదం చలరేగింది. మహిళా దర్శకులంటే మామూలు దర్శకుల స్థాయి తేనివారనడం సహించరాని విషయమనే

వాదన వినవచ్చింది. చిత్రంలోని విలువలనుబట్టి దాని అంతస్తు నిర్ణయించాలి కాని దాన్ని తీసింది స్త్రీయా, పురుషుడా అనే చూపు అనారోగ్యకరమని ఒక దర్శకురాలు ఘట్టిగా నిర్వచించిది. అంతేకాదు స్త్రీల కష్టాల గురించి వారి సమస్యల గురించి ఈ పితృస్వామ్య వ్యవస్థలో స్త్రీల దృక్పథం వేరుగా వుంటుందికనుక స్త్రీలే స్త్రీల చిత్రాలను సమర్థవంతంగా నిర్మించగలరని కొందరు వాదించారు.

మహిళలు మాత్రమే మహిళా సమస్యలు అవగాహన చేసుకోగలరా, అనేదొక ప్రశ్న. కాగా పురుషులుకూడా స్త్రీల స్థితిని అర్థంచేసుకోగలరనేది నిర్వివాదాంశం. అందువల్ల ఎవరు దర్శకత్వం వహించారనేదానికన్నా మహిళా సమస్యలను నిర్దుష్టంగా ఎవరు వెలికి తెచ్చారనేది గీటురాయి కావాలి. ఆ దృష్టితో మహిళా చిత్రాలను ఎన్నికచేస్తే న్యాయంగా వుండేది. 40 చిత్రాలలో సగంకన్నా పూర్తిగా మహిళా విమోచనపై కేంద్రీకరించినవి లేవని చెప్పవచ్చు. కొన్ని చిత్రాలు సామాజికపరమైనవి అంటే స్త్రీ పురుషు లిద్దరికీ సంబంధించినవి వున్నాయి. ఏది ఏమైనా వర్థమాన దేశాల స్త్రీల చిత్రాలు ఈ ఫిలిమోత్సవంలో ప్రత్యేకంగా ప్రదర్శించటం స్త్రీ జనాభ్యుదయానికి తొలిమెట్టు. ఒక క్రొత్త శాఖకు ఊపిరి పోసి ప్రాణ ప్రతిష్ట చేయటం ఈ వుత్సవానికి హైలైట్.

వర్థమాన మహిళా చిత్రాల విలువలను మరికొన్నింటిని గమనిద్దాం. "ఇండియా కేబరా" అనే భారతీయ చిత్రానికి మీరానాయర్ దర్శకత్వం వహించింది. ఇందులో నైట్‌క్లబ్బుల్లో అర్థనగ్నంగా నృత్యం చేసే డాన్సరంటే పతిత అని, గృహిణి అంటే పరమ పతివ్రత అనే మన సంప్రదాయంలో నాటుకుపోయిన అపోహలను తొలగించడానికే ఈ చిత్రం తీశానని ఆమె అన్నది. భర్త త్రాగుబోతై తిరుగుతున్నందున ఇల్లు గడుపుకోటానికి ఈ వృత్తి స్వీకరించిన ఒక స్త్రీ జీవితగాథే "ఇండియా కాబరే".

"ఓరియాన" అనే స్త్రీ కష్టమయ జీవిత వృత్తాంతం ఈ సినిమాలో ప్రదర్శించింది దర్శకురాలు ఫినాటొరేస్. ఇందులో ఓరియాన చిన్ననాటి

జీవితం, ఆమె తన సవతి కుమారుని అభిమానించడం, ప్రేమించడం, ఆమె తండ్రి ఆమె ప్రియుని చంపడం జరుగుతుంది. ప్రేమకు అవధులు వుండవని, స్త్రీ హృదయం ప్రేమను ఆశించటం సహజమని ఈ చిత్రం తెలియజేస్తుంది.

గరల్ ఇన్‌రెడ్ :- అనే చైనా చిత్రానికి లుషియా దర్శకురాలు. ఆన్ రాన్ అనే పిల్లకు నీతి నిజాయితీలపై మక్కువ, స్వతంత్రాలోచన, వ్యక్తిత్వం, విద్యా వివేకాలు, హేతుత్వం లాంటి లక్షణాలు స్వతహా ఆ పిల్లలో వున్నాయి. చైనాలో ఇటీవల యువతుల్లో వొస్తున్న మార్పుకు ఈ చిత్రం ప్రతీక.

లెయిలా అండ్ ది ఉల్వ్స్ :- ఈ సినిమాలో పాలస్తీనా, లెబనాన్ దేశాల్లో యుద్ధ సమయాల్లో స్త్రీలు పురుషులకు చేసే సహాయ, సహకారాలు ప్రదర్శించారు. యుద్ధాలలో, విప్లవాలలో, త్యాగాలలో అష్ట కష్టాలుపడి ప్రాణాలకు తెగించి పోరాడే స్త్రీలు యుద్ధాలు ముగిసి శాంతి యుత వాతావరణం రాగానే అస్వతంత్రులయి పోతారు. చివరికి ఆ స్త్రీలు ముసుగులు తొలగించుకొని స్వేచ్ఛవైపు పయనిస్తున్నట్లు కథ ముగుస్తుంది. లెబనాన్ దేశపు ఈ చిత్రానికి హినీస్రేర్ దర్శకురాలు.

36-చౌరంగిలేన్ :- ఒక ఆంగ్లో ఇండియన్ టీచరు భర్తకు దూరమై పోతుంది. కన్నకూతురు తల్లిని విడిచి భర్తతో వెళ్ళిపోతుంది. తనవల్ల ఆశ్రయం పొందిన శిష్యులు సైతం నిరాదరణ చేస్తారు. స్కూలు అధికారులు, విద్యార్థులు గౌరవించరు. సమాజంలో వైమనస్యతా భావాన్ని ఈ టీచరుద్వారా డైరెక్టరు అపర్ణాసేన్ చిత్రీకరించింది. ఈ జీవిత నగ్న సత్యం స్త్రీలకే కాదు పురుషులకు సైతం వయస్సుమళ్ళిన ప్రతి వ్యక్తికీ సంభవిస్తుంది. ఈ ఇండియన్ చిత్రం మహిళా సమస్యలను తన కథా వస్తువుగా స్వీకరించలేదని చెప్పాలి.

నోబడీస్ వైఫ్ :- ఒక ధనవంతుని భార్య భర్త అక్రమ జీవితానికి రోతపుట్టి పిల్లలిద్దరిని విడిచిపెట్టి పోతుంది. తనకు తటస్థపడిన

పురుషులు అందరూ ఆమె యడల కపట|ప్రేమ నటిస్తే ఒక్కొక్కరినీ విడిచి పెట్టి పోతూ స్వతంత్రతను నిలబెట్టుకుంటూ ఏ వక్కరికీ చెందకుండా మిగిలిపోతుంది. దక్షిణ అమెరికా దేశపు ఈ చిత్రాన్ని 4 సం॥లు సెంసార్ బోర్డు నిషేధించింది. స్త్రీని వ్యక్తిగా, మనిషిగా ప్రేమించిన వానినే భర్తగా స్వీకరించాలని ఈ చిత్రంద్వారా దర్శకురాలు "మేరియా రూసా" సందేశం ఇచ్చింది.

స్పర్శ :- ఒక గ్రుడ్డి పిల్లల స్కూలు ప్రిన్సిపాల్ అనిరుద్ధ పర్మార్, ఒక బాలవితంతువుల అనురాగ, ఆత్మీయతలను విరజిమ్మే కథాంశమే స్పర్శ. ఇందులో అంధుని న్యూనతాభావం, స్త్రీ ప్రేమ, త్యాగం ప్రతిఫలిస్తాయి. ఈ ఇండియన్ చిత్రానికి "శాయి పరంజపే" దర్శకురాలు.

బ్రూటల్ :- మోనికా అనే ఒక యువతిని "రేప్" చేశాడొక యువకుడు. తర్వాత అతనితో ఆమె పెళ్ళి జరిపారు తల్లిదండ్రులు. మోనికాను భర్త అతి దుర్మార్గంగా, క్రూరంగా చిత్రహింసలు పెట్టేవాడు. అదిచాలక తన స్నేహితు లిద్దరూ రోజూ ఆమెను అనుభవించేవారు. ఈ బాధలు భరించలేక ఒకరోజు ఆ ముగ్గుర్నీ హత్యచేస్తుంది ఆమె ఒక గదిలో. ఆ వెంటనే మోనికా నిశ్చేష్టురాలయిపోతుంది. కొందరి పురుషుల్లో వుండే హింసాప్రవృత్తి, సాడిష్టు మనస్తత్వం ఈ ఫిలిప్పైన్ చిత్రంలో చూపింది దర్శకురాలు మేరియా-డయజు.

ఫణీయమ్మ :- ఒక బాలవితంతువు జీవిత వాస్తవ గాథను చిత్రించింది ఈ కన్నడ చిత్రం. 9 వ ఏట వివాహమైన ఈమె 11 వ ఏట వితంతువయింది. అప్పుడే ఆమెకు శిరోముండనం చేయించి కురూపిని చేస్తారు. కొన్నేళ్ళ తర్వాత ఆమె చెల్లెలు విధవరాలైంది. కాని ఆమె సంప్రదాయాలకు "గుడ్‌బై" చెప్పి పునర్వివాహమాడి బిడ్డను కంటుంది. ఈ చిత్రంలో వాస్తవికత ఆదర్శవాదం మేళవింపుచేసి స్త్రీ జనాభ్యుదయానికి ప్రేరణ ఇస్తుంది దర్శకురాలు ప్రేమాకరంతి.

గైజిన్ :- బ్రెజిల్ దేశానికి అనేక దేశాలవారు జీవనోపాధి నిమిత్తం

వలసవచ్చినప్పుడు అక్కడి యజమానుల చిత్రహింసలు వారి మానవత్వ భావ రాహిత్యం ప్రస్ఫుటంగా గోచరిస్తాయి. జమిందారి విధానం అమల్లో వున్న ఏ దేశంలోనైనా ఇలాంటి కష్టాలు వస్తూనే వుంటాయి.

పేట్రియా మాడ :- తమ ప్రియమైన బ్రెజిల్ దేశానికి అధ్యక్షుని ఎన్నిక సమస్య ముఖ్యభూమికగా భావించిన (యమసాకి దర్శకత్వం క్రింద) కెరొలినా అనే 20 సం॥ యువతి కథే ఈ చిత్రం. కెరొలినా గోయస్, రోబా అనే ఇద్దరితో సంబంధం పెట్టుకుంటుంది. ఆమెకు రోబా వల్ల గర్భంవస్తుంది. అవివాహిత మాత కావటానికి ఆమె సిద్ధపడుతుంది. కడకు "గోయస్" ఆమె శిశువుకు తానే తండ్రినని ప్రకటించుకుంటాడు.

షెల్టర్ :- గుడిశలను మున్సిపల్ సిబ్బంది గడ్డపారలతో త్రవ్వి పారేయటం, పేదలమీద ఈ సిబ్బంది అశనిఘాతంలాగా విరుచుకుపడటం ఈ చిత్రంలో చూపించారు. ఇళ్ళకు నోచుకోని ఈ దౌర్భాగ్య జీవులను గుడిశవాసులుగా మార్చిందెవరు? ప్రత్యామ్నాయ వసతి చూపకుండా వారి గుడిశలను కూల్చడం న్యాయమా ?

సోఫార్ ఫ్రం ఇండియా :- పెళ్ళయిన 20 రోజులకే పొట్టకోసం అమెరికా వెళ్ళి అక్కడ పత్రికలమ్మి జీవిస్తాడు అశోక్. రెండేళ్ళకు తిరిగి వచ్చిన భర్తకు పుత్రుని ప్రసాదిస్తుంది భార్య. ఇక్కడి మిత్రుల, బంధువుల ఆప్యాయతకు ముగ్ధుడైన అశోక్ తన దేశంమీద అభిమానం పెంచుకుంటాడు. రెండు విభిన్న దేశాల నాగరికతలను, సంస్కృతులను విడమరిచి చూపే ఈ చిత్రం విదేశాలపై మోజుచూపే వారికి ఒక హెచ్చరిక ఇస్తుంది.

ది ఫ్రెండ్స్ :- ఒక భూస్వామి సోదరి ఒక పాలేరును పెళ్ళాడుతుంది. అది ఇష్టంలేని భూస్వామి బావను అష్టకష్టాలుపెట్టి చివరికి చంపిస్తాడు. భూస్వామి కుమార్తె పాలేరు కుమారుని ప్రేమిస్తుంది. తండ్రి అన్యాయాలను అసహ్యించుకుంటుంది. తండ్రి భూస్వామి ఇల్లు తగలపెట్టించాడు. మేనల్లుడు మామను, ఆమె కూతుర్ని ద్వేషిస్తాడు. పగపడ

త్రాడు. కాని మామకూతురు పుట్టింటిని విడిచి తనదగ్గరికి వచ్చినప్పుడు మెఱపేనుకు స్పందించి స్వీకరిస్తాడు. నిజమైన ప్రేమ, స్నేహం ద్వేషాన్ని జయిస్తాయనే ఈ చిత్రంలోని భావం సార్వజనికం, సార్వకాలికం, వర్గ స్వభావం, దౌర్జన్యం. క్రౌర్యం నిజమైన స్నేహం వున్నప్పుడు వాటిని అధిగమిస్తాయనే భావాన్ని దర్శకురాలు సుమిత్రా పెరీస్ చిత్రీకరించింది. సింహళదేశ సామాజిక వాతావరణం, భారతీయ పరిస్థితులకు భిన్నంకాదు. కనుక ఈ చిత్రం ఎంతో నచ్చుతుంది.

వైవిధ్యంతో కూడిన కొన్ని మహిళా చిత్రాలను పరిశీలిద్దాం. "బ్రిక్ మేకర్స్" అనే కొలంబియా చిత్రంలో ఒక కుటుంబ సభ్యులు 14 మంది రోజంతా శ్రమపడి ఇటుకలను తయారుచేసినా చాలీచాలని వరుమానం రావడం చూపించారు. ఇటుకల ధరలో పదిశాతం మాత్రమే కూలి క్రింద వీరికి ముడుతుంది. కార్మికుల జీవితాన్ని హృదయ విదారకంగా ప్రదర్శించారు దర్శకులు మార్తా, జొర్గేలు.

శాండ్‌విచ్ :- ఇందులో ఈజిప్టు దేశపు దుర్భర దారిద్ర్యాన్ని ఎత్తిచూపింది "ఎట్ ఎట్-అబ్‌నౌది" అనే దర్శకురాలు. ఒక బీదరాలు తన బిడ్డకిచ్చిన రొట్టె అతికష్టంమీద విరిచి మధ్యలో మేకపాలు పిండి ఆ పొడిపైన కప్పి కలిపి తింటాడు. దరిద్రం ఈ చిత్రంలో పరాకాష్ఠను చేరుతుంది. మన దేశంలో గట్టి జొన్నరొట్టెలు తినే బీదస్థితి ఇదే.

ది రాంగ్ ఎండ్ ఆఫ్ ది రోప్ :- నారతో త్రాళ్ళు తయారుచేసే స్త్రీల పరిస్థితులను చిత్రించిన శ్రీలంక ఫిలిం ఇది. ఇందులో ఈ కుటీర పరిశ్రమలో 25 వేలమంది స్త్రీలు పనిచేస్తూ వుంటారు. మధ్య దళారీలు, యజమానులు వారి శ్రమను దోచుకోవటంపై చిత్రీకరణ బాగుంది. యంత్రాలు పెట్టాలని ఆలోచిస్తున్న పెట్టుబడిదార్లపై ప్రతిఘటనకు పూనుకుంటారు ఈ స్త్రీలు. స్త్రీల జాగృతిని ప్రకోపింపజేసే చిత్రంగా దీన్ని మనం పేర్కొనవచ్చు.

---

# షాబానో కేసు తీర్పు: స్త్రీ జాతికి మేలుకొలుపు

సమాజంలో పీడితులకు, తాడితులకు ఏమాత్రం మేలు కలిగినా పెత్తందార్లు సహించలేరు. ఎవరైతే అణచివేతకు గురి అవుతున్నారో వారిచేతనే "సంస్కరణలు మాకొద్దు; విప్లవం మాకు అనవసరం; మార్పు మాకు అక్కరలేదు." అని ఆందోళన చేయించడం పీడించేవారి కుటిల నీతి. ఇది అనాదిగా వారు అనుసరిస్తున్న విధానం. షాబానో కేసుపై వచ్చిన వ్యతిరేకత ఈ సత్యాన్ని రుజువు చేస్తుంది. ఈ వైఖరి కేవలం ముస్లింలకు మాత్రమే పరిమితం కాదు. 1951లో హిందూకోడ్ బిల్లు చర్చకొచ్చినప్పుడు కరపత్రస్వామీజీ నాయకత్వాన "హిందూ మతోద్ధారకులు" 30 వేల మంది స్త్రీలను పార్లమెంటు వద్దకు అసమ్మతి సూచకంగా ఊరేగింపుగా తీసుకెళ్ళారు. స్త్రీజాతికి స్త్రీలచేతనే అపకారం చేయించడం ప్రత్యాఘాతశక్తుల ఎత్తుగడ. ఇది స్త్రీజాతిని అవమాన పరచడమేకాక మానవ విలువలను త్రోసిరాజనడంగా భావించాలి. అందువల్ల ముస్లిమేతర స్త్రీలు, కార్యకర్తలు కూడా తమ మత నమ్మకలను ప్రక్కకునెట్టి తోటి మహిళాలోకానికి తోడ్పడాలి. ఇది మన కనీస విధ్యుక్త ధర్మం.

ఇండోర్‌కు చెందిన షాబానోకు 1932లో మహమ్మద్ అహమ్మద్ ఖాన్‌తో వివాహమయింది. వీరికి ముగ్గురు పుత్రులు, ఇద్దరు పుత్రికలు కలిగారు. షాబానో వయస్సు 68 సంవత్సరములు. 1975లో భర్త ఆమెను ఇంట్లోంచి వెళ్ళగొట్టాడు. ఏప్రిల్ 1978లో నెలకు రు. 500 మనువర్తి ఇమ్మని మేజిస్ట్రేటు కోర్టులో ఆమె పిటీషన్ పెట్టింది. 6-11-78న భర్త ఆమెకు తలాక్ ఇచ్చాడు.

భర్త వాదనలోని ముఖ్యాంశాలు :- 1) విడాకులు ఇవ్వబడింది కనుక మనువర్తి ఇవ్వనక్కరలేదని, 2) నెలకు 200 రు. చొ॥ రెండు సం॥ ఇచ్చాననీ, 3) ఇద్దతు కాలంలో 3 వేలు మహర్ క్రింద చెల్లించాను కనుక ఇక ఇవ్వనక్కరలేదని వాదించాడు. అయినా ఆమెకు నెలకు 25 రూ॥

మనువర్తి క్రింద ఇమ్మని మేజిస్ట్రేటు తీర్పు చెప్పాడు. భర్త వెంటనే హైకోర్టు కెళ్ళి షరియత్ చట్టం (ముస్లింలా) క్రింద చెల్లించ నక్కరలేదని వాదించినా మధ్యప్రదేశ్ హైకోర్టువారు మనోవర్తిని నెలకు 175 రూ. 20 పైసలకు పెంచారు. ఆ తర్వాత భర్త సుప్రీంకోర్టుకు అప్పీల్ చేశాడు. అక్కడ కూడా ఆమెను విజయం వరించింది.

సుప్రీం కోర్టు తీర్పులోని ముఖ్యాంశాలు ఇలా వున్నాయి. (1) ఈ కేసుకు రాజ్యాంగపరమైన ప్రాముఖ్యత లేకపోలేదు. సంప్రదాయబద్ధంగా అన్యాయానికి గురిఅయిన వర్గాలకు సివిలు, క్రిమినల్ తీర్పులు చాల ముఖ్యమైనవి. స్త్రీలు అలాంటి వర్గం. మనువు "నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి" అన్నాడు. స్త్రీలు స్వాతంత్ర్యానికి తగరన్న మాట. "స్త్రీని నీచంగా చూడ డమే ఇస్లాంలో బలహీనత" అని ఎడ్వర్డు విలియం లేన్ అనే ఆయన "ఖుర్-ఆన్" లోని కొన్ని భాగాలు అనే పుస్తకంలో 1843లో రాశాడు. అందులో ప్రవక్త ఇలా అన్నట్లు వుంది. "వంకరగా వున్న ప్రక్క టెముక లోంచి స్త్రీ తయారుచేయబడింది. దాన్ని తిన్నగా సరిచేయబోతే అది విరుగుతుంది. కనుక భార్యలను దయగా చూడవలసింది" అంటే వంకర అయిన స్త్రీని బాగుచేయలేమని దీని భావం.

2) ముస్లిం ధర్మశాస్త్రం ప్రకారం విడాకు లివ్వబడిన భార్యకు భర్త మనవర్తి ఇవ్వనక్కరలేదా? కారణాలు మంచివైనా, చెడ్డవైనా, అసందర్భమైనా భార్యను త్యజించటానికి ముస్లిం భర్తకు హక్కువున్నది. నిజానికి అతడు ఏ కారణాన్ని తెలియజెప్ప నక్కరలేదు. "ఇద్దతు" కాలంలో నామమాత్రపు భృతి ఇచ్చిన పురుషుడు ఈ హక్కును పొంద గలడా? ఏదో కొంత మొత్తం ఇద్దతుకాలంలో భరణంగా చెల్లించినంత మాత్రాన ఆమె జీవించటానికి తగినంత మొత్తం తర్వాత యివ్వ వలసిన బాధ్యత తొలగిపోతుందా? విడాకులు ఇచ్చినందువల్ల భర్త ఆమెకు ఏదైనా మొత్తం చెల్లించనక్కరలేదా? అన్నారు కోర్టువారు. ఈ ప్రశ్నలు బాధాకరంగా వున్నా చాలా ముఖ్యమైనవి.

3) క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ 125 సెక్షన్ ముస్లింలకుకూడా వర్తి

స్తుందా అనేవిషయమై సుప్రీంకోర్టు మునుపే తీర్పు చెప్పింది. ఫజులున్‌బీ ఎదిరి ఖాదర్‌వలీ (19.0 సుప్రీంకోర్టు 1730) తీర్పులో 125 సెక్షన్ ప్రకారం విడాకులు పొందిన ముస్లిం స్త్రీ భరణం పొందవచ్చని చెప్పబడింది. తర్వాత అతి పెద్ద ధర్మాసనం నుండి ఈ షాబానో కేసు తీర్పు వచ్చింది.

4) భర్తకు తగినంత రాబడి కాని లేక సంపద కాని వున్నప్పుడు, భార్య తనను తాను పోషించుకోలేనప్పుడు, భర్త భార్యను పోషించడానికి నిర్లక్ష్యం చేసినా, నిరాకరించినా నెలకు 500 రూ. మించకుండా భార్యకు మేజిస్ట్రేటు భరణం ఇప్పించ వచ్చునని సెక్షన్ 125 Cr.P.C. లో వుంది. ఆ సెక్షన్ క్రింద ఇవ్వబడిన 'b' అనే వివరణ ప్రకారం భర్త చేత విడాకులు ఇవ్వబడిన స్త్రీ లేక భర్త నుండి విడాకులు పొందిన స్త్రీ ఇరువురూ "భార్య" అనే పదం యొక్క నిర్వచనం క్రిందికి వస్తారు. మరల వారు వివాహ మాడేవరకు అలాగే పరిగణింపబడతారు.

5) విడాకులు పొందిన స్త్రీ మేజిస్ట్రేటు వుత్తరువుకు పూర్వంకాని, తర్వాత కాని వారి వారి మత ధర్మశాస్త్రం, లేక ఆచార ప్రకారం విడాకులకుగాను చెల్లించాల్సిన మొత్తాన్ని తీసుకొన్నచో మేజిస్ట్రేటు పూర్వపు వుత్తరువును రద్దు చేయవచ్చని సెక్షన్ 127 (3) (b) ప్రకటిస్తున్నది.

6) 125 (1) (b), 127 సెక్షన్లు అందరి మతస్తులకు వర్తిస్తాయి. వాటిలో కక్షిదారుల మతాలను పేర్కొనలేదు. ఇది "క్రిమినల్ లా" కు సంబంధించినది. పోషణ, జరుగుబాటు లేని వారికి వెంటనే సహాయం అందించటానికి ఇది ఉద్దేశింపబడినది. వేరు వేరు మతాల వారికి సివిల్ వ్యవహారం ద్వారా మనవర్తి పొందటానికి వేరు వేరు శాసనాలు వున్నాయి. సమాజంలో అనాథలు తిరుగుబోతులు వుండకుండా చెయ్యటానికి ప్రతి వ్యక్తి తన దగ్గర బంధువులను పోషించాలనే లక్ష్యంతో (125 సి. ఆర్. పి. సి.) వ్యక్తి మీద ఈ బాధ్యత వుంచబడింది. ఇది ఆ వ్యక్తికి సమాజం యెడల వున్న బాధ్యత. ఇది శాసనం యొక్క సైతిక దృక్పథం. నీతిని మతంతో ముడి పెట్టటానికి వీలులేదు.

విడాకులు పొందిన స్త్రీ ని భార్యగా పరిగణించి నందువల్ల ముస్లిం స్త్రీలు కూడా ఆ సెక్షన్ పరిధిలోకి వస్తారు. అందువల్ల 125వ సెక్షన్ పూర్తిగా లౌకిక స్వభావం కలిగి వున్నది.

7) గతిలేని స్త్రీల తిరుగుమోతు తనాన్ని నిరోధించటానికి, సామాజిక ప్రయోజనానికి ఆ తీర్పు వుద్దేశింపబడినదని 1963లో సుప్రీం కోర్టు జడ్జి సుబ్బారావు గారి తీర్పు కూడా వుంది. కనుక ఇది కక్షిదారుల మత ధర్మ శాస్త్రాలతో సంబంధం లేనిదని 1970లో మరో తీర్పు ఇచ్చింది సుప్రీంకోర్టు. అందువల్ల మత ధర్మశాస్త్రానికి ఈ సెక్షన్‌కు వైరుధ్యం వున్నదని భావించినప్పటికీ 125 క్రింద మనవర్తి ఇవ్వవచ్చుని స్పష్టంగా, నిర్వంద్వంగా ప్రకటించటానికి ఇలా చెప్పాం అని జడ్జిమెంటులో న్యాయ మూర్తి చంద్ర చూడ్ వ్రాశారు.

పై జెప్పిన వివరణలో వైరుధ్యం వున్నదని భర్త తరుపున వాదన జరిగింది. దానిపై కోర్టువారు ఇలా అన్నారు. "ముల్లా, తయాబ్జీ, డా॥ పరాస్ దివాన్‌లు వీరు ముగ్గురూ అధికారికంగా ముస్లింలపై గ్రంథాలు రాశారు. వాటి ప్రకారం మూడు నెలలకు (ఇద్దత్) మాత్రమే భర్త మనవర్తి ఇవ్వాల్సివుంటి. వీటిలో తనను తాను పోషించుకోలేని విడాకులు పొందిన స్త్రీ విషయం లేదు. భార్యకు కాని, విడాకులు పొందిన స్త్రీకి కాని అన్ని పరిస్థితులలో, అన్ని కాలాలలో మనవర్తి ఇవ్వాలా లేదా అని కాదు ప్రస్తుత సమస్య. 125 సెక్షన్ క్రింద వచ్చే కేసులు మాత్రమే ఈ దృష్టితో విచారిస్తున్నాం". అంటూ మరి కొన్ని వుదాహరణలు ఇచ్చారు. 15-21 ఖుర్-ఆన్ నుండి చెప్పబడిన వాక్యములను బట్టి విడాకులు పొందిన స్త్రీకి మనవర్తి ఇవ్వవలెనని స్పష్టం అవుతోంది. మహర్ చెల్లింపబడినది కనుక మహర్ విడాకులకుగాను ఇచ్చినట్లు ఎంచుకొని మెజిస్ట్రేటు ఇచ్చిన వుత్తరువును రద్దు చేయుమని భర్త తరపున వాదింపబడినది. "ఈ వాదనను మేము అంగీకరించబోము". అన్నది సుప్రీం కోర్టు. న్యాయమూర్తి ఆలోచన ఇలా సాగింది."వివాహం చేసుకున్నందుకు ప్రతిఫలంగా భార్యకు ఇవ్వబడిన పైకంగాని, ఆస్తిగాని మహర్ అంటాం". అని ముల్లా అన్నాడు. దివాన్ దీన్ని విమర్శించాడు.

ఈ మహర్ గౌరవంగా ఇవ్వబడేది. ఇది విడాకులు ఇచ్చినప్పుడు చెల్లింపబడుతుంది కాని విడాకులకు ప్రతిఫలం కాదు. మహరును ప్రతి ఫలంగా నిర్వచించినా లేక గౌరవ చిహ్నంగా పరిగణించినా అది విడాకులకు ప్రతిఫలితం కాదు; గౌరవ చిహ్నం కాదు. ప్రతి కేసులో న్యాయాన్ని ప్రకటించడము అనే విధానం కన్నా అందరికీ న్యాయం చేకూర్చే పద్ధతి మంచిదని కోర్టు చెప్పింది. "ముస్లిం ధర్మశాస్త్రం" అనే పుస్తకంలో డా॥ టహర్ మహమ్మద్ కామన్ సివిల్ కోడ్ కావాలని వ్రాశాడు. "ముస్లిం దేశాలు ఇకముందు ఎదుర్కోవలసిన సమస్య ఏమంటే ముస్లింలా పరిణామానికి లోను అవుతుందా లేదా ?" అని ఆలం ఇగ్బల్ ప్రశ్నించారు. పాకిస్తాన్ వివాహానికి, కుటుంబానికి సంబంధించిన శాసనాల విషయమై ఒక కమీషన్‌కు నియమించింది. అందులో "మధ్య వయస్కులైన స్త్రీలు అనేక మంది అక్రమంగా విడాకులకు లోనయి తమ పిల్లలకు, తమకూ తిండి లేకుండా వీధులలో తిరుగాడు వలసిన పరిస్థితి రాకాదు" అని ఆ కమీషన్ రిపోర్టులో వ్రాశారు. ఆలం ఇగ్బాల్ ప్రశ్నను కూడా వుదహరించారు. ఈ రిపోర్టు మనవర్తి ఇవ్వాలనే వాదనను బలపరుస్తున్నదని జడ్జీలు ఈ తీర్పులో వుదహరించారు.

చివరికి అప్పీలు త్రోసివేయబడి హైకోర్టు తీర్పును ఖాయంచేసింది సుప్రీంకోర్టు. ఇంకా పదివేలు ఖర్చుల క్రింద మాజీ భర్త షాబానోకు చెల్లించాలని, అవసరమైతే ఆమె పరిస్థితులు మారితే ఆమె తనకు మనోవర్తిని పెంచమని కోరవచ్చునని జడ్జిమెంటులో చంద్రచూడు స్పష్టీకరించారు.

ఇక జ్వాల ముట్టుకుంది. అఖిల భారత ముస్లిం మతధర్మశాస్త్ర బోర్డు ప్రధానికి వినతి పత్రం సమర్పించింది. అందులో 125 సెక్షన్ సూత్రం ముస్లింలకు ఇచ్చిన మతస్వేచ్ఛను భగ్నపరుస్తుందని ఆ బోర్డు వాదిస్తోంది. ఒకే పౌరశాసనం కావాలని 44వ రాజ్యాంగం ఇస్తున్న ఆదేశం జాతీయ సమైక్యతకు భంగకరమని గగ్గోలు పెడుతోంది. ఈ తీర్పు "షరియత్"ను అవమానిస్తోందనే ఆరోపణతో ఆందోళన ప్రారంభించింది. ప్రధాన మంత్రితో జరిపిన సంభాషణలో మతసంస్థలద్వారా అలాంటి స్త్రీల పోషణా బాధ్యత ముస్లిం సమాజం తీసుకునేటట్లు చేస్తామని

కూడా ప్రకటించారు. ఇదంతా కాక మౌల్వీలు, ముల్లాలు, మతగురువులూ షాబానోకు బోధించి, కోప్పడి, బెదిరించి ఆమెచేతనే ఈ తీర్పు రద్దుచేయుమని అడిగించినట్లు వార్తలు చదివాము.

ఒకేఒక వ్యవహార సంహిత వుండాలనేది ముఖ్య సమస్య. ఆ సమస్యను గురించి ఆలోచించమని ఈ తీర్పుద్వారా ఈ కేసులో జడ్జీలు హితవు చెప్పారు. భారత శిక్షాస్మృతి అందరికీ వర్తిస్తుంది. వివాహము, దత్తత, వారసత్వం లాంటివి మతధర్మశాసనాంశాలు. కాని క్రిమినల్ ప్రొసీజరు కోడ్ అన్ని మతాలవారికి వర్తిస్తుంది. దానిప్రకారం భర్తకాని, మాజీ భర్తకాని స్త్రీ పోషణాభారానికి బాధ్యత వహించాలి. ఈనాడు సనాతన ముస్లింలు 125 సూత్రం వర్తించరాదంటున్నారు. ఇది ముందుముందువారు చేయబోయే పోరాటాలకు, ఉద్యమాలకు నాంది. ఈ విషయంలో ప్రభుత్వం వారికి తలవొగ్గితే ముసల్మాన్‌లు చేసే నేరాలకు మత న్యాయస్థానాలు, లేక మత గురువులు మాత్రమే శిక్ష విధించాలని వాదించవచ్చు. కనుక దీనిని అంగీకరించటానికి వీలులేదు.

ముఖ్యంగా ఇది స్త్రీ జాతికి సంబంధించిన సమస్య. స్త్రీలను బురఖాలలో వుంచి, విద్యా విజ్ఞానాలకు దూరంచేసి సామాజిక కార్యక్రమాలలో వారికి ప్రవేశం లేకుండా చేస్తున్న పురుషులు ఈ తీర్పువల్ల ముస్లిం స్త్రీలు తమ ఆధిపత్యాన్ని ఎదిరిస్తారని వణికిపోతున్నారు. అందుకే ఈ ప్రతిఘటన. అంతే కాదు. ముస్లిం స్త్రీలలో స్వతంత్రతాభావాలు పెరిగి వారు తతిమ్మా మతాల భారత స్త్రీలతో కలిసి మతగురువుల దౌష్ట్యాన్ని ఎదుర్కొంటారని, ముస్లిం మతతత్వంపై ఆధారపడిన ముస్లిం ఐక్యత నశిస్తుందని ముస్లిం రాజకీయ నాయకుల ఆందోళన. తమ స్త్రీలను అజ్ఞానంలో వుంచి, తమ నాయకత్వాన్ని సుస్థిరం చేసుకోవాలని వారు ఆశిస్తున్నారు. ఈ కేసు తీర్పు ముస్లిం స్త్రీలలో విప్లవం తేలేదు. వెంటనే తీసుకొనిరాదు. కాగా ఇది మార్పుకు నాంది. అందువల్ల ఈ తీర్పును భారత స్త్రీలు ఆహ్వానిస్తున్నారు; బలపరుస్తున్నారు.

(మార్చి 1986 "కలువబాల")

---

# శుభాకాంక్ష

ప్రజాహిత జీవితానికి సంబంధించిన బహుళరంగాలలో మల్లాది సుబ్బమ్మ గారి కృషిని కొన్ని సం॥రాలుగా పరిశీలిస్తున్న నాకు ఇదివరలో ఒక అభిప్రాయం వుండేది. "భర్త అడుగు జాడలలో నడవడం" అనే ప్రాచీన సంప్రదాయం ప్రకారం ఆమె భర్తను అనుసరిస్తున్నదని భావిస్తూ వుండే వాడిని. కాని ఈ వ్యాస సంకలనం చదవగా పెనిమిటితో అడుగు కలిపి ఆమె నడుస్తున్నదని, కొన్ని కొన్ని సందర్భాలలో ఆయనకంటె రెండడుగులు ముందు వేస్తున్నదని నాకు నమ్మకం కుదిరింది.

పదకొండవయేట వివాహం జరిగిననాటికి ఆమె చదివిన "పెళ్ళి చదువు" ఆరవతరగతి మాత్రమే. భర్త రామమూర్తి గారు అనేక ప్రజోద్యమాలలో పనిచేస్తున్నా ఆమెను మరింత విద్యావతిగా చేయటానికి ప్రయత్నించలేదు. అందువల్ల ఆమె పూజలతో, పురాణ కాలక్షేపాలతో పొద్దుపుచ్చవలసి వచ్చేది. కాని లోలోపల ఏదో అశాంతి ఆమెను బాధిస్తూనే వుండేది. ఈ బాధను భరించలేక ఆధునిక విద్యన్ను అభ్యసిస్తానని అత్తమామలను ఆమె అభ్యర్థించగా పరాయి పురుషుని వద్ద విద్య నభ్యసిస్తే కుటుంబ పరువు, ప్రతిష్టలు మంటగలిసిపోవా? అని అడ్డుపడ్డారు. తన పిల్లలలో ఇద్దరు ఇంజనీరింగు, ఇద్దరు మెడిసిన్ చదువుతున్నారు. తన భర్త, బిడ్డలు ఆధునిక విజ్ఞానాన్ని సముపార్జిస్తూ వుండగా తానేమో పుక్కిటి పురాణాలతో, శుష్క-వేదాంతంతో కాలాన్ని వృధాచేయవలసి వస్తున్నది ఇది ఆమెలోని విద్యాకాంక్షను మరింత బలపరిచింది. అందువల్ల తన కుమారుల చేతనే పాఠాలు చెప్పించుకొని, తన 38 వ యేట మెట్రిక్‌లేషన్‌లో ఉత్తీర్ణురాలయి, పి. యు. సి. పాసయిన సుబ్బమ్మ గారు బి. ఏ. వరకు చదువు సాగించారు. ఈ ఉన్నత విద్యాభ్యాసం ఆమె జీవిత సరళినే పూర్తిగా మార్చివేసింది. నా దృష్టిలో ఇది ఒక విశేషం.

ఒకే ఒక మాట చెప్పి ముగిస్తాను. శ్రీమతి మల్లాది సుబ్బమ్మ గారిని పోలిన మహిళామణులు మన దేశంలో ఒక లక్షమంది వుంటే మన దేశ స్వరూపమే పూర్తిగా మారిపోతుంది. ప్రాచీన యుగంలోని ఆధునిక యుగంలోకి అది పాదం వేస్తుంది. దేవుళ్ళు, దయ్యాలు పారిపోగా మానవులు ముందుకు వస్తారు.

లుంబిని
హైదరాబాద్

నార్ల వెంకటేశ్వరరావు